S. V. UNIVERSITY, TIRUPATI (A.P.)
1977 DECEMBER

Glimpses of local history from
C. P. Brown's letters :
an anthology of Cuddapah letters

Published with the financial aid provided by
the Cuddapah District Collector from out of the
Andhra Kesari T. Prakasam Pantulu Centinary Fund

*Chief editor* : G. N. REDDY, *editor* : BANGOREY
*Cover design* : P. C. N. REDDY

*Price* : Rs 10-00

*Printers* :
Kranti Press, 12 Francis Joseph Street,
Madras-1.

# వి ష య సూ చి క

# కృతజ్ఞతలు

కడపజిల్లా వారి
ఆంధ్రకేసరి ప్రకాశం పంతులు
శతజయంత్యుత్సవ నిధి నుంచి
బ్రౌన్ ప్రాజెక్ట్ పరిశోధనాధికారి పేర
ఆర్థిక సదుపాయం అందజేసి
యీ గ్రంథం అవతరించడానికి
ముఖ్యకారకులైన
కడప కలెక్టరుగా వుండిన
పి. యల్. సంజీవరెడ్డిగారికి—

ఆ నిధి సౌకర్యంతో
విశ్వవిద్యాలయ ప్రచురణగా యిది
వెలువడడానికి అనుమతించిన
వైస్-ఛాన్సలర్, ఆచార్య
కె. సచ్చిదానందమూర్తిగారికి—
కృతజ్ఞతలు.

జి. యన్. రెడ్డి

# అనుశీలన

మనదేశంలోనూ, విదేశాల్లోనూ వివిధ పుస్తక భాండాగారాల్లో ముద్రితా ముద్రిత రూపంగా తలదాచుకొన్నట్టి బ్రౌన్ వాఙ్మయరాశి మనకు పిత్రార్జితప్రాయమైన పెన్నిధి. అది తెలుగుభాషా సాహిత్య సామాజిక చరిత్రకారులకు, పండిత పరిశోధకులకు ఒక తరగని గని. అమూల్యమైన ఈ బ్రౌన్ వాఙ్మయరాశిని ఒక చోటకు చేర్చి జిజ్ఞాసువులకు, పరిశోధకులకూ అందుబాటులో పెట్టడం ఏనాడో జరిగి ఉండవలసిన పని.

ఏ రంగంలోనైనా జరగవలసిన పని జరగనపుడు దాన్ని జరిపించవలసిన బాధ్యత అభ్యుదయ ప్రియులమీద ఉంటుంది. విశ్వవిద్యాలయాలు కూడా అభ్యుదయ కాంక్ష కలిగిన సంస్థలే. ఈ దృష్టితోనే శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ఒక బ్రౌన్ పరిశోధక కేంద్రాన్ని 1975 సెప్టెంబరులో స్థాపించింది. బ్రౌన్ సాహిత్య సేకరణేగాక ప్రచురణకూడా చేపట్టింది. ఆ కేంద్రం తెలుగు ప్రజ కందిస్తున్న మరొక ప్రచురణ ఇది. బ్రౌన్ సేకరించి పెట్టిపోయిన జాబుల సంపుటాల్లో కడపమండలానికి సంబంధమున్న జాబుల్లో మండల సంఖ్యకు ఒకటి అదనంగా చేర్చి కూర్చిన జాబుల సంకలన గ్రంథం. కడపమండల స్థానిక చరిత్రావగాహనకు తెలుగుభాషా పరిణామ చరిత్రకు మిక్కిలి ఉపకరించే ఉత్తరాలు ఈ సంకలనంలో వున్నాయి.

మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో బ్రౌన్ సేకరించి వ్రాయించిన తెలుగు ఉత్తరాలు—తనకు పండితులు, సేవకులు, ఆప్తులు వ్రాసినవి, ఆనాటి పత్రికల్లో నుండి ఎత్తి వ్రాయించిన పాఠకుల సంపాదకుల ఉత్తరాలూ 20 సంపుటాల్లో ఉన్నాయి. అర్జీలు—జిల్లా కచ్చేరీలనుండి ఇతర ప్రభుత్వ కార్యాలయాలనుండి సేకరించినవి—ఇవి కూడా ఈ సంపుటాల్లో చేరి ఉన్నాయి.

అసలు బ్రౌన్ వీటిని ఎందుకు సేకరించి సంపుటాలుగా కూర్చి భద్రపరిచాడు అన్నది అందరూ అడగవలసిన ప్రశ్న. తన జీవితకాలంలో బ్రౌన్ అవిచ్ఛిన్నంగా అహోరాత్రాలు నిర్వహించిన తెలుగు సారస్వత యజ్ఞంలో తెలుగు పాఠ్య గ్రంథాల ప్రచురణకు, తెలుగు వ్యాకరణ రచనకు, ప్రామాణిక బృహన్నిఘంటువుల కూర్పుకు ఆకరము, ఆధారప్రాయమూ అయిన ముడి సామగ్రికోసం వీటిని సేకరించినాడు. ఆనాడు బ్రౌన్ సేకరించిన ఈ సంపుటాలు ఈనాడు భాషా చరిత్రకారులకు తరచి చూచినకొద్దీ తరగని నిధులు. మనకు సంక్రమించిన బ్రౌన్ వాఙ్మయరాశిలో తెలుగుభాషా చరిత్రదృష్టికి ఈ లేఖలు, అర్జీలు ఉన్న సంపుటాలన్నీ ఒక ఎత్తు. మిగిలినవన్నీ మరొక ఎత్తు.

మన భాషా చరిత్ర నిర్మాణానికి 18 వ శతాబ్దం వరకు ఉన్న లిఖితాధారాలు రెండు రకాలు: 1. శాసనాలు, 2. కావ్యవాఙ్మయం. తెలుగు శాసనాలు క్రీ. శ. 6 వ శతాబ్ది చివరనుండి 18 వ శతాబ్దంవరకు వెలువడ్డాయి. అవి వేల సంఖ్యలలో వున్నాయి. కావ్యభాషకన్నా శాసనస్థమైన తెలుగు ప్రజా వ్యవహారానికి సన్నిహితం, శిలాక్షరప్రాయం. తెలుగులేఖన సంప్రదాయ నిరూపణకు ప్రమాణం. కాబట్టే భాషాపరిణామ చరిత్ర నిర్మాణంలో కావ్యాలకన్నా శాసనాలకే ముఖ్యంగా వచన శాసనాలకే అగ్రతాంబూలం.

19 వ శతాబ్ది ప్రారంభంనుండి శాసనాలు ఆట్టే వెలువడలేదు. వాటి స్థానంలో తెలుగుభాషా చరిత్రకారునికి ఉపయోగకరంగా ఉన్నవి కైఫీయతులు, అర్జీలు, లేఖలు. వీటి కర్తలు తెలుగువారే అయినా సంగ్రహకర్తలు మాత్రం పాశ్చాత్యులే. కైఫీయతుల ప్రథమ సేకరణకర్త మెకంజీ. అర్జీలను సేకరించిన వారిలో ఆద్యుడు జె. సి. మారిస్. లేఖల విషయంలో తొలి సంగ్రహకర్త సి. పి. బ్రౌన్. ఈ ముగ్గురిలో ఒకవిధంగా మెకంజీ, మారిస్‌దొరల కన్నా బ్రౌన్ దొరే ఘనుడనవచ్చు. కారణం కాగితాల్లో శిథిలమైపోతుండిన మెకంజీ కైఫీయతు

లకు బ్రౌన్ దొర మేలుప్రతులు వ్రాయించి—సంపుటాలుగా సంరక్షించినాడు. ఆ పని బ్రౌన్ చేయకుండా ఉండివుంటే మెకంజీ దొరకు పేరుప్రతిష్ఠలుగాని, మనకు ఆ కైఫీయతులుగాని దక్కి ఉండేవికావు. మారిస్ సేకరించి 'తెలుగు సెలక్షన్స్' పుస్తకంలో ప్రచురించిన అర్జీలు కేవలం 20 మాత్రమే. కాగా బ్రౌన్ సేకరించిన అర్జీలు 20 వందలైనా ఉంటాయి. అర్జీల సేకరణలో ప్రచురణలో మారిస్ ఆద్యుడు కావచ్చుకానీ బ్రౌన్ మాత్రం అద్వితీయుడు. బ్రౌన్ తరువాత అర్జీలను సేకరించిన మరొక పాశ్చాత్యుడు లేన్ దొర.

లేఖల సేకరణ విషయంలో కూడా బ్రౌన్ కృషి అపూర్వం, విస్తారం. బ్రౌన్ కూర్చిన లేఖా సంపుటాలలోని తెలుగు లేఖల్ని మూడు రకాలుగా వింగడించవచ్చు. 1. తనకు ఇతరులు వ్రాసినవి. 2. తాను ఇతరులకు వ్రాసినవి లేదా వ్రాయించినవి. 3. ఇతరులవి—అంటే భాషాదృష్టితో పత్రికలనుండి, ఇతరులనుండి, కచేరీలనుండి బ్రౌన్ సేకరించినవి. ఈ మూడు రకాల జాబుల్లో మొదటి రకానికి చెందిన జాబులు ఎక్కువ. దానికి తక్కువ మూడో రకానికి చెందినవి. బ్రౌన్ స్వయంగా వ్రాసినవి చాలా తక్కువ.

## లేఖా ప్రక్రియ

ఇద్దరు వ్యక్తులమధ్య సమక్ష సంభాషణ సాధ్యంకాని పరిస్థితుల్లో లిఖితమైన జాబులు జవాబుల రూపంలో ఉన్న రచనలే లేఖలు. కేవలం సామాన్య వ్యవహార రూపమైన లేఖలకు సాహిత్యంలో స్థానం ఉండదు. చారిత్రక ప్రాధాన్యమూ విషయ భరితమూ సాహిత్యగౌరవమూ కలిసి పండితాదరణకు పాత్రమైన జాబులే లేఖా సాహిత్యంలో చేరుతాయి. మహనీయులు వ్రాసిన లేఖలు వారి దృక్పథాన్ని, ఆత్మీయతను, వ్యక్తిత్వాన్ని ప్రతిబింబించే దర్పణాలు. జనాదరణీయాలు, అవశ్యపఠనీయాలుకూడా. అట్టి లేఖలు ఆ మహనీయుల జీవిత చరిత్రల, సామాజిక చరిత్రల రచనకు ప్రబలాధారాలు. ఈ దృష్టిలో, మహనీయులకు ఇతరులు—వారు సామాన్యులైనా కావచ్చు—వ్రాసిన లేఖలు కూడా గణనీయాలే.

పాశ్చాత్య భాషల్లో ఏక కర్తృకమై సాహిత్య గౌరవానికి నోచుకొన్న లేఖావళులు ఒక విశిష్ట సాహిత్య ప్రక్రియగా ప్రసిద్ధి పొందినాయి. తెలుగు వాఙ్మయంలో కూడా లేఖా సాహిత్యాన్ని ఒక ప్రక్రియగా గుర్తించవచ్చు. దీనికి మూల పురుషుడనదగిన వ్యక్తి బ్రౌన్. తెలుగులో లేఖాప్రక్రియ పుట్టుపూర్వోత్తరాలు,

స్వరూప సంప్రదాయాలు పరిశోధనార్హాలయిన విషయాలు. ఈ లేఖల విషయంలో జిజ్ఞాసువులు పరిశీలించవలసిన అంశాలు మూడు: 1. లేఖా నిర్మాణం, 2. లేఖస్థమైన విషయం, 3. భాషాశైలి.

## లేఖా నిర్మాణం

లేఖారచన అన్ని నాగరిక సమాజాల్లో కనిపించే వ్యాసంగమే అయినా లేఖల రచనా సంప్రదాయం, స్వరూపం ఒక్కొక్క సమాజంలో విలక్షణంగా ఉంటాయి. ప్రాచీన కాలానికి సంబంధించిన తెలుగులేఖలు ఏవీ మనకు లభించలేదు. కాని వారికి లేఖారచన అపరిచితంకాదు అనడానికి ప్రాచీన కావ్యసాహిత్యంలో కొన్ని సాక్ష్యాలు లేకపోలేదు. ప్రద్యుమ్నుడు ప్రభావతికి వ్రాసిన ప్రేమలేఖను సూరన (క్రీ. శ. 1560) ఒక సీసపద్యరూపంలో ఇమిడ్చినాడు (ప్రభావతీ ప్రద్యుమ్నం 3-134). కట్టా వరదరాజు (క్రీ. శ. 1630) ద్విపద రామాయణంలో సీతారాముల కళ్యాణానికి దశరథుని సకుటుంబ పరివారంగా ఆహ్వానిస్తూ జనక మహారాజు పంపిన శుభలేఖ అవాల్మీకాంశం (బాలకాండ 4-208). పద్యరూపాల్లోని పై లేఖలనుబట్టి ప్రాచీనకాలంలో తెలుగులేఖల రచనా విధాన లక్షణాలను కొంత వరకు ఊహించవచ్చు.

కాని వచనరూపంలో మనకు లభ్యమైన తొలి తెలుగులేఖలు బ్రౌన్ సేకరించినవే. వీటిని పరిశీలిస్తే 19వ శతాబ్దంలో తెలుగుభాషా స్వరూప లక్షణాలు, సంప్రదాయ విశేషాలు తెలుస్తాయి. స్వరూప నిర్మాణాన్నిబట్టి వీటిలో ప్రధానంగా మూడు భాగాల్ని గుర్తించవచ్చు: 1. లేఖావతారిక, 2. లేఖా విషయభాగం, 3. లేఖాంతం. ఈ గ్రంథంలో కూర్చిన లేఖల్ని ఆధారంగా చేసుకొని పై మూడు విభాగాలకు సంబంధించిన విశేషాల్ని స్థూలంగా పరిశీలించి తెలుసుకొనడం అప్రస్తుతం కాదు.

## లేఖావతారిక

లేఖను ఫలానావారికి ఫలానావారు వ్రాస్తున్నారన్న విషయం, వారి మధ్యగల సంబంధం తెలియజేయడం లేఖావతారిక ప్రయోజనం. లేఖ వ్రాసిన వ్యక్తిని లేఖా రచయిత అన్నట్లే, లేఖ ఎవరికి వ్రాయబడిందో అతన్ని లేఖితుడు, లేఖ్యుడు లేదా లేఖాంకితుడు (addresse) అనవచ్చు. ఈ గ్రంథంలోని 41 లేఖలలో బ్రౌన్ ముప్పయ్యేడింటికి లేఖాంకితుడు. రెండింటికి (సంఖ్య 4,31) లేఖా రచయిత. బ్రౌన్

లేఖాంకితుడుగా ఉన్న 39 లేఖల్ని వ్రాసినవాళ్లు అతని పోష్యవర్గంలోని పండితులు, సేవకులు. అందువల్ల ఈ 39 ఉత్తరాల్లోని లేఖాంకిత—లేఖారచయితల సంబంధం పోషకపోష్య సంబంధం లేదా ప్రభుసేవక సంబంధం. ఇట్టి ఉత్తరాల్లో లేఖావతారికారూపం ఒక విధంగానూ, పోషకపోష్య సంబంధంతో పోషకుడుగా బ్రౌన్ ఇతరులకు వ్రాసిన రెండుత్తరాల్లోని లేఖావతారికా భాగం మరొక విధంగానూ ఉన్నది. బ్రౌన్కు వ్రాసిన ఉత్తరాల్లో లేఖావతారికలకు నాలుగు ఉదాహరణలు:

1. శ్రీమదనంత కల్యాణగుణ విరాజితులయిన సకల గ్రంథ పరిశీలన విమలీకృతమానసులయిన శ్రీకృష్ణవద్యశోదయాలంకృతులయిన శ్రీరామపత్న్యైకవ్రతశీలులయిన అస్మత్ప్రభువర్యులయిన మహారాజరాజశ్రీ—సీ-పీ-బ్రౌన్ యిస్క్వయిరు ధొరవారి దివ్యసముఖానకు తమ ముఖ్య ఆశ్రితుడయిన చల్లా సుబ్బన్న నిరంతరం అనేక సలాములుచేసి చాయంగల విన్నపములు...(చూ. లేఖ. 38)

2. బందరుజిల్లా అదాలతుకోర్టు జడ్జీగారు అయిన మహారాజరాజశ్రీ మేస్తర్ సీ. పీ. బ్రౌన్ యిస్క్వయరు దొరవారి సముఖానకు - నిజపోష్యవర్గుడైన కడపజిల్లా కోర్టు నాజరు అ॥ కృష్ణారెడ్డి పదివేలు సలాములుచేసి అత్యంత వినయపూర్వకముగా వ్రాసుకున్న మనవి యేమంటే...(లేఖ. 3)

3 మహారాజశ్రీ - సీ - పీ - బ్రౌన్ యిస్క్వయరు దొరగారి సుముఖానకు నిజపోష్యవర్గుడైన అయోధ్యాపురం కృష్ణారెడ్డి పదివేలు సలాములుచేసి...(లేఖ. 5)

4. హాజరతు మేస్తరు సి. పి. బ్రౌన్ యిస్క్వయరు ధొరగారి సముఖానకు... (లేఖ. 17)

ఉదాహరణలిచ్చిన పై నాలుగింటిని విశ్లేషించినట్టయితే లేఖావతారికా రచనలో ప్రధానంగా నాలుగు సంప్రదాయరీతులు స్పష్టమౌతాయి. వాటి క్రమం— 1. ప్రశంసాపూర్వక లేఖాంకిత నామ నిర్దేశం. 2. లేఖాంకిత నామానుబంధ గౌరవ వాచకం. 3. లేఖక నామ విశేషణం. 4. ఆశీర్నమస్క్రియా విధానం.

మొదటిదానిలో లేఖాంకితనామ ప్రశంసా విశేషణాలు శ్రీకారంతో ప్రారంభమై సంస్కృత సమాస భూయిష్టమై స్తోత్రప్రాయంగా ఉన్నాయి. ఇది ప్రాచీన సంప్రదాయ తుల్యమైన పద్ధతి అనవచ్చు. బహు విశేషణ సహితమైన ప్రశంస తర్వాత లేఖాంకిత నామానికి పూర్వం మహారాజరాజశ్రీ అనే విశేషణం

కూడా ఉంది. రెండవదిగా ఉదాహరించిన ఉత్తరంలో మొదట శ్రీకారం లేదు. లేఖాంకితుని హోదాను తెలిపే విశేషణం (బందరుజిల్లా అదాలతుకోర్టు జడ్జీగారు అయిన) తర్వాత మహారాజరాజశ్రీ అనే పూజ్య విశేషణం, దాన్ననుసరించి ఆంగ్లభాషలో పురుషబోధక గౌరవార్థకపదం అయిన మేస్తర్ (mister) ప్రయోగింపబడ్డాయి. మూడవ ఉత్తరం మహారాజశ్రీతో ప్రారంభమైంది. మరియే విశేషణాలులేవు. నాల్గవ ఉదాహరణలో మహారాజశ్రీలేదు. అన్యదేశ్యాలయిన హాజరతు, మేస్తరు అనే రెండు విశేషణాలు మాత్రం ఉన్నాయి. హాజరత్ అనేది అరబ్బీ పదం. మహమ్మదీయ ప్రభువుల పేర్లకు ముందు వాడే గౌరవార్థక విశేషణం ఇది. ఇంగ్లీషువారికి పూర్వం మన పాలకులు మహమ్మదీయులు కాబట్టి వారిని పేర్కొనే సంప్రదాయాన్నిబట్టి హాజరతు, ఆంగ్లేయుల సంప్రదాయాన్నిబట్టి మేస్తర్ అనే రెండు విశేషణాలు ప్రయోగింపబడ్డాయి. ఇందులో మహారాజశ్రీ మాయమైంది.

## నామానుబంధ గౌరవవాచకం

ఈ గ్రంథంలోని ఉత్తరాల్లో లేఖాంకితుడైన సి. పి. బ్రౌన్ పేరు తర్వాత యిస్కోయరు, యిస్కోయరు దొర, సాహెబు, యిస్కోయరు మహాప్రభువులు, దొరగారు అనే అనుబంధరూపాల ప్రయోగం చూడవచ్చు. ఆనాటికి సాహెబు అన్నది హైందవేతరులయిన పాలకులపేర్లకు చేర్చే గౌరవపదం. యిస్కోయరు అన్నది ఆంగ్లభాషా సంప్రదాయానికి సంబంధించినది. మనదేశీయ సంప్రదాయానికి చెందిన మహారాజరాజశ్రీ అనే పూజ్యవాచకానికి M. R. R. Y అనే ఆంగ్లీకరణ కూడా ఇటీవలవరకూ ప్రచారంలో ఉన్నది.

## లేఖకనామ విశేషణం

ఈ ఉత్తరాల్లోని లేఖా రచయితలు బ్రౌన్ పోష్య వర్గంలోనివారు కాబట్టి తమనుగురించి చెప్పుకొన్న విశేషణాల్లో నిజపోష్యవర్గుడయిన, తమ ముఖ్య ఆశ్రితుడయిన, తమ పోషణలో చేరిన, తమ పండితుడు మొదలైన వాటినిబట్టి లేఖకుల దాసభావం వ్యక్తమౌతుంది. ఇట్టి విశేషణాలకు పరంగా లేఖకులు తమ ఉద్యోగాన్ని విశేషణరూపంగా పేర్కొనడం కద్దు. ఉదాహరణకు అర్జిదాస్తు ఫీదివిజిల్లా కోర్టు గుమాస్తా క్రిష్ణారెడ్డి...

## ఆశీర్నమస్క్రియా విధానం

పోష్యవర్గంలోనివారు వ్రాసిన ఉత్తరాల్లో లేఖాంకితునికి అనేక సలాములు, పదివేల సల్లాములు, నిరంతరం అనేక సల్లాములుచేసి వ్రాయడం మామూలు పద్ధతిగా కనిపిస్తుంది. మహమ్మదీయ ప్రభువులకు చేసే సలాములనే మన పండితులు విదేశీయులైన ఆంగ్లేయులకు కూడా చేయడం జరిగింది.

పోషకపోష్య సంబంధంతో బ్రౌన్ వ్రాసిన/వ్రాయించిన ఉత్తరాల (4, 31) లేఖావతారికా స్వరూపం యిందుకు భిన్నంగా ఉంది.

మహారాజశ్రీ సీ॥ పీ॥ బ్రౌన్ యిస్కోయరు ధొరగారు అయోధ్యాపురం కృష్ణారెడ్డికి వ్రాయించిన హుకుం—(లేఖ. 4)

ధర్మపురం సుబ్బన్నకు—మహారాజశ్రీ సి. పి. బ్రౌన్ ధొరవారు వ్రాయించిన ఆజ్ఞ యేమంటే...(లేఖ. 31)

పై రెండు ఉత్తరాల్లో లేఖాంకితులు దేశీయులు. వారికి పోషకుడైన లేఖారచయిత బ్రౌన్ దొర ఏలాంటి ప్రశంసా పూర్వక లేఖాంకిత నామ నిర్దేశం చెయ్యలేదు. పైగా మహారాజశ్రీ అనే విశేషణం లేఖక నామాంకితమైంది. ఇక ఆశీర్నమస్క్రియా రూపమైన మాట అసలే లేదు. వాడినవి హుకుం, ఆజ్ఞ అన్న మాటలే.

## లేఖాంతం

పోష్యవర్గులు వ్రాసిన లేఖల్లో చిత్తగించవలెను, చిత్తానకురావలెను, చిత్తగించ కర్తలు, దివ్యచిత్తానకు తేవలెను, చిత్తగించి కాపాడగలందులకు తాము ఖామందులు వున్నారు, తప్పు క్షమ కాయవలెను, ఇంతే అనేక సలాములు—ఇటువంటి సమాప్త వాక్యాలు సాధారణం. అటు తర్వాత తేదీ వివరాలు, వాటిక్రింద లేఖకుని సంతకం, సంతకంతోబాటు చేవ్రాలు లేదా వ్రాలు అనే పదం విధిగా ఉన్నవి. మొదటి ఉత్తరం మాత్రం ఆంగ్లలేఖా రచనా పద్ధతిలో ఆంగ్లంలోనే సమాప్తమైంది.

తేదీల లేఖనంలో క్రైస్తవ మహమ్మదీయ హిందూ శకాలకు సంబంధించిన పద్ధతులు మూడూ ఈ ఉత్తరాల్లో కనిపిస్తాయి. కాని క్రీ. శ. పద్ధతే ఎక్కువ. క్రీ. శ. సంబంధమైన తేదీల లేఖనంలో మొదట సంవత్సరం, తర్వాత నెల,

ఆ తర్వాత దినం ఒక పద్ధతిగానూ, ఈ క్రమాన్ని వ్యత్యస్తంగా చెప్పడం మరొక పద్ధతిగానూ కనిపిస్తుంది. ఉదా॥ 1833 సంవత్సరం యేప్రిల్ 8 తేది (లేఖ. 8). ది 25 డిశంబరు 1829 సం॥ (లేఖ. 15). బ్రౌన్ వ్రాసిన వ్రాయించిన రెండు లేఖల్లోనూ (లేఖలు. 4, 31) ఈ రెండవ పద్ధతే ఉంది. మహమ్మదీయ పద్ధతి: స్న 1260 ఫసలి మహే మే చందు 29 తేది (లేఖ. 27). హైందవ పద్ధతి: వైశాఖ కృష్ణ 8 లు (లేఖ. 28).

## లేఖా విషయభాగం

ఈ గ్రంథంలో చేర్చిన బ్రౌన్ జాబులకు చారిత్రక భాషా విషయక ప్రాధాన్యమే హెచ్చు. రచనాశిల్ప సంబంధమైన లక్షణాలు వీనిలో లేవంటే బాధపడనక్కరలేదు. పైగా ఇందులోని ఉత్తరాలు సమస్థాయిలోని ఇద్దరు మహనీయులు పరస్పరం వ్రాసుకొన్నవికావు. సామాన్యులు వ్రాసిన ఉత్తరాలలో రచనాశిల్పం లేకంటే అది వారి దోషంకాదు. కాని ఈ లేఖలు బ్రౌన్ మహాశయుని తెలుగు సాహిత్యసేవను, అసమానమైన అతని వ్యక్తిత్వాన్ని లోక విదితంచేస్తాయి,

ఈ ఉత్తరాలు ముఖ్యంగా ఆనాడు వాడుకలోని లేఖన సంప్రదాయాలకు, వ్యవహారరూపమైన భాషా ప్రయోగాలకూ నిలువుటద్దాలు. జిజ్ఞాసువులు ప్రధానంగా ఈ క్రింది విశేషాలను గుర్తించవచ్చు.

## లేఖన సంప్రదాయాలు

అనేకపదాల వ్రాతలో వర్ణక్రమ సంబంధమైన ఏకరూపత లోపించి అనియమితమైన వర్ణక్రమ వైవిధ్యం (spelling variation) కనిపిస్తుంది. ఇట్టి వైవిధ్యం ఎక్కువగా హిందూస్తానీ, ఆంగ్లపదాల్లోనూ, కొంతవరకు తత్సమదేశ్య పదాల్లోనూ చూడవచ్చు.

కొన్ని ఉదాహరణలు: హిందూస్తానీ—కైది, కైదీ, ఖైది, ఖయిది; జురమానా, జురమ్నా, జులుమ్నా, జులుమానా; మునసఫు, మునసిఫు, మునసఫి, మున్సఫు, మున్ సపు, మునసపు, మున్నసఫి, మునసఫ, మునసఫీ. ఇంగ్లీషు—కలకటరు, కలక్టరు, కల్కటరు, కలెక్టరు; జడ్జీ, జెడిజి, జడిజీ, జెడిజి, జెడ్జి; శప్టంబరు, శపిటెంబరు, శెపెటంబరు, శపెటెంబరు, శపటంబరు; చారలిస్ ఫిలిప్ బ్రౌన్, చారులిసు ఫిలేబు బ్రౌన్, చార్లిసు ఫిల్లీపు బ్రోన్, చార్లీసు ఫిలీపు బ్రౌం.

తత్సమాలు—పుస్తకాలు, పుస్తుకాలు, పొస్తకాలు, పొస్తుకాలు; పర్యంతం, పర్యంతరం, పరియంతరం, పరియంత్రం, పరియంత్తరం. దేశ్యాలు—మనవి, మనివి, మన్వి, మ్నవి; కెలవు, కెలవు, కెల్వు, సెలవు.

శాసనాలలో కూడా పదాల వ్రాతలో ఇటువంటి వర్ణక్రమ వైవిధ్యం ప్రాచీన కాలంనుండి కనిపిస్తూనే ఉంది. శిల్పుల అశ్రద్ధవల్ల కొన్నివచ్చినా కొన్ని లిఖిత వాగ్వ్యవహారాల మధ్య ఉన్న భేదాన్ని సూచిస్తాయి. ఉదాహరణకు దక్షిణ భారత శాసనాల్లో సంవత్సర శబ్దానికున్న వర్ణక్రమ వైవిధ్యాన్ని చూడండి:

సంగ్వత్సరంబు (ద. హిం. శా. 10.707.6,1153), సమంత్రంబు (6.637,8,1147), సంమ్వత్సరంబు (5.1214), సంవ్వాత్సర (5.1212).

అసలు తెలుగులేఖన విధానంలో పదాల వర్ణక్రమ విభిన్నత్వాన్ని గురించి బ్రౌన్ చెప్పిన ఈ క్రింది మాటలు గమనార్హాలు: "The Telugus are as negligent in spelling as the English were before the days of Johnson. The words borrowed from Sanscrit are often mispelt..." (బ్రౌణ్య మిశ్రభాషా నిఘంటు, మద్రాసు 1854, Preface, పేజి xxii).

ఈ గ్రంథంలో పండితులు వ్రాసిన ఉత్తరాలలో కూడా పదాల వర్ణక్రమ ప్రామాణికత లోపించి ఉంది. ఈనాడు మన విద్యార్థులు ఇటువంటి వర్ణక్రమ వైవిధ్యాన్ని పాటిస్తే దోషంగా భావిస్తాం. ఆనాటికన్నా నేడు వచన రచన చక్కగా వికసించినందువల్ల లేఖన ప్రామాణికత చాలావరకు సిద్ధించింది.

ఈ జాబుల్లోని కొన్నిపదాల్లో కనిపించే సంయుక్తాక్షరలేఖన సంప్రదాయం వాటి ఉచ్చారణతో సంబంధంలేనిదని నిస్సంశయంగా చెప్పవచ్చు. త్మ (తమ), జ్మ (జమ), ల్కే (లేక), గ్కా (గాక), శ్నా (శానా), మ్న (మన), యేల్ని (యేలిన), తేద్ని (తేదిన), రోజ్నా (రోజున), మ్నవి (మనవి), యేద్నిము (యేదినము), అయ్నాది (అయినది). ఈ విధమైన సంయుక్తాక్షర లేఖనాన్ని ద్వ్యక్షరంగా ఉచ్చరించి చదువుకోవాలి. ఇట్టి లేఖన సంప్రదాయం ప్రాచీన శాసనాల్లో కూడా కనిపిస్తున్నది. ఉదాహరణకు నెల్లూరు జిల్లా శాసనాల సంపుటం 2 లో: పయ్ని (కందుకూరు, 48, 1650), చేస్ని (కందుకూరు 80, 1641), యిదేగ్కా (కందుకూరు 38, 1650)).

## హిందుస్తానీ పదాలు

ఈ 41 జాబుల్లో హిందూస్తానీ పదాలు చాలా ప్రయుక్తమై ఉన్నాయి. అంటే అవన్నీ ఆనాటి సామాన్య వ్యవహారంలోనూ కచ్చేరి వ్యవహారాల్లోనూ రూఢికెక్కినవే (చూ: అనుబంధం_2). శబ్దార్థ పరిశీలనాదృష్టిగల జిజ్ఞాసువులకు ఈ అన్యదేశ్యాలు చాలా ఆసక్తికరమైన పదాలు. ఆనాడు తెలుగువారి వ్యవహారంలో చోటుచేసుకొని ఉండిన అనేక హిందూస్తానీ పదాలు ఈనాడు వ్యవహార భ్రష్టం కావడం గమనింపదగిన విషయం. ఉదాహరణకు మొహనత్తు (౩౮), ఖాస్గీ (౬౮), నకషా (౮౬), సాలీషు (౧౫), జిలదు (౨౫) మొదలైనవి.

## పదాల సంక్షిప్తీకరణం (abbreviations)

ఈ జాబుల్లో కొన్నిచోట్ల పదాలు సంక్షిప్తీకరణ పద్ధతిలో వ్రాయబడి ఉన్నాయి. సంక్షిప్తరూప చిహ్నం రెండు నిలువుగీతలు, లేదా విరామ చిహ్నం. ఈ లేఖల్లో ప్రయుక్తమైన కొన్ని సంక్షిప్త రూపాలు:

అ॥_అయోధ్యాపురం (ఇంటి పేరు), ఆ॥_ఆక్టింగు, గ_గండు: వరహా, గగ_వరహాలు, చ_చందు: ఆ తేదీన, త॥_తరువాత, తా॥_తాలుకా, తా॥క॥_తాజాకలం, ది_దివి: తేది, గు॥_గురించి, పై._పైసలు, ప్ర॥ది॥_ప్రతివాది, ప్ర॥ల॥_ప్రతివాదుల, మహా రా॥_మహారాజశ్రీ, రు., రూ._రూపాయలు, శే॥_ శేర్లు, స॥_సదరు, సం॥, సం॥ రం॥_సంవత్సరం, స॥హి._సదరహి.

## కొన్ని ప్రయోగ విశేషాలు

ప్రేముత్సాపలు ౫౬ (ప్రేముతో చేసిన చాపలు)
నితనిత్యం ౭ (ప్రతినిత్యం)
చాలిచాలములుగా ౭ (చాలీచాలకుండా)
హారహారదినము ౨౩ (ప్రతిదినం)
నిభావు అవు ౮౫ (సాధ్యపడు)
తొందర ౩౦ (కష్టాలు)
రొక్కవలు ౫ (విశేషవార్తలు)
శ్రుతపరుచు ౧౩ (వినిపించు)

జి. యన్. రెడ్డి

త్రయం ౩౮ (వ్యయానికి కృతక ప్రామాణిక రూపం)
స్వస్తంగా ౨౬ (ఆరోగ్యంగా)
వివరగతి లెఖ్ఖ (వివిధ పద్దులవారిగా వివరమైన లెఖ్ఖ)
తాత్పర్యము ౭౧ (కోరిక)
పరిముఖం ౭౯ (ద్వారా)
క్షమ శేయు ౬౮ (క్షమించు)
కాలీజా కచ్చేరి ౨౫ (బ్రౌన్ పోషణలోని పండితుల కార్యస్థలం)

ఈ ప్రచురణకు సంగ్రహరూపంగా సంధించిన ఈ అనుశీలనలో బ్రౌన్ లేఖల బహుముఖ ప్రాధాన్యం దిఙ్మాత్రంగా చర్చించడం జరిగింది. పరిశోధనాప్రియులు, తెలుగుభాషా చరిత్రకారులు బ్రౌన్ సేకరించిన లేఖల సంపుటాల్ని తరచి చూచినట్లయితే వారికి సరికొత్తగా ఎన్నో విశేషాలు గోచరం కావచ్చు. అట్టి పరిశీలనకు ఈ ప్రచురణ కొంత దోహదం చెయ్యగలిగితే శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ బ్రౌన్ పరిశోధనా కేంద్రం ఉడుతాభక్తిగా బ్రౌన్‌పట్ల చేస్తున్న కృషి చరితార్థమైనట్లే.

తిరుపతి,
6-11-'77.

బంగోరె

# ముందు మాటలు

నా స్వల్ప అనుభవంలో, యింతవరకు నే వ్రాసిన ప్రతిపుస్తకం విషయంలోనూ, అచ్చు పూర్తవబోతుండగా ముందుమాటలు వ్రాద్దామని కూర్చున్నప్పుడు–శ్రీశ్రీ పరిభాషలో చెప్పాలంటే– నా మస్తిష్క కులాయంలో మనోవల్మీకంలో యేవేవో సుప్త భుజంగాలను కదిలించబోతున్నట్లు, మౌన మృదంగాలను పలికించబోతున్నట్లు, శాంత తరంగాలను కెరలించబోతున్నట్లు, లోహ విహంగాలను యెగిరించబోతున్నట్లు వుండేది. ఏమేమో చెప్పుకోవాలని ముంచుకొచ్చే ఆవేశాన్ని ఆవేగాన్ని చిక్కబట్టుకొని వ్రాయడంలో యెంతగానో యాతనపడేవాణ్ని. ఇప్పుడూ అదే అవస్థ యెదురైంది.

ఎక్కడ ప్రారంభించాలి? ఏమని ప్రారంభించాలి? తెలుగువాళ్ళు హీన చరిత్రులు కాదు గానీ, చరిత్రహీనులుగా మాత్రం వుండిపోతున్నారు. పూర్వం సంగతేమోకానీ, యిప్పుడు మాత్రం చెప్పుకోతగిన ఆంధ్రచరిత్రకారులు చెప్పుకోతగినంతమంది లేని కొరత కొట్టవచ్చినట్లు కనపడ్తున్నది. కొందరు విదేశీపండితులు చేస్తున్నంతగానైనా దక్షిణాదిన మరీముఖ్యంగా మనరాష్ట్రంలో మనవాళ్ళు మన చరిత్ర విషయంలో శ్రద్ధ కనపర్చడంలేదు. ప్రత్యేకించి ఆధునిక చరిత్రరంగంలో యీ కొరత మరీ దారుణంగావుంది. తెలుగు చరిత్రకారులుగా చలామణిలో వున్న కొద్దిమంది సైతం, వొకరిద్దర్ని మినహాయిస్తే, లోతుకుదిగి మూలాధారాల (original sources)ను పరిశీలించకుండానే చిలకపలుకులు పలుకుతూ పైపై వ్రాతలు వ్రాసే

స్తున్నారు. చూడవలసిన చరిత్రాధారాలు బోలెడన్నివున్నాయి. నిగ్గుతేర్చవలసిన చరిత్ర యెంతగానోవుంది. కానీ మనవాళ్ళు చేస్తున్న చరిత్రరచన మాత్రం యెక్కడేసిన గొంగళి అక్కణ్ణేగా వుంటున్నది. చిలకపలుకుల తత్వం, యెంగిలిమెతుకుల బ్రతుకు మనలో పోవడంలేదు. ఇందువల్ల యెన్నో తప్పులు, ప్రాథమికమైన తప్పులు వొప్పులుగా స్థిరపడిపోతున్నాయి. చర్విత-చర్వణంగా చలామణిలో వుండిపోతున్నాయి. ఉదాహరణలు కూడా కావాలంటారా? కేవలం వుదాహరణ ప్రాయంగానే చెప్పుకొందాం.

బ్రౌన్‌కు సంబంధించిన విషయంతోనే ప్రారంభించడం సబబుగా వుంటుందనుకొంటాను. 'జర్నల్ ఆఫ్ అమెరికన్ వోరియంటల్ స్టడీస్' పత్రిక (1930)లో సి. పి. బ్రౌన్ వొక ఆంగ్లవ్యాసం వ్రాసినట్లుగా, యాంద్రియనోవ్ అనే రష్యన్ పండితుడు 'మెటీరియల్స్ ఫార్ యె బిబ్లియాగ్రఫీ ఆఫ్ ద్రవిడియన్ లింగ్విస్టిక్స్' అనే గ్రంథం (1966)లో పేర్కొన్నాడు. అంతవరకూ బాగానేవుంది. అణ్ణామలై విశ్వవిద్యాలయంలోని యిద్దరు పండితులు వ్రాసిన 'యె బిబ్లియాగ్రఫీ ఆఫ్ ద్రవిడియన్ లింగ్విస్టిక్స్' అనే గ్రంథం (1973)లో కూడా యీ విషయాన్ని పునరుద్ఘాటించారు. 1884లో చనిపోయిన బ్రౌన్ 1930లోని అమెరికన్ పత్రికలో వ్రాయడమేమిటి, అయినా యే పుట్టలో యే పాముందోనని ఆరా తీయకతప్పలేదు. ఆ అమెరికన్ పత్రికకోసం గాలించి చూస్తే, అందులో ఆ వ్యాసం వ్రాసింది మన బ్రౌన్ కాదు, జి. డబ్ల్యు. బ్రౌన్ అనే మరో బ్రౌన్! మన అణ్ణామలై విద్వాంసులు 'వొరిజినల్ సోర్స్' చూడకుండా ఆ రష్యన్ వ్రాసిన పొరపాటు వ్రాతనే పట్టుకుని 'గుడ్డి'గా యెత్తి వ్రాసుకోవడంవల్ల వొక తప్పుడు విషయానికి యింత వ్యాప్తి కల్గింది.

మరొక వుదాహరణ. చరిత్రలో డాక్టర్ డిగ్రీ పొందిన నెల్లూరు వి. ఆర్. కాలేజి లెక్చరర్ సి. వి. రామచంద్రరావు—కావలి వెంకటరామస్వామి 1829లో ప్రకటించిన 'బయాగ్రఫికల్ స్కెచెస్ ఆఫ్ ది డక్కన్ పొయెట్స్' అనే గ్రంథాన్ని యిటీవల పునర్ముద్రిస్తూ యిటువంటి చిలకపలుకులు బోలెడన్ని పలికి నానా రకాల తప్పుల్ని ప్రచారంలోకి తెచ్చాడు. ఈ కావలి సోదరుల్లో వొకడైన వెంకటలక్ష్మయ్య భారవి కిరాతార్జునీయాన్ని యింగ్లీషులోకి తర్జుమా చేసినట్లు, అది 1869 లో వొక పుస్తకంలో అనుబంధంగా అచ్చయినట్లు వ్రాశాడు. తాను స్వయంగా ఆ పుస్తకం చూసినట్లు ప్రగల్భానికి పోయి వొక ఫుట్‌నోట్ కూడా చేర్చాడు. తీరా ఆ 1869 నాటి పుస్తకాన్ని చూస్తే అందులో భారవి

లేదు, కిరాతార్జునీయం తర్జుమానూ లేదు. ఇంతటి తప్పుకు కారణం యేమిటి? ఒక పాతపుస్తకాల పండితుడూ తెలుగురాని యింగ్లీషు జర్నలిస్టూ అయిన యస్. యస్. రామస్వామిగారు 1975 డిసెంబర్ 28 'సండే స్టాండర్డ్'లో యీ విషయాన్ని యేదో పొరపాటుపడి తప్పుగా పేర్కొన్నారు. దీన్ని గుడ్డిగా పట్టుకొన్నాడు తెలుగు వచ్చిన మన చరిత్రడాక్టర్. ఆ 1869 నాటి గ్రంథాన్ని చూడకుండానే చూచినట్లు బూటకపు ఫుట్‌నోట్‌తో బుకాయిస్తూ యీ తప్పును తన గ్రంథంలోకి ఎక్కించుకొన్నాడు.

వాస్తవానికి ఆ 1869 నాటి గ్రంథంలో వున్నది—భారవి కిరాతార్జునీయానికి కావలి సోదరుని యింగ్లీషు తర్జుమా కాదు. మహాబలిపురానికి సంబంధించి తెలుగులో వున్న మెకంజీ కైఫీయత్తూ, దానికి లక్ష్మయ్య చేసిన యింగ్లీషు తర్జుమా. చూశారా యెంత శుద్ధ తప్పు ప్రచారంలోకి వచ్చిందో! దొంగనోట్లు వచ్చి అసలు నోట్లను చలామణిలో నుంచి తొలగించివేసినట్లు, యిట్లాటి శుద్ధతప్పుల మూలంగా కొంత కాలానికి వొప్పుల్ని పట్టించుకొనేవాడే వుండడు.

అంతేకాదు యీ సదరు చరిత్ర లెక్చరర్ పీఠిక (9 వ పేజీలోని 28 వ నెంబర్ ఫుట్‌నోట్)లో వున్న అయిదు లైన్ల వాక్యం యావత్తూ విరామచిహ్నాలతో సహా మెహ్రోత్రా వ్రాసిన 'ది యెమర్జెన్స్ ఆఫ్ ది యిండియన్ నేషనల్ కాంగ్రెస్' (1971) అనే పుస్తకంలో (55 వ పేజీ) నుంచి యెత్తి వ్రాసుకొన్న పచ్చి కాపీ. కనీసం బిబ్లియాగ్రఫీలోనైనా యీ మెహ్రోత్రా పుస్తకాన్ని చేర్చలేదు. పోనీ ఆ వాక్యాన్ని కొటేషన్లలోనైనా యివ్వలేదు.

ఇంకా యిటువంటిదే డాక్టర్ మంగమ్మ వ్రాసిన 'బుక్ ప్రింటింగ్ యిన్ యిండియా' (1975) అనే పుస్తకంలో నుంచి ఆయన బరితెగించి దొంగిలించిన భాగాల్లో ముఖ్యమైంది మరొకటున్నది. ముగ్గురు భారతీయులతో కలిసివున్న మెకంజీదొర పెయింటింగ్ వొకటి పూర్తి పేజీలో ముద్రించి, అందుకు సంబంధించి రెండు పేజీల బారున (22-23) ఆయన చర్చించాడు. ఫిల్లిమోర్ సంకలనం చేసిన 'హిస్టారికల్ రికార్డ్స్ ఆఫ్ సర్వే ఆఫ్ యిండియా' సంపుటాల్లోనుంచి డాక్టర్ మంగమ్మ ఉటంకించిన భాగాలనే అప్పటంగా తీసుకొని తాను నేరుగా ఫిల్లిమోర్ సంపుటాల్లోనుంచి వుల్లేఖిస్తున్నట్లు నటించాడు. అయితే ఆ బొమ్మ, దానికి సంబంచిన చర్చ యే సంపుటంలో వున్నదో ఆయన తప్పుగా యెందుకు యివ్వవలసివచ్చింది?

డాక్టర్ మంగమ్మ పొరపాటుగా (లేదా అచ్చు పొరపాటు గావచ్చు) ఫిల్లిమోర్ మూడో సంపుటంలో ఆ బొమ్మ వున్నట్లు పేర్కొనగా, యీయనా గుడ్డిగా మూడో సంపుటంలోనే వుందన్నాడు. తీరాచూస్తే అదివున్నది మూడో సంపుటంలో కాదు, రెండో సంపుటంలో. ఒరిజనల్ సోర్స్ చూచినవాడైతే యీ తప్పును కాపీగొట్టి యెందుకు పునరుద్ధరించుకోవాలి? పోనీ తాను అచ్చువేసిన బొమ్మ వొరిజనల్‌దా అంటే అదీకాదు. ఆ వొరిజనల్ పెయింటింగ్‌లో నుంచి నేపథ్యభాగాలను కత్తిరించి వదించి డబ్ల్యు.సి. మెకంజీ (మెకంజీదొర వంశీకుడే కావచ్చు) అచ్చువేసిన 'సెకండ్ రేట్' బొమ్మ. నేపథ్యంలోని కొండలు, శ్రావణ బెళగోళ, గోమతేశ్వరుని శిల్పం, సర్వేశాఖవారి గుంజ వగైరాలేమీ లేవు యిందులో. ఇట్లా ఆ ఫిల్లిమోర్ సంపుటాల్లోవున్న ఆ అసలు బొమ్మను వదిలి, కత్తిరింపులకు లోనైన అసమగ్ర చిత్రాన్ని అచ్చు వేసుకోవలసిన నిస్సహాయస్థితి యెందుకు?

ఈ బొమ్మగురించి యిక్కడ యింత దీర్ఘంగా యెందుకు చెప్పవలసివస్తున్నదంటే క్రిందటేడాది జరిగిన 'ఆం. ప్ర. హిస్టరీ కాంగ్రెస్' సభల్లో యీ సెకండ్ హ్యాండ్ బొమ్మకు నకళ్ళుతీసి పంపకం చేసి మెకంజీపట్ల మన తెలుగు వరిష్ఠ చరిత్రకారులు తమ భక్తిని వెల్లడించుకోవడం జరిగింది గనుక.

ఈ ధోరణులను గురించి యేమనాలి? ఈ వుదాహరణలు చెప్పడంలో నా వుద్దేశం మనవారి 'ప్లేజియారిజమ్' ధోరణులను యెత్తిచూపడం కాదు; వొరిజనల్ సోర్సెస్‌లోకి పోకుండా సెకండరీ సోర్సెస్‌ను మాత్రమే పట్టుకు వేళ్ళాడుతూ యెంగిలి మెతుకులు యేరుకునే మన చరిత్ర పరిశోధనాతత్వంలోని దివాళాకోరుతనాన్ని గూర్చి ముచ్చటించడానికే.

తెలుగులో చెప్పుకోతగిన చరిత్రకారులు బొత్తిగా లేరనికాదు గానీ చెప్పుకో తగినంతమంది లేరని కదూ అన్నాను. ఒకప్పుడు వున్నారనుకునే వారి కాలం చెల్లిపోయింది. మల్లంపల్లి, నేలటూరు, కొమర్రాజు, భావరాజు, చిలుకూరు___యిట్లా యీ సంప్రదాయ చరిత్రకారుల అమాయిక స్వర్ణయుగం అంతరించిన తర్వాత, కొత్త శూన్యం వొకటి ఆవరించినట్లున్నది. వాళ్ళంతా 'విశుద్ధ' చరిత్రకారులు. చరిత్ర అంటే యేదో గతకాలపు సంగతులను క్రమించి పోగుచేసి వుల్లేఖించే జిగిబిగిని చూపే తత్వం మినహా మరో సామాజిక తత్వాన్ని వారు సాధించలేకపోయారు. రాగిరేకుల్లో నుంచి, రాతిశాసనాల్లో నుంచి తెలుగు రాజవంశానుగత చరిత్ర రాసు

అను త్రవ్వి పోశారు. డైనాస్టిక్ చరిత్ర తాలూకు మొజాయిక్ స్తంభాలను వాళ్ళు నిలిపి పోయారు. గతించిన ఆ రాజవంశాల చరిత్రను గడుస్తున్న సమాజ-చరిత్రతో యెట్లా అనుమేళన చేసుకోవాలో చూపకుండానే, అట్లా అనుసంధింపజేసే సామాజికశాస్త్ర సరళిలో వొక ప్రాణవంతమైన చరిత్ర తత్వాన్ని అందివ్వకుండానే వారి చరిత్రరచనా పవిత్ర యజ్ఞం కొనసాగుతూపోయింది—వొక విశుద్ధ వినిర్మల విజ్ఞానశాఖగా వారు అందులో పాటుపడ్డారు. విస్తృత విహారం సల్పారు. పైగా వీరు ఆధునిక చరిత్ర పరిధిలోకి ప్రవేశించనే లేదు. ప్రవేశించ నిచ్ఛగించనూ లేదు. సకృత్తుగా వీరిలో కొందరు ఆధునిక చరిత్రగురించి వొకటీ అరా రచనలు చేసినా వాటిలో ప్రాణస్ఫూర్తి బొత్తిగా కనిపించేది కాదు. ప్రాచీన మధ్యయుగాల చరిత్ర వరకే వారు ఆగిపోయారు. తెలుగుచరిత్ర రచనారంగంలో మనకు వీరినుంచి సంక్రమించిన యీ వారసత్వం మనల్ని యింకా వొక జాడ్యంలా అంటిపెట్టుకునివుంది. బహుశా యిట్లా contemporary relevance లేకుండా మనవారి చరిత్రరచన సాగుతూపోయినందువల్లనే కావచ్చు మొత్తం మీద మన చరిత్ర యెక్కడేసిన గొంగళి అక్కణ్ణేగా వుంటున్నది. All history is contemporary history అని యిటాలియన్ చరిత్ర పండితుడు క్రోషీ (Croce) వూరకే అన్నాడా?

స్వర్గీయ డి. డి. కోశాంబి It is doubtless more important to change history than to write it అని వూరకే అన్నాడా?

పంతొమ్మిదో శతాబ్దపు బ్రిటిష్ లిబరల్ సంప్రదాయపు చరిత్రకారులు 'చరిత్ర'పట్ల పెంచుకున్న 'దృష్టిసంపద'ను గూర్చి చెబుతూ యి. హెచ్. కార్ యిట్లన్నాడు:

"This was the age of innocence, and historians walked in the Garden of Eden, without a scrap of philosphy to cover them, naked and unashamed before the god of history. Since then we have known sin and experienced a Fall; and those historians who today pretend to dispense with a philosphy of history are merely trying, vainly and self-consciously, like members of a nudist colony to create the Garden of Eden in their garden suburb..."

(*What is History*, p. 20)

ఈ వాక్యాలు—ఆ సంప్రదాయపు ముద్దుబిడ్డలైన పైన చెప్పుకొన్న మన తెలుగు చరిత్రకారులనూ, వారి చరిత్రరచనా సంప్రదాయాన్ని స్మరణకు తెస్తున్నాయి. కాదంటారా?

ర ర ర

ఆంధ్రదేశం నేడు అల్లకల్లోలమైన పరిస్థితిలోవుంది. ఈ వాక్యాలు వ్రాస్తున్న తేదీకి పదిరోజుల క్రితం రాష్ట్రం నడిబొడ్డున కోస్తాప్రాంతాన్ని తుఫాను బీభత్సం ముంచెత్తివేసింది. ఈ సందర్భంలో మన చరిత్రనుంచి మనం గ్రహించిన పాఠాలుగానీ గుణపాఠాలుగానీ యేమైనా వున్నాయా? పదేళ్ళకొకసారో వందేళ్ళకొకసారో చరిత్ర పునరావృత్తమవుతుంటుందనే నమ్మకంవున్న వాణ్ణికాదుగానీ, దాదాపు యిదే కోస్తాప్రాంతంలో 1787లోనూ 1839లోనూ 1864లోనూ యింకా యిటీవలా సంభవించిన పెను వుప్పెనల్లో యెంతెంత నష్టం జరిగిందీ అప్పట్లో ప్రజలూ ప్రభుత్వమూ ఆ కష్టనష్టాలను యెట్లా యెదుర్కొన్నారు? యెట్లా యెదుర్కోలేకపోయారు? స్వాతంత్ర్యం వచ్చి ప్రజాప్రభుత్వం అని పిలవబడే మన ప్రభుత్వం యీ విపత్తులో యెట్లా వ్యవహరించింది? యేమిచేయగల్గింది? యేమిచేయలేకపోయింది? పరాయిదిగా సామ్రాజ్యవాదపు పెట్టుబడిదారీదిగా భావించే ఆ నాటి ప్రభుత్వం వ్యవహరించిన తీరు తెన్నులకూ నేడు మన ప్రభుత్వం అనుసరించిన పద్ధతులకూ మార్పేమైనా వుందా? ఇట్లా సరిపోల్చిచూసుకొంటే మన కెన్నో విషయాలు సువ్యక్తమవుతాయి. కానీ మన చరిత్రను యిట్లా applied ధోరణిలో రచించిన వారేరీ? పరికించిన వారేరీ?

"Great history is written precisely when the historian's vision of the past is illuminated by insights into the problems of the present...The function of the historian is neither to love the past nor to emancipate himself from the past, but to master and understand it as the key to the understanding of the present... The function of history is to promote a profounder understanding of both past and present through the interrelation between them..."

(*What is History*, Carr, Pp. 37, 26, 68)

పై వాక్యాలను కార్ వ్రాసిందీ, కోశాంబి తన గ్రంథంలో వీటిని కోట్ చేసిందీ యీ వుద్దేశంతోనే కదా. కార్ యింకా యిట్లన్నాడు:

"Learning from history is never simply a one-way process. To learn about the present in the light of the past means also to learn about the past in the light of the present."

ఈ గ్రంథంలో 'గుంటూరు కరువు' అధ్యాయం వ్రాసేటప్పుడు యిదే ప్రశ్నను అడుగడుగునా యెదుర్కోవల్సివచ్చింది. కానీ అందుకు న్యాయం చేకూర్చే విధంగా ఆ అధ్యాయాన్ని వ్రాయాలంటే యిటీవలి బీహారు కరువును గురించి గాఢంగా పరిశోధించవలసిన అవసరం కన్పించి, యిప్పట్లో యిది సాధ్యం కాదనే మానుకున్నాను. పైగా శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో చరిత్ర అధ్యాపకులు శ్రీ రామన్ 'రాయలసీమ కరువుల'పై పరిశోధన చేస్తున్నారు. ఏమైనా అటువంటి చర్చను స్పృశించలేకపోయానన్న కొరత యిప్పుడు యేమిచెప్పుకుంటే తీరుతుంది? అయినా, 'యెన్ అయ్ టు యిండియా' గ్రంథకర్త దేవిడ్ సెల్బోర్న్ అన్నట్లు మనది వొక విధంగా నిత్య కరువుల దేశం కదా. ఈ విశాల దేశంలో మృష్టాన్న భోజన సంతుష్టాంతరంగులు యెంతమందివుంటారో, అర్ధాకలితో కడుపులు నింపుకొని నెట్టుకొస్తున్న వారి సంఖ్య అంతకు యెక్కువే కాదంటారా? వీళ్లను గురించి మన 'స్వాతంత్ర్యం' యే మేరకు పట్టించుకొంటున్నది?

వర్తమానాన్నీ భవిష్యత్తునూ అర్థం చేసుకొనే సాధనంగా, అన్వయించుకొనే ఆయుధంగా మన చరిత్రను మనం యేనాడూ వినియోగించుకోలేదు. ఆ కోణంలో మన చరిత్ర రచన పెద్దగా కొనసాగనూలేదు. అందువల్లనే చరిత్ర అనేది వొక ప్రాణపూర్ణమైన నవనవోన్మేషమైన విజ్ఞానశాఖగా మనగడ్డమీద వర్ధిల్లనూలేదు. నాలుగేళ్ళ క్రితం వ్రాసిన వాక్యమే అయినా మళ్ళీ యీ సందర్భంలో చెప్తే పునరుక్తిదోషాన్ని అంటగట్టరనుకొంటాను: మనదృష్టిని మార్చవలసిన చరిత్ర, మనకొక దృష్టిని ప్రసాదించవలసిన చరిత్ర రచనలు చాలా రావలసివున్నాయి.

* * *

ప్రాచీన మధ్యయుగాల చరిత్ర సంగతటుంచి, ఆధునిక చరిత్రరంగంలో కొస్తే తెలుగువాళ్లం యెంత వెనుకబడివున్నామో యెంతని చెప్పుకోవాలి? ఆధునికాంధ్రచరిత్ర, ముఖ్యంగా బ్రిటిష్ యుగాంధ్రచరిత్ర గురించి యేకదీక్షగా యేకాకిగా ఆధునికమైన అవగాహనతో దాదాపు రెండుమూడు దశాబ్దాలపాటు తెలుగులో లెక్కలేనన్ని వ్యాసాలూ పుస్తకాలూ ప్రకటించిన శ్రీ దిగవల్లి వెంకటశివరావు వొక్కరు కనపడ్తున్నారు. ఇన్ని విశ్వవిద్యాలయాలు యేర్పడి, యిందరు

మహామహులనబడే చరిత్ర అధ్యాపకుల కింద యిందరు చరిత్ర విద్యార్థులు తర్ఫీదైన తర్వాతకూడా తెలుగుదేశపు ఆధునిక చరిత్ర ఆకరాలు, ఆధారాలూ యెక్కడ లభ్యమవుతున్నాయో, నిన్న మొన్నటిదాకా యెక్కడెక్కడ భద్రంగా వుండి నేడు శిథిలమైపోతున్నాయో కూడా మనవారికి స్పృహ లేకుండాపోయింది. ఇంత కాలం మనల్ని యీ ఆధారాలకు బహుదూరంగా వుంచారు మనవాళ్ళు.

ఇంచుమించు పదేళ్ళుగా మద్రాసు రికార్డ్స్ ఆఫీస్ (ఇప్పుడు తమిళనాడు ఆర్కైవ్స్)కు అడపాదడపా వెళ్తున్నాను. నా ఔత్సాహిక చారిత్రక తృష్ణను తీర్చుకుంటూ వస్తున్నాను. ఇటీవలవరకూ అక్కడ తారసిల్లే పరభాషల పరదేశాల చరిత్రవిద్యార్థుల సంఖ్యతో పోల్చుకుంటే తెలుగు చరిత్రాన్వేషకుల సంఖ్య స్వల్పాతి స్వల్పం. అక్కడి అటెండెన్స్ రిజిష్టర్‌లో తెలుగుపేరుకోసం వెతికేవాణ్ని. మొదట్లో వొక్కటీ కనపడేదికాదు.

మొట్టమొదటిసారి అక్కడికి వెళ్ళినప్పుడు—నీ ప్రవేశార్హతను చూపమన్నారు అధికారులు. నా చిత్తశుద్ధే నా అర్హత అన్నాను. నేను అప్పట్లో తల బద్దలు కొట్టుకొంటూ పరిశోధిస్తున్న వొక అనామక సమస్యను గూర్చి వారికి విన్నవించుకొన్నా. అదంతా జాన్తానై, నీవు యూనివర్సిటీలో జెన్యువిన్ పరిశోధన చేస్తున్నవాడివి—అని యేదైనా వొక రికగ్నైజ్డ్ యూనివర్సిటీ చరిత్రాచార్యుని వద్ద లేదా మరే శాఖాచార్యునివద్ద నుంచి వొక సర్టిఫికేట్ తెస్తేనే యీ ఆర్కైవ్స్ పవిత్రమందిరంలోకి ప్రవేశించే అర్హత లభిస్తుంది. లేకపోతే లేదు—అన్నారు. నేను యూనివర్సిటీ గోడలు దాటి, ఆ వాతావరణాన్ని వదిలి అప్పటికి అర్ధపుష్కరం అవుతున్నది. అటువంటి సర్టిఫికేట్ యెట్లా తెచ్చుకోవాలో బోధపడ్డేదు. మద్రాసు నుంచి 400 మైళ్ళదూరంలో వున్న నే చదువుకొన్న విశ్వవిద్యాలయంలోని మిత్రులకు సదరు సర్టిఫికేట్ కోసం వ్రాస్తే, వాళ్లు యీ ఆర్కైవ్స్ వునికిని గురించి విన్నట్లే కనపడ్లేదు. ఇక్కడ యింత చరిత్ర ముడిసరుకు వున్నదన్న స్పృహ లేనివారి దగ్గర్నుండి ఆ పత్రం తెచ్చుకోవడమేమిటని అడ్డదారి తొక్కి మద్రాసు విశ్వవిద్యాలయంలో లైబ్రరీ సైన్సులో రీడర్‌గా వుంటున్న మిత్రుని దగ్గర నా తపన విన్నవించుకుంటే ఆయనొక సర్టిఫికేట్ యిచ్చాడు. అప్పుడు లభించింది ప్రవేశం. అంతే ఆ నాటినుంచే నా దృష్టిమారింది. నా జీవన పథం మారిపోయింది. ప్రవృత్తీ, ప్రవృత్తితోబాటు వృత్తీ, వ్యసనమూ కూడా మారిపోయాయి.

ఈ ఆర్కైవ్స్ ఆధారాలను వినియోగించుకొని తెలుగువారి వొకానొక చరిత్రకు సంబంధించిన మొదటి తెలుగు పుస్తకం 1973 నాటిదాకా రాలేదంటే, అది బ్రౌన్ జాబుల పుస్తకమేనంటే మనం ఆశ్చర్యపడాలి. లేదు, అంతకుముందే మరొకటి వచ్చిందని యే చరిత్రకారుడైనా చూపితే సంతోషంగా సవరించుకొంటాను. మన ఆధునిక చరిత్రరచన యిట్లా అఘోరిస్తున్నది స్థూలంగా చెప్పాలంటే.

అటువంటి ఆర్కైవ్స్ మందిరాల్లో నిక్షిప్తమైవున్న ఆధారాల్లోనుంచి సేకరించిన విషయాల అల్లికతో యీ పుస్తకం తయారైంది. గతకాలపు వాస్తవాలకు సంబంధించిన వొట్టి విషయసేకరణే చరిత్రకాదు. కాకూడదు. "The belief in a hard core of historical facts existing objectively and independently of the interpretation of the historian is a preposterous fallacy, but one which it is very hard to eradicate." అన్వయదృష్టి, అంతరార్థ వివరణ అవసరం. అన్వయదృష్టితో అర్హమైన విషయాలను సేకరించాలి. సేకరించిన విషయాలను సరిగా అన్వయించాలి. "The facts of history do not exist for any historian till he creates them"—అని కార్ల్ బెకర్ అనే అమెరికన్ చరిత్రకారుడన్నాడంటే అర్థం అదే కదా.

ర ర ర

నాకలలు నెమ్మది నెమ్మదిగానైనా కాస్తకాస్త నిజమవుతున్నాయి. ఈ జాబులను బ్రౌన్ ప్రధానంగా సేకరించింది భాషా పరిశీలనకోసం. అందుకోసమే వీటిని ఆయన బహుళంగా వినియోగించుకొన్నాడు. ఒక ఔత్సాహిక దృష్టితో అయిదేళ్ళ క్రితం అలవోకగా తొలిసారి వీటిని చూచినప్పుడు—మరో కోణం నుంచి వీటిని వినియోగించుకోడానికీ అన్వయించుకోడానికీ అవకాశం లేకపోలేదన్న ఆలోచన కల్గింది. నెల్లూరులేఖలు, విశాఖపట్నం లేఖలు, కృష్ణాలేఖలు—యిట్లా జిల్లాలవారీగా వీటిని వర్గీకరించుకొని ప్రాంతాలవారీగా స్థానికచరిత్రను యెందుకు వెలికి తీయరాదు అనిపించింది. కొన్ని నెల్లూరుజిల్లా లేఖలను కాపీచేసి యేదో తెలిసీ తెలియని వివరణలను జోడించి వొక నెల్లూరు స్థానికపత్రికలో సీరియల్‌గా ప్రకటించాను, జిల్లా స్థానిక చరిత్ర శకలాలుగా భావిశోధకుడికి పనికొస్తాయనే గుర్తింపుతో. శ్రీ నార్ల, దిగవల్లి వెంకటశివరావు, కె. వి. రమణారెడ్డి వంటి భావుకుల దృష్టిని

ఆకర్షించి ప్రోత్సహిస్తూ వచ్చారు. అప్పట్లో నేను స్వప్నించిన ఆ చరిత్ర కల శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంవారు నాకు ప్రసాదించిన యీ మహాదవకాశం మూలంగా యిట్లా ఫలిస్తుందని వూహించుకోలేకపోయాను. ఇటువంటి భాషేతర పరిశీలన కోసం బ్రౌన్ జాబులను బహుశా మొదటగా వెలుగులోకి తెచ్చిన వ్యక్తి స్వర్గీయ వేటూరి ప్రభాకరశాస్త్రి. 1944-45 మధ్యకాలంలో ఆంధ్ర దినపత్రికలో ఆయన కొన్ని జాబుల్ని ప్రకటించాడు.

ఈ జాబుల్లో సందర్భానుసారంగా between the lines అనేక చరిత్ర విషయాలు యిమిడివున్నాయనీ, వాటిని శ్రద్ధగా పరిశీలించాలి అనేవారు శ్రీ దిగవల్లి. నేను చాలాచాలా వాటిని వదిలేయవలసివచ్చింది. మరొకరు మరోవిధంగా మరో కోణం నుంచి వ్రాయడానికి వీలున్నది. వట్టి వీలేకాదు. ఆ అవసరమూ వుంది. గ్రంథ పరిమితి, పేజీలసంఖ్య—వీటి మూలంగా నా జిజ్ఞాసను కుదించుకోవలసి వచ్చింది. ఇప్పటికే అనుకొన్న పేజీలసంఖ్య బాగా దాటిపోయింది.

బ్రౌన్ సేకరించిన 20 సంపుటాల జాబుల్లోనుంచి మొత్తం 80 కడప జాబుల్ని కాపీచేశాము. ఒకటికి రెండుసార్లు యిద్దరకు ముగ్గురంచేరి జాగ్రత్తగానే యేరాము. ఇంకా పరిశీలనగా చూస్తే మరికొన్ని తేలవచ్చు. కాపీచేయించిన వాటిలో నుంచి యీ గ్రంథంలో వినియోగించుకొన్న జాబులసంఖ్య 41 మాత్రమే. అంటే సగంవరకూ యీ పుస్తకం యితివృత్తంలోకి రాలేదన్నమాట. అటు బ్రౌన్ గురించి, బ్రౌన్ కృషిగురించి యిటు కడపజిల్లా చరిత్రగురించి వుభయతారకంగా వుండే విధంగా వీటిని యీ రూపంలో సంకలనం చేయవలసివచ్చింది.

ఈ గ్రంథంలోకి రాకుండా మిగిలున్న జాబుల్లో నిజమైన స్థానిక చరిత్రాంశాలు తక్కువున్నాయని కాదు. నిజానికి వాటిల్లో ఆ నాటి కడప ఆర్థిక సాంఘిక పరిపాలనా చరిత్రల విషయాలు దండిగానే వున్నాయి. బ్రౌన్ పోస్ట్ మాస్టర్ జనరల్ గా వుంటున్నప్పుడు కడపప్రాంతపు పోస్టల్ వుద్యోగులు వ్రాసుకొన్న జాబులు అరడజన్ దాకా వున్నాయి. ఇక బ్రౌన్ కు వ్రాసినవి గాకపోయినా ఆయన కాపీ చేయించిన పెక్కు అర్జీలు పత్రాలు వుండనే వున్నాయి. వీటిల్లో కుతూహలకరమైన అనేక చరిత్రాంశాలున్నాయి. భావిపరిశోధకులెవరైనా వీటిని మున్ముందు పరిశీలిస్తారనీ, మరింత సమగ్రంగా పరిశీలిస్తారనీ ఆశిస్తున్నాను.

మన చరిత్రరచన యిటీవల కాలంవరకూ పైనుంచి కిందికి సాగుతూవచ్చింది. కిందినుంచి పైకి కొనసాగాలనేది నా మతం. కిందనుంచి చరిత్రరచన సాగించాలనే

కొత్త దృక్పథాన్ని కల్పించినవారిలో ఫ్రైకెన్‌బర్గ్ మొదటివాడుగా కన్పిస్తాడు. గుంటూరుజిల్లాపై ఆయన వ్రాసిన థీసిస్ గ్రంథంలో అంటున్నాడు చూడండి:

"There seemed to be a tendency for historians and political scientists to concentrate upon a wide and often an All-India frame of reference and, on the other, a tendency for anthropologists and sociologists to focus attention upon the minutiae of individual village...Between these macroscopic and microscopic approaches there appeared to be an uncharted territory that might prove a rich field for research. It also appeared to me at the time that much Indian history has been written from above, from the viewpoint of the rulers...The idea of writing a history from below, with the hope that other studies in local history might follow, some day giving rise to a more comprehensive (social and economic) history of India by an inductive process..."

ఈ మార్గంలో మరొక జిల్లా చరిత్రగా యిది మరొక చిన్న ప్రయత్నంగా తెలుగు పాఠకులు పరిశీలిస్తారని ఆశిస్తున్నాను.

ఠ ఠ ఠ

ఇందులో కొంత తొందరపాటువల్ల అనేక విషయాలు ప్రధాన చర్చలో నుంచి తప్పిపోయాయి. ఉదాహరణకు కడపకరువు అధ్యాయంలో జారిపోయిన విషయం. ఆ రోజుల్లో కరువులవల్ల తుఫాన్లవల్ల రైతులూ మిగతా సన్నజనం నానా బాధలు అనుభవించవలసివచ్చినా రివెన్యూమాత్రం కఠినంగా వసూలు చేసేవారు కలెక్టరు. అట్లావుండేది కంపెనీ పరిపాలన. ప్రభుత్వానికి బ్రౌన్ పంపిన నివేదికల్లో మొత్తంమీద సానుభూతి పూర్వకమైన వ్రాతలేవున్నా, యిటువంటి రివెన్యూ ధోరణికూడా అక్కడక్కడా వ్యక్తంగాకపోలేదు. జూలియా తామస్ అనే బ్రిటిష్ వనిత మాటల్లో చెప్పాలంటే రాజమండ్రిలో సాక్షాత్తు వొక 'క్రాక్ కలెక్టర్' వుండేవాడు ఆ రోజుల్లో. 1839లో కోరంగి తుఫాను బీభత్సాన్ని గూర్చి వ్రాస్తూ ఆమె తన లేఖల గ్రంథంలో ఆయన్ను యెట్లా చిత్రించిందో చూడండి:

"The Collectors are chiefly bent upon keeping up the revenue; whatever may happen; and the people suffer terribly when they have any additional drawback. A 'crack Collector' as the phrase goes, is one who makes a point of keeping up the usual revenue in defiance of impossibilities. There may be a

famine, a hurricane; half the cultivators may take refuge in another district in despair; there may seem no possible means of obtaining the money; but still the collector bullies, tyrannizes, starves the people—does what he pleases, in short,—and contrives to send in the usual sum to the Board of Revenue, and is said to be a 'crack Collector'

(*Letters from Madras*...by a Lady, 1846, P. 144)

ఇటువంటి విషయాలను అక్కడ చర్చించి వుండాల్సింది. సమయానికి సరిగా స్ఫురించక కొన్ని, స్థలం చాలక మరికొన్ని యిట్లా పెక్కింటిని వదిలివేయవలసి వచ్చింది.

ఆఖరుగా వొక్క విషయం చెప్పి ముగిస్తాను. భాషా విషయంలో పెద్ద పట్టింపులున్న వొక తలపండిన తెలుగు పండితుడు యీ పుస్తకం అచ్చుఫారాలు కొన్ని నా గదిలో వుంటే చదివి—ఇదేమిటయ్యా నీ రాత పాడుగానూ. ఒకచోట 'ఉయ్యాలవాడ' అనీ, యింకోచోట 'వుయ్యాలవాడ' అనీ అచ్చుల హల్లుల తేడాను పాటించకుండా రాశావు?—అన్నాడు. అందుకు నేనిచ్చిన సమాధానం:

మీరీ ప్రశ్న వేశారంటే నా ధ్యేయం నెరవేరినట్లే. ఈ 'కాంట్రడిక్షన్'ను రేకెత్తించాలనే, యీ అచ్చుల-హల్లుల 'విడ్డూరం' గూర్చి తెలుగుపాఠకులచేత ఆలోచింపజేయాలనే పనిగట్టుకొని అట్లా వ్రాశాను. ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ—యీ పన్నెండు అచ్చులను మన అక్షరమాలనుంచి తొలగించినందువల్ల కొంప మునిగిపోయేదేముందో ఆలోచించారా? వాటి బదులుగా—యి, యీ, వు, వూ, రు, రూ, యె, యే, అయి, వొ, వో, అవు— అని వ్రాసుకోవచ్చుగదా. ఆ మేరకు మన అక్షరాల సంఖ్యలో 12 తగ్గిపోయి టైపులోనూ, ప్రింటులోనూ యెంత సౌలభ్యం యేర్పడ్తుంది? ఈ ఆలోచన నా సొంతమేం కాదు. బ్రౌన్ జాబుల్లో దాదాపుగా యిదే లేఖనపద్ధతి గదా మనకు కనపడ్తున్నది. బ్రౌన్ యీ విషయాల గూర్చి చాలాచోట్ల వ్రాసున్నాడు. నేటి రచయితల్లో చాలామంది యిట్లాగే వ్రాస్తున్నారు. ప్రఖ్యాత అభ్యుదయ సాహిత్య విమర్శకుడు రా.రా. వ్రాతల నిండా యీ హల్లులే. పైన చూపిన అచ్చులు దాదాపు వాడడాయన. ఒకే

బంగోరె

ఒక నవలతో తెలుగుపాఠకుల్ని ఆకట్టుకున్న వడ్డెర చండీదాస్ 'అవసరం కన్పించక యీ అక్షరాలు వాడే అలవాటు' తనకు లేదని ప్రత్యేకంగా వివరణ వ్రాసుకున్నాడు. ఓం ప్రథమంగా విలియమ్ బ్రౌన్ (సి. పి. బ్రౌన్ కాదు) తన డిక్షనరీ (1818)లో యేకంగా అ, ఆ లతో వచ్చే ఆరోపాల్ని యిచ్చింతర్వాత ఇ, ఈ... వగైరా అచ్చులన్నీ యెగరగొట్టేసి నేరుగా క, ఖ ల దగ్గరకొచ్చాడు. ఆలోచించండి స్వామీ. ఆ అక్షరాలు లేనంతమాత్రాన తెలుగుభాషకు వొరిగే ప్రమాదమేమిటి, బాలవ్యాకరణాది పాఠాలు చెప్పుకోడానికి యేర్పడే యిబ్బంది తప్ప? పైగా బోలెడంత సౌకర్యం. ఈ గ్రంథంలో దాదాపుగా వాక్యాదిన అచ్చులు వాడి మధ్యలో మాత్రం హల్లులు వుపయోగించడం ద్వారా ఆ contradictionను తెలుగు పాఠకుల దృష్టికి తీసుకొచ్చి వారిచేత కాస్త ఆలోచింపచేయాలనే అట్లా వ్రాశాను. మీరు సరిగ్గా యీ ప్రశ్న లేవనెత్తారంటే నా లిపి సంస్కరణ చిరుధ్యేయం కొంత వరకు యీడేరినట్లేగదా. కాస్త ఆలోచించండి. శలవ్.

మద్రాసు,

29-11-77.

265

To the Collector ...

Cuddapah

Sir,

I am directed by the Board of Revenue to communicate for your information, the undermentioned appointment by the Governor in Council, dated 8th Augt 1820

Mr. C. P. Brown — Assistant to the Collector and Magistrate of Cuddapah

I am,

Sir,

Your most obedient Servant

Fort St. George

14 Aug. 1820

Secretary

Sept 16

Recd 14th ...

1820

కడప కలెక్టర్‌కు అసిస్టెంటుగా సి. పి. బ్రౌన్

మొదటి వుద్యోగపుటుత్తర్వు

[ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఆర్కైవ్స్ (హైదరాబాదు)లోని
కడపజిల్లా రికార్డ్స్ సంపుటి 646, పేజీ 265]

# ప్ర వే శి క

## కడపతో బ్రౌన్ అనుబంధం

పురుగుల వాతబడి భ్రష్టమైపోతుండిన తెలుగు తాళపత్ర గ్రంథాలతో సతమత మైన వట్టి 'పుస్తకాల పురుగు' మాత్రమే కాదు బ్రౌన్. తెలుగువాళ్ళతో సత్సంబంధాలు పెట్టుకొని, వీలైనంత 'సానుభూతి'తో సహానుభూతితో సమకాలీన తెలుగు ప్రజా జీవితంలో సంలీనమై, దానితో తాదాత్మ్యంచెంది, తెలుగు ప్రజల గుండెల 'లబ్‌డబ్' ధ్వనుల్ని పరిశీలించి పోయిన 'సాహిత్య శాస్త్రజ్ఞుడు' బ్రౌన్. అంతేకాదు, తెలుగు జన జీవితంలోనుంచి సాహిత్యాన్నీ, సాహిత్యంలోనుంచి జీవితాన్నీ దర్శించి అవగాహనకు తెచ్చుకొని, మనకొక అవగాహనను ప్రసాదించిపోయిన సారస్వతమూర్తి బ్రౌన్.

బ్రౌన్ పరాయిదేశంవాడైనా తెలుగు అధ్యయనాలకు తన జీవితాన్ని ధారబోసి, తెలుగు సాహిత్య సముద్ధరణకు మార్గదర్శకమైన కృషిచేసిన తొలి ఆధునికుడుగా గణుతికెక్కాడు. అందుకనే, 'బ్రౌన్ యుగం' అనేది తెలుగు సాహిత్య చరిత్రలో చెరగని ముద్ర వేసిపోయిన వొక దశా విశేషం.

తెలుగు సాహిత్య సాక్షాత్కారంలోనూ, సాధనలోనూ బ్రౌన్‌కు తోడ్పడిన తెలుగు పట్టణాలు లెక్కకు కొద్దే- కడప, బందరు, రాజమండ్రి, కంభం, గుంటూరు, చిత్తూరు....ఈ ప్రాంతాల ప్రభావం ఆయన సాహిత్య జీవితంలో యే యే పాళ్ళలో

వున్నదో అంచనా కట్టాలంటే చాలా గట్టి పరిశోధనే చేయవలసి వుంటుంది. ప్రఖ్యాత రచయిత సోమర్సెట్ మామ్ అనేవాడట—వొక కొత్త కథకు యితి వృత్తాన్ని రాబట్టనిదే వొక కొత్త వ్యక్తితో నాలుగు నిమిషాలపాటు మాట్లాడేవాణ్ణి కాదు అని. ఒక కొత్త తెలుగు పుస్తకాన్ని సేకరించకుండానో, వొక తెలుగు మాటకు అర్థాన్ని రాబట్టకుండానో బ్రౌన్ యే తెలుగు వూర్లోనూ వున్నట్లుగానీ, యే తెలుగువాడితోనూ మాట్లాడినట్లుగానీ కనిపించదు. ఇందుకు చిన్న చిన్న వుదాహరణాలు చెప్పుకోవాలన్నా బోలెడన్ని వున్నాయి. మచ్చుకు:

"బిత్తలి as meaning nacked, is to this day used in the Cuddapah Country: where Vemana lived. In the north, Rajahmundry the word is at present unknown. In the year 1824 when I first read Vemana my learned assistant (Thippabhatla) Venkatasiva Sastri interpreted it pretty, elegant. At last we came to the verse పుట్టు బిత్తలివలె పోవు బిత్తలివలె Nacked are we born and nacked we die. This constrained him to admit the sense I averred. Afterwards in the Dasavathara Charitra we repeatedly met బిత్తలి as distinctly meaning nacked. He concluded, perhaps right, that in this sense it is a Kanarese word." *

"పులసరం heart-burn, love, lust...enthusiasm, spirit ఉద్రేకం.... I heard this word in a comedy acted at Rajahmundry."†

మిగతా చోట్ల సంగతి అలావుంచి. కడపతో మాత్రం బ్రౌన్‌కు వొక ప్రత్యేక అనుబంధం యేర్పడ్డదని చెప్పాలి. ఆయన వుద్యోగరీత్యా 1820-22 లో వొకసారి, 1826-29 లో మరొకసారి మొత్తం రెండు దఫాలు కడప మండలంలో పనిచేశాడు. ఈ రెండు దఫాల్లోనూ ఆయన కడప జిల్లాలో అయిదేళ్ళకంటే యెక్కువ కాలం లేదు. అయినా యాభై యేళ్ళ అనుబంధాన్ని యేర్పరచుకొన్నాడనేందుకు ఆయన సేకరించిన యీ కడప జాబులే సాక్ష్యం.

కడపలో పనిచేసినంతకాలం ఆయన జీతం పెద్దదేమీకాదు. 1855 లో రిటైరయ్యేనాటికి 3 వేల రూపాయల పైచిలుకు జీతం వచ్చేది. కానీ కడపలో వున్న

* మ.ఓ.మే.లై లో బ్రౌన్ డిక్షనరీల నోట్సు సంపుటం డి. 1391, వాల్యూమ్ 3.

† అదే సంపుటం.

కాలంలో మాత్రం జూనియర్ హోదా కలిగిన వుద్యోగాల్లోనే పనిచేశాడు కాబట్టి అప్పట్లో ఆయన జీతం నెలకు అయిదారు వందలకు మించినట్లు లేదు. తాను వుద్యోగంచేసిన మిగతాచోట్ల స్థిరాస్తులేమీ చేర్చినట్లు లేదుగానీ కడపలో మాత్రం వొక పెద్ద బంగళా—తోట కొనుక్కొన్నాడు. అందులో పెద్ద లైబ్రరీ యేర్పరిచాడు. సొంతంగా జీత బత్తేలిచ్చి పండితుల్ని నియమించి ఆ బంగళాను తెలుగు కావ్యోద్ధరణ 'కర్మాగారం'గా రూపొందించాడు. రెండు స్కూళ్ళు పెట్టాడు. తెలుగు పిల్లలకు వుచిత విద్యా సౌకర్యం కల్గించాడు.

ఉత్తరోత్తరా యితర వుద్యోగాల్లో యితరచోట్ల నిమగ్నమై వున్నప్పుడు సైతం, కడపలో కొనిపెట్టిన యీ బంగాళా—తోట, తాను చేపట్టిన యీ యితర కార్యభారాలు, వీటి లెక్కపక్కలు యెప్పటికప్పుడు తెలుపుతూ వుండేదానికి అయోధ్యాపురం కృష్ణారెడ్డి వంటి నమ్మకస్తులైన వుద్యోగుల్ని పెట్టుకొన్నాడు. ఇట్లా కడపలో దాదాపు యిరవైయేళ్ళపాటు తన బంగళాయే వొక చిన్న 'కాలేజి'గా వొక పెద్ద కమతమే వుండేది.

చిన్న వుద్యోగిగా వుంటూ యింత తతంగం యెట్లా నడుపుతూ రాగలిగాడు బ్రౌన్? మామూలు సంపాదనగాక, ఆనాటి మిగతా కంపెనీ వుద్యోగుల మోస్తరు 'లో సంపాదనపరుడు' కూడానా బ్రౌన్? కాదు. నిజాయితీపరుడైన వుద్యోగిగానే పేరు తెచ్చుకొన్నాడు. 1834 లో వుద్యోగంనుంచి కొంతకాలం సస్పెండ్ చేయబడ్డాడు. కానీ అందుక్కారణం దుస్సంపాదనా కాదు, లంచగొండితనమూ కాదు.*

బ్రౌన్ వుద్యోగ జీవితంలోనూ, వుద్యోగేతర జీవితంలోనూ స్వచ్ఛత, స్వచ్ఛందత ముఖ్యమైన అంశాలు. ఆయన సొంతంగా తలపెట్టిన సాహిత్యకృషి దొడ్డది. బ్రౌన్ సంకల్ప బలం గొప్పది. 'వేర్ దేరీజ్ విల్ దేరీజ్ వే' అనే ఆంగ్లోక్తికి ఆయన వొక సూటి ప్రమాణంగా నిల్చిపోయాడు. సొంత బాధలు యెన్నివున్నా, యెన్ని అడ్డంకులు యిబ్బందులు యెదురైనా తాను కొనసాగిస్తూ రోజురోజుకూ పెరుగుతూ వచ్చిన కడప కమతభారాన్ని కడవరకూ మోస్తూనే వచ్చాడు తప్ప, దాన్ని వదుల్చుకో చూడలేదు.

---

* చూడు: లోగడ శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంవారు ప్రకటించిన "బ్రౌన్ లేఖలు: ఆధునికాంధ్ర సాహిత్య చరిత్ర శకలాలు", 1977, పేజీలు 129-31.

బ్రౌన్ కడపకు మొదటిసారిగా సరిగ్గా యే రోజున వచ్చాడో తెలియదు. మూడేళ్లపాటు మద్రాసు కాలేజీలో శిక్షణ తర్వాత 1820 ఆగస్టు 8 తేదీన కడవ కలెక్టర్ కింద అసిస్టెంటుగా వుద్యోగ నియామకపు టుత్తర్వు 14 తేదీ జారీ అయింది. ఆ వుత్తర్వు బట్వాడా అయింది 16 తేదీన. అది కడపకు చేరింది 19 తేదీన. దీనికి వొకటి రెండురోజులు అటు యిటుగా బ్రౌన్ కడపకు వచ్చి చార్జి తీసుకొని వుండాలి (చూడండి 2వ పేజీలో ముద్రింపబడిన ఆ వుత్తర్వు తాలూకు ఛాయా చిత్రం). అప్పట్నుంచి 1822 ఆఖరుదాకా కడపలోనే వున్నాడు. ఆ తర్వాత మచిలీపట్నం, రాజమండ్రిలలో వుద్యోగం. మళ్లీ 1826 మార్చిలో కడప వచ్చాడు జిల్లా రిజిస్టర్‌గా. అప్పట్లో కడపజిల్లాలోనే చేరిన కంభంలో కూడా బ్రౌన్ కొంతకాలం పనిచేశాడు. 1829 జనవరిదాకా కడప వుద్యోగ జీవితం సాగింది.

బ్రౌన్ రెండోదఫా కడపకు వచ్చినప్పుడే ఆ బంగళా-తోటను కొనడం జరిగి వుంటుంది. (1821 లోనే కడపలో రెండు స్కూళ్లు పెట్టినట్లు తన స్వీయచరిత్రలో వ్రాసుకొన్నాడు). అయోధ్యాపురం కృష్ణారెడ్డి యిచ్చిన లెక్క నిజమైతే అప్పట్లో దీని ఖరీదు వెయ్యి వరహాలు. అంటే 3 వేలా 5 వందల రూపాయలు. కడప తర్వాత తిరుచునాపల్లి, బందరు, రాజమండ్రి, గుంటూరు, చిత్తూరు, మద్రాసు....యిట్లా ఆయన వుద్యోగ జీవితం పరిభ్రమించింది.

ఎక్కడ వుండినా కడపలో సొంత బంగళా-తోట, యితర ఆస్తిపాస్తులు, వాటితోబాటు ఆయన జరుపుతూవచ్చిన సాహిత్య సంబంధమైన పనులు, తదితరమైన తతంగాలు వుండేవి గనుక కడపనుంచి జాబులూ జవాబులూ తరచు వస్తుండేవి. ఎన్నెన్నో విషయాలు గురించి కడపకు వ్రాస్తుండేవాడు. కడప విషయాలు తెలుసుకుంటూనే వుండేవాడు. కడపలో యెక్కడ చీమ చిటుక్కుమన్నా, యే చిన్న వార్తా కెరటం లేచినా దాన్ని గురించిన వివరాలు అడిగి తెలుసుకొంటుండేవాడు.

సబ్ కలెక్టర్ మగ్డానల్డ్‌ను కడప ముస్లిమ్‌లు ఘోరంగా హత్య చేశారు. కడపలో కటిక కరువు పరిస్థితులు విలయతాండవం చేశాయి. దివిటీ దొంగలుపడి బజారును దోచుకున్నారు. కోయిలకుంట్ల వుయ్యాలవాడ నరసింహారెడ్డి బ్రిటీష్‌వాళ్లపై తిరుగుబాటుచేసి ముప్పతిప్పలుబెట్టి మూడు చెరువుల నీళ్లు తాగించాడు—యిట్లా యెన్నో సంఘటనలు జరిగాయి. ఇవి ఆ రోజుల్లో మొత్తం రాష్ట్రాన్ని కలవర పరిచాయి. ఈ అన్ని విషయాలపైన కడపలో తన మనుషులనుకొన్నవారిని అడిగి,

వారికి వ్రాసీ అన్ని వివరాలూ పూసగుచ్చినట్లు జాబుల మూలకంగా తెలుసుకొనేవాడు బ్రౌన్.

ఈ కడప జాబుల్లో యిట్లా ఆనాటి స్థానిక చరిత్రకు సంబంధించిన విషయాలెన్నో ప్రస్తావనకు వస్తాయి. చదవండి. జాబులను వున్నవి వున్నట్లుగా, యెట్టి పరిష్కరణలూ లేకుండా, కొన్నిచోట్ల లిపికి సంబంధించిన మార్పుల్నికూడా చేయకుండా సాధ్యమైనంతవరకూ యధాతధంగా యివ్వడం జరిగింది.

జాబులలోకి వెళ్లేముందు—వాటిని ఆధారం చేసుకొని టూకీగా వివరణ ప్రాయంగా వ్రాసిన అధ్యాయాలను చదివి ఆ తర్వాత జాబుల విషయం చూడండి.

# బ్రిటీష్ ప్రభుత్వంపై ఉయ్యాలవాడ నరసింహారెడ్డి సాయుధ తిరుగుబాటు

తెలుగుగడ్డ మీదనుంచి యించుమించు 130 యేళ్ల క్రితం బ్రిటీష్ ప్రభుత్వంపై సాయుధ పోరాటానికి దిగిన వుయ్యాలవాడ నరసింహారెడ్డిని - నేటి రాజకీయ పరిభాషలో చెప్పాలంటే - స్వాతంత్ర్య యోధుడుగా* లేదా ఆదిమ ఆంధ్ర నక్సలైట్‌గా అభివర్ణించవచ్చు.

ఇటీవలి కాలంలో నక్సలైట్లు సాయుధ పోరాటమగ్నులై హత్యలు చేసినా మరొకటి చేసినా వారిని నడిపించింది వొక ఆర్థికరాజకీయ సిద్ధాంతం. తీవ్ర మార్క్సిజానికి కల్పించుకొన్న వొక ప్రత్యేక భాష్యాన్నిబట్టి వారు ఆ అవగాహనకు వచ్చారు. ఆ ఆచరణకు దిగారు. ఆ రకం రాజకీయ నిబద్ధత నరసింహారెడ్డిలో మృగ్యం. కానీ

---

* నరసింహారెడ్డిని వొక స్వాతంత్ర్య యోధుడుగా చిత్రిస్తూ శ్రీపాణ్యాం నరసరామయ్య 1976లో పద్యకావ్యాన్నే ప్రకటించారు. రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ గారు 'అభినందనము' వ్రాస్తూ—''ఇట్టివారెందరి పచ్చినెత్తురు కండలో ఈ పుణ్యభూమిలో ఇంకి యెండిపోయిన తర్వాతగదా యీ మహాదేవికి స్వతంత్రభూమిక వేసుకొనుట సాధ్యమైనది. మరి దీనిని స్వార్థపరుల 'అహిభయము' నుండి తప్పించి నెలకొల్పుటకు ఇంకెంతో వివేకుల రక్తము ప్రవహింపవలసియున్నదని మనమిప్పుడు గమనించుచున్నాము''—అని అన్నారు.

స్వభావంలో గాకపోయినా స్వరూపంలో మాత్రం ఆయన పోరాటం నేటి నక్సలైట్ల కోవకు చెందిన దనవచ్చు.

బ్రిటీష్ ప్రభుత్వంపై నరసింహారెడ్డి ఆనాడు ఆ రకమైన పోరాటానికి దిగినప్పుడు మార్క్సిజం అనేది రూపు దిద్దుకోలేదు. ఇండియాలో అప్పటికి 'సిపాయిల పితూరీ (1857)' కూడా జరిగివుండలేదు. భారతీయుల్లో, ముఖ్యంగా పల్లె ప్రాంతాల్లో జాతీయ భావబీజాలు సైతం సరిగా పురుడుపోసుకోలేదు.

మరి యే ప్రేరణతో, యే అవగాహనతో, యే శక్తుల ఆసరాతో ఆయన బ్రిటీష్ వారితో తలపడ్డాడో మన ఆంధ్ర చరిత్రకారులు యింకా పరిశీలించలేదు. మన వాళ్లు పట్టించుకోకపోయినా, బెంగాలీ చరిత్రకారుడు డాక్టర్ యస్. బి. చౌధురి 1955 లో ప్రకటించిన "Civil Disturbances during the British Rule in India (1765—1857)" అనే గ్రంథంలో యీ నరసింహారెడ్డి పోరాటానికి వొక సముచితమైన స్థానాన్నే యిచ్చివున్నాడు.

చరిత్రకు సంబంధించి పెక్కు విషయాల్లో అభిప్రాయ భేదాలున్నట్లే, యీ తిరుగుబాటు వుద్యమాల్నికూడా చులకనగా త్రోసివేసే వారిని * గురించి పై గ్రంథ పీఠికలో ఆచార్య యస్. సి. సర్కార్ సరియైన సూచనే వొకటి చేశాడు.

"The risings against British authority have often enough been dismissed as the outcome of the machinations of a number of dispossessed malconted persons. But of course the problem is where the following came from, and why did people respond to the 'intrigues' of the interested parties. It is after all a superficial view of history to remain satisfied with attributing all disturbances to 'agitators'..."

ఇటీవల కాలంలో నక్సలైట్ల సాయుధ పోరాటాన్ని గురించి, వాళ్ళు చేపట్టిన చర్యలను గురించి రెండు పరస్పర విరుద్ధమైన అంచనాలు, చర్చలు వున్నాయి. వారిని అటు 'నరరూప రాక్షసులు' గానూ, యిటు 'విప్లవకారులు' గానూ చిత్రించిన

---

* ఇట్లా త్రోసివేసిన చరిత్రకారులు మనకు లేకపోలేదు. మామిడిపూడి వెంకటరంగయ్యగారు 1965 లో రాష్ట్రప్రభుత్వంచేత ప్రకటింపజేసిన "The Freedom Struggle in Andhra Pradesh (Andhra): volume one (Pp. 42-3)లో పాత ధోరణిలో పాత ఆధారాలతోనే సరిపుచ్చారు తప్ప వొక్క అడుగు ముందుకుపోయి వొక్క అదనపు వివరమైనా యివ్వలేదు.

సమకాలీన రచనలు మనకు లేకపోలేదు. వాళ్లు జరిపిన హత్యలను 'వ్యక్తిగత హత్యలు'గా గానీ, లేదా యేవో స్వప్రయోజనాలకోసం చేసిన మామూలు హత్యలుగా గానీ భావించడానికి లేదనీ, స్పష్టమైన రాజకీయ హత్యలుగా వాటిని పరిగణించవలసి వుంటుందన్న జస్టిస్ చిన్నపరెడ్డివంటి హైకోర్టు న్యాయమూర్తులూ మనకు లేకపోలేదు.

నరసింహారెడ్డి నడిపిన పోరాటం వీరగాధల కెక్కిన తీరునుబట్టి ఆయన్ను గురించి పేరు వూరులేని జానపదులు రచించిన కోలాటపు పాటలు, తదితర జానపద గేయాల సరళినిబట్టి చూస్తే పరాయి ప్రభుత్వాన్ని కఠోరంగా యెదుర్కొన్న వొక చిన్న విప్లవ వీరుడుగా మనం భావించవలసి వుంటుంది. ఆచార్య తూమాటి దొణప్పగారు సేకరించిన కోలాటపు పాట, డాక్టర్ తంగిరాల వెంటకసుబ్బారావుగారు సేకరించిన పిచ్చిగుంట్ల పాట, మొదలైనవి—యిట్లా నరసింహారెడ్డిని గురించి వున్న 'జానపద సారస్వతం' తక్కువేమీ కాదు.

ఇక, యీయన పోరాటం సాగుతున్నప్పుడు—బ్రిటీష్ ప్రభుత్వోద్యోగుల మధ్య జరిగిన వుత్తర ప్రత్యుత్తరాలు, నరసింహారెడ్డిని పట్టుకోడానికీ ఆయన తిరుగుబాటును అణిచివేయడానికీ తీసుకొన్న చర్యలకు సంబంధించిన ప్రభుత్వ రికార్డులు పత్రాలు, యీ తిరుగుబాటు కారణాలు ఫలితాల గురించి ప్రభుత్వాధికారులు తయారుచేసిన రిపోర్టులు, నివేదికలు—యిట్లా యీ తిరుగుబాటుకు సంబంధించి బ్రిటీష్ ప్రభుత్వం నాటి రికార్డులు పోయినవిపోగా వ్రాతప్రతుల రూపంలో మిగిలి

త్రివేణి: ఆంధ్రదేశ జానపదగేయములు, ఆం. ప్ర. సంగీత నాటక అకాడమీ ప్రచురణ, హైదరాబాదు, పేజీలు 270-71లో శ్రీ దొణప్ప సేకరించిన పాట. డాక్టర్ తంగిరాల శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయానికి 'తెలుగు వీరగాథా కవిత్వము' పైన సమర్పించిన తీసిస్ (1968), రెండో సంపుటం, పేజీలు 817-31. భారతి 1969 జూన్‌లో డాక్టర్ తంగిరాల వ్యాసం 'ఉయ్యాలవాడ నారసింహారెడ్డి కథ'. ఇక నరసింహారెడ్డిని గూర్చి కలవటాల జయరామరావు వ్రాసిన నవల 'రేనాటి వీరుడు' (1925)కూడా వొకటున్నట్లున్నది. 'ఇందు సత్యముతోబాటు కొంత కల్పనము జోడింపబడి వున్నది'—అన్నారు తంగిరాలవారు. కలవటాలవారి కల్పనల సంగతేమోగానీ, డాక్టర్ తంగిరాల యిచ్చిన నరసింహారెడ్డి వృత్తాంతంలో సత్యంతోబాటు కావల్సినన్ని అసత్యాలుకూడా చోటు చేసుకున్నాయనేది మాత్రం వాస్తవం.

వున్నవి దండిగానే వున్నాయి తమిళనాడు ఆర్కైవ్స్ (మద్రాసు)లోనూ ఆంధ్ర ప్రదేశ్ స్టేట్ ఆర్కైవ్స్ (హైదరాబాదు) లోనూ. ఈ వ్రాతప్రతుల సంగతటుంచి. అదృష్టవశాత్తు నరసింహారెడ్డి తిరుగుబాటును వున్నంతలో పూసగుచ్చినట్లు వివరించి చెప్పే అయిదు సంపుటాల ఆధార గ్రంథాన్నొకదానిని ప్రభుత్వం 'కడప డిస్ట్రిక్ట్ ప్రెస్'లో అచ్చువేయించింది—1914-15-19 సంవత్సరాల్లో.* ఇందులో ఆనాడు (1846-48-52) కడపజిల్లా కలెక్టర్. గవర్నర్. చీఫ్ సెక్రెటరీ. మిలిటరీ ఆఫీసర్ల మధ్య జరిగిన వుత్తర ప్రత్యుత్తరాలను అచ్చువేయడం జరిగింది.

అంగట్లో అన్నీవున్నా అల్లుడు నోట్లో శని అన్నట్లు. యిన్నివున్నా బ్రిటీష్ ప్రభుత్వం యిన్నిట్ని భద్రపరచి పెట్టిపోయినా. వీటిని పట్టించుకున్న ఆంధ్ర చరిత్ర కారు లెవరూ యింతవరకూ లేరనే చెప్పాలి. ఆధునిక చరిత్ర రచనపట్ల మనవారి అలక్ష్యానికి యిదొక మచ్చుతునకగా పేర్కొనవచ్చు. నేలవిడిచి సాముచేయడం మన చరిత్రకారులకు అనాదిగా వస్తున్న విద్యే. ఆధార పత్రాలు. గ్రంథాలు యిన్ని వున్నప్పటికీ వీటిని సద్వినియోగం చేసుకోలేకపోవడం మనవాళ్ల అలసతకూ అజ్ఞతకూ నిదర్శనం.

అయితే చరిత్ర రచనకు ప్రభుత్వ రికార్డు లొక్కటే వేదంకాదు. కారాదు. సంపూర్ణ సత్యమంతా అందులోనే దాగివుండదు. వాటిలోనే సర్వవివరాలూ సాక్షాత్కారం కావు. ప్రభుత్వ రికార్డులకున్న యిట్టి విలువను గురించి వొక అజ్ఞాత చరిత్ర కారుడు హెచ్చరిస్తున్నాడు చూడండి:

"...... the student should remember that their value (the value of the government records) is not so great as their scope. They may be relied on to tell the truth but not the whole truth. They exhibit the mechanical accuracy and stiffness of an automation without the warm passions and emotions that inform all human affairs. Seldom do these old volumes strike the personal

---

*A Selection of papers from the old records of the Cuddapah district: official report of a revolt by poligar Narasimha Reddy in Koilcuntla taluk (which formed part of Cuddapah district) in 1846 (5 volumes), Cuddapah, 1914-19. ఈ అయిదు సంపుటాల ప్రతి తాలూకు జెరాక్స్ కాపీ శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలోని సి. పి. బ్రౌన్ ప్రాజెక్టు విభాగం (తెలుగుశాఖ) లో వుంది.

note. For that we must turn to private journals, to letters to friends or enemies, or semi-official letters, perhaps, long since passed into oblivion, The student must therefore be warned against accepting the part for the whole or from allowing his Judgement to be unduly influenced by the inhuman propriety of these official documents." *

ప్రభుత్వ రికార్డుల పరిమితులను గురించి యిందులో సరియైన హెచ్చరికలే వున్నాయి. ఈ తిరుగుబాటుకు సంబంధించి వొకవైపు లభ్యమవుతున్న ఆ జానపద సారస్వతం, మరొకవైపు ప్రభుత్వ రికార్డుల సంచయం—వీటి పరిధులను దాటు కొని చరిత్రకారులుగా మన అన్వేషణ యింకా విస్తృతంగా కొనసాగాలి. ఇంకా సుదూరాలకు వెళ్లాలి. ఈ చిరు విప్లవాన్ని అణిచివేయడంలో ప్రత్యక్ష సంబంధ మున్న ఆనాటి బ్రిటీష్ కలెక్టర్ల, తదితర ఆఫీసర్ల తాలూకు ప్రయివేటు డైరీలు తదితర పేపర్లలో మనకు యేవైనా అదనంగా ఆయువుపట్లు దొరికినా దొరకవచ్చు ననిపిస్తున్నది. ఈ ప్రయివేట్ పేపర్లకోసం లండన్ లైబ్రరీల్లో గాలించవలసి వుంటుంది.

కుంపిణీ సర్కారుపై నరసింహారెడ్డి తిరుగుబాటు జోరుగా సాగుతున్నప్పుడు గానీ, అది సమసిపోయిన తర్వాతగానీ-సమకాలికులైన తెలుగువారు కట్టిన అంచనాలు, వ్రాసిన యితర వ్రాతలుగానీ మనకిప్పుడు దాదాపు కానరావడంలేదు. ఈ దృష్ట్యా చూస్తే, నరసింహారెడ్డి తిరుగుబాటు తారస్థాయిలో వున్నప్పుడు, ఆయన వొక 'సెన్సేషనల్ వార్త'గా మద్రాసు కుంపిణీ అధికారుల్ని కలవర పరుస్తున్నప్పుడు—బ్రౌన్ ఆనాడు కడపలో తనకు తెల్సిన తెలుగువాళ్లకు వ్రాసి వారి నుండి రాబట్టిన ఆ జాబు (పేజీలు ౩-౪) వొక్కటే మనకు మిగిలిన చారిత్రక పత్రం. నరసింహారెడ్డిని గురించి సమకాలీన జనంలోవున్న భావజాలాన్ని పరిమితమైన పరిధిలోనైనా ఆజాబు సూచిస్తున్నది. బ్రౌన్ ఆజాబును యే వుద్దేశంతో భద్రపరచిపెట్టినా మనం యీనాడు వొక 'చారిత్రక కోణం' నుండి పరిశీలించడానికి అనువుగా వుంది.

నరసింహారెడ్డిని వొక పచ్చి దారిదోపిడీ దొంగలముఠా నాయకుడుగా చిత్రించిన సి. సుబ్బయ్య అనేవ్యక్తి సి. పి. బ్రౌన్‌కు ఆనాడు వ్రాసిన ఆజాబులోని అభిప్రాయాలను విలువకట్టేముందు—ఆజాబు వ్రాసిన వ్యక్తి తాలూకు చైతన్యస్థాయి, సామాజిక

* Handbook to the Revenue Records of the Ceded Districts, Madras, 1932, P. 2 (introductory remarks by the compiler).

అవగాహన యెట్లాంటివి అని పరిశీలించ వలసివుంటుంది. నేడు సైతం, నక్సలైట్లు జరిపే కార్యకలాపాలను గురించికూడా యిదేరకం అభిప్రాయాలను వెలిబుచ్చే చైతన్యస్థాయి కల్గిన వ్యక్తులకు కొదువలేదుగదా.

1846 సెప్టెంబరు నాటికి నరసింహారెడ్డి మద్రాసులో వొక గగ్గోలు సృష్టించి వున్నాడు. ఆయన్ను పట్టుకోడానికి వేలాదిమంది సైన్యాన్ని కడప ప్రాంతంలో ప్రత్యేకంగా దింపి కూర్చున్నది ప్రభుత్వం. అప్పటికి పోస్ట్‌మాస్టర్ జనరల్‌గాను, తెలుగు ట్రాన్స్‌లేటర్‌గానూ మద్రాసులో వుంటున్న బ్రౌన్‌లో సహజంగా ఆసక్తిని రగిల్చి వుండగల సంఘటన కాబట్టి, తనలో కడప 'అనుబంధం' విశేషంగా వుండబట్టి, దాన్నిగురించి వివరంగా తెలుపమని కడపకు జాబు వ్రాసివుండాలి. నమ్మకస్తుడైన చెలికాడు అయోధ్యాపురం కృష్ణారెడ్డి ఆనాటికి లేడు. అతను చనిపోయి అప్పటికి రెండేళ్లయింది. కనుకనే యీ సుబ్బయ్యకు వ్రాసి వివరాలు పంపమని కోరివుండాలి. ఫలితంగా వచ్చిన జవాబే అది.

ఈ జాబుల్లో సుబ్బయ్య పేర్కొన్న 'కర్నూలు రైటర్' దగ్గర్నుంచికానీ, మరొక 'స్నేహితుడు' దగ్గర్నుంచికానీ నరసింహారెడ్డిని గురించి బ్రౌన్‌కు మరేమైనా జాబులొచ్చాయా అని బ్రౌన్ జాబులసంపుటాలు తిరగేశాను. నా కళ్లకు కనపళ్లేదు. మరింత జాగ్రత్తగా వెతికితే యిందుకు సంబంధించిన వొకటి రెండు జాబులు దొరక వచ్చునేమో ననిపిస్తుంది.

నరసింహారెడ్డి తిరుగుబాటు వుదంతంలో దాగివున్న పెక్కు కీలకమైన ఆర్థిక-రాజకీయ అంశాల సంగతటుంచి, దానికి సంబంధించిన సరియైన క్రానాలజీ (కాలక్రమణిక) నైనా మనవాళ్లు పట్టించుకోలేదు. ఏయే తేదుల్లో ఈపోరాటం ప్రారంభమై వుధృతరూపం దాల్చిందీ, యెప్పుడు మిలిటరీతో తలపడిందీ, యేతేదీన ఆయన పట్టుబడిందీ, యెప్పుడు ఆయన్ను వురితీసిందీ మొదలైన ప్రాధమిక వివరాలు సైతం మనవాళ్లు చెప్పిన పాపానపోలేదు. ఆచార్య దోణప్పగారు తానుసేకరించిన కోలాటపు పాటకు సమకూర్చిన లఘుపీఠికలో యీ నరసింహారెడ్డి సంఘటన 1800-1825 నాటిదని వ్రాశారు.*

---

* దోణప్పగారి లఘుపీఠిక : "రాయలసీమ పాళియగాండ్ర పుట్ట. ఊరికొక ఒడయడు, పల్లెకొక పాళెగాడు. కంపిణీవారి చావుటా క్రొత్తగా ఎగిరిన కాలములో చాలమంది పాళెగాండ్రు లొంగలేదు. వారిలో ఈ దొరవారి నరసింహారెడ్డి ఒకడు. కోయిలకుంట్ల తాలూకా ఉయ్యాలవాడ పరిసరముల ఇతని ప్రభుత్వము

డాక్టర్ తంగిరాల వెంకటసుబ్బారావుగారు మరింత దరిదాపుల్లోకివచ్చి 1845-47 మధ్యకాలంలో జరిగినదై వుండాలన్నారు.†

నరసంహారెడ్డి తిరుగుబాటును గూర్చిన 'కాలక్రమణిక'ను మరింత వివరంగా క్లుప్తంగానైనా చెప్పుకొందాం:

1846 జూలై 6 : మజ్జారి నరసింహారెడ్డి అనే పింఛన్ దారుడైన పాళయగారు (Pension poligar) కొందరు కొండవాళ్లను, కట్టుబడి బంట్రోతులను పోగుచేసుకొని, ఆయుధాలు సమకూర్చుకొని ప్రభుత్వాన్ని ధిక్కరించడానికి ఆయత్తమవుతున్నాడని కోయిలకుంట్ల తాసీల్దార్ వగైరా తాలూకా అధికార్లకు తెలిసి బంట్రోతుల్ని పెట్టి బందోబస్తుగా పంపిస్తే ఆయన సరిగా సమాధానం చెప్పక తిరగబడి బెదరగొట్టి పంపించినట్లు కోయిలకుంట్ల హెడ్ పోలీస్ తనకు వర్తమానం పంపాడనీ అందువల్ల నరసింహారెడ్డినీ అతని మనుషుల్ని వొక కంట కనిపెడుతూ వుండవలసిందిగా కోరుతూ కర్నూలులోని గవర్నర్ తాలూకు యేజంట్‌కు కడప యాక్టింగ్ కలెక్టర్ కాక్రేన్ (Cochrane) 6 తేదీన వొక జాబువ్రాసి పంపాడు.

1846 జూలై 11 : చాగలమర్రి తాలూకాలోని రుద్రవరం గ్రామం పైనబడి నరసింహారెడ్డి బృందం (బహుశా 7,8 తేదుల్లో కావచ్చు) కొల్లగొట్టుకొని పోతుండగా-పోలీసు బంట్రోతులు తదితర ప్రభుత్వ తరపు మనుషులు వెళ్లి మిట్టపల్లిదగ్గర వాళ్లను యెదురుకోగా అక్కడ జరిగిన పోరాటంలో హెడ్ డఫేదార్, మరో తొమ్మిదిమంది బంట్రోతుల్ని నరసింహారెడ్డి మనుషులు చంపివేసి వాళ్ల దగ్గరున్న ఆయుధాలను లాక్కొని పరారై పోయినట్లు కలెక్టర్‌కు దువ్వూరు తాలూకా తాసీల్దారు ద్వారా వర్తమానం వెళ్లింది. కలెక్టర్ యిదేదో చిలికిచిలికి గాలివాన అయ్యేటట్లున్నదని భావించక తప్పలేదు. మిలిటరీని వెంటనే పరుగులమీద దువ్వూరు, కోయిలకుంట్ల ప్రాంతాలకు పంపి శాంతి భద్రతలను కాపాడవలసిందిగా కడపలోవున్న మిలిటరీ కమాండింగ్ ఆఫీసరుకు జాబువ్రాసి పంపాడు. కర్నూలులోని గవర్నర్ యేజంటు సహాయాన్ని కూడా అర్థిస్తూ మరొక జాబు వ్రాశాడు.

1846 జూలై 12 : నరసింహారెడ్డి బృందం జూలై 10 తేదీన కోయిలకుంట్ల

---

చెల్లుచుండెనది. కుంపిణీ దొరతనమును ఎదిరించి వీరమరణము పొందినాడు. ఇది క్రీ. శ. 1800_1825 నాటి సంఘటన...'' (చూ. త్రివేణి, పేజీ 270).

† లోగడ 11 పేజీలో ప్రస్తావించబడిన డాక్టర్ తంగిరాల వారి తీసిస్, భారతిలో వ్యాసం.

ట్రెజరీ ఆఫీసుపైబడి నానావిధ్వంసం చేసి ట్రెజరీని కొల్లగొట్టుకొని ఆనాటికి అందులో మిగిలివున్న 805 రూపాయలా 10 అణాలా నాలుగు పైసల డబ్బును దమ్మిడీలతో సహా వూడ్చుకుపోయారు.* అడ్డగించిన ప్రభుత్వ సిబ్బందిని చిందర వందర చేసి పెక్కుమందిని గాయపరచి వొక దఫేదారును, అయిదుమంది పోలీస్ బంట్రోతుల్ని చంపివేశారు. ఇక్కడ జరిగిన యీ పోరాటంలో నరసింహారెడ్డి స్వయంగా పాల్గొన్నాడు. ట్రెజరీ పైకప్పు మీదకు దఫేదారు యెక్కి కాల్పులు జరుపుతుంటే, నరసింహారెడ్డి తన అనుచరులనుంచి తుపాకి (matchlock) లాక్కొని గురిపెట్టి దఫెదార్‌ను వొక్కగుండు దెబ్బతో పడగొట్టారట. ఈ విధ్వంసంలో నరసింహారెడ్డి మనుషులూ కొందరు చనిపోయారు. కోయిలకుంట్ల తాసీల్దార్ రాఘవాచార్యులను నరసింహారెడ్డి మనుషులు చిక్కించుకొని నిర్బంధంలోకి తీసుకొని వెళ్లారు. కడకు అతగాడి పల్లకీని కూడా బోయీలతో సహా పట్టుకెళ్లారు. ఈ సంఘటనతో కోయిలకుంట్ల ప్రజలు భీతాహులై వున్నారని కోయిలకుంట్ల సబ్ ఆఫీసర్ జమ్మల మడుగు హెడ్ పోలీసుద్వారా పంపిన వర్తమానం జూలై 11 తేది రాత్రి (వేకువ జామున 2 గంటలకు) కలెక్టర్ కాక్రేన్‌కు చేరింది.

---

* ట్రెజరీనుంచి దోచుకున్న డబ్బులో నరసింహారెడ్డికి రావల్సిన మే నెల పెన్షన్ రు. 11_10_8 పైసలు 'డ్రా' చేయబడి చెల్లించనందువల్ల అది కూడా చేరి వున్నదన్నమాట. ఉయ్యాలవాడ జాగీర్దార్ పెదమల్లారెడ్డి ముగ్గురు కొడుకుల్లో చిన్నవాడు మన కథానాయకుడు నరసింహారెడ్డి. కోయిలకుంట్ల తాలూకా బ్రిటిష్ వారి కిందకు వచ్చినప్పుడు యేటా 30 వేల రూపాయల పైచిలుకు రివెన్యూ వచ్చే ఆ ఉయ్యాలవాడ జాగీర్‌ను లాక్కొని పెదమల్లారెడ్డి కుటుంబానికి నెలకు 70 రూపాయల భరణం(పెన్షన్)యేర్పాటుచేశారు. ఇందులో పెదమల్లారెడ్డి సోదరుడు చినమల్లారెడ్డికి సగభాగం పోగా పెదమల్లారెడ్డి ముగ్గురు కొడుకులు (నరసింహారెడ్డి, యిద్దరు అన్నలు)కు మిగతా సగం 35 రూపాయలు మిగిలింది. నరసింహారెడ్డి యిద్దనర్నలతో తగవులాడి విడిపోవడంతో యీ 35 రూపాయల్లో మూడోవంతు 11_10_8 మాత్రమే తన పెన్షన్ కింద దక్కింది. అయితే నరసింహారెడ్డి మాతామహుడైన నొసం జమీందార్ జయరామిరెడ్డికి మద్రాసు యేటా 22 వేల రివెన్యూ వచ్చే జాగీర్‌ను తీసుకొని నెలకు వెయ్యి రూపాయిల పెన్షన్ యేర్పరిచాడు గనుక యిట్లా తన తల్లివారివైపునుంచి కొంత ముట్టుతుండేది నరసింహారెడ్డికి. ఈ జయరామిరెడ్డి తర్వాత నొసంకు జమీందారైన ఆయన కొడుకు మరో నరసింహారెడ్డి నిస్సంతుగా మరణించడంతో ఆ పెన్షన్ శాస్త్రా క్రమంగా తగ్గిపోతూ, పూర్తిగా

ఈ కబురందగానే కలెక్టర్ తారెత్తిపోయాడు. బళ్లారిలోవున్న దత్తమండలాల సైనికాధికారి (బ్రిగేడియర్ జనరల్)కి అర్జంటుగా కబురంపించాడు—వున్న పళాన వీలైనంత యెక్కువమంది సైన్యాన్ని పంపించవలసిందిగా కోరుతూ. ఈ కోయిల కుంట్ల దోపిడీ వర్తమానం కాక్రేన్ మదనపల్లిలో విడిది చేసివుండగా చేరిందట.*

మొదట్లో అందిన అంచనాల ప్రకారం నరసింహారెడ్డి నాయకత్వంలో 9 వేల మంది చేరివుండవచ్చుననుకొన్నారు. కానీ కలెక్టర్ మాత్రం వోరుమంటే 3,000 మందికి మించకపోవచ్చుననుకొన్నాడు. వనపర్తి జమీందార్ రాజారామేశ్వరరావు, మునగాల రామకృష్ణారెడ్డి, జటప్రోలు సంస్థానాధీశుడు లక్ష్మణరాయడు, పెనుగొండ, ఔకు జమీందార్లు, హైదరాబాదుకు చెందిన సలామ్‌ఖాన్, కర్నూలుకు చెందిన పాపాఖాన్, బనగానిపల్లె నవాబు మహమదాలీఖాన్ ప్రభృతులు నరసింహారెడ్డికి అండగా వుంటున్నారనీ, ముఖ్యంగా కట్టుబడి బంట్రోతులు, చెంచువాళ్లు, వడ్డెవాళ్లు, బోయవాళ్లు, యానాదులు, కడకు కొందరు బ్రాహ్మణులుసైతం నరసింహారెడ్డి ముఠాలో ప్రత్యక్షంగా చేరివున్నారనీ, కొందరు అరబ్బులు కూడా పరోక్ష సహాయం అందిస్తున్నారనీ అభిప్రాయపడ్డాడు కలెక్టరు.

కోయిలకుంట్ల ట్రెజరీ తర్వాత నరసింహారెడ్డి ముఠా జమ్మలమడుగు ట్రెజరీని కూడా కొల్లగొట్టాలను కొన్నారట గానీ మిలిటరీ పటాలాలు వస్తున్నాయని తెల్సు కొని ఆ ఆలోచన మానుకొన్నారట. కడపనుంచి, కర్నూలునుంచి, బళ్లారినుంచి, కంభం, కడకు సికిందరాబాదు నుంచి—యిట్లా నానాప్రాంతాలనుంచి సైన్యం వచ్చి ముసురుకోవడం ప్రారంభించింది.

1846 జూలై 23: కంభంనుంచి వస్తున్న లెఫ్టినెంట్ వాట్సన్ నాయకత్వంలో

---

ప్రభుత్వ స్వాధీనం కావడంతో—మన కథానాయకుడు నరసింహారెడ్డికి తాతలనాటి ప్రాభవం తగ్గిపోయింది. తన తల్లివారివైపు పెన్షన్ షేర్ కోసం ప్రభుత్వంతో యెంత పోరుకాడినా వచ్చింది కాదు. (నెలకు 11 రూపాయలు పెన్షన్ వచ్చే నరసింహారెడ్డికి ఆస్థానమేమిటి? ఆస్థానకవి యేమిటి? వేటూరి ప్రభాకరశాస్త్రి చాటుపద్య మణిమంజరిలో వ్రాసినట్లు నళ్యంమీద పద్యాలు చెప్పిన ఓబళాచార్యుడు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి దగ్గరున్న కవిగాక, నొసం నరసింహారెడ్డి 'ఆస్థానకవి' అయివుండేదానికి ఆస్కారమున్నది).

* Brief History of Madanapalli, F. A. Coleridge, Trichonopoly, 1911, Pp. 23-4.

వచ్చిన మిలిటరీవాళ్లు గిద్దలూరుదగ్గర నరసింహారెడ్డితో తలపడ్డారు. తిరుగుబాటు దార్లమొత్తం 5 వేలమంది వుంటారని మిలిటరీవారి అంచనా. వాట్సన్ కిందవున్న సైన్యమేమో వందమంది. ఈ వందమందికి జతగా కంభం తాసీల్దార్, మరికొందరు పోలీసు బంట్రోతులు తోడయ్యారు. అంతే. వేలాదిమంది ప్రత్యర్థులతో పోరాట మంటే ప్రతికూల ఫలితాలకు దారితీయవచ్చునని భయపడ్డాడు వాట్సన్. అయినా అయిదుగంటలసేపు హోరాహోరీ పోరాటం సాగింది. ఒక పాడుబడ్డ కోటలోచేరి వాట్సన్ తన సైన్యాన్ని పురమాయించి పోరాటంలోకి దింపి, మందుగుండు సామగ్రి అయిపోనీకుండా పొదుపుగా వ్యూహం ప్రకారం వుపయోగించాడు. చీకటిబడితే తనకు ప్రతికూలం కావచ్చునని పోరాటాన్ని వుధృతం చేశాడు. ఈ పోరాటంలో నల్గురు సిపాయీలు మరణించారు. మరో ముగ్గురుకు తీవ్రమైన గాయాలే తగిలాయి. నరసింహారెడ్డి మనుషులు 200 మంది దాకా చనిపోయారు. నాలుగు చిన్న ఫిరంగులు (జజాయీలు) వాట్సన్ బృందానికి పట్టుపడ్డాయి. కప్పర కప్పర చీకటిపడ్డ తర్వాత వాట్సన్ వెనుకంజవేశాడు. గిద్దలూరుకు 5 మైళ్ళ యివతలవున్న సెట్టివీడుకు తన సైన్యాన్ని తరలించుకు వెళ్లాడు. నరసింహారెడ్డి కూడా తెలివిగా తప్పించుకొని తన మొతాను అటువైపు అయిదుమైళ్లలో వున్న ముండ్లపాడుకు మళ్లించుకుపోయాడు.

24 తేది కర్నూలునుంచి వచ్చిన కెప్టెన్ నాట్, కెప్టెన్ రసెల్ సైన్యం కిష్టంసెట్టిపల్లె చేరుకున్నారు. ముండ్లపాడులో నరసింహారెడ్డి బలగం చేరివున్నారని తెలిసి అక్కడికి చేరుకొన్నారు. పోరాటానికి దిగారు. మళ్లీ హోరాహోరీ సమరం జరిగింది. ఒక సిపాయి చనిపోయాడు. ముగ్గురు తీవ్రంగా గాయపడ్డారు. నరసింహా రెడ్డి బృందంలోని వాళ్లు 15 మంది దాకా చనిపోయారు. మరో 10 మంది సైన్యా నికి పట్టుబడ్డారు.

అయితే యిక్కడ జరిగిన ముఖ్యమైన విషయం—కంభం తాసీల్దార్ (జంగం రెడ్డి శ్రీనివాసరావు?)ను నరసింహారెడ్డివాళ్లు కాల్చి చంపగలిగారు. నరసింహారెడ్డి మనుషులు అడవుల్లో కొండల్లో కోనల్లో బడి తప్పుకున్నారు. కంభంవైపు గుత్త కనుమగుండా వెళ్ళి కొత్తకోట చేరుకున్నాడు నరసింహారెడ్డి.

ఈ పోరాటాలతో యిరుపక్షాల శక్తి సామర్థ్యాలు పరస్పరం తెల్పివచ్చాయి. ఆధునికమైన ఆయుధసామగ్రి, సుశిక్షితులైన సైనిక సిబ్బంది వొకరికి అందగా వుంటే, మరొకరికేమో మొరటు ఆయుధాలేవున్నా, శత్రువులకు అంతు చిక్క కుండా కొండలు కోనలు అడవుల యిరుకుదారులన్నీ కొట్టినపిండిగా దూసుకు

పోయి తిరగగలిగే స్థానికుల బలగం వుంది. నాలుగువైపులా మోహరించివున్న మిలిటరీ దళాలు దుర్గమమైన యీ కంటక మార్గాల్లో ప్రయాణం చేయడమంటే యిబ్బందేనని ప్రభుత్వాధికారులు గుర్తింపుకు తెచ్చుకొన్నారు.

పోరాటంలో తమకు పట్టుబడ్డ మనుషులను పట్టుకొని కూపీలు తీయడం ప్రారంభించారు. నరసింహారెడ్డికి ప్రత్యక్ష పరోక్ష సహాయాలు అందజేశారని అనుమానమున్న పెక్కుమంది కట్టుబడి యినాందార్లు, తవర్జీదార్లను పట్టి జైళ్లలోపెట్టి హింసించడం ప్రారంభించారు. వారినుంచి నరసింహారెడ్డిని గురించి వీలైనంత సమాచారాన్ని అధికారులు రాబట్టగలిగారు. నరసింహారెడ్డి అన్న (కుమార మల్లారెడ్డి) తొలినుంచి తమ్ముడికి వ్యతిరేకంగా నిల్చాడు. బ్రిటీష్‌వారికి ఆఖరుదాకా పూర్తి అండదండలిస్తూ వచ్చాడు.

నరసింహారెడ్డి కొత్తకోటలోని తన మామ యింట్లో పెళ్లాం బిడ్డల్ని తల్లిని వదిలిపెట్టి వెళ్లాడు. (రెడ్డికి ముగ్గురు భార్యలు - మొదటి భార్యకు 16 యేళ్ల కొడుకు, రెండో భార్యద్వారా వొక కుమార్తె, మూడో భార్యకు యిద్దరు కొడుకులు; తల్లీ, అత్తా మామా—యిదీ ఆయన సంసారం). పెద్దకొడుకు మాత్రం యెట్లాగో తప్పించుకు వెళ్లాడు. మిగతా కుటుంబ సభ్యులనంతా పట్టుకొని మిలిటరీ యెస్కార్ట్‌తో కడపకు తీసుకుపోయి అక్కడొక 'బంగాళా'లో పెట్టి నిర్బంధంలో వుంచారు. చుట్టూ మిలిటరీ పారా వుంచారు.†

ఇక నరసింహారెడ్డికోసం గాలింపు కార్యక్రమం ప్రారంభమైంది. ఆయన్ను యెట్లాగైనా పట్టుకోవడం ప్రభుత్వానికి వొక ముఖ్య ధ్యేయమైపోయింది. పెద్దా చిన్నా అధికారులందర్నీ యీ పనిమీదకే పురమాయించడం జరిగింది. జిల్లా అంతటా వాళ్లకు యిదే నిత్యకార్యక్రమమై పోయింది.§

---

* తమకు చేసిన యీ సహాయానికి ప్రతిఫలంగా నరసింహారెడ్డి అన్నలిద్దరకూ వస్తున్న రు. 23-5-4 పై.ల పెన్షన్‌ను రెండింతలుచేస్తూ కుంపిణీ ప్రభుత్వం 1847 జూన్ 26న వుత్తర్వు చేసింది.

† నరసింహారెడ్డి భార్యా పిల్లలను నిర్బంధంలో వుంచినంతకాలం ఆయనకు లోగడ యిస్తూ వచ్చిన 11 రూపాయలు చిల్లర పెన్షన్‌ను వారికి బత్తా కింద యిచ్చే యేర్పాటు చేశాడు కలెక్టర్. కేసు పరిష్కారమైన తర్వాత 1847 జూన్ నుంచి యీ పెన్షన్ యివ్వడం ఆపేశారు.

§ చూడు : జాబుల విభాగం ౫వ పేజీలో కింద గీతవున్న వాక్యం.

నరసింహారెడ్డి కొండలుదాటి కోనలుదాటి హైదరాబాదు ప్రాంతంలోకి వెళ్లి అక్కడ జనసమీకరణ చేస్తున్నాడని కొందరు. కాదు, నల్లమల కొండల్లోనే వున్నా దని మరికొందరు, ఈ పక్క అడవుల్లోనుంచి వెళ్లాడనీ, కాదు ఆ పక్క తిప్పలమీద నుంచి వెళ్లాడనీ - యిట్లా తలా వొకమాట, తలా వొక సలహా. ఈ అన్ని తావులకూ మనుషుల్ని పంపి, మిలిటరీని పంపి వెతికించేవారు. ఒక దశలో వర్షాలుపడి వాగులు నిండి ప్రవహించడంతో మిలిటరీవాళ్లు ప్రయాణించడం కష్టమైపోయింది.

ఆ వూరును దోచుకోడానికి వస్తారనీ, యీ వూరును కొల్లగొట్టడానికి వచ్చా రనీ-యిట్లా రోజుకో పుకారు. వారానికో వార్త. లూటీలు, దోపిడీలు జరక్కుండా ఆయా వూళ్లల్లో యెక్కడి కక్కడ జగజ్జెట్టీలవంటి వాళ్లను యేరి ప్రత్యేకంగా బత్తా లిచ్చి జీతాలిచ్చి గ్రామ కాపలాలు యేర్పాటు చేశారు. మరికొందర్ని మిలిటరీకి సహా యంగా వుంచారు.

కొత్తకోటలో కొన్ని పత్రాలు దొరికాయి - నరసింహారెడ్డికీ హైదరాబాదులోని కొందరు నవాబులకూ మధ్య జరిగిన వుత్తర ప్రత్యుత్తరాలున్న పత్రాలు. గోల్కొండ నవాబు మొహరుతోవున్న వొక పత్రం కూడా దొరికింది కానీ, అది ఫోర్జరీదని తేలిం దట. హైదరాబాదులోని రెసిడెంటుకు తాకీదులు వెళ్లాయి—నరసింహారెడ్డి, ఆయన సహచరులనబడే వారిపై గట్టి నిఘా వుంచి పెట్టమని. అనుమానమున్న ప్రతి మనిషినీ పట్టితెచ్చి జైళ్లలో పెట్టేవారు. సకల సమాచారమూ రాబట్టేవారు. జిల్లాలోని జైళ్లన్నీ యీ బాపతు మనుషులతో నిండిపోయాయి. ఒక దశలో 600 మందిదాకా జైళ్లలో వున్నట్లు రికార్డులు తెలుపుతున్నాయి.

నరసింహారెడ్డిని ప్రభుత్వ ద్రోహిగా ప్రకటించారు. ఆయన్ను పట్టిచ్చినవారికి వెయ్యిరూపాయలు బహుమానం అని చాటింపులు వేయించారు. కొంతకాలం పోయిన తర్వాత రెండువేలు బహుమాన మన్నారు. ఒక్క నరసింహారెడ్డినేగాక ఆయన ముఠా లోని ముఖ్యులనబడే అయిదుమందిని పట్టిచ్చినవారికి కూడా బహుమానాలని చాటిం చారు. గోసాయి వెంకయ్య, కర్నం అశ్వద్ధామ, దాసరి రోశిరెడ్డి, జంగం మల్లయ్య- యిట్లా ముఖ్యుల జాబితా యెప్పటికప్పుడు పెరిగిపోతూ వచ్చింది. వీళ్లలో మరీ ముఖ్యుడు అకుమళ్ల గ్రామానికి చెందిన గోసాయి వెంకయ్య. నరసింహారెడ్డి తిరుగు బాటు వెనుక గోసాయి వెంకయ్య ప్రోత్సాహ ప్రేరణలు ప్రధానంగా పనిచేసినట్లు కలెక్టర్ భావించాడు.

ఈ గోసాయి వెంకయ్య నరసింహారెడ్డికి వొక విధంగా మతగురువువంటి

వాడనీ, అప్పుడప్పుడూ భవిష్యద్దర్శనంచేసి రెడ్డికి కొన్ని హితబోధలు చేసేవాడనీ, కుంపిణీ సర్కారుపై సాయుధ పోరాటానికి దిగనిదే నరసింహారెడ్డికి అతీగతీ లేదనీ మంత్రోపదేశం చేసినవాడు యీ గోసాయేననీ కలెక్టర్ గట్టిగా అభిప్రాయపడ్డాడు. ఎన్ని తుపాకిగుండ్లు తగిలినా నిన్నేమీ చేయవని చెప్పి రెడ్డికి యేదో పసరుపూత పూసి ఆశీర్వదించి పంపాడని కూడా అంటారు. కలెక్టర్ రిపోర్టులో యితన్నిగూర్చి వివరంగానే వ్రాశాడు.

ఏమైతేనేం, మిలిటరీ సహాయంతో ప్రభుత్వం జరిపిన యీ గాలింపు చర్యల వల్ల నరసింహారెడ్డి బృందంలోని కొందర్ని పట్టుకోగలిగారు. వీళ్లందరినుంచీ సాక్ష్యాలు నమోదుచేసి, వీళ్ల వాదనలు విచారించి కేసును నడిపి ఫౌజుదారీ అదాలత్ (కోర్టు)కు సమర్పించడానికి ప్రభుత్వం డబ్ల్యు.ఎ.డి. ఇంగ్లిస్ (W.A.D. Inglis)ను స్పెషల్ కమీషన్‌గా నియమించింది. ఇట్లా యీ కర్మకాండతో జూలై, ఆగస్టు, సెప్టెంబర్ మాసాలు గడిచిపోయాయి.

అక్టోబరునెల వచ్చింది. నరసింహారెడ్డి ప్రభుత్వానికి దొరికిపోయాడు. ప్రభుత్వ వర్గాల్లో సంతోషం పెల్లుబికింది.

1846 అక్టోబరు 6న పట్టుబడిన వైనం: ఎర్రమల - నల్లమల కొండల మధ్య గల పెరసోమల కొండల్లో (దాదాపు 6 మైళ్ల కైవారం గల్గిన కొండలని కలెక్టర్ వర్ణన) జగన్నాధ దేవళంలో నరసింహారెడ్డి వున్నాడని తెల్సి కలెక్టర్ కాక్రేన్ మిలిటరీ సాయంతో అక్కడికి వెళ్లాడు. కొండలచుట్టూ సైన్యాన్నిపెట్టి తుపాకులతో కాల్పులవర్షం అన్ని దిక్కులనుంచీ కురిపించమన్నాడు. ఈ కాల్పుల కుండపోతలో షుమారు 40-50 మంది నరసింహారెడ్డి మనుషులు చనిపోయారు. 90 మంది పట్టుబడిపోయారు. మరో వందమందిదాకా బాగా గాయపడ్డారు. నరసింహారెడ్డి నిస్సహాయుడుగా మిగిలిపోయి యెటూ పోలేక చిక్కుబడిపోయాడు. కాలికి గుండుదెబ్బ తగిలి కుంటుకుంటూ కొదమ సింగంలాంటి మనిషి మిలిటరీ వాళ్లకు దొరికిపోయాడు. మూడు నెలల అరాచకం మూడు నిమిషాల్లో అంతమైపోయిందనుకొన్నాడు కలెక్టర్.

కేసు నడిచింది. మొత్తం 901 మందిపై నేరం మోపబడింది. వీరిలో 412 మందిపై నేరం రుజువు కాలేదని వదలివేయడం జరిగింది. 273 మందిని స్వల్పమైన సెక్యూరిటీ తీసుకొని వదిలివేశారు. 112 మందికిమాత్రం కఠినశిక్షలే పడ్డాయి—14 యేళ్లనుంచి 5 యేళ్లదాకా జైలు శిక్షలు. ఎంతమందో స్పష్టంగా తెలియడం లేదుగానీ బంకోలుకు పంపించబడ్డవారు (ద్వీపాంతరవాస శిక్ష పడ్డవారు) కూడా కొందరున్నారు- ఔకు రాజుల్లో కనిష్ట సోదరుడు వీరిలో వొకడు.

నరసింహారెడ్డికి మాత్రం వురిశిక్ష పడింది. ఫౌజుదారీ అదాలత్ (కోర్టు) మజ్జారి నరసింహారెడ్డిని వురితీయమని తీర్పు (1847 జనవరి 9 న) చెప్పింది. ఊరకే వురితీయడం కాదు, వురి తర్వాత అతని శిరస్సును కోయిలకుంట్ల దగ్గర వొక బురుజుపై గొలుసులతో బంధించి 'తూకుమాను'కు వేలాడదీయవల్సిందిగా కూడా తీర్పు. 1834 నాటి రెగ్యులేషన్ వొకటి శెక్షన్ రెండు కిందనూ, 1802 నాటి రెగ్యులేషన్ యెనిమిది శెక్షన్ పది కిందనూ యీ వురిశిక్ష విధించామని కోర్టు తీర్పు-తిరుగుబాటు, హత్యలు, దొంగతనాలు చేసిన నేరానికి.

ఈ వురిశిక్షకు గవర్నర్ ఆమోదముద్ర 1847 ఫిబ్రవరి 6 న పడింది.

1847 ఫిబ్రవరి 22: పలానారోజున పలానాచోట నరసింహారెడ్డిని వురితీయబోతున్నామని ప్రభుత్వం వూరూరా చాటింపు వేయించింది. 1847 ఫిబ్రవరి 22 తేది సోమవారం 7 గంటలకు కలెక్టర్ కాక్రేన్ సమక్షంలో పర్యవేక్షణలో నరసింహారెడ్డిని ఘోరంగా వురితీశారు.*

దాదాపు 2 వేలమంది పైచిలుకు ప్రజలు—తమను నిశ్శబ్ద రక్కసి ఆవహించి తమనోళ్లు కుట్టేసినట్లు కిమ్మనకుండా, వళ్లంతా కళ్లుచేసుకుని గుడ్లప్పగించి విక్కి-విక్కి చూశారు నరసింహారెడ్డిని వురితీస్తుంటే. ఒక మనిషిని నిలువునా వురితీసి, వొకానొక తిరుగుబాటును అధఃపాతాళానికి అణిచివేసినట్లు చరిత్రలో పేరు తెచ్చుకొంది కుంపిణీ ప్రభుత్వం!

ఈ నరసింహారెడ్డి శిరస్సు రెండుమూడు తరాలదాకా చుట్టుపక్కల ప్రజల్ని 'తస్మాత్ జాగ్రత్త' అంటూ హెచ్చరిస్తూ 1877 దాకా ఆ బురుజుకు వేలాడుతూ వుణ్ణిందట.†

''అతడు ప్రారంభ మొనరించినట్టి యుద్ధ
మమ్మె రవులుచు నొక దశాబ్దమ్ము నకును
క్షితి 'సిపాయి పితూరి'గా కింవదంతి
గన్న 'స్వాతంత్ర్య సమరంబు'గా జ్వలించె.

---

* "...at a spot selected near the town of Koilcuntla" అని కలెక్టర్ వ్రాత కాగా, జానపద పాటనుబట్టి నరసింహారెడ్డిని వురితీసింది జుర్రేటి వొడ్డున అని డాక్టర్ తంగిరాల వ్రాశారు.

† A Manual of the Kurnool District, Narahari Gopalakristnamah Chetty, Madras, 1886, P. 42.

అతని జీవాత్మ భౌతికమైన తనువు
వదిలి యంతట వ్యాపించి బహు మహోద్య
మమ్ము లొనరించి యొక శతాబ్దమ్మునకును
మాతృభూమికి స్వాతంత్ర్య మహిమగూర్చు."*

x x x

"దొరవారి నరసింహ్వారెడ్డి
నీ దొరతనము కూలిపోయె రాజా నరసింహ్వారెడ్డి ॥దొర॥

రేనాటిసీమలోనా రెడ్డోళ్ళ కులములోనా
దొరవారి వమిశానా ధీరుడే నరసింహ్వారెడ్డి ॥దొర॥

కోయిల్‌కుంట్లా గుట్టలెంటా కుందేరూ వొడ్డులెంటా
గుఱ్ఱమెక్కి నీవువస్తే కుంపిణీకి గుండెదిగులూ ॥దొర॥

కాలికీ సంకెండ్లువేసీ చేతికీ బేడీలువేసీ
పారాతో పట్టితెచ్చి బందికానులొ పెట్టిరీ ॥దొర॥

కండ్లకూ గంతాలుగట్టీ నోటినిండా బట్లు† పెట్టీ
నిలువునా నీతలాగొట్టీ కోట బురుజుకు గట్టిరీ ॥దొర॥

కాసిలోనా తల్లికేమో చావుసుద్దీ దెలిసినాదీ
కన్నకడుపే తల్లడించే గంగలోనా గంగ గలిసే

దొరవారి నరసింహ్వారెడ్డి
నీ దొరతనము కూలిపోయె రాజా నరసింహ్వారెడ్డి."§

—అని వుయ్యాలవాడ నరసింహారెడ్డి వీరగాధను గురించి ప్రచారంలోవున్న వొక కోలాటపు పాట.

---

* స్వాతంత్ర్యవీరుడు: ఉయ్యాలవాడ నరసింహారెడ్డి చరిత్ర (పద్యకావ్యం), పాణ్యం నరసరామయ్య, ఉయ్యాలవాడ, 1976, పేజీ 82.

† త్రివేణి: ఆంధ్రదేశ జానపద గేయములు, ఆం. ప్ర. సంగీత నాటక అకాడమీ ప్రచురణ, హైదరాబాదు, 1960, పేజీలు 270-71 (తూమాటి దోణప్ప గారు సేకరించిన పాట).

§ 'త్రివేణి'లోని ఆ పాటను చదువుతూ వొకమిత్రుడు "నోటినిండా 'బట్లు' యేమిటీ 'బుడ్లు' అని వుండాలేమో"నన్నాడు. 'బుడ్లు'కన్నా 'బట్లు' రూపమే సరి

వీరావేశం వుట్టిపడేలా జానపదులు 'కవిగట్టిన' మరొక పాటలోనుంచి కొన్ని చరణాలు:

"అదుగోవచ్చె, ఇదుగోవచ్చె నరసింహరెడ్డీ
పళపళ పళపళ కేకవేసెరా నరసింహరెడ్డీ
చంద్రాయుధమూ చేతబట్టెనే నరసింహరెడ్డీ
.... .... .... .... .... .... .... .... .... ....
ఆవులమందలో పులీ దుమికిన చందము దుమికినడూ
.... .... .... .... .... .... .... .... .... ....
కరువువచ్చినా కాలమొచ్చినా అదరించె రెడ్డీ
అట్టి వక్క మనరెడ్డిమాటనూ చిన్నచెయ్యరాదు....
నాలుగు గ్రామాల మందిగా తాము లేచినారు...."*

—కుంపిణీ సర్కారుపై నరసింహారెడ్డి నడిపిన సాయుధ తిరుగుబాటు గాథ యిదీ క్లుప్తంగా అతిక్లుప్తంగా.

ర ర ర

ఈ తిరుగుబాటుకు మూలకారణాలేమిటి? ఈ పోరాటంలో యింత జన సమీకరణ యెట్లా జరిగినట్లు? ఇందరు కట్టుబడి యినామ్‌దార్లు బంట్రోతులు తదితరులు నరసింహారెడ్డికి అండగా యెందుకు చేరినట్లు? ఆర్థిక రాజకీయ కారణాలేమైనా వున్నాయా? లేక కేవలం వొక వ్యక్తి యేదో వళ్లుతెలియని వీరావేశంలోబడి నడిపిన వొకానొక వ్యక్తిగత పోరాటమేనా?—ఈ కీలకమైన విషయంలో యీనాడే కాదు, ఆనాడు కూడా బోలెడన్ని అభిప్రాయభేదాలు వుండనే వున్నాయి.

ప్రభుత్వం నియమించిన స్పెషల్ కమీషనర్ డబ్లు. ఏ. డి. ఇంగ్లెస్ 1847 జనవరి 19 న జుడిషియల్ డిపార్ట్‌మెంట్ సెక్రిటరీకి 12 పేజీలలో వొక సుదీర్ఘమైన రిపోర్టు సమర్పించాడు. ఇందులో ఆయనచేసిన ప్రధానమైన వాదం- గ్రామ

---

అనిపిస్తున్నది. రెడ్డోళ్ళ, వనిశాన, గుట్టలెంటా, వొడ్డులెంటా, పారా- అనే మామూలు వాటికి అర్థాలిచ్చిన దొణప్పగారు యీ చిత్రమైన శబ్దానికి యిచ్చివుండి వుంటే ఆ మిత్రుడు యీ పాఠాంతరాన్ని వూహించి వుండేవాడు కాదేమో. బట్ట→బట్టలు→బట్లు=గుడ్డలు అనుకొంటే సరిపోతుందనిపిస్తుంది.

* డాక్టర్ తంగిరాల వెంకటసుబ్బారావు తీసిస్ 'తెలుగు వీరగాథా కవిత్వము', 'భారతి' వ్యాసం.

కట్టుబడి యినాందార్లు, తవర్జీదార్ల సమస్యలపట్ల ప్రభుత్వాధికార్ల కఠోరమైన వైఖరి మూలంగా వాళ్లలో అసంతృప్తి క్రమంగా రాజుకుంటూ వచ్చిందనీ, అందువల్లనే వాళ్లు నరసింహారెడ్డి నాయకత్వం కింద చేరి తమ సమస్యలకు పరిష్కార మార్గం వెతుక్కోడానికిగాను యీ తిరుగుబాటులో ప్రత్యక్ష భాగస్వాములుగా చేరారని. ఇంకా మరికొన్ని పరిపాలనా సంబంధమైన కారణాలనుకూడా ఆయన చూపాడు.

ఆయన చూపిన యీ ప్రధాన సమస్యను - కట్టుబళ్ళ సమస్యను - సాకల్యంగా అర్థంచేసుకోవాలంటే, మద్రాసు నాటి దత్తమండలాల రైత్వారీ సెటిల్మెంట్ వ్యవస్థను చారిత్రక కోణంనుంచి అవగాహనకు తెచ్చుకోవలసివుంది. ఆయన ప్రవేశపెట్టిన రెవెన్యూ సెటిల్మెంట్ పద్ధతుల్లో, ముఖ్యంగా యీ కట్టుబడి - భట్టవృత్తి యినామ్‌లు క్రమంగా యెట్లా అమలు జరుగుతూ వచ్చిందీ, గ్రామస్థాయి కట్టుదిట్టాలలో యే విధంగా మార్పులు సంభవిస్తూ వచ్చిందీ - అనే విషయాలను మనసుకు తెచ్చుకోనిదే ఇంగ్లిస్ చూపిన కట్టుబళ్ల కారణాలను గురించి పరిశీలించడం సాధ్యంకాదు.

సరిగ్గా యీ తిరుగుబాటుకు ముందు కలెక్టర్ కాక్రేన్ 1845 డిసెంబర్‌లో - కొన్ని కట్టుబడి మాన్యాల వంశపారంపర్య హక్కుల రద్దుకు, కొందరు కట్టుబడి బంట్రోతుల బదిలీకి, గ్రామ పోలీస్ వ్యవస్థ పునర్నిర్మాణానికి సంబంధించిన కొన్ని ప్రతిపాదనలను రివెన్యూ బోర్డుకు పంపాడు. 1846 మే నెలలో ఇరవైమంది కట్టుబడి మాన్యాల వంశపారంపర్య హక్కులను రద్దుచేస్తూ, కొందరు కట్టుబడి బంట్రోతులు నిస్సంతుగా మరణిస్తే, వారి హక్కులను రద్దుపరచి ఆ మాన్యాలను ప్రభుత్వం వశపరచుకొంటూ, గ్రామ విధులను సరిగా నిర్వర్తించని కొందరి తవర్జీని తగ్గిస్తూ వుత్తర్వులు జారీ చేశాడు. ఈ రకం వుత్తర్వుల మూలంగానే కట్టుబడి బంట్రోతుల్లో అలజడి కలిగి, వారు నరసింహారెడ్డి తిరుగుబాటులో చేరడానికి ప్రధాన కారణమైందని ఇంగ్లిస్ తన రిపోర్టులో వాదించాడు.

ఈ ఇంగ్లిస్ రిపోర్టులోని మాటల్ని ఆధారం చేసుకొనే యస్. బి. చౌధురి తన గ్రంథంలో యిట్లా వ్రాశాడు :

"... and in 1845, an order was passed restricting the tenure of these grants to existing lives. This last order provoked the rising of Narasimha Reddi...In consequence of these disturbances, a special commissioner was appointed later on to deal with the whole question of assignments. His work resulted in the enfranchisement of a number of inams. It was also made obli-

gatory on the part of the government to surrender its right to resume in return for a quitrent..." *

కానీ యీ ఇంగ్లెస్ చూపిన ఆ కారణాలను మిగతా అందరూ త్రోసిరాజన్నారు. ఇంగ్లెస్ చూపిన కారణాలపై నీ అభిప్రాయాలేమిటో తెలపమని ప్రభుత్వం కలెక్టర్ కాక్రేన్‌ను కోరింది. ప్రధాన కారణమని ఆయన దేన్నయితే చూపాడో యీయన దాన్ని కాదన్నాడు. తన కారణాలు తాను సూచిస్తూ మరొక సుదీర్ఘమైన ప్రతి రిపోర్టును పంపాడు. ఆయన యెన్ని లెక్కలు యిచ్చాడో, యీయనా అంతకంటే యెక్కువ లెక్క పక్కలే యిచ్చాడు.

"... While disaffection, if any, existed, was entirely local... (and) confined solely, at first, to the Taluk of Coilcoontla, and latterly to Bunganpally and part of Kurnool...where, however no such interference with the cuttoobadies was contemplated at all ... and that the Cuttoobadies of the rest of the District numbering 11,756 individuals not only exhibited no signs of discontent but rendered good and zealous service against the rebels..."

ఇట్లాగే కర్నూలులోని గవర్నర్ యేజంట్ యస్. స్కాట్ కూడా ఇంగ్లెస్ కారణాలను కాదన్నాడు. కడకు రివెన్యూ బోర్డుకూడా ఇంగ్లెస్‌తో యేకీభవించ లేదు. వీటిన్నిట్నీ యిక్కడ చర్చించాలంటే యీ అధ్యాయం యింకంత పెరుగుతుంది. ఎన్నో రిపోర్టులు, నివేదికలు, మెన్నో అభిప్రాయాలూ వున్నాయి. ఇవిగాక యింకా మరెన్నో రికార్డ్స్ వున్నాయి—లండన్ దాకా నడిచిన రికార్డులు. చరిత్రకారులుగా వీటన్నిట్నీ మనం బేరీజువేసుకొని యీ తిరుగుబాటు వెనుకగల ఆర్థిక రాజకీయ కారణాలకోసం అన్వేషించ వలసివుంటుంది. భావి పరిశోధకుడికి యీ రంగాన్ని వదిలి వేయడమే ప్రస్తుతం నేను చేయగల్గిన పని.

ఇక కోయిలకుంట్ల తాసీల్దార్ వుదంతం వొకటుంది. ఆ తాసీల్దార్ రాఘవాచార్యులు పాపాలభైరవుడుగా నరసింహారెడ్డి తిరుగుబాటుకు వొక ముఖ్య కారకుడైనట్లు కడప కలెక్టర్, కర్నూలులోని యేజంట్ యిద్దరూ యేక కంఠంగా తమ రిపోర్టుల్లో వ్రాశారు.

1846 జూన్‌లో-నరసింహారెడ్డి తనకు రావల్సిన మేనెల పెన్షన్ డబ్బును

* Civil Disturbances during the British Rule in India (1765-1857), S. B. Chaudhuri, 1955, Pp. 29, 152.

నేరుగా కోయిలకుంట్ల ట్రెజరీకి వెళ్ళి తీసుకోకుండా, వొక మనిషిని పెట్టి చీటీవ్రాసి తెమ్మని పంపాడట. లోగడ కొన్నిసార్లు యిట్లాగే పంపినప్పుడు తాసీల్దార్ సమ్మతించి యిచ్చి పంపినా, యీసారి మాత్రం ఆ వచ్చిన మనిషిని యేదో దుర్భాషలాడి రెడ్డి నేరుగా వస్తేనేగానీ యిచ్చేదిలేదు పొమ్మన్నాడు. దీనిమీదట రెడ్డి రాకుండా మొండి కేసుకొని టలాయిస్తుంటే, తాసీల్దార్ వారంట్ యిచ్చి బంట్రోతుల్ని పంపడంతో ఘర్షణ ప్రారంభమై, వచ్చిన వాళ్లను నరసింహారెడ్డి తన్ని తరమడంతో పోరాటానికి బీజావాపం జరిగిందని అంటారు.

అసలు తాసీల్దార్ రాఘవాచార్యులు ఫక్తు లంచగొండి అధికారి అనీ కట్టుబడి బంట్రోతులచేత నానా సొంత చాకిరీ చేయించుకుంటూ బ్రాహ్మణాధిక్య భావంతో వాళ్లను నీచంగా మాట్లాడేవాడని కూడా అంటారు. ఈయన స్థానికుడు కూడా కాదు. అంతకుముందున్న కలెక్టర్ యీయన్ను వేరే జిల్లానుంచి రప్పించి వుద్యోగ మిచ్చినట్లు వొక రిపోర్టునుబట్టి తెలుస్తుంది.

కోయిలకుంట్ల ట్రెజరీపై నరసింహారెడ్డి మనుషులు దొమ్మీకి వచ్చినప్పుడు యితను అయిపులేకుండా యెక్కడో దాక్కున్నాడనీ, అంతేగాకుండా అంతకు మూడు రోజులముందు యిటువంటి దొమ్మీ వొకటి వుండవచ్చునని పసిగట్టి ట్రెజరీలో రహస్యంగా దాచుకొని వుండిన తన సొంత డబ్బు దస్కాన్ని తీసేసుకుపోయాడని కలెక్టర్ రిపోర్టు.

తాసీల్దార్‌పై నరసింహారెడ్డికి అంత కక్ష వున్నప్పుడు కోయిలకుంట్ల ట్రెజరీ దొమ్మీలో యీయన్ని చంపివేయకుండా నిర్బంధంలోకి మాత్రమే యెందుకు తీసుకున్నట్లు—అనే ప్రశ్న వుదయిస్తుంది. ఈయన బ్రాహ్మణుడు కావడంవల్ల, చంపితే బ్రహ్మహత్యా పాపం యెక్కడ చుట్టుకుంటుందో ననే మూఢ నమ్మకమే కాకుండా, నరసింహారెడ్డి కూడా 'వైష్ణవుడు' కావడం, మతరీత్యా యిద్దరూ వొకే మతానికి చెందినవారు కావడం కారణాలుగా చూపారు రివెన్యూబోర్డు రిపోర్టులో.

నిర్బంధంలోనుంచి బయటపడ్డ తర్వాత యీ రాఘవాచార్యుల్ని వుద్యోగంలో నుంచి తొలగించివేశాడు కలెక్టర్. తాను నిర్బంధంలో వుండగా వొక చేతికి తీవ్రమైన గాయాలు తగిలి, ఆ చేయి పనిరాకుండా పోయిందనీ, ప్రభుత్వ సేవలో వుండగా తనకు యీ కష్టనష్టం వాటిల్లింది గనుక, కనీసం పెన్షన్ అయినా యిమ్మని అర్జీ పెట్టుకొన్నాడు ఆ తాసీల్దారాచార్యులు. అందుకూ వల్లకాదని వ్రాశాడు కలెక్టర్.

అయితే నరసింహారెడ్డితో జరిగిన పోరాటంలో ప్రాణాలు కోల్పోయిన కంభం తాసీల్దార్ భార్యకు నెలకు 35 రూపాయలు. తదితర వుద్యోగాల కుటుంబాలకు తలా 4, 5, 6 రూపాయల చొప్పున పెన్షన్ మంజూరు చేసింది ప్రభుత్వం.

౨ ౨ ౨

నేటి నక్సలైట్లతో నరసింహారెడ్డిని పోల్చడం కొందరికి నచ్చకపోవచ్చు గానీ-యీ సందర్భంలో వొక విషయం జ్ఞప్తికి వస్తున్నది. ఈ జాబుల సంపుటాల్లోనే-ఆనాటి తెలుగు పత్రికల్లో పడిన సంపాదక లేఖలు పెక్కింటిని కూడా బ్రౌన్ కాపీ చేయించి పెట్టాడు. 1843 లో కడపజిల్లా వ్యక్తికి సంబంధించిన వొక 'వార్తా లేఖ'ను లోగడ (1973 లో) నేను ప్రకటించిన "బ్రౌన్ జాబులు: తెలుగు జర్నలిజం చరిత్ర: 1832 నుంచి 1857 దాకా" అనే గ్రంథం (పుటలు 47-9)లో యిస్తూ ఆ అధ్యాయానికి "ఆనాటి నక్సలైట్లు: న్యాయం జరగక తిరుగుబాటును వరించిన సామాన్యులు" అనే శీర్షిక పెట్టిన వైనం స్మరణకు వస్తున్నది.

# 'గుంటూరు కరువు'లో
# కడప కటకటలు

బ్రౌన్‌కు ఆనాడు వ్రాసిన జాబుల్లో అయోధ్యాపురం కృష్ణారెడ్డి వర్ణించిన కడప కటిక కాటకాన్ని - కారణం యేమైనా కానీ - మన చరిత్రకారులు, ముఖ్యంగా బ్రిటీష్ చరిత్రకారులు 'కడప కరువు' అని పిలవలేదు. కనీసం 'రాయలసీమ కరువు' అనైనా అన్లేదు. గుంటూరు కరువు అని వారు దానికి నామకరణం చేశారు. ఆ యేడాది కడపలో లేదా నెల్లూర్లో వచ్చిన కరువును 'గుంటూరు కరువు'లో వొక భాగంగానే చరిత్రలో పరిగణించడం జరిగింది గనుక యీ అధ్యాయానికి యీ శీర్షిక అవసరమైంది. ఇక బ్రౌన్ విషయంలో మరీను.

గుంటూరు జిల్లా యాక్టింగ్ కలెక్టర్‌గా బ్రౌన్ అక్కడి కరువు పరిస్థితుల్ని కళ్లారా చూశాడు. అంతేగాక అంతకు కొద్ది ముందునుంచి కూడా కడపలో తన బంగళా-తోట విషయాలను గురించి వచ్చేజాబుల్లో అక్కడకూడా వర్షాలు బొత్తిగాలేక యేరు యెండిపోయి నీళ్లు లేక తోట నిలువునా యెండిపోతున్నదనీ, ప్రజలు కటకట లాడి పోతున్నారనీ వ్రాస్తుండడంవల్ల - కడపలో బీదజనం యెట్లా బ్రతుకుతున్నారో అక్కడి పరిస్థితులు యెట్లా వున్నాయో తెలుసుకోవాలను కొన్నవాడై, గుంటూరు నుంచి బ్రౌన్ అయోధ్యాపురం కృష్ణారెడ్డిని ప్రత్యేకంగా వొక జాబులో కోరాడు గనుక కృష్ణారెడ్డి అన్ని వివరాలతో అంత పెద్దజాబు వ్రాశాడు (పేజీలు ౧౦-౧౩).

అప్పటి బ్రౌన్ మనోవైఖరిని అర్థం చేసుకోవాలంటే ఆ కరువు రోజుల్లో గుంటూరు కలెక్టర్‌గా ఆయన వ్రాసిపంపిన రిపోర్టులు చూడవలసివుంటుంది.

తెలుగుదేశాన్ని, ముఖ్యంగా రాయలసీమను క్రుంగదీసిన కరువులు వొకటి రెండుకాదు. అనేకం వున్నాయి.* మన అమ్మమ్మలు నాయనమ్మలు యెరిగిన కరువు వొకటుంది—ధాత కరువు. ధాతనామ సంవత్సరం (1876-77) లో వచ్చిన కరువు. అంతకు నలభైయేళ్ల క్రితం నందననామ సంవత్సరం (1832-33) లో వచ్చిన కరువు మహా ఘోరమైంది. దీన్నే 'గుంటూరు కరువు' అని చరిత్రకారులు నామ కరణం చేశారు:

"In 1832-3 occurred the terrible drought, which is known among Europeans as "the Guntur Famine" and among natives as "Nandana" that being the cyclic year. This terrible calamity covered the country with human bones from Ongole to Masulipatam and for twenty years afterwards the cultivation in the Guntur district did not reach its previous limit." †

ఒక కడప జ్యోతిష్కుడు ముందుగానే భవిష్యద్దర్శనం చేసుకొని, నందన నామ సంవత్సరంలో వీరభోగవసంతరాయలు అవతరించ బోతున్నాడనీ, యేదో ఘోరమైన విపత్తు వొకటి సంభవించ బోతున్నదనీ వొక 'వార్తను' ప్రచారంలోకి తెచ్చి హెచ్చరిక చేసినట్లు కడపలోని లండన్ మిషనరీ సొసైటీవారి తాలూకు వ్యక్తి విలియం హోవెల్ (William Howell) 1831 యేప్రిల్ 8 తేదీన లండన్‌లోని తన మిషన్‌కు వ్రాసిన ఒక లేఖలో యిట్లా తెలిపాడు:

---

* బ్రౌన్ తన 'యెఫిమరీస్' గ్రంథం (మద్రాసు, 1850, పేజీ VIII) రెండు కరువులు పేర్కొన్నాడు. 1792 లో "A great famine, called Mina Sani Caruvu" అనీ, 1806 లో "A famine in Kadapa" అనీ యిచ్చాడు. వీటి తర్వాత 1823-24 లో కూడా నేటి రాయలసీమ జిల్లాలో మరొక కరువు తాండవించింది (చూడు: Imperial Gazetteer of India, Provincial series, Madras, vol. 1, W. Francis, Calcutta, 1908, Pp, 79-80; Memorandum on the Madras Famine 1866, R. A. Dalzell, Madras, 1867, P. 26).

† A Manual of the Kistna District..., Gordon Mackenzie, Madras, 1881, P. 86.

"... recently a native has thought proper to put a paper in circulation to this effect:—That the time predicted in the 'Kala Gnana' (Knowledge of Times) for the appearing of 'Veera Boja Wasunta-royaloo', is near at hand, ... about the 'Nundana' Cycle, agreeing with year...1832. In consequence to this prediction the natives are led to expect some serious change in the Government, or a total subversion of idolatry."*

సరిగ్గా యీ నందన కరువు ప్రారంభంలో బ్రౌన్ గుంటూరుకు యాక్టింగ్ కలెక్టర్‌గా వచ్చాడు. ఈ కరువు తీవ్రతను గురించి యాదృచ్ఛికంగానైనా ప్రభుత్వం దృష్టికి వోం ప్రథమంగా తీసుకొచ్చిందికూడా బ్రౌనే.

1832 డిసెంబర్ 21 తేదీన గుంటూరు కలెక్టర్ డబ్ల్యు. మేసన్ (W. Mason) నుండి చార్జి తీసుకొన్నాడు బ్రౌన్. 22న ప్రమాణ స్వీకారాది లాంఛనాలు పూర్తి చేశాడు. 23 నుంచి పనిలోకి దిగాడు. చార్జి తీసుకొన్న వారంరోజుల లోపల్నే అక్కడి కటిక కాటక పరిస్థితుల్ని అర్థం చేసుకొన్నాడు. కరువు బాధల్ని గాథల్ని విన్నవించుకుంటూ సన్నజనం యిచ్చే గుట్టల గుట్టల అర్జీలు రోజూ అందుకొంటూ వచ్చాడు. ఆకలి చావులవార్తలను అనునిత్యమూ వింటూవచ్చాడు. బ్రౌన్ కలెక్టర్‌గా ప్రభుత్వానికి పంపిన రిపోర్టుల్లో యీ కరువు గురించిన వ్రాతలే అధికంగా వున్నాయి. మద్రాసునుంచి హైదరాబాదు (ఆం. ప్ర. స్టేట్ ఆర్కైవ్స్)కు తరలించబడివున్న 'డిస్ట్రిక్ట్ రికార్డ్స్ సీరీస్'లో యీ నివేదికలున్నాయి. మన అవగాహనకు అవసరం గనుక వాటిల్లో నుంచి మచ్చుకుకొన్ని పరిశీలిద్దాం. చార్జి తీసుకొన్న అయిదో రోజున్నే అంటే డిసెంబర్ 26 న రివెన్యూ బోర్డుకు పంపిన రిపోర్టులో బ్రౌన్ యిట్లా వ్రాశాడు.

"... ... The prices are also greatly enhanced from the total failure of rain in this month, great number of people and cattle are dying. Plundering of villages by bandititi, robbers etc., are of frequent occurrence & the Cholera still continues".†

---

* Missionary Chronicle (London Missionary Society) for December 1831, London, 1832, P. 542.

† Hyderabad, A. P. State Archives, Guntur District Records, Vol. 3988, P. 319.

ఒక రెజిమెంట్ తాలూకు సైన్యం మచిలీపట్నంనుంచి బళ్లారి వెళ్తూ గుంటూరు గుండా వస్తుందనీ, వాళ్లకు తగిన సరఫరాలు సదుపాయాలు అంద జేయమని బ్రౌన్‌కు హుకుం వస్తే - యీ గడ్డు పరిస్థితుల్లో వాళ్లవసతులు గిసతులు చూడాలంటే సాధ్యమా అంటూ 1832 డిసెంబర్ 31 న బ్రౌన్ మరొక జాబులో ప్రభుత్వానికి విన్నవించుకొంటాడు.

"... ... The distress from the continued drought is very great, and the deaths by famine are frequent even in the town of Guntoor and much more so in surrounding villages.

"The difficulties to all who have to travel through the District are greatly increased by the circumstances I have described by the prevalence of Cholera and still more by the want of water.

"I mention this because I am informed that H. M. 45th Regiment now under orders to march from Masulipatam to Bellary this District...leads me to believe that the difficulties arising from want both of water & fodder will be very great. There is indeed every prospect of a severe famine; and I consider it my duty to point out that if this march be ordered it cannot be effected without the greatest difficulty, which will be aggravated by the Cholera...which is now very severe through all this District; worse than it was on their late march through though that was attended with a great mortality."*

జనవరి 7 తేదీన బ్రౌన్ వ్రాసిన మరొక రిపోర్టులోనుంచి కొన్ని వాక్యాలు :

"... ... no rain has fallen in any part of this District since October last year. The distress is in consequence increasing ... and in fact there is not a single village where even moderate supplies and sufficient water can be met with." †

ఇవన్నీ మామూలుగా రివెన్యూ బోర్డుకు పంపిన నివేదికలు. జనవరి 16 న చీఫ్ సెక్రిటరీకి ప్రత్యేకంగా వొక జాబు వ్రాశాడు - ప్రస్తుత కరువు పరిస్థితుల మూలంగా జిల్లాలో లూటీలు దొంగతనాలు యెక్కువయ్యాయనీ, అధికారిగా తాను తగిన జాగ్రత్తలు తీసుకోవాలి గనుక పోలీస్ శాఖ వద్ద సిద్ధంగా తగిన మందుగుండు

---

* Hyderabad...Guntur District Records, Vol. 3988, P. 325

† " " " " " " " P. 2

సామగ్రి వుండడం అవసరం గనుక మచిలీపట్నం స్టోర్సునుండి జిల్లా ఖాతాకింద సరఫరా చేయించమని వ్రాశాడు. ఇదీ ఆ జాబు :

The Chief Secretary to the Government,
Fort St. George.

Sir,

In consequence of the increase of crime during the present famine, I have the honour to request that the Right Honorable the Governor in Council will be pleased to sanction the issue from the stores at Masulipatam of the under mentioned military stores, which are indispensably necessary for the efficiency of the police establishment in the district.

1,000 flints for muskets
20,000 cartridge slotted muskets
200 muskets with bayonets.

I have the honor to be
Sir,
Your most obedient servant,
C. P. BROWN,
Acting Collector. *

GUNTOOR,
Acting Collector's Cutcherry,
16th January 1833.

ప్రభుత్వ చీఫ్ సెక్రిటరీకి యిందులోవున్న యీ మామూలు పదజాలమే నచ్చినట్లు లేదు. ఘాటుగా తగిలినట్లున్నది. కరువు (famine) అని అంటావేమిటి. కొరత (scarcity) అనొచ్చుగదా. అనాలోచితంగా అంత తీవ్ర పదజాలం వాడి గోరంతలు కొండంతలుగా యెందుకు చిత్రించాలి అని అంటూ చీఫ్ సెక్రిటరీ బ్రౌన్‌కు మందలింపుగా శ్రీముఖం పంపాడు. అంతే కాదు. రాష్ట్రంలో యెక్కడ గానీ తీవ్ర కరువు పరిస్థితులున్నట్లు గవర్నర్ దృష్టికి రాలేదనీ. కరువు పరిస్థితి వున్న మాటే నిజమైతే గుంటూరులో యిప్పుడు ధరలు యెట్లా వుండేదీ తెలిపితే. దాన్ని

* Madras, Tamilnadu Archives, Judicial Consultation No. 12 of 1833 Jan. 18.

బట్టి నిజపరిస్థితిని తామె అర్థం చేసుకోగలమన్నట్లు వ్రాశాడు. ఏమైనా నీవు అడిగిన మిలిటరీ సామగ్రిలో సగం మటుకు సరఫరా చేయిస్తున్నామనీ వాటిని పోలీసువాళ్ల తగు జాగ్రత్తలతో వుపయోగించేలా చూడమనీ కోరాడు చీఫ్ సెక్రిటరీ ఆ జాబులో :

C. P. BROWN esq.,
Acting Collector, Guntur.

Sir,

I am directed to acknowledge receipt of your letter of the 16th applying for certain military stores to ensure the tranquility of your district "during the present *famine*"—and to request that you will say more at large in what respects crime has increased throughout Guntur.

H. E. Governor in Council has not yet heard that any part of the country is suffering the calamities of "*famine*" and hopes that you have made use of that term inadvertantly. The indiscriminate employment of strong expressions when the occasion does not require them, should be carefully avoided. They mislead the government as to the actual state of affairs,...create a distrust of the accuracy of your information. You will be pleased to transmit to this office a statement of prices as they exist at present in the mufussal towns in your district. Half of the supply of ammunities and arms which you solicit will be furnished—but especial care must be taken that it is distributed to your police under proper restitution.

Fort St. George,
18th January 1833.

దీని మీదట బ్రౌన్ ఆయన కోరినట్లుగానే ధాన్యం ధరలపట్టీ పంపాడు - అది కరువు (famine) అవునో కాదో చూచుకోమన్నట్లు—(1831 జనవరి నుంచి 1832 డిసెంబర్ దాకా నెలవారీగా ధరల వివరమున్న ఆ పట్టీని ముద్రణ సౌకర్యంకోసం యిక్కడ ఆరునెలలవారీగా చూపడమైంది). దీన్నిబట్టి వొక్క వుప్పు మినహా మిగతా ధాన్యం ధరలన్నీ యిబ్బడిగా పెరిగినట్లు అర్థమవుతుంది.

---

* Madras, Tamilnadu Archives, Judicial Consultation No. 14 of 1833 Jan. 18.

తనకు ప్రజలు రోజూ సమర్పించుకొనే అర్జీల్లో 'కరువు' అనే అంటున్నారు కాబట్టి, పసిపిల్లలను తెగ నమ్ముకుంటున్నారు కాబట్టి, ఆకలిచావులు యెక్కడబడితే అక్కడ సంభవిస్తున్నట్లు వారం వారం తనకు రిపోర్టులు (వొక్క దాచేపల్లి డివిజన్ లోనే 60 చావులు రిపోర్టయినట్లు) వస్తున్నాయి కాబట్టి 'కరువు' అని తాను వ్రాయవలసి వచ్చిందనీ వున్నవిషయాన్ని సంజాయిషీ రూపంలో యీ క్రింది విధంగా వ్రాసుకొన్నాడు బ్రౌన్:

The Secretary to the Government
in the Judicial Department,
Fort St. George.

Sir,

I have the honor to acknowledge your letter of the 18th instant and to forward the statement therein required, exhibiting the rise of the prices of grain which I considered as meriting the name of Famine.

This expression being objected to in your letter I admit that scarcity and not a stronger word should have been used. I was led to call it famine because that term occurs in numerous petitions continually presented in this cutcherry because the sales of infants are daily more numerous, and because the reports sent to this office show that several deaths occur weekly in each Division (sixty are now reported in one Division) of this District, which are plainly admitted to starvation.

Guntoor Zillah,
Acting Collector's Cutcherry,
Datchapally,
29th January 1833.

I have the honor to be
Sir,
Yours most obedient servant,

C. P. BROWN,

Acting Collector.

Table showing the average wholesale prices per garce of grain and salt in the Guntoor District (from January 1831 to the end of December 1832) calculated to the nearest Rupee.

| Description of Grain | 1831 June | 1831 December | 1832 June | 1832 December |
|---|---|---|---|---|
| 1. White Paddy. | 90 | 90 | 83 | 187–8 |
| 2. Red Paddy. | 84 | 81 | 74 | 177 |
| 3. White rice. | 187–8 | 183–8 | 173–8 | 358 |
| 4. Red rice. | 172–8 | 165 | 156–8 | 346 |
| 5. Jonnaloo. | 122 | 113 | 106–8 | 267–8 |
| 6. Sazzaloo. | 98 | 88 | 89 | 238 |
| 7. Mocca Jonnaloo. | 95 | 91 | 92 | 209 |
| 8. Cholloo or Natcheny. | 89 | 87–8 | 84–8 | 228 |
| 9. Vorugaloo. | 89–8 | 85 | 78 | 217 |
| 10. Aulloo. | 68 | 63 | 57–8 | 148–8 |
| 11. Corraloo. | 87 | 83 | 73–8 | 210–8 |
| 12. Wheats. | 202 | 235 | 189 | 340 |
| 13. Condooloo. | 84 | 91–8 | 72 | 230–8 |
| 14. Pasaloo. | 111 | 112–8 | 96 | 256 |
| 15. Munoomooloo. | 144 | 139 | 127 | 287 |
| 16. Chenna Bengal Gram. | 108 | 112–8 | 95–8 | 261–8 |
| 17. Ootty. | 90 | 92 | 78 | 250 |
| 18. Alachendaloo. | 94–8 | 91 | 82 | 216 |
| 19. Anoomoloo. | 81 | 86 | 79–8 | 195 |
| 20. Salt. | 144–8 | 144 | 145–8 | 142 |

GUNTOOR ZILLAH,
Acting Collector's Cutcherry,
Datchepally,
29th January, 1833.

C. P. BROWN,
Acting Collector. *

* Madras, Tamilnadu Archives, Judicial Consultation No. 17 of 1833 Feb. 5.

రోజురోజుకు పరిస్థితులు విషమించడమే గాని కరువు తగ్గుముఖం పట్టడ మనేది లేదు. గంజికేంద్రాలను నడపడం, కూలీలను పెట్టి రోడ్లు వేయించడం వగైరా కరువు పనులు ప్రారంభించడం వంటివి చేయవలసి వచ్చింది. ఫిబ్రవరి 21న పంపిన రిపోర్టులో యీ విషయాలే వున్నాయి :

"...I took the requisite steps for employing and feeding a portion of the sufferers in the present scarcity.

"The presence of Lt. Handerson of the Engineers was of material assistance to me with regard to determining the work in road making to be effected by such of the people fed as were not incapacitated by age or disease.

"To those that were incapacitated I allowed ten Rupees per day which supported nearly a hundred persons & an equal sum to those who carried on the work taking care to ensure diligence & its being done in a proper manner. The accounts kept show all the details.

"These measures have produced an alleviation of the present distress although every week still produces reports of deaths by starvation. I trust the steps I have adopted will not be disapproved by the Board." *

మార్చి వచ్చేసరికి ధరలు మరింత మండిపోయాయి. రెండింతలు దాటి మూడింతలకు పోయాయి. మార్చి 6, 15 తేదుల్లో పంపిన నివేదికల్లో నుంచి కొన్ని వాక్యాలు :

"The liberality of Government however in taking off the duties on grain exported has caused a fall in the market prices; as rice which three months age was 12 seers to the Rupee is now about fourteen and a half. The relief likewise extended to the poor both by granting them alms and hiring them to repair the roads has been the cause of many lives being saved...

"The failure of the crops this year has occasioned a great rise in the price of grain as is shown in the annexed memorandum. The price is now nearly three fold as much as it was in the last fusly: The resources are indeed greatly diminished but

---

* Hyderabad..., Guntur District Records, Vol. 3989, P. 17.

in consequence of the rise in the prices, the gross amount of the crops including the farmers share is rated at Rs. 66,615–7–1.

PRICES

| Description of grain | Amount of prices in last fusly | Current prices | Increase |
|---|---|---|---|
| | Rs. A. P. | Rs. A. P. | Rs. A. P. |
| Jonnaloo per candy | 16—0—0 | 50—0—0 | 34—0 - 0 |
| Cotton ,, | 7—0—0 | 20—0—0 | 13—0—0 |
| Suzzaloo ,, | 14—0—0 | 40—0—0 | 26—0—0 |

ఇక "ఇల్లుకాలి యేడుస్తుంటే చుట్టకు నిప్పివ్వమని వచ్చినట్లు" యీ కరువు బాధల్లో అమీన్‌లు వగైరా గ్రామాధికారుల లోపాయికారీ పనులకు లెక్కలేనట్లున్నది. పంటల అంచనా వగైరా గ్రామ లెక్కలు తయారుచేయడంలో పల్నాడు అమీన్‌ల లంచగొండి వ్యవహారాలు బయటపడి, కొందర్ని వుద్యోగాల్లోనుంచి తొలగించడం దాకా వెళ్లినట్లున్నది వ్యవహారం - నేటికాలపు కరువు నిధులు, తుఫాను నిధుల పేరుతో ప్రభుత్వం ఖర్చుపెడుతున్న మొత్తాల్లోనుంచి మధ్యనుండే కంట్రాక్టర్లు, రాజకీయ పెత్తందారులు స్వాహా చేస్తున్నట్లు. ఈ అమీన్‌ల వ్యవహారాలను గురించి పెద్ద నివేదికే పంపివున్నాడు బ్రౌన్.

"...The deplorable state of Palnaud having been brought to my notice on my arrival in Guntoor on 23rd December as acting collector I went to that District (on 20 January) as soon as I had time to make myself acquainted with the state of the zillah.

"I regret greatly to find that the state of Palnaud proves worse than had been described for it appears that the two Aumeens relying on the badness of the season as an all prevailing excuse had fraudulently underrated the Anchana accounts and reported the existing resources less than half their real amount. They permitted the crops to be removed, and housed in a most irregular manner and are reported to have received considerable sums as bribes for the permission.

---

* Hyderabad..., Guntur District Records, Vol. 3989, Pp. 18-19, 25.

......"Some confessions of fraud have been made by accomplies, but both parties being interested in concealing the truth I cannot suppose it has been in all cases discovered.

"The accusations laid against the Aumeens for fraud are numerous, there are now filed fifteen complaints against the Dachepully Aumeen, of which two have been tried according to Regulation IX of 1822 and the later orders on the subject and three against the Aumeen of Timmirecottah of which one has been tried. These enquiries have been a great source of labour and less of time, which may partly be repaid by the results of next year.

I had hoped I should be relieved from these duties at an earlier period and wished to leave the decision to Mr. Blackburne as Collector but as so long a period has passed without his joining the zilla I have decided these cases and dismissed the Aumeens."

"...The great distress caused by the hardness of the season has already led to the emigration of several farmers; and it becomes a matter of difficuly to decide how far the demand can be pushed without leading to this disastrous result."

ఇంత జరిగిన తర్వాత కొత్తగా నియమింపబడిన కలెక్టర్ రావడంతో మార్చి 25 న బ్రౌన్ చార్జి యిచ్చేపి చిత్తూరుజిల్లా జడ్జిగా వచ్చే ముందు పంపిన ఆఖరు రిపోర్టులో నుంచి కొన్ని వాక్యాలు:

"...the small pox has broken out in almost every part of this District in a most virulent form, this was brought to the notice of the Zillah surgeon and application made for the assistance of vaccinators."

"...The great increase in the number of applicants for this bounty has induced me to increase the amount from 10 to 20 Rupees per day at the town of Guntoor and also to add ten Rupees per day at Baupitlah making a total 30 which supported seven hundred and fifty persons - even this sum is not adequate to the demand now prevailing. A sum of 10 Rupees was at first

---

* Hyderabad..., Guntur District Records, Vol. 3989, Pp. 25-9.

allowed for the persons employed in labour which being entirely insufficient the said causes induced me at last to increase the sum from 10 to 20 Rupees at Guntoor in repairing the Calcutta high road and a further sum of 10 Rupees has likewise been allowed at Incolloo to labourers in the same route - the total number of persons employed on the work at both places is about 380 at an expense of 30 Rupees per day.

"I state these circumstances that the Board may be enabled to countermand these arrangements if I have exceeded the amount intended by Government to be expended on this object...I can truly state that the sum at present granted is much less than the distress of the public calls for, though here alleviated by a private subscription among ourselves.

"Every precaution has been taken to prevent an influx of strangers as the charity is intended to relieve the residents alone. The result appears fully to have met the benevolent wishes of Government, though daily reports are still received of deaths by actual starvation." *

ఇట్లా గుంటూరు యాక్టింగ్ కలెక్టర్‌గా ఆయన పని చేసింది పట్టుమని మూడు నెల్లే అయినా యీ స్వల్పకాలంలో ఆయన పంపిన యీ రిపోర్టులనుబట్టి చూస్తే 'గుంటూరు కరువు కలెక్టర్'గానే వుండిపోయాడా అనిపిస్తుంది. "This famine lasted for three years and its effects have been felt for ten years more"—† అని బ్రౌన్ వ్రాశాడంటే ఆ కరువు తీవ్రతను అర్థం చేసుకోవచ్చు.

అమాయికంగా famine అన్న పదాన్ని వాడి- పై అధికార్ల నుండి బ్రౌన్ అన్ని చీవాట్లు తిన్నాడంటే అందులో విడ్డూరం యేమీ కనపడ్డంలేదు. ఆ రోజుల్లో యీ గుంటూరు కరువు విలయతాండవం చేస్తూ దాని భయంకరమైన తాకిడికి లోనైన జిల్లాల కలెక్టర్లెవరూ కూడా famine అనే పదం దాదాపు వుపయోగించలేదు-పరిస్థితి యెంత గడ్డుగా వున్నప్పటికీ. పైకి వ్రాసే రిపోర్టుల్లో drought, scarcity, dist-

* Hyderabad..., Guntur District Records, Vol. 3989, Pp. 41, 43-4.

† The Telugu Reader (English translation...), C.P. Brown, Madras, 1852, P. 109.

ress, adverse season వంటి పూత మెరుగుల పదాలే వుపయోగించారంటే— famine అనే పదం వారి యెరుకలో లేకపోబట్టి కాదు. దాని వెనుకగల రాజకీయ కారణాలను వూహించుకోవచ్చు.

ఈ గడ్డపై తమకు వలసాధిపత్యం యేర్పడి, యీ దేశాన్ని తమ యేలుబడి కిందకు తెచ్చుకొన్న తర్వాత, అస్తవ్యస్తంగా వున్న ఇండియాను తామేదో నాగరిక మైన పరిపాలనా పద్ధతులతో వుద్ధరిస్తున్నామనే అధికృభావానికి—కరువుతో తమ రాజ్యంలోని ప్రజలు అల్లాడి పోతున్నారంటే—పెద్ద దెబ్బగదా మరి. ఒక విధంగా అవమానకరం కూడా కదా. అందువల్లనే వారు కావాలని 'తీవ్రతను తగ్గించి చూపే పదజాలాన్ని' వుపయోగిస్తూ వచ్చారనుకోవాలి.

ఉన్న పరిస్థితులకు వారు వక్రభాష్యాలు కల్పించగలరు కూడా. కడప జిల్లా 'మాన్యువల్'ను రచించిన జె. డి. బి. గ్రిబిల్ యింకొక సంవత్సరంలో ధాతకరువు రాబోతున్నదనగా కడప కరువులను గురించి యెంతగా వక్రీకరించి వ్రాశాడో చూడండి:

"Famines do not ever seem to have seriously affected this district. Even during the celebrated 'Nandana' year, though there was considerable distress and severe pressure, there was never an actual famine. In 1866 there was distress, but not actual famine..."

ఇదీ ఆనాటి అధికారుల ధోరణి. ఈ నందన కరువు తీవ్రతను గురించి ఆనాటి మరికొందరు బ్రిటీష్ అధికారులు వ్రాసిన వ్రాతలే సాక్ష్యం. ఒక యింజనీర్ వ్రాస్తున్నాడు చూడండి: †

1831-32 లో గుంటూరు జిల్లా జనాభా 5,12,317 మంది కాగా 1832-33లో 3,57,038 మందికి దిగిపోయింది. అంటే వొక్క యేడాదిలో దాదాపు మూడోవంతు మంది మటుమాయమయ్యారన్నమాట. ఆ మరనటేడు మరో లక్ష యిరవై వేల మంది తగ్గిపోయారు. ఈ కరువు అయిన తర్వాత పదేళ్ళకుకూడా జిల్లా జనాభా 3½ లక్షలు దాటలేదు.

---

* A Manual of the District of Cuddapah, J. D. B. Gribble, Madras, 1875, P. 128.

† The Madras Journal of Literature and Science. Effects of the Famine of 1833. Captain Best. Madras. Pp. 186-95.

ఈ కరువు పొట్టన పెట్టుకున్న మనుషుల శవాలను రోడ్డుకు రెండుపక్కలా అమర్చితే ఆ పొడవు 20 మైళ్ళు వుంటుందని అంచనా వేశారు. ఇక పశునష్టం చెప్పనలవికాదు. పాడిపశువులు, యెద్దులు, గొర్రెలు, మేకలు యీ రెండేళ్ళ కాలంలో మొత్తం 6 లక్షలకు పైగా మలమల మాడిపోయాయి.

ఎక్కడంటే అక్కడ తారపిల్లే మనుషుల శవాల గుట్టలను పోగుజేసి సామూహిక దహన (లేదా ఖనన) సంస్కారాదులు చేసేందుకు ప్రత్యేక పోలీసు సిబ్బందిని నియమించి ప్రత్యేక పద్దుగా లెక్కల్లో చూపడం జరిగినా,* ప్రధానంగా కాకులు గద్దలు బారువాపక్షులు కుక్కలు ఆ శవాలను లాక్కుని తినేస్తుండేవని కల్నల్ వాల్టర్ కేంబెల్ 'మై ఇండియన్ జర్నల్' (ఎడింబరో, 1964?) లో పేర్కొన్నాడట.†

ఈ ఘోరమైన కరువు పరిస్థితులను అనరాగా తీసుకొని క్రిశ్చియన్ మిషనరీలు రంగ్రంలోకి దిగినట్లున్నారు. మతాంతరీకరణలకు ప్రయత్నాలు జోరుగానే జరిగినట్లున్నాయి. Letters Edifantes et curieuses అనే ఫ్రెంచి లేఖల గ్రంథంలో యీ నందన కరువు తీవ్రతను Pere Charbonneaux అనే ఫ్రెంచి మిషనరీ వ్రాసిన సుదీర్ఘ లేఖలో వర్ణించివున్నట్లు కృష్ణ జిల్లా మాన్యువల్ వ్రాత.§

ఇక రివెన్యూ పరంగా చెప్పాలంటే—యీ కరువు మూలంగా మొత్తం రివెన్యూ నష్టం 2 కోట్ల 27 లక్షలని వాక అంచనా.♦ 1831-32 లో 18 లక్షలా 31 వేల రూపాయలున్న గుంటూరు జిల్లా రివెన్యూ 1832-33 లో 8 లక్షలా 76 వేలకు పడిపోయింది. ఇట్లా వరసగా అయిదేళ్ళపాటు సగటున 8 లక్షల చొప్పున

---

* మనుషుల శవాలను పూడ్చిపెట్టడానికి 184 రూపాయలా 2 అణాలు ఖర్చు చేసినట్లు మచిలీపట్నం కలెక్టర్ 1833 సెప్టెంబర్లో బోర్డుకు వ్రాసుకొన్నాడు (Board of Revenue Consultation dated 1833 December 12).

† Guntur District 1788 - 1848..., R. E. Frykenberg, London, 1965, P. 2.

§ A Manual of the Kistna District..., P. 283.

♦ Ibid., P. 253.

రివెన్యూ తగ్గుతూ పోయింది. ఆ తర్వాత మరో అయిదేళ్లపాటు సగటున జరిగిన నష్టం 5 లక్షలు అని లెక్కలు గట్టారు. *

ఏమేటా యింత రెవిన్యూ నష్టం భరించేదానికన్నా కరువు నివారణకు ముందు నుంచీ గట్టి చర్యలు తీసుకొని వుండాల్సిందనీ, నీటిపారుదల సౌకర్యాలు బాగా హెచ్చించి వుండాల్సిందనీ చర్చలు ప్రారంభమైనాయి. ఈ చర్చల ఫలితంగానే కృష్ణానది కింద నీటి పారుదల సౌకర్యాల సర్వే పునఃప్రారంభమైంది. 1792-96 మధ్య జరిగిన మేజర్ బీట్సన్ (Major Beatson), మైకేల్ తోపింగ్ (Michael Topping), డాక్టర్ హీన్ (Dr. Heyne) జరిపిన సర్వేల తాలూకు పాత చిట్టాల పరిశీలన, పునశ్చరణ ప్రారంభమైనాయి.

ఈ గుంటూరు కరువు తీవ్రరూపంలో వున్నప్పుడు కృష్ణానది దాదాపు నాలుగింట మూడువంతుల నిండుగా పారుతున్నప్పటికీ 'శిశువుకు దక్కని స్తన్యం లాగ'† ప్రవహిస్తున్న యీ నదీజలాలు యెందుకూ కొరగాకుండా సముద్రం పాలై పోతున్నాయనే ఆగం మొదలైంది. ఈ నదీజలాలను సేద్యానికి తరలించడ మెట్లా అనే ఆలోచనలు మళ్లీ ముసురుకున్నాయి—దాహం వేసినప్పుడు బావి తవ్వడమెట్లా అన్నట్లు. కెప్టెన్ బకిల్ (Captain Buckle)ను ప్రభుత్వం యీ పనికి పురమాయించింది. వల్లూరు దగ్గర పుల్లేరుకాల్వ, సీతానగరం దగ్గర మరో కృష్ణకాల్వ— యీ రెండూ యీ నేపథ్యంలోనుంచి ప్రారంభమైనవే.

కృష్ణానదిపై ఆనకట్ట ప్రణాళికను 1839లో యీ కెప్టెన్ బకిల్ తయారు చేసిందే. 1841-47 లో ఈ ఆనకట్ట గురించి కెప్టెన్ బెస్ట్ (Captain Best), కెప్టెన్ లేక్ (Captain Lake) మరింత విస్తృతంగా సర్వేలు జరిపి విపుల ప్రతిపాదనలు రూపొందించారు. కెప్టెన్ లేక్ నివేదికను కాటన్‌దొర (అప్పట్లో మేజర్, యింకా సర్ కాలేదు) సిఫారసు చేయడం, దానిమీద 1849లో అయిదుగురుతో కూడిన కమిటీ వొకటి తన రిపోర్టును పైకి పంపడం, లండన్‌లోని కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్ దానిని 1850లో ఆమోదించడం, ఆనకట్ట పని ప్రారంభం కావడం— యిదంతా యీ కరువు అనంతర చరిత్రే. §

---

* M.J.L.S....Capt. Best's essay. ఇది లోగడ 41 పేజీలో ప్రస్తావనకు వచ్చిందే.

† శ్రీశ్రీ 'విషాదాంధ్ర' గేయంలో వొక చరణం తునక.

§ Manual of the Kistna District..., P. 254.

ఇక యీ నందన కరువులో ప్రభుత్వం అనుసరించిన అధ్వాన్నపు ఆర్థిక - వ్యవసాయ విధానాలను మరొక వ్యాసకర్త అప్పట్లోనే తీవ్రంగా విమర్శించివున్నాడు.* ప్రఖ్యాత ఆర్థిక శాస్త్రవేత్త ఆడమ్ స్మిత్ (Adam Smith) రూపొందించిన సిద్ధాంతాలనుబట్టి వ్యవహరించడంవల్ల ప్రభుత్వం యీ కరువు కాలంలో ప్రత్యక్షంగా రంగంలోకి దిగి చురుగ్గా చేయవలసిన పనులు చేయకుండా ప్రేక్షకప్రాయంగా వుండిపోయినందువల్ల కరువు పరిస్థితిని మరింత అధ్వాన్న పరిచిందని ఆయన తన సీరియల్ వ్యాసంలో విమర్శించాడు.

ఉదాహరణకు కరువు తీవ్రరూపంలో తాండవిస్తున్నప్పుడు, జనం తిండి గింజలకు అల్లాడిపోతుంటే—కనరా, మలబార్ ప్రాంతాల్లో ధాన్యం సమృద్ధిగా వుండడమే గాక, సలీసుగా కూడా లభిస్తుంటే, దిగుమతులు జరిపి ప్రభుత్వం ఆదుకోలేకపోవడం ఘోరమైన విషయమనీ అన్నాడాయన. అంతదూరం పోనక్కర్లేకుండా రాజమండ్రి, విశాఖపట్నం, గంజాం ప్రాంతాల్లో గుంటూరు ధరలకన్నా సగానికి సగం తక్కువ ధరలకు ధాన్యం లభిస్తుంటే, వ్యాపారాలకు కొన్ని కనీస ప్రోత్సాహాలు కల్పించి దిగుమతులు జరిపించలేకపోవడం ప్రభుత్వ దివాలకోరు విధానానికి నిదర్శనమనీ ఆయన ఆ వ్యాసంలో తూర్పార బట్టాడు.

బెంగాల్‌కు వుప్పు పంపించి అక్కడినుంచి ధాన్యం దిగుమతి చేసుకోవాలని వ్యాపారులు కోరుతున్నారనీ వుప్పుధరల తఫసీళ్ళనుగురించి బోర్డుకు వ్రాశాడు మచిలీపట్నం కలెక్టర్. 1832 డిసెంబర్ 29 తేదీన ధాన్యం నింపుకున్న వోడలు బందరు రేవుకు వస్తే కారణం యేమిటోగానీ ధాన్యం తీసుకొనే వ్యాపారులు లేరని 1833 ఏప్రిల్ 22 న మరొక జాబులో వ్రాశాడు.† ధాన్యం దిగుమతుల విషయంలో ప్రభుత్వం మొదట్లో యెంతగా మీనమేషాలు లెక్కపెడ్తూ వచ్చిందో దీన్నిబట్టి అర్థం

---

* M.J.L.S...., Jan.-April 1839. Notes on Ryotwar, or Permanent Annual Money Rent, in South India: and on the Duty of Government in Periods of Famine. John F. Thomas. Pp. 53-78, 207-220.

† Selection from the Records of the late Masulipatam Zillah (Reports of collectors of Masulipatam Zillah to the Board of Revenue relating to the famine of 1832), Masulipatam, 1906, Pp. 3, 6.

చేసుకోవచ్చు. ఉప్పు పంపించి యెంత ధాన్యాన్ని దిగుమతి చేసుకొన్నదో తెలియదు గానీ కరువు మొదటి నాలుగైదు నెలల్లో మటుకు నెల్లూరు జిల్లాలోని ఇస్కపల్లి రేవు కొఠార్ల నుండి 1 లక్ష 75 వేల మణుగుల వుప్పును బెంగాల్‌కు యెగుమతి చేయడం జరిగింది.

తర్వాత పోను పోను ధాన్యం దిగుమతులను ప్రోత్సహించేదానికిగాను బెంగాల్, మలబార్, కనరాలనుంచి బియ్యం దిగుమతి చేసినవారికి ప్రతి గరిసె బియ్యానికి 20 రూపాయల బహుమానం యివ్వబడుతుందని మాత్రం 1833 ఆగస్టులో మద్రాసు ప్రభుత్వం వొక ప్రోత్సాహక పథకాన్ని ప్రకటించింది.*

ఇట్లా నందన కరువుతో పెనవేసుకొన్న వ్రాతకోతలు - చరిత్రకారులుగా పరిశీలించదగినవి - యెన్నో వున్నాయి. పేరుకు యిది గుంటూరు కరువు అయినా, వొక్క గుంటూరే కాకుండా - మచిలీపట్నం, యిప్పటి కడప, ఒంగోలు, నెల్లూరు, కర్నూలు, అనంతపురం, చిత్తూరు, అప్పటి నార్త్ ఆర్కాట్ జిల్లా ప్రాంతాలు ఘోరంగా దెబ్బ తిన్నాయి.

ఈ కరువులో కడప కటకటలు, యిక్కట్లుగురించి చెప్పకనే చెప్తున్నదిగదా అయోధ్యాపురం కృష్ణారెడ్డి బ్రౌన్‌కు వ్రాసిన ఆ జాబు (పేజీలు ౦౦-౧౩).

కడప బజారులోని వొక షావుకారి యింటిమీదకు షుమారు నూరుమంది స్తోమతై వచ్చి బీగాలు పగలగొట్టి యించుమించు మూడువేల రూపాయల నగదు వగైరాలు దోచుకుపోయిన సన్నివేశాన్ని వర్ణించాడు కృష్ణారెడ్డి.† అది వ్రాసిన రెణ్ణెల్లకు, అంటే 1833 మే 24 న సాక్షాత్తు కడపకోర్టు ట్రెజరీనే దొంగలు కొల్లగొట్టుకొని పోయిన సంఘటన మరొకటి జరిగింది.§ దీనితో కడప వున్నతాధికారులకు పెద్ద కనువిప్పు కల్గింది. మిలిటరీ కాపలాలు గస్తీలు కట్టుదిట్టం చేయవలసి వచ్చింది.

దివిటీ దొంగలు వూళ్ళమీదపడి పొలాల్లో ధాన్యం పాతర్లు, కుప్పలు దోచుకున్న సంఘటనలు కడప జిల్లాలో బోలెడు. ఈ రకం దొంగలతో నేరస్తులతో కడప

---

* Fort St. George Gazettee, Madras, 28 August 1833.

† ఏలూరులోకూడా యిట్లాగే దొంగలు ఆగస్టులో బజారుమీదపడి ధాన్యం కొల్లగొట్టుకొని పోయారు (చూడు: Selection from the Records of the late Masulipatam Zillah..., 1906, P. 14).

§ Madras, Tamilnadu Archives, Judicial Consultation No. 4 of 1833 June 4.

జైళ్లు కిటకిట లాడిపోయాయి. కంభంలో కూడా యీ దొంగతనాలకు లెక్కలేదు. కంభం 'నేటివ్ క్రిమినల్ కోర్టు'లో బందీలై వున్న ధాన్యపు దొంగల లిస్టు పైకి పంపుకొంటాడు కడప మేజిస్ట్రేట్.* కరువు రోజుల్లో తినడానికి అన్నంలేక కడుపులు కాలిపోతుంటే విధిలేక దొంగతనాలకు దిగేవాళ్లనూ, బాగా రాటుదేరిన వృత్తి దొంగలనూ వేర్వేరుగా పరిగణించవలసిన అవసరాన్నిగురించి కడప మేజిస్ట్రేట్ పైకి వ్రాసుకొంటాడు.†

ఆపత్సమయంలో వసుదేవుడంతటివాడు గాడిదకాళ్లు పట్టుకొన్నాడంటారు. ఆశలన్నీ అడుగంటిపోతున్న ఆ నీరవసమయంలో మానవమాత్రులైనవారు దేవుని మీద భారంవేసి తమ మొరలాలకించమని ప్రార్థనలు జరపడంలో వింతలేదు. ఎంత పరాయి ప్రభుత్వమైనా, యెంత క్రైస్తవమత పక్షపాతంవున్న పరిపాలకులైనా ప్రజల నమ్మకాలకు తలవొగ్గక తప్పలేదు. ఊటలెండిపోయిన పెన్నానదికి నీళ్లు వచ్చేలాగా చేయమని—వానలు కురిపించే వరుణదేవునికి ప్రార్థనలు జరిపించడానికీ దేవాలయాల్లో ప్రత్యేక పూజలు చేయించడానికీ నెల్లూరు కలెక్టర్ ఖర్చులక్రింద మొత్తం 1,400 రూపాయలు మంజూరు చేయవలసిందిగా బోర్డుకు వ్రాసుకొన్నాడు.§ ఇంతకు పదేళ్లక్రితం 1824 లో (యింకా ముందు 1812 నవంబర్‌లోనూ) కడపలో వానలులేక పరిస్థితి వికటిస్తే 300 వరహాలు మంజూరు చేయించుకుని పుష్పగిరి దేవాలయంలో వరుణదేవునికి పూజలు చేయించాడు కలెక్టర్.♦

పట్టణప్రాంతాల్లో యేవో గంజికేంద్రాలు నడుపుతున్నట్లు తెలిసి, పల్లెపట్టుల నుంచి జనం పొట్ట చేతబట్టుకొని కడప, కంభంవంటి చోట్లకు తరలిరావడం ప్రారంభించారు. వ్యాపారులు ధాన్యం దాచిపెట్టకూడదనే తాకీదులు యిచ్చి చూశాడు

---

* Madras, Judicial Consultation, No. 10 of 1833 June 10.

† „ „ „ No. 21 of 1833 June 18.

§ Gazetteer of the Nellore District..., Madras, 1942. P. 191. (రెవిన్యూ బోర్డు మాత్రం యిందుకు సమ్మతించినట్లు లేదు. చూడు: బోర్డు కన్సల్టేషన్ 1832 సెప్టెంబర్ 17).

♦ Hyderabad, A. P. State Archives, Cuddapah District Records, Vols. 639, 4575, 4585.

కలెక్టర్.* తిండి గింటలకు కటకట మాత్రం తగ్గలేదు. జనం యింతదూరం వచ్చిచేరినా యిక్కడా రద్దీ యెక్కువై. బ్రతకలేక ఆకలికి తట్టుకోలేక మద్రాసుకు వలసవెళ్ళిన జనాభాగురించి కూడా రిపోర్టులు అనేకం వున్నాయి.†

ఈ దశలో మద్రాసులో గంజికేంద్రాలు నడపడంలో - యేనుగుల వీరాస్వామయ్య కాశీయాత్ర ముగించుకొని తిరిగి వచ్చిన తర్వాత పూర్తిగా నిమగ్నుడు కావల్సి వచ్చింది. వీరాస్వామయ్య యీ గంజికేంద్రాల నిర్వహణ తత్పరతనుగూర్చి ఆయన సమకాలికుడు కోమలేశ్వర శ్రీనివాసపిళ్లె యిట్లా వ్రాశాడు:

"నందన సంవత్సరపు క్షామములో....మరిన్ని గంజిదొడ్డి యనే అన్న సత్రములో గవరన్‌మెంటువారు అపార ద్రవ్యమును బదల అన్నప్రదాన విషయమై ఖర్చుచేసినప్పుడు అయ్యవారు ఆ ధర్మ విచారణ ప్రభువులలో తాను వొక్కడుగా నుండి పేదలకు కాలములో విమర్శగా అన్నమును అందచేసేకొరకై పడినశ్రమ చెప్ప శక్యముకాదు. అది యెలాగంటే 1,000—2,000 తూముల బియ్యమును ప్రతి దినమున్ను పాకము చేయించి తన దృష్టిపథములో పేదలను శ్రమపడనీయకుండా రెండు జాములకు లోగానే అన్నమంతయు వినియోగపరచుచు వచ్చిరి....మరిన్ని తన బుద్ధిశక్తిని యావత్తున్ను రాత్రిన్ని పగలున్ను ఆ కార్యము విషయమై వాడుచు వచ్చిరి."§

వెయ్యి తూముల బియ్యం లెక్కన వేసుకొన్నా రోజుకు దాదాపు మూడు లక్షలమందికి వొక్క మద్రాసులోనే అన్నదానమన్నమాట. ప్రభుత్వ లెక్కలనుబట్టి చూచినా యిందులో అతిశయోక్తి కనపడ్డంలేదు. 1833 మే 4 తేదినాటికి మద్రాసులో యీ కరువు కాందిశీకుల సంఖ్య 1,10,512 మంది కాగా, జూన్ 8 నాటికి 1,66,808 మందికి పెరిగింది. జూలై 6 నాటికి 2 లక్షలా 17 వేలా 986 మంది అయ్యారు. ఈ కరువు కాందిశీకులకు ప్రత్యేక శిబిరాలు, పాకలు—మళ్లీ వీటిల్లోనే

* Hyderabad, Cuddapah District Records, Vol. 4606, Pp. 487, 491, 504.

† ,, ,, ,, ,, Vol. 4607, P. 1; 4580, P. 265.

§ ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్ర చరిత్ర, (సం) దిగవల్లి వెంకట శివరావు, బెజవాడ, 1941, పేజీలు ౬_౭ (కోమలేశ్వరపిళ్లె వ్రాసిన పీఠికాభాగం.)

చావులు, జననాలు: ఈ శిబిరాల్లో వొక వారంలో 378 మంది చనిపోయినట్లు 1833 జూలైలో వొక రిపోర్టు.*

ఈనాడు మద్రాసు మహానగరంలో-కార్పొరేషన్లోగానీ, ప్రభుత్వ ఆసుపత్రుల్లోగానీ పనిచేస్తున్న తోటీవాళ్లల్లో నూటికి 90 వంతులు మంది ఫక్తు తెలుగువాళ్లే. దీనికి ప్రత్యేకకారణం యేమైనా వుందా? మిగతా కారణాలతోబాటు యీ 'కరువు కాందిశీకులు' కూడా వొక కారణం కాదా? ఆ 'గుంటూరు కరువు'లోనూ, ఆ తర్వాత ధాత కరువులోనూ యిక్కడ మన ప్రాంతాల్లో బ్రతకలేక చావలేక రాజధాని నగరమైన మద్రాసువెళ్లి అక్కడి గంజికేంద్రాల్లో పొట్టపోసుకుని ప్రాణాలు నిలబెట్టుకొని, ఆ తర్వాత అక్కడే యీ పనిబాటల్లో చేరిపోయి స్థిరపడిపోయిన కుటుంబాలు అన్నీ గాకపోయినా కొన్నయినా వుంటాయని వూహిస్తున్నాను. ప్రఖ్యాత జర్నలిస్టు 'శ్రీశ్రీకాచార్య' కీ.శే. యస్. జి. ఆచార్య 35 యేళ్లక్రితం "మేం తెలుగోళ్లం కామా" అనే గల్పికా రచనలో† వేసిన ప్రశ్ననే నేనూ వేయక తప్పడంలేదు.

ఆనాడు కడప కలెక్టర్ చొరవతీసుకొని యెట్లాగో చందాలు పోగుచేసి 'లంగర్ ఖానా' యేర్పాటుచేసి గంజికేంద్రాలు నడిపి తాత్కాలికపు వుపశమన చర్యలు తీసుకున్న వైనంగూర్చి కృష్ణారెడ్డి బ్రౌన్‌కు వ్రాస్తూ—మీరుకూడా కొంత చందావేసి ఖర్చు భరించేటట్లయితే, నేనూ వొక చిన్న గంజికేంద్రం నడిపి కనీసం మరికొందరికైనా ప్రాణంపోసి నిలబెట్టవచ్చునని బ్రౌన్‌ను ఆ జాబులో కోరడం కృష్ణారెడ్డి మానవీయతకు చిన్న సాదృశ్యం అవుతుంది. అంతేగాక ఆనాటి కడప దయనీయమైన పరిస్థితులను ఆమాట అద్దంపట్టి చెప్తున్నది. ఇట్లాగే ఆ రోజుల్లో వాడవాడలా నడిపిన గంజికేంద్రాల లెక్కపక్కలు చెప్పుకోవాలంటే యీ అధ్యాయం పరిధి చాలదు §

---

* వారం వారం ప్రచురింపబడే Fort St. George Gazettee, Madras సంచికల్లో యీ లెక్కల వివరాలు ప్రచురణవుతూ వచ్చాయి.

† నగ్నదృశ్యాలు, ఎస్. జి. ఆచార్య, మద్రాస్, 1943, పేజీలు 38_40.

§ మచిలీపట్నం జిల్లాలో_మొత్తం నాలుగుచోట్ల 'గంజి కేంద్రాలు' నడుపుతుండేవారు. 1833 జూలైలో మచిలీపట్నం శిబిరంలో 31,900 మందికీ, ఏలూరులో 22,740, బెజవాడలో 16,990 జగ్గయ్యపేటలో 9,300 మందికీ అన్నం వండి పెట్టేవారట. మనిషికి రోజుకు సగటున $7\frac{3}{4}$ పైసల చొప్పున ఖర్చయ్యేదట (చూడు: Selections from the Records of the late Masulipatam Zillah..., Pp. 14_15).

కడపలో ఆనాడు ప్రారంభమైన 'లంగర్ ఖానా' యిప్పుడు విచారిస్తే లేదని తేలింది. కానీ నెల్లూర్లో నేటికీ నామావశిష్టంగానైనా మునిసిపాలిటీ ఆధ్వర్యంలో లంగర్ ఖానా వొకటున్నది. ఏదో కొందరు ముసలి బీదా బిక్కికి తిండి వండి పెట్టేందుకు యేటేటా పురపాలక సంఘం బడ్జెట్‌లో కొంత మొత్తం కేటాయిస్తూనే వస్తున్నది. ఎంత ఖర్చు చూపి యెందరకు తిండి పెడ్తున్నారనేది వేరే విషయం.

* * *

ఈ గ్రంథం అచ్చులో వుండగా దొరికిన కొన్ని అదనపు వివరాలు: కడప లండన్ మిషనరీ సొసైటీ తాలూకు క్రిశ్చియన్ మిషనరీ డబ్ల్యు. హొవెల్ (Howell) 1833 యేప్రిల్ 5 న తన లండన్ మిషన్ కార్యాలయానికి వ్రాపిన వొక జాబులో యీ కడప కరువుకు సంబంధించిన విషయాలు కొన్ని తెలుస్తున్నాయి. ఎవరి గోడు వారిది. ఎవరి గొడవ వారిదిగా కనపడ్తుంది. ఆకలి భరించలేక గంజికూటికి వచ్చిన ప్రజలకు అన్నంపెట్టి, వారికి క్రీస్తుబోధలు వినిపించగలిగాననే ఆనందం ఆ మిషనరీ గారిది: చూడండి ఆ జాబు:

"In my last I alluded to the late drought; in consequence of which there is great distress throughout the country, and the inhabitants from the Guntoor district have come into the place, in great numbers, to be relieved of their present distress, occasioned by the great scarcity of grain in that part of the country. In order to provide for the poorer families of the Christians in the mission, and such of the natives as may call on me for assistance, I thought proper to apply to my respected friend, G. J. Waters, Esq., for pecuniary aid, to enable me to buy up a large quantity of grain to meet the wants of the people. He, with his usual liberality, kindly sent me 300 rupees for this purpose, and 100 rupees as his subscription to the mission. No sooner the distribution of grain was announced that the mission chapel began to be crowded, by strangers of all castes, on the Sabbath, leaving many to hear out at the doors and windows. Last Sabbath, particularly, there were above 500 persons who came with their wives and children, and among them many Brahmin families, who filled the chapel at an early hour; and, on seeing them, I rejoiced in the opportunity thus afforded me to bring to their serious consideration; and it was gratifying to find how

attentively they sat all the time hearing of the great salvation purchased for sinners by the Lord Jesus Christ. It is a pleasing circumstance, that while they have come so far for the bread that perisheth, they have been invited also to receive the bread of life." *

ఈ జాబునుబట్టి చూస్తే కడప కరువుగురించి ఆయన లండన్‌కు అంతకు ముందు మరొక జాబు వ్రాసినట్లున్నాడు. జులై 20, అక్టోబరు 3 తేదీల్లో కడప కరువు పరిస్థితిని గూర్చి మరి రెండు జాబులు కూడా వ్రాశాడట.†

దూరాబారాలనుంచి యెక్కువమంది కరువు కాందిశీకులు రావడంతో తాము అంతవరకూ చందాలు వేసుకొని నడుపుతూ వచ్చిన 'లంగర్‌ఖానాలు' చాలకుండా పోవడంతో—ప్రభుత్వ ధనంతో 'గంజి కేంద్రాలు' యేర్పాటుచేసి ఆదుకోవలసిన అవసరం గురించి కడప కలెక్టర్ రివెన్యూ బోర్డుకు వ్రాసిన యీ క్రింది లేఖలో తెలియజేశాడు:

To the President and Members of the
Board of Revenue, Fort St. George,

Gentlemen,

In consequence to the great rise in the price of grain at this place, I have been under the necessity of adopting measures for the relief of the distressed objects who have congregated at this place. Until lately they were enabled to subsist on the general charity of the inhabitants, which the scarcity price now subsisting has in a great measure precluded. The 'poor fund' established at Cuddapah has also afforded occasional support, but this institution being intended for the poor of the Town, its resources would

---

* Missionary Chronicle (London Missionary Society) for March 1834, London, 1834, P. 122.

† లండన్ మిషనరీ సొసైటీ కార్యాలయంలోని ఆర్కైవ్స్‌లో Telugu Area (1817-63)కు సంబంధించిన బాక్సు నెం. 1, ఫోల్డర్ 5 లో యివి వున్నట్లు బెంగుళూరు, యునైటెడ్ తియలాజికల్ కాలేజి లైబ్రరీ అండ్ ఆర్కైవ్స్‌లో వున్న లండన్ మిషనరీ సొసైటీవారి వివరణాత్మకమైన (మైక్రోఫిల్మ్‌లో వున్న) క్యాటలాగ్‌నుబట్టి తెలుస్తున్నది. అక్టోబరు 3న వ్రాసిన జాబు 'Famine & Cholera'ను గురించినదని అందులో వున్నది.

soon be exhausted, if diverted to objects who have flocked in from distant parts The number to whom prepared food is now served out amounts to two thousand persons, and the number is likely to increase should the present drought continue. I would therefore beg leave to solicit through your Board the immediate aid of Government at this period. The amount expended since the 1st August is Rs. 95-7-1, and I should suggest that a daily expense not to exceed Rs. 40/- be sanctioned at this place, where grain can be best procured until the rains shall be set in.

CUDDAPAH,
Principal Collector's Office,
13 August 1833.

—(Sd). H. LACON,
(Pr. Collector) *

1833 ఆగస్టు. సెప్టెంబర్ నెలల్లో యీ గంజి కేంద్రాలకోసం మొత్తం రు. 1,597-13-6 పైసలు ఖర్చయినట్లు కలెక్టర్ అక్టోబర్ 16 తేదీన వివరగతిగా అన్ని లెక్కపక్కలతో వాక విపులమైన నివేదిక పంపుతాడు. ఏ యే పద్దుకింద యెంతెంత ఖర్చయిందీ పూర్తి వివరాలతో పెద్ద జాబితాలు జతచేశాడు.† ఉదాహరణకు సెప్టెంబర్ నెలలో మొత్తం మగవాళ్ళు. ఆడవాళ్ళు. పిల్లలు అందరికీ కలిపి 30,237 మందికి గంజి వండిపెట్టడానికి రు. 739-14-0 ఖర్చయిందట. ఆగస్టు 16, 17 తేదుల్లో మసూచి సోకినవారికోసం వేరుగా పూరిపాకలు వేయడానికి రు. 11-15-5 పైసలు, వారికి పత్యాహారంగా మజ్జిగ చేయడానికి అయిన ఖర్చు 10 అణాలు అనీ ఆ జాబితానుబట్టి తెలుస్తున్నది.

* Madras, Tamilnadu Archives, Board of Revenue Consultation dated 22 Aug. 1833, Vol. No. 1376, Pp. 10,028-30

† Madras......, Board of Revenue Consultation, 28 Oct. 1833, Vol. No. 1386, Pp. 13298-300.

# సబ్ కలెక్టర్
# మగ్డానల్డ్ హత్య

కుంపిణీయుగంలో కడపజిల్లాకు సంబంధించిన స్థానిక చరిత్రలో మైలురాళ్లుగా పేర్కొనబడుతున్న సంఘటనల్లో సబ్‌కలెక్టర్ మగ్డానల్డ్ హత్యోదంతం వొకటి.

హత్య జరిగింది 1832 జూన్ 15 తేది శుక్రవారం. ఆ రోజు వుదయం కడప కొత్వాల్ సత్రం దగ్గరున్న జుమ్మా మశీదులో యెవరో పందిపిల్లను చంపి తెచ్చి పడేశారనే వార్త వొకటి గుప్పుమన్నది, 'ఇదుగో తోక, అదుగో పులి'వ్యవహారంలా యీ వార్త వూరంతా వ్యాపించింది. కడప మహమ్మదీయు(పఠాన)ల్లో మతావేశం దావానలంలా అంటుకొంది.

మశీదు బయట నగారా ధనధనమని మోగింది. ముస్లిమ్‌లంతా 'దీన్ దీన్' అరుపులు అరుస్తూ బజారువీధిలో గుంపులు గుంపులుగా చేరడం ప్రారంభించారు. ఏదో అల్లరికి సిద్ధమైనట్లు వుద్రిక్తులై వున్నారు. హఠాత్తుగా చెలరేగిన యీ కలకలం సబ్‌కలెక్టర్ సి. యి. మగ్డానల్డ్ (C. E. Macdonald) చెవిన బడింది. ఆయన పల్లకీలో బయలుదేరి కడప వూరుకు దగ్గర్లో విడిదిచేసివున్న కలెక్టర్ లేకన్(Lacon) వద్దకు వెళ్ళాడు. ముస్లిమ్‌లంతా అట్టుడికిపోతున్నారనీ, తప్పక అల్లర్లు జరగొచ్చుననీ చెప్పాడు. అవసరమైతే మిలటరీ సాయాన్నయినా తీసుకొని శాంతి భద్రతలు కాపాడమని కలెక్టరు సలహాయిచ్చి పంపాడు.

మగ్డానల్డ్ పల్లకీ యెక్కి హడావుడిగా కచేరీకి వచ్చాడు. అక్కడ కాపలా జవాన్లు, యితర వుద్యోగులు కంగారుగా నిలబడివున్నారు. మిలిటరీ సహాయంకోసం కడపలోని సైనికాధికారికి మగ్డానల్డ్ చీటీ వ్రాపి పంపాడు. తాసీల్దారునుకూడా పిలవ నంపాడు. మశీదులో పందిపిల్లను చంపి పడేసినవాళ్లను పట్టిచ్చినవారికి 500 రూపా యల బహుమానం యిస్తామని అవశ్యం చాటించమని ఆదేశించాడు.

అంతలోనే హావెల్ (Howell) అనే క్రిశ్చియన్ మిషనరీ బజారు వీధిలోని తన యింటిమీదకు గుంపులు రాబోతున్నాయనీ, వెంటనే వచ్చి కాపాడమనీ చీటీ వ్రాపి పంపుకొన్నాడు. (సహజంగా హిందువులపైకి రావలసిన ముస్లిమ్‌లు కిరస్తానీల మీదకు ఎందుకు పోవాలనుకున్నట్లు?)

మగ్డానల్డ్ ఆ కబురు వినగానే వున్నపళాన పల్లకీ యెక్కి బోయీలను పుర మాయించాడు గుంపులున్నచోటికి వెళ్లమని. ఆఫీసు మున్షీలు వద్దని వారించారు. మిలిటరీ వచ్చేదాకా కాస్త ఆగిపోవచ్చునన్నారు. వినలేదు. మిలిటరీ వచ్చేలోగా జనానికి సర్ది చెప్పవచ్చుననే ధీమాతో పల్లకీని రయ్‌మని పోనిచ్చాడు. సొంత దఫేదారూ, మరో యిద్దరు డలాయతులు మాత్రమే అయన్ను అనుసరించారు. మగ్డానల్డ్ ఆఫీసు నుంచి నాలుగొందల గజాలు దాటి బజారు ప్రాంతానికి చేరుకొన్నాడు.

మశీదుకు దగ్గర్లోనే పల్లకీ దిగాడు. జనానికి సర్ది చెప్పడం ప్రారంభించాడు. గుంపులు మీదకు వస్తున్నాయి. రాళ్ల వర్షం ప్రారంభమయింది. పల్లకి బోయీలు బ్రతుకుజీవుడా అనుకొంటూ కాళ్లకు బుద్ధి చెప్పారు. మగ్డానల్డ్‌కు యేమి చేయడానికీ తోచలేదు. కొత్వాల్ సత్రంలోకి దూరాడు. దానిమీదకుకూడా రాళ్ళు రువ్వడం ప్రారం భించారు. ముస్లిమ్ జనం గుంపులుగా వెళ్లి తలుపులు తోసుకొని లోపలికి ప్రవేశిం చారు. మగ్డానల్డ్ యెట్లాగో తప్పించుకుని వెనకవైపుగా వొక చిన్న గోడౌన్లోకి దూర బడ్డాడు. జనం దానిమీదకూడా పడ్డారు. మగ్డానల్డ్ తప్పించుకొని బయటకొచ్చాడు. అంతే. గుంపులోనుంచి వొకడు కత్తి తీపి మగ్డానల్డ్ యెదుర్రొమ్ముదగ్గర వొక పోటు పొడిచాడు. రక్తం కారుకొంటూనే పక్కనేవున్న వొక అంగడి వరండా స్తంభానికి ఆనుకొన్నాడు.

అంతలోనే కచేరీ గార్డు పిపాయిలూ, నాయక్ అక్కడ కొచ్చారు.

మగ్డానల్‌ను హతమార్చడానికి వొక ముస్లిమ్ ముందుకు దూసుకొస్తున్నాడు. మగ్డానల్డ్ అది చూచి నాయక్‌ను కాల్పులు జరపమని ఆదేశించాడు. అతను తుపాకి

గురిపెట్టి కాల్చాడు. ఆ ముస్లిమ్‌కు గుండు దెబ్బ తగిలింది. అయినా ఆ ముస్లిమ్ యింకా ముందుకు దూసుకొస్తున్నాడు. ఒక గార్డుసిపాయి యిది గమనించి గురిపెట్టి కాల్చాడు. ఆ గుండుదెబ్బనూ లెక్కచేయకుండా ఆ ముస్లిమ్ నాయక్‌ను నిలువునా పొడిచి తానూ నేల కొరిగాడు.

మగ్డానల్డ్ ఆ వరండాలో నడుచుకొంటూవెళ్లి పక్కనున్న రెండు యిళ్లలోకి దూరాలనుకొన్నాడు. ఆ రెండిళ్లూ తలుపులు వేసివున్నాయి. ఎంత బాదినా యెవరూ తలుపులు తెరిచిన పాపానపోలేదు. అది దాటుకొనిపోతూ తట్టుకొని పడ్డాడు. ఒక గుర్తు తెలియని ముస్లిమ్ వచ్చి రెండుపోట్లు పొడిచాడు. మగ్డానల్డ్ మరి యిక లేవ లేదు. సబ్ కలెక్టరూ, నాయక్ గాక మరో యిద్దరు గార్డుసిపాయీలుకూడా మరణిం చారు. ఆ నాయక్ పేరు కమాల్ మహమద్. సిపాయిల పేర్లు షేక్ అబ్దుల్లా, షేక్ నబీ. మరో యిద్దరు సిపాయిలకు బలంగా గాయాలు తగిలాయి.

ఈ హత్యలు జరిగి నెత్తురు కళ్లబడడంతో గుంపులు చెల్లాచెదరై పోయాయి. త్రుటికాలంలో ఆ బజారు ప్రదేశమంతా నిర్జనమైపోయింది. కాసేపటికల్లా మిలిటరీ వాళ్లు పరుగులుతీసుకొంటూ వచ్చారు. బెంబేలెత్తిపోయిన కలెక్టరూ వెనకనే వచ్చాడు. వీళ్లంతా వచ్చి చూచేసరికి అక్కడ నాలుగు శవాలు తప్ప వొక్క పిట్టకూడా కనపళ్లేదు. ఇదీ క్లుప్తంగా అ హత్యోదంతం.*

చనిపోయిన ఆ మిగతావాళ్ల సంగతటుంచి సబ్ కలెక్టర్ చావు మాత్రం ఘోర మైంది. మగ్డానల్డ్ నవ యువ్వనుడు. 25 యేళ్లయినా నిండనివాడు. అంతకు కొన్నాళ్ల క్రితమే పెండ్లి చేసుకొని వొక 'యింటివాడై'నవాడు. ఆయన ఆకస్మిక మరణవార్త వింటూనే భార్య ఆగ్నస్ (Agnes) స్పృహతప్పి పడిపోయింది. మూడు వారాలు గడిచినా ఆమె స్పృహలోకి రాలేదట. 22 వ రోజున చనిపోయింది. భార్యనుకూడా భర్త పక్కనే పూడ్చిపెట్టారు. వారి సమాధిరాయి కడపలో నేటికీ వుంది. కడప—

* A Selection of Papers from the Old Records of the Cuddapah District: Official correspondence between the district magistrate, Cuddapah, and the Government of Madras regarding the riot committed by the musalmans of Cuddapah town which ended in the death of Mr. Macdonald, I.C.S., sub collector and joint magistrate, Cuddapah, Madras, 1926, Pp. 2-3.

మాచుపల్లి రోడ్డుపక్కన 'దొరల గోరీ'లోని వారి సమాధిపైనున్న 'శాసనం బండ'ను* మొన్న మేనెలలో గుర్తించాను. దానిమీద యిట్లా చెక్కివున్నది:

Erected by the
civil officers of this station
as a tribute of affection and esteem
to the joint memory of
Charles Edward Macdonald Esqre.
of the M. C. S.
aged 24 years
a civilian of the fairest promise,
who,
while attempting
in the fearless & conscientious discharge of his duty
to appease by prompt and persuasive measures
the fury of a fanatic rabble of Moormen
assembled on the 15th June 1832
in the town of Cuddapah
who was completely unarmed, attacked
deserted by all his peons
and barbarously murdered
and of
Agnes, his wife
who only survived him twenty one days
having died on the 7th of July 1832
broken hearted
in the 20 years of her age.
"They were lovely in their lives,
and in death
shall not be seperated."†

---

* సాధారణంగా 'శిలాఫలకం' అనే సంస్కృత పదం వాడుతుంటాము. రాయలసీమలోని కొన్ని ప్రాంతాల్లో 'శాసనం బండ' అనే చక్కటిపదం వాడుకలో వున్నట్లున్నది (చూడు: విరసంవారి గేయసంకలనం 'కిరణాలు', కావలి, 1977, పేజీలు 11-12లో జి. హనుమంతరెడ్డి గేయంలో 'సాసానంబండ' అనే ప్రయోగం).

† వీరికి కడలూరు పాత టౌన్‌లోని చర్చి ఆఫ్ ఇంగ్లాండ్ సెమిత్రీలో మరొక స్మారకచిహ్నం కూడా వున్నట్లున్నది. (చూడు : List of Inscriptions on Tombs or Monuments in Madras, J. J. Cotton, Madras, 1905, Pp. 206, 153).

ఈ హత్యోదంతం-బ్రిటిష్‌వాళ్లను తుదముట్టించడానికిగాను ముస్లిమ్‌లు వొక పథకం ప్రకారం జరపాలన్న తిరుగుబాటులో వొక భాగంగా మొదట్లో కలెక్టర్ భావించాడు. ఆ విధంగానే పైకి రిపోర్టులు వ్రాశాడుకానీ హఠాత్తుగా పెచ్చరిల్లిన ముస్లిమ్‌ల మతావేశానికి వొక యువ ఆఫీసర్ అమాయికంగా బలి అయిపోయిన సంఘటన మాత్రమేనని తర్వాత జరిగిన విచారణనుబట్టి తేలినట్లున్నది.

అప్పట్లో మొత్తం మద్రాసు రాష్ట్రంలో, ముఖ్యంగా కుంపిణీ వుద్యోగుల్లో పెద్ద గగ్గోలు పుట్టించిన సంఘటన యిది. సంవత్సరందాకా దీని ఫైలు ముగియలేదు. ఈ హత్యాకాండలో పాల్గొన్న ముఖ్యుల్ని పట్టిచ్చినవారికి వెయ్యి రూపాయల బహుమానం ప్రకటించింది ప్రభుత్వం. ఆ తర్వాత రెండువేలకు పెంచింది. కేసు విచారణకు ప్రత్యేక కమీషన్‌ను వేసింది. డబ్ల్యు. మోర్ హెడ్ (W. Morehead)ను స్పెషల్ కమీషనర్ (జాయింట్ మేజిస్ట్రేట్)గా నియమించి, కేసు విచారణ జరిపించింది.* దాదాపు వందమందిని పట్టుకొచ్చి 'రిమాండు'లో వేశారు. ఆరుగురికి వురిశిక్ష, మరో అయిదుగురికి ద్వీపాంతరవాస శిక్షలూ పడ్డాయి. వాళ్లను ద్వీపాంతరవాసానికి పంపుతూ మధ్యలో తప్పించుకొని పారిపోకుండా సకల భద్రతాచర్యలు యేర్పాటు చేసింది ప్రభుత్వం—దారి పొడుగునా ప్రత్యేక మిలిటరీ యెస్కార్ట్‌తో సహా వాళ్లను ద్వీపాంతరానికి పంపడం జరిగింది.

ఈ యేర్పాట్లూ అవీ చూస్తే, యిది మతపరమైన వుద్రేకంగా ప్రభుత్వం భావించినట్లు తోచదు. స్థానికుల్లో చెలరేగుతున్న క్రైస్తవ మతాంతీకరణకు వ్యతిరేకత, లేదా బ్రిటీష్ పరిపాలనా వ్యతిరేకతా బీజాలు యిందులో లీలగా కన్పిస్తున్నాయి. ఈ సంఘటన జరిగిన పద్నాలుగేళ్ల తర్వాత బ్రిటీష్ అధికారాన్ని యీ ప్రాంతంలో ప్రభంజనంలా వూపివేసిన వుయ్యాలవాడ నరసింహారెడ్డి తిరుగుబాటులో కొందరు ముస్లిమ్‌ల పరోక్ష సహాయాదులున్నట్లు తేలిందంటే—దీని వెనుక వొక క్రమం గోచరం కావడంలేదా?

ఈ హత్య విచారణకు సంబంధించి మరింత సమగ్రంగా తెలియజెప్పడానికి పరిశీలించవలసిన ఫైళ్ళు బోలెడున్నాయి తమిళనాడు, ఆంధ్రప్రదేశ్ అర్కైవ్స్‌లలో. ఒక చిన్న పుస్తకం వ్రాయతగినంత సమాచారమే వుంది. కేసు విచారణ జరుగు

---

* Dictionary of Indian Biography, C. E. Buckland, London, 1906, P. 299.

తున్నంత కాలం సహజంగా మద్రాసు కుంపిణీ అధికారులు ఆసక్తితో గమనిస్తూ వుండివుంటారు కాబట్టే విచారణ యేమైందని బ్రౌన్ అయోధ్యాపురం కృష్ణారెడ్డికి వొక జాబులో వ్రాసుండాలి. దానికి సమాధానంగానే కృష్ణారెడ్డికి ఆ పైనం తెలిపి వుంటాడని అనుకోవాలి.

ఈ హత్య జరిగిన చాలాకాలం దాకా కడప ముఖ్యప్రాంతాల్లో మిలిటరీ కాపలా యేర్పాట్లు కట్టుదిట్టం చేశానని కలెక్టర్ వ్రాస్తే, ఛీఫ్ సెక్రిటరీ వొక జాబులో యిట్లా వ్రాశాడు:

"The presence of a military force on ordinary occasions for the purpose of upholding the civil power betrays both weakness and apprehension, which are unfit to be exhibited by any Government. It is contrary to every maxim of sound policy to have recourse to a measure so derogatory to the power and reputation of all well established authority, and is a tacit avowal that the people are unworthy of confidence." *

ఈ వాక్యాలు, యిటీవల మనదేశంలో విధించబడిన 'యెమర్జన్సీ' పరిస్థితులపై జరుగుతున్న తర్జన భర్జనలను జ్ఞప్తికి తెస్తున్నాయి.

ర ర ర

అల్లర్లు చెలరేగబోతున్నట్లు, ముస్లిమ్‌లు తన యింటిమీదకు దాడి చేయబోతున్నట్లు మగ్దానల్డ్‌కు మొదట చీటీ వ్రాసి పంపిన క్రిశ్చియన్ మిషనరీ హావెల్ గురించి నాలుగు మాటలు.

ఈయన పూర్తిపేరు రెవరెండ్ విలియమ్ హావెల్ (Rev. William Howell, 1790–1867). తెలుగులో గట్టి పాండిత్యమే సంపాదించినవాడుగా కనపడ్తున్నాడు. (A Compendium of the Andhra Vyakaranam or a Catechism of Telugu grammar) అనే తెలుగు వ్యాకరణ గ్రంథం వ్రాసి 1834 (బళ్లారి)లో ముద్రింపజేశాడు.† దీని ముద్రణకుగాను చందాలిచ్చిన ముగ్గురు నల్గురిలో కడప కలెక్టర్ లేకన్‌కూడా వొకడు.

---

* లోగడ 55 వ పేజీలో ప్రస్తావించబడిన పుస్తకం, పేజీ 11.

† Book Printing in India: with Special Reference to the Contribution of European Scholars to Telugu (1746–1857), J. Mangamma, Nellore, 1975, Pp. 185–86.

ఈ ఆంధ్ర వ్యాకరణం ముద్రణ 1835 కి గాని పూర్తయినట్లు లేదు. ఈ హోవెల్ 1835 జనవరి 8న కడపనుంచి వ్రాసిన వొక లేఖలో యిట్లా వుంది: "The schools are improving, under christian teachers, and the Telugu grammar, being in print, is now introduced in all schools, and the children take an interest in learning it. The Government have also established two English schools for Hindoo and Musselman youths, in order to qualify them to fill public offices."*

హోవెల్ యింతేగాక, తెలుగులో స్కూలు పుస్తకాలు, క్రీస్తుమత ప్రచార గ్రంథాలు వ్రాసి ప్రకటించినట్లున్నాడు. ఆయన ప్రకటించిన Telugu Hymn Book (క్రీస్తు కీర్తనల పుస్తకం) యీ కోవలోవిదే. ఆర్. డి. జాన్స్టన్ (R. D. Johnston)తో కలిపి ప్రకటించిన "హిందూమత దైవపరీక్ష (Scriptures on Hinduism: adapted from Howell's Criticisms on the Hindu Sastras)" అనే చిన్న పుస్తకం పెక్కు ముద్రణలు పొందినట్లున్నది. దీని మూడో యెడిషన్ ప్రతి (1863) లండన్ బ్రిటీష్ మ్యూజియంలో వున్నది.†

బన్యన్ వ్రాసిన ప్రఖ్యాత గ్రంథం Pilgrim's Progress కు తెలుగు తర్జుమాను సంతరించి 1831 లో ప్రకటించినట్లున్నాడు.§

1821 లో బళ్లారికి మిషనరీగా వచ్చి, కడపలో 'లండన్ మిషన్' కేంద్రాన్ని 1822 లో స్థాపించాడు. 1822 లో మొదట బళ్లారికి చెందిన జె. హ్యాండ్స్ (J. Hands) కడపకు అప్పుడప్పుడూ వచ్చి క్రీస్తుబోధలుచేసి, స్కూళ్ల యేర్పాటు

---

* Missionary Chronicle (London Missionary Society) for May 1836, London, P. 207.

† A Catalogue of the Telugu Books in the Library of the British Museum, L. D. Barnett, London, 1912, col. 73-74.

§ Missonary Chronicle (London Missionary Society) for December 1831, London, P. 542. బహుశా యీ తర్జుమాల గురించే బ్రౌన్ యిట్లా చులకనగా వ్రాశాడు: "The Pilgrim's Progress, James's Anxious Enquirer, and some other small volumes have appeared in Telugu, written by various missionaries. But they do more credit to the zeal than to the skill as writers. I cannot point to one (translation) that is successfully executed." (చూడు: Some Account of the Literary Life of Charles Philip Brown, London, 1866, P. 19).

చేసి కలకవేసిపోతుండేవాడు.* ఆ తర్వాత, స్థిరంగా వొక మిషనరీవి కడపలోనే స్థావరంగా వుంచేటట్లయితే చందాలివ్వగలమని సివిల్ వుద్యోగులు చెప్పడంతో మిషన్ డైరెక్టర్లు హోవెల్‌ను కడపకు పంపించారు.† 1842 దాకా కడప కేంద్రం లోనే వుంటూ వచ్చాడు. లండన్ మిషన్ వారితో అభిప్రాయభేదాలువచ్చి, యస్. పి. జి. (సొసైటీ ఫార్ ది ప్రాపగేషన్ ఆఫ్ ది గాస్పెల్)లో చేరాడు. 1867 లో మద్రాసులో మరణించాడు.

హోవెల్ § దాదాపు యిరవై యేళ్లపాటు కడపలోవుండి గట్టి కృషిచేసినట్లే వున్నాడు. క్రైస్తవులైనవారిని చేరదీసి యిళ్లుకట్టించి వొక 'క్రైస్తవ పేట'గా తీర్చిదిద్దాడు. వారికి భూములు గీములు సంపాదించిపెట్టి, జీవనాధారంగా కాగితాలు చేసే యంత్రాదుల్ని తెప్పించి స్వతంత్ర జీవనోపాదికి ఆస్కారం కల్గించాడు. ఒక దశలో ఆరుచోట్ల ఆరు స్కూళ్లు నిర్వహించాడు. కడపలో రెండు, క్రిశ్చియన్ పేట, దేవునికడప, సాయిపేట, బాకరాపేట—యిట్లా మొత్తం యీ ఆరు స్కూళ్లలో 116 బాలురు, 48 మంది బాలికలు చదువుకొనేవారు. కడపలో మొదట జిల్లాకోర్టు రిజిస్టర్‌గా వుంటుండిన యఫ్. లాసెలస్ (F. Lascelles) యేర్పాటుచేసి నడిపిస్తూ వచ్చిన రెండు స్కూళ్లను తీసుకొని యిట్లా క్రమంగా పెంచుతూ వచ్చాడు.♦

---

* The History of the London Missionary Society 1795-1895, R. Lovett, London, 1899, vol. II, P. 137.

† A Manual of the District of Cuddapah, J. D. B. Gribble, Madras, 1875, P. 278-79.

§ ఈ హోవెల్ ఇండియాలోనే పుట్టాడు. మిషనరీగా రాకముందు చిత్తూరు ప్రాంతంలో కంపెనీ వుద్యోగిగా వుండేవాడని వొక ఆధారం. "ఉల్లియం హవెల్ గారు చిత్తూరుజిల్లాలో సర్కారు ఉద్యోగము నందుండెను. మతాసక్తిగలవాండై నందున దైవసేవకై పిలుపు రాగానే సంతోషముతో సమ్మతించిన వాడాయెను" (చూడు: 'లండన్ మిషనెరి సొసైటీ ఉత్పత్తి తెలుగు ప్రాంత సేవాచరిత్ర సంగ్రహము: లండను మిషను 150వ వార్షిక విజయోత్సవము; 1795-1945', రెవ. బి. సముయేలు, కమలాపురము, 1945, పేజీ 4).

♦ Missionary Chronicle (London Missionary Society) for April 1832, London, P. 167. ఈ లాసెలస్ పెట్టిన స్కూళ్లుగాక, కడపలో 1821లోనే రెండు స్కూళ్లు యేర్పాటు చేసినట్లు బ్రౌన్ తన స్వీయ చరిత్రలో వ్రాసుకొన్నాడు గాబట్టి—అవి రెండు వేరుగా వున్నాయనుకోవాలి.

ఈ హావెల్ కడపలో క్రిశ్చియన్ మిషనరీగా వుంటూ రాయలసీమలో విస్తృత పర్యటనలుచేసి క్రైస్తవమత వ్యాప్తికి నానా తంటాలు పడినట్లే వున్నాడు. క్రీస్తు కీర్తనలు, కరపత్రాలు, చిన్న చిన్న మతపుస్తకాలూ పంచిపెడుతూ హిందూ ముస్లిమ్ మతావలంబులను కవ్విస్తూ వారితో వేదాంత చర్చలకు లంఖించుకొంటూ వచ్చాడు. ఈ రాయలసీమ పర్యటనల్లో తనకు యెదురైన అనుభవాలను సంఘటనలను గురించి యెప్పటికప్పుడు దినచర్య రూపంలో తన మిషన్‌కు చెందిన డైరెక్టర్ల (లండన్)కు నివేదించుకుంటూ వచ్చాడు. తమ మిషనరీ పత్రికల్లో తన యీ రాయలసీమ పర్యటన విశేషాలు దాదాపు వరసగా అచ్చవుతూ వచ్చాయి.

1829 మార్చి 23 న రాజంపేటనుంచి వొక వైశ్యుడు తనను చూడడానికి వచ్చినపుడు వేమనపై జరిగిన చర్చనుగురించి యిట్లా వ్రాశాడు:

"He next adverted to a heathen reformer named Vemana, who had written much against idolatry and caste, and asked me what I thought of him. I replied, that he wrote according to the light of reason, and that while he exposed error, he showed not the way by which men were to de saved, but by human merit. I gave him an account of the salvation proposed by Jesus Christ..." *

ఒకరోజున కంభం దగ్గరి దోర్నకల్‌నుంచి రోమన్ క్యాతలిక్ మతం పుచ్చుకున్న వొక రైతు కడపలో తనను కల్సుకొన్నాడట (1830 అక్టోబరు 22 న). విగ్రహారాధనను తూర్పారబట్టే వేమన పద్యాలు వినడంవల్ల అతని తండ్రి దృష్టిలో పెద్ద మార్పువచ్చి క్రమంగా విగ్రహారాధనను యేవగించుకునే దశకు వచ్చాడనీ అతను చెప్పినట్లుగా వ్రాశాడు.†

సతీసహగమనం గురించి కూడా మరొక లేఖలో పేర్కొన్నాడు. కడపలో బాగా ఆస్తిపాస్తులున్న వొక బ్రాహ్మణుడు చనిపోగా, అతడిభార్య సహగమనం చేసుకోడానికి పట్టుదలగా వున్నదని తెలిసి, కడప మేజిస్ట్రేట్ వెంటనే పోలీసుల్ని పంపి

---

* Missionary Chronicle (London Mission Society) for Sept. 1830, London, P. 408.

† Trasactions of Missionary Society (L.M.S.) for Oct. 1832, London, P. 500.

దాన్ని నివారించినట్లు వ్రాశాడు. అంతకు పదేళ్ల క్రితం కమలాపురంలోనూ, దానికి యిరవైయేళ్ల క్రితం కడపలోనూ సహగమనాలు జరిగినట్లు కూడా హోవెల్ వ్రాశాడు.*

తిరుపతికి 1830 లో క్రైస్తవమత ప్రచారానికై వెళ్లినప్పుడు తనకు యెదురైన అనుభవాలను వొక రిపోర్టులో పూసగుచ్చినట్లు వివరించాడు. బ్రాహ్మణాచార్యులతో మతచర్చలు జరిపిన తర్వాత తిరుపతిలో వొక శూద్రుని కలిశాడట. అతణ్ణి గూర్చి ఆ రిపోర్టులో యిట్లా వ్రాశాడు:

"Another came forward, a fine-looking Soodra, who also spoke English, and to my surprise repeated some verses of the Gospel, which he admired greatly, but said that no one could act up to them; ...On asking him how he came to know these things, he said that he was for some time in the employ of Dr. Carey, at Shevarampore (Serampore), in the printing-office. On inquiring whether he was a Christian, he said he was not, but that he had renounced idolatry, and believed in Jesus Christ; yet objected to the ordinance of the Lord's Supper, which he said was invented by men to break the distinctions of caste. On asking him why he left Serampore, he said he got a better employment with a Major Fraser at Madras, but was now employed by Bomarang (a petty Rajah) in teaching his family to read English. His own name, he said, Juganautsing." †

ర ర ర

ఇది అచ్చులో వుండగా దొరికిన కొన్ని అదనపు వివరాలు: మగ్డానల్డ్ హత్యోదంతం గురించి వ్రాస్తూ, 'సహజంగా హిందువులపైకి రావల్సిన ముస్లిమ్‌లు కిరస్తానీల యింటిమీదకు యెందుకు పోవాలనుకున్నట్లు?'—అని కుండలీకరణంలో వొక సందేహాత్మకమైన వాక్యం చేర్చాను. ఆ సందేహానికి తావులేకుండా యిప్పుడు కొన్ని స్పష్టమైన దాఖలాలే దొరికాయి. హిందూ ముస్లిమ్‌ల గలాటాలో బ్రిటీష్ ఆఫీసర్ దుర్మరణం పాలైన సన్నివేశం కాదిది. ఈ సంఘటనలో ముస్లిమ్‌ల ఆక్రోశం అంతా బ్రిటీష్‌వాళ్లపైన్నే—యింకా ముఖ్యంగా క్రైస్తవ మిషనరీలపైన్నే. ఇందుకు ప్రత్యక్ష ఆధారం మిషనరీ హోవెల్ వ్రాతలే. మగ్డానల్డ్ హత్యగావింపబడిన వారం

---

* Missionary Chronicle (L.M.S.) for Dec. 1831, London, Pp. 642_43.

† Transactions of Missionary Society......Pp. 488_89.

రోజుల తర్వాత 1832 జూన్ 22 న లండన్‌లోని తన మిషన్ అధికారులకు వ్రాసుకున్న జాబులోనుంచి యీ క్రింది వాక్యాలు చూడండి:

"On the 15th inst. a riot of a very serious nature broke out about 9 A. M., in the town of Cuddapah, on account of a dead pig being found in one of the mosques, at an early hour, having been placed there, it is presumed, by some enemy of the Christians, with the intention of exciting a tumult in the place. The Mussulmen accused the Christians of having done it at my instigation. The Caujee, or Mussulman priest, immediately caused the great drum to be beat, in order to assemble the Mohammedans, who congregated from every direction of the town, and, on learning the cause of the summons, became quite infuriated. They all joined in the accusation against myself and the native Christians, and sought to be revenged by a massacre in open day of myself and family and all the Christians; and, to cause our name to be no more remembered or known, they afterwards prposed to destroy the chapel and the Christian village! This, being boldly declared, excited great alarm; the native Christians assembled at my house, declaring that our lives were in imminent danger, and that we were accounted as sheep for the slaughter. The assistant magistrate, Mr. Macdonald, on finding the Mussulmen assembled to commence a riot, wrote to the officer commanding the regiment (the cantonment is about three miles distant), for the aid of a detachment, and in the meanwhile went in person to appease the mob and put a stop to the beating of the drum. As soon as he arrived, the rioters began to cast stones, and, though he went defenceless, on his retiring to a place of safety, they fell on him with swords, &c. As his life was in danger, five sepoys from the treasury guard were sent to rescue him; these fired upon the mob when an Arab, a stranger to the place, was killed. Of the sepoys, one was killed on the spot, and three wounded, who have since died of their wounds. Some desperate fellows of the baser sort immediately fell on Mr. Macdonald, and massacred him in a most inhuman manner. The troops from the cantonment made their appearance about noon-day, when the mob dispersed and fled. Several of the rioters have been apprehended, and are now under trial for their lives, and orders have been sent out to apprehend those who have absconded.

"From this account you will perceive how perilous our situation has been. The overruling providence of God has interposed mercifully on our behalf, and our lives have been precious in his sight. The counsel of the wicked has come to nought: they thought to cut us off from being a people; but God has arisen to judge his cause, and now shame has covered their faces. The Lord has great things for us, and will take the cup of salvation and pay our vows unto Most High! The native Christians are deeply impressed by this display of God's providence on their behalf. May this event be overruled for good to the cause of the Redeemer, be sanctified to us all, and prove greatly to the furtherance of the spread of the Gospel, amidst the opposition of Satan and his emissaries!" *

దీన్నిబట్టి అర్థంచేసుకోవచ్చు కడప ముస్లిమ్‌ల ఆవేశం ఆనాడు ప్రధానంగా క్రైస్తవులపైన్నే కేంద్రీకరించబడిందని. ఈ మిషనరీలకు అన్నిరకాల అండ దండలిస్తూ వచ్చారు కుంపిణీ అధికారులు. అందువల్లనే యీ ఆవేశం వీళ్ల మీదకు కూడా విస్తరించింది. అసలు యీ మిషనరీ హావెల్ దగ్గరనుంచి వచ్చిన జాబు చూచుకొన్న వెన్వెంటనేగదా ఆనాడు మగ్డానల్డ్ బరబరా పల్లకీయెక్కి అల్లర్ల తావుకు బయలుదేరి వచ్చింది. ఈ క్రమాన్ని మనం యిక్కడ మనసుకు తెచ్చుకోవాలి.

క్రైస్తవమత వ్యాప్తికి హిందువులు యెట్లా వ్యతిరేకతను ప్రదర్శిస్తూ వచ్చారో. ముస్లిమ్‌లూ అట్లాగే- వొకోక్క సందర్భంలో మరింత యెక్కువగానే-

---

* Missionary Chronicle (L.M.S.) for January 1833, London, P. 34. ఈ సంఘటనకు మూడునెల్ల క్రితం బెంగుళూరులో యిటువంటిదే మరొకటి జరిగింది. బెంగుళూరు కంటోన్‌మెంట్ బజారు ప్రాంతంలోని వొక మసీదులో 1832 మార్చి 1 తేది వొక పంది తలకు శిలువ తగిలించి పడవేసి వుణ్ణింది. దీంతో ముస్లిమ్‌లు రెచ్చిపోయి దగ్గర్లోవున్న రోమన్ క్యాతలిక్కుల చర్చిని నానా విధ్వంసం చేసివేశారు. అంతలోనే మిలిటిరీవచ్చి చెల్లాచెదరు చేసివేసింది. ఇక్కడ జరిగిన ఘర్షణలో పెక్కుమందికి రాళ్ళగాయాలు తగిలాయి. ఎవరికీ ప్రాణం నష్టం మాత్రం జరగలేదట. ఈ రెండు సంఘటనలకూ లండన్‌లోని మిషనరీ సొసైటీ అధికారులు తారెత్తిపోయారు.

తమ వ్యతిరేకతను వ్యక్తంచేస్తూ వచ్చారు. క్రైస్తవమతం పుచ్చుకున్న హిందువులు వున్నంత విశేష నిష్పత్తిలో ముస్లిమ్‌లు లేరనే చెప్పాలి.*

ఈ మగ్దానల్డ్ హత్యోదంతానికి ముందు కడప ముస్లిమ్‌లకూ, క్రైస్తవులకూ చిల్లరమల్లర ఘర్షణలు కొన్ని జరుగుతూ వచ్చాయి. ఈ హత్యకు వొక సంవత్సరం పూర్వం కడప ముస్లిమ్‌లతో యెదురైన వొక ఘర్షణను 1831 యేప్రిల్ 8 న హొవెల్ వొక జాబులో యిట్లా తెలియజేసివున్నాడు:

"He (the native reader Veerapah) has lately met some opposition from Mussulman Sepoys, who treated him very rudely while reading the 'Criticisms on the Shasters' in the Bazaar, to the Hindoos. The master was brought before the native magistrate and the evidence being in his favour, of Veerapah, the Sepoys were placed in confinement, and made to pay a fine of two rupees. They have since been dismissed the service."†

దీన్నిబట్టి వూహించుకోవచ్చు మగ్దానాల్డ్ హత్య వెనుక యే యే శక్తులు పని చేసి వుంటాయో.

ఈ హత్య జరిగిన నాలుగునెల్ల తర్వాత అక్టోబరు 3 తేదీన హొవెల్ లండన్‌కు వ్రాసిన మరొక జాబులో 'Mahomedan rising proves to be part of an attack on the British government' అని పేర్కొంటూ మరికొన్ని వివరాలు వ్రాసినట్లున్నది. §

---

*బహుశా యిందువల్లనే కావచ్చు—టి. హడ్సన్ అనే బెంగుళూరు మిషనరీ 1836లో ముస్లిమ్‌లపట్ల తనకున్న యేవగింపును యిట్లా వ్యక్తం చేసుకొన్నాడు: "...but the Mussulmans are a hopeless people, and will perhaps dwindle away, and so perish from the face of the earth, and never in great numbers be converted to God."(చూడు: Missionary Notices, &c., vol. ix, No. 260, 1837 August, P. 507.)

† Missionary Chronicle (L.M.S.) for Dec. 1831, London, P.542.

§ ఈ జాబు లండన్ మిషనరీ సొసైటీ కార్యాలయానికి చెందిన ఆర్కైవ్స్‌లో 'Telugu Area (1817–63)'కు సంబంధించిన బాక్స్ నెంబర్ 1, ఫోల్డర్ నెంబర్ 5లో వున్నట్లు బెంగుళూరు యు.టి.సి. కాలేజి లైబ్రరీ & ఆర్కైవ్స్‌లో గల మైక్రోఫిల్మ్‌లో వున్న వివరణాత్మకమైన క్యాటలాగ్ చెప్తున్నది.

అయోధ్యాపురం కృష్ణారెడ్డి బ్రౌన్‌కు వ్రాసిన జాబులోని వాక్యాన్ని ఇంగ్లీషు లోకి తర్జుమాచేసి వ్రాశాడా అనిపించేటట్లుగా 1833 యేప్రిల్ 8 న హావెల్ లండన్‌కు వ్రాసిన జాబులో యీ వాక్యాలు చూడండి:

"Of the eleven delinquents confined for the murder of the late Mr. Macdonald, six of them were executed early this morning, near the spot where the deed was committed. The other five are to be transported for life. Those concerned in the pig affair are still in jail, who will be further tried at the next session of July."*

ఇక అంత్యఘట్టంలో వురికంబమెక్కుతూ కూడా యేదో వీర మరణ శయ్య మీదకు వెళ్తున్న శూరాగ్రేసరుల మాదిరి ఆ కడప ముస్లిములు తమ వుగ్ర మతో ద్రేకాన్ని ప్రదర్శించకుండా వుండలేకపోయారంటే యేమనుకోవాలి? చదవండి ఆనాటి వొక ప్రత్యక్ష వార్తాకథనం :

## EXECUTION OF THE CUDDAPAH MURDERERS

The six chief actors in the Cuddapah outrage were executed at Cuddapah on the 5th April. They met their fate with resolution. The whole spectacle was conducted with an imposing solemnity and military display, the object of which was to increase the effect of the example. Very few spectators, however, were present, which is attributed to various causes; the strong precautionary measures to prevent a demonstration of feeling amongst the Musulmans, probably alarmed many. A person who was present writes: "One man, impatient of the delay occasioned from some unexpected impediment in removing the platform, actually tried to hang himself; he advanced, with a bold yet quick step, towards its verge, with the rope about his neck, and suddenly threw his body backwards. The drop, however, which immediately followed, soon put an end to his convulsive struggles. He was, of course, the first to die; the others struggled violently, and continued to give occasional

* Missionary Chronicle......for March 1834, P. 122.

indications of life for an incredible period, at least I should suppose for four or five minutes, if not more. One of the victims, I have been just told by a native spectator of respectability (in opposition to the others who protested their innocence to the last) confessed his guilt – nay, gloried in the confession, stating triumphantly that his sword had at least done its duty. The bodies were removed in about an hour, and immediately buried in the vicinity of the scaffold, where a strong guard of sepoys is now stationed to prevent their disinterment. The five criminals sentenced to transportation for life, regretted that they were not suffered to mount the scaffold with their late associates."*

---

* Asiatic Journal, London, 1833 November (probably reprinted from the Madras Gazette, April 20, 1833).

# కడపలో
# బ్రౌన్ సాహిత్య కార్ఖానా,
# బంగళా - తోట

ఆధునిక యుగంలో జరిగిన తెలుగు సాహిత్యసముద్ధరణ కృషికి సంబంధించి జాగ్రఫీ రీత్యా ఆంధ్రదేశపటం గీయవలసివస్తే, అందులో విధిగా వివిధ రంగుల్లో గుర్తించవలసిన పట్టణాల్లో కడపకు వొక ప్రత్యేకమైన రంగు కేటాయించి కేటాగా చూపవలసి వుంటుంది.

తెలుగు సాహిత్య చరిత్రలో ఆధునికతను ఆవిర్భవింపజేసిన ముఖ్యమైన సన్నివేశాలలో 'బ్రౌన్ యుగం' అనేది వొకటనుకుంటే—ఆ యుగంలోని సాహిత్య కృషికి కడప వొక గుప్తమైన కేంద్రస్థానంగా వుణ్ణిందన్న విషయం యిటీవలవరకూ అంతగా వెలుగులోకి రాలేదు.* తాను కొద్దో గొప్పో స్నేహ పరిచయాదులు సంపా

---

*"...బ్రౌన్ వంటి సాహితీవేత్తల కర్మక్షేత్రం కడప మండలం...కడపలో ఒకనాడు బ్రౌన్ నివసించిన గృహాన్ని ప్రభుత్వం జాతీయ స్మృతి చిహ్నంగా స్వాధీనం చేసుకొని తెలుగు సాహిత్యానికి ఆయన చేసిన సేవలను సంస్మరించడం అవసరమని శ్రీ ఆరుద్ర సూచించారు"—అని ఆంధ్రజ్యోతి దినపత్రిక (1976 మార్చి 29) లో వచ్చిన వార్త యిందుకు సాక్ష్యం. మూడు నెల్ల తర్వాత, "ఇటీవల శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం (బ్రౌన్ పరిశోధన ప్రాజెక్టువారు)...బ్రౌన్

దించుకొని తన కృషికి తోడ్పాటు అందజేస్తూ వచ్చిన తెలుగు పండితులను జిల్లాల వారీగా—పలానా జిల్లాలో పలానావారున్నారు అంటూ—"In each district of the Telugu country I have these agents"—అని వొక సుదీర్ఘమైన జాబితాయిస్తూ, కడప దగ్గరకొచ్చేసరికే—"a complete establishment in Cuddapa"—అని పేర్కొన్నాడు బ్రౌన్.* తాను తలపెట్టిన తెలుగు సాహిత్య వ్యవసాయానికి కడపలో వొక పెద్ద కమతమే వుణ్ణిందన్నమాట.

బ్రౌన్ యుగావతరణకు ముందు తెలుగు సాహిత్యరంగం యెట్లా వుణ్ణిందో టూకీగానైనా చెప్పుకోవడం యీ దశలో కాస్త అవసరం. మధ్య యుగాలనాటి రాచరికాలు పోయి జమీందార్ల, పిల్లజమీందార్ల, పాలెగాండ్ల వ్యవస్థ వచ్చింది. సమాజ వుత్పత్తి శక్తులు స్తంభించుకుపోయి ఆర్థిక వ్యవస్థ తాలూకు వుపరితలం వట్టి బోలు అయిపోయింది. ఎక్కడ చూచినా అవిద్య, పేదరికం తాండవిస్తూ జాతి జీవనాడులు నీరసిల్లిన రోజులవి. సంప్రదాయం ఘనీభవించుకుపోయి మూఢాచారాల బలమే రాజ్యతంత్రంగా పరిణమించి జాతిలో సృజనాత్మకత అనేది కనీస స్థాయికి దిగజారిన దశ అది. సృజనాత్మకతతోబాటు సాహిత్య స్పృహకూడా తగ్గుస్థాయికి చేరుకొన్న తరుణం అది. జాతిని వుత్తేజపరిచే సాహిత్యసృష్టికి తావు లేకుండా పోయిన వల్లకాటి యుగం అది.

"In 1825 I found Telugu literature dead"—అని బ్రౌన్ అప్పటి స్థితిని గురించి అన్నాడంటే యేదో అతిశయోక్తికి అన్నమాట కాదు. "In thirty years I raised it to life"—అని అన్నప్పుడూ అతిశయోక్తి ధ్వనించడంలేదు. తెలుగువాళ్ళకున్న సాహిత్య వారసత్వం తక్కువైనదేమీ గాకపోయినా, పెక్కు

---

కడపలో నివసించిన భవనాన్ని గుర్తించారు. భవనమంతా శిథిలమై గోడలు మాత్రం మిగిలాయి. ఆంధ్రసాహిత్యానికి అనుపమానమైన సేవచేసిన బ్రౌన్ స్మారక చిహ్నంగా ఈ భవనాన్ని పునర్నిర్మింపచేసి, దానిలో అతనిపేర గ్రంథాలయాన్ని నిర్మించడం సమంజసం''—అని ఆ పత్రిక జూన్ 30 తేదీ సంచికలో కడప వ్యక్తి శ్రీ జానుమద్ది హనుమచ్ఛాస్త్రి జనవాక్యం శీర్షికలో వ్రాశారు.

* చూడు: 'బ్రౌన్ లేఖలు: ఆధునికాంధ్రసాహిత్య చరిత్ర శకలాలు', శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ప్రచురణ, 1977, పేజీలు 126-7. (మ.ఓ.మే. లై.లోని బ్రౌన్ డిక్షనరీ నోట్సుల సంపుటం నెంబర్ డి. 3140).

కావ్యాలు ప్రబంధాలు జాతికి అందించిన సుదీర్ఘ వారసత్వం వున్నప్పటికీ—ఆ వారసత్వ స్పృహ పరిమితమైన స్థాయిలో అల్పసంఖ్యాకులైన పండితవర్గమనబడే వారిలో మాత్రమే మిగిలిపోయి కిందిపాయా జనబాహుళ్యంలో నుంచి తొలగిపోయింది. జన జీవితంలో నుంచి చెరిగిపోయింది. మహాకావ్యాలనబడేవన్నీ మట్టిగొట్టుకొని శిధిలమై కూలి పడిపోయిన ధ్వజస్తంభాల్లాగా, విరిగి పడిపోయిన మొండి వటవృక్షాల్లాగా అయిపోయాయి. ఇట్లా పందొమ్మిదో శతాబ్ది తొలిపాదంలో ప్రవేశించేటప్పటికీ—తెలుగు సాహిత్యక్షేత్రం జనవాటికకు దూరంగా వొక గోరీలతోపుగా తయారైంది.

మృతప్రాయమైన ఆ దశలోనుంచి మళ్ళీ జీవశక్తిని పుంజుకొని ప్రాణస్ఫూర్తిని పొందడానికి కొత్తశక్తులు అవసరమయ్యాయి. బ్రౌన్ యుగావతరణ జరిగింది సరిగ్గా ఆ తరుణంలోనే. ఆ గోరీలతోపులో అడ్డదిడ్డంగా మొలిచిన గంజాయి మొక్కలన్నీ పీకేసి, కొత్త పాదులన్నీ తీసి, కొత్త పాయలన్నీ పారించి వొక సుందరమైన ఆరామంగా తీర్చి దిద్దడానికి బ్రౌన్‌కు నిజంగా మూడు దశాబ్దులు పట్టింది. ఖర్చుకు గిర్చుకు వెనకాడకుండా వొక కఠోరమైన దీక్షతో యెంత శ్రమపడాల్నో అంతాపడ్డాడు. ఇందుకు వొక ప్రత్యక్ష సాక్ష్యం కడపలో యేర్పాటుచేసిన యీ సాహిత్యకర్మాగారం.

కడపలో తాను కొనిపెట్టిన, బహుశా అందుకోసమే కొనిపెట్టిన 'బంగళా—తోట', అందులో నెలకొల్పిన యీ తెలుగు 'సాహిత్య కార్ఖానా'లో ఆయన జరిపించిన కార్యకలాపాలను యీ అధ్యాయంలోని జాబులనుబట్టి కొంతకు కొంతైనా తెలుసుకోవచ్చు.

ఈ కార్ఖానాలో ఆనాటి పెక్కుమంది తెలుగు పండితులు పనిచేశారు. సుశిక్షితులైన, వుద్దండులైన ఆ 'సాహిత్య కూలీలు' వెచ్చించిన శ్రమ తాలూకు 'అదనపు విలువ'ను దోచుకొన్న, లేదా దోచుకోవాలనుకొన్న పెట్టుబడిదారీ మాత్రంకాదు బ్రౌన్. ఆయన పెట్టుబడి పెట్టింది ఆ పద్ధతిలో కాదు. ఆ వుద్దేశంతోనూ కాదు. తాను ఖర్చుపెట్టిన దాంట్లో కనీసం పదిహేనోవంతైనా రాబట్టుకోలేకపోయాడు.* పోనీ ఆయన

---

* "He told me a few months before his death that what he had received represented about a fifteenth part of what he had spent"—అని ఆర్. యమ్. మగ్డానల్డ్ (R. M. Macdonald) 1885 జనవరి 3 తేదీ లండన్ 'ఎథీనియమ్' పత్రిక (14 వ పేజీ) లో బ్రౌన్‌ను గురించి వ్రాసిన ఆఖిచువరీ నోట్‌లో తెలియజేశాడు.

యిదంతా యేదో పేరుకోసం చేశాడనుకొందామా అంటే అదీకాదు. తనకు న్యాయంగా రావలసిన పేరైనా పొందకుండానే దాటుకొన్నాడు.*

మరెందుకోసమని బ్రౌన్ యిదంతా చేసినట్లు? మనదేశ సాంస్కృతిక పునరుజ్జీవపు ప్రభాతవేళలో—రెండు పరస్పర భిన్నమైన సంస్కృతులు సన్నిహితంగా రావడంవల్ల సంభవించిన వొకానొక అనివార్యమైన acculturation పరిణామానికి బ్రౌన్ లోను గావలసి వచ్చింది. ఈ నేపథ్యంలో నుంచే బ్రౌన్ యీ కృషికి వుద్యమించాడని అనుకోవాలి. అదే అతని శ్రమకు గీటురాయి అయిందనుకోవాలి. అందువల్లనే—యీ దేశాన్ని, యీ ప్రజలను పెక్కువిధాలుగా కొల్లగొట్టి దోచుకొనిపోయిన పెట్టుబడిదారీ దేశపు బంటుగా, వలసరాజ్య ప్రతినిధిగా యీ తెలుగు గడ్డపై అడుగిడిన బ్రౌన్—పెక్కు వున్నతోద్యోగాల్లో నానా విధాలుగా ధనార్జన చేసుకొని చల్లగా తరలిపోడానికి ఆస్కారం వున్నా, ఆ దోవ తొక్కకుండా, తన జీతపు రాళ్లలో నుంచి ఆదా చేయకల్గిన ప్రతి చిల్లిగవ్వనూ, తన జీవితంలో మిగిల్చగల్గిన ప్రతిక్షణం తీరికనూ యీ బృహత్కృషికి వెచ్చించి పండించిన పంటనంతా తెలుగువాళ్ళకే సమర్పించి వారి జాగృతికి పెక్కువిధాలుగా తోడ్పడిన 'సాహిత్య సామ్యవాది'గా బ్రౌన్‌ను మనం పరిగణించవలసి వుంటుంది.

* * *

"When I began these tasks, Telugu literature was dying out, the flame was just glimmering in the socket...with these facilities I think Telugu will no longer be considered the most difficult language in India. To revive the literature of a language was an ardous task for one man, and he a foreigner."—అన్నాడు బ్రౌన్ వొక చోట వినమ్రంగానే.†

ఒక పరాయివాడు మన సాహిత్యానికి యింత చేసిపెట్టిపోవడమనేది—'అతని యౌదార్యమున'కూ, మన 'దారిద్ర్యమున'కూ వొక సంకేతంగా, 'తెల్లదొరగారి తిరి

---

* బ్రౌన్ గతించిన తర్వాత కనీసం కృతజ్ఞతగానైనా ఆ పేరుప్రఖ్యాతులను ఆయనకు చెందకుండా చేశారు మనవాళ్ళు— వేటూరి ప్రభాకరశాస్త్రి, కందుకూరి వీరేశలింగం వంటి ప్రఖ్యాత సాహిత్యవేత్తలు.

† 1872 నాటి బ్రౌన్ ఆంగ్లంలో ప్రకటించిన స్వీయచరిత్ర, (Literary Life of Charles philip Brown, London, 1872, Pp. 25—6.)

పెమునకే యెుడి బట్టవలసి వచ్చినందు కేడ్వ'* వలసివచ్చే అంశంగా, మన అహాన్ని దెబ్బతీసే విషయంగా వుండవచ్చుగానీ, నిజానికి యిందులో పిసమంత అతిశయోక్తి కూడా లేదనవలసి వస్తుంది. ఒక ముప్పయ్యేళ్లలో బ్రౌన్ పునాదినుంచీ నిర్మించు కొంటూ వచ్చి యింతపని యెట్లా చేసిపోగలిగాడో, అందుకు కడపలో ఆయన యేర్పాటు చేసుకొన్న సాహిత్య కర్మాగారం యెట్లా తోడ్పడిందో యీ జాబుల్లో శకల ప్రాయంగా లభించే కొన్ని ఆధారాలను బట్టి కొంతైనా అర్థం చేసుకోవచ్చు.

ఎంత ఖర్చుపెట్టి యీ కార్ఖానాను నిర్వహిస్తూ వచ్చాడో యీ జాబుల్లో వచ్చే కొన్ని లెక్కపక్కలు చెప్తున్నాయి. 'కాగితాల శిక్కెనులు దస్తాలు 21', మేలుతరహా 'రూలు వేశ్ని శికసనులు 160 దస్తాలు', చీనా కాగితాల కట్టలు, యర్ర అట్టలు మొదలైన బైండింగ్ సామాన్లు, 'బంగారు అక్షరాలు గల జీలుకట్టిన యర్రతోలు, యర్రగుడ్డ దస్త్రాలు, కాగితపు సంచులు', 'పేనాల కట్టలు 196, పేనా కత్తులు', కరక్కాయసిరా-యిట్లా యెన్ని సామాన్లు, యెంత సరంజామా అవసరమయ్యేదో - అంతా కూడా యీ కడప కార్ఖానాకు కొని పంపేవాడు. 196 పేనాల కట్టలు యెన్నిసార్లు పంపించాడో, అన్ని పేనాలతో యెన్ని కావ్యాలు వ్రాయవచ్చునో అన్ని కావ్యాలకూ శుద్ధప్రతులు, వ్యాఖ్యానాలు, లఘు టీకలు వ్రాయించినట్లున్నాడు కడపలో. మహాభారతం మొదలు వేమన పద్యాలదాకా, అహల్యా సంక్రందనంనుంచి భానుమద్విజయం, చంద్రాంగద చరిత్ర దాకా యే వొక్క కావ్యాన్నీ వదిలినట్లు లేదు.

చదువుకోడానికి వసతి లేకుండా, తప్పుడు తడకలతో గజిబిజి లిపులతో తాటాకుల్లో శిథిలమైపోతూ కొనవూపిరితో కొటకలాడ్తుండిన తెలుగు కావ్యాలను కాల గర్భంలో కలిసిపోకుండా పునరుద్ధరించిపోయాడు బ్రౌన్. ఒక్కొక్క కావ్యానికి ఒకటికి మించిన ప్రతులు——కొన్నిటికి పది పన్నెండు కూడా సేకరించి, శాస్త్రీయమైన పద్ధతుల్లో శుద్ధప్రతులు తయారు చేయించాడు. ఒకరికి యిద్దరు, కొన్నిటికి ముగ్గురు చేతకూడా పరిశీలన చేయించి, పునఃపరిశీలన చేయించి కావ్య నష్టంగాకుండా, కావ్య భ్రష్టం జరక్కుండా వాటికి ప్రామాణికమైన రూపాలు సంతరించి పెట్టిపోయాడు. ఆ నాడు యీ కడప కర్మాగారంలో యిన్ని పనులు జరిపించి యింత పెన్నిధిని బ్రౌన్ మనకిచ్చి పోబట్టే,† ఆ తర్వాతి తరంలో అంతటి సాహిత్య చైతన్యం చిగురించ

---

* రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి 'వేమన', వాల్తేరు, 1945 (ప్రథమ ముద్రణ 1929), పేజీలు 20—21.

† ఈ పెన్నిధిలో చాలావరకు నేటికీ మ.ఓ.మే.లై.లో పదిలంగానే వుంది.

దానికి దోహదకారి అయింది. వీరేశలింగం పంతులు వంటివారు దాని అసరాతో తెలుగుకవుల చరిత్ర వ్రాయడానికి వీలైంది. మరొకరు మరొకటి వ్రాయడానికి, యింకా యెందరు యెన్నయినా చేయడానికి వేదిక యేర్పడింది. ఏదో పండిత వర్గానికి మాత్రమే పరిమితమైపోయి వారి గుత్తసొమ్ముగా వుండిపోయిన తెలుగు కావ్య ప్రపంచానికి ముద్రణయోగం పట్టించి, అచ్చుప్రతులు పుట్టించి, సామాన్యుల అందు బాటులోకి తెచ్చి, సాహిత్యానికి పట్టిన యీ పండిత 'చెర' వదిలించి ప్రజాస్వామ్యీ కరణం గావించాడు.

ఎన్నెన్ని కావ్యాలనో పునరుద్ధరించిన తీరు, సులభ వ్యాఖ్యలు, టీకలు, వివరణలు, పదసూచికల సాయంతో యెవరైనా వాటిని సొంతంగా గురువుల అవసరంలేకుండా అధ్యయనం చేసుకోడానికి బ్రౌన్ కల్పించిన వీళ్లు—వీటిని గురించి వివరంగా చెప్పుకోవాలంటే యీ చిన్న అధ్యాయంలో వీలయ్యే పనికాదు.

§ § §

ఈ పుస్తకంలో వచ్చే మొత్తం 41 జాబుల్లో-ముప్పయిమూడింటిని కడపలో బ్రౌన్ బంగళా-తోటకు సంబంధించినవిగా వొక స్థూల వర్గీకరణచేసి యీ అధ్యాయంలో క్రిక్కిరిసినట్లు చేర్చడం జరిగింది. ఇందులో అయోధ్యాపురం కృష్ణారెడ్డి, ధర్మపురం సుబ్బన్న, ములపాక బుచ్చయ్యశాస్త్రి, పైడిపాటి వెంకటనరసయ్య, కంభం నృసింహాచార్యులు, గరిమెళ్ళ వెంకయ్య, అవధాన్ల అప్పయ్య మొదలైన వారు బ్రౌన్‌కు వ్రాసిన జాబులున్నాయి. వీళ్లందరి జీవితాలు కొద్దో గొప్పో బ్రౌన్ తోనూ, యీ బ్రౌన్ బంగళాతోనూ ముడిబడినట్టివే. ముఖ్యంగా అయోధ్యాపురం కృష్ణారెడ్డితో బ్రౌన్ కేర్పడ్డ స్నేహానుబంధం ప్రత్యేక తరహాకు చెందింది. మామూలు సేవ్య-సేవక సంబంధాన్ని దాటి ఆత్మీయమైన స్నేహ పరిధిలోని ఆప్తత, చనువు, ప్రేమ, వాత్సల్యం, అభిమానం వగైరా మానవీయమైన భావజాలం ఆయన జాబుల్లోని అక్షరక్షరంలో ధ్వనిస్తుంది. తెలుగువారితో బ్రౌన్ కుదుర్చుకున్న సత్సంబంధాలకు సూటి వుదాహరణ యీ జాబులు. ఈ పుస్తకంలోని మొత్తం జాబుల్లో అయిదింట నాల్గవంతులు యీ కృష్ణారెడ్డివే.

ఇందరు వ్రాసిన జాబుల్ని బ్రౌన్ కాపీచేయించి పెట్టాడుగానీ బ్రౌన్ వీళ్లకు వ్రాసిన జాబుల్లో కొన్నయినా వీళ్ల వంశీకులు భద్రపరచకపోతారా ప్రయత్నించి చూద్దామని యిటీవల అయోధ్యాపురం కృష్ణారెడ్డి సంబంధీకులను విచారించడానికి హసనాపురం చుట్టుప్రక్కల గ్రామాలైన చిట్లూరు, నల్లగుంట్లపల్లె, సరసపల్లె,

యెర్రబల్లె—యీ వూళ్లకు వెళ్లాను. అయోధ్యాపురం యింటిపేరు గల్గినవాళ్లు యీ గ్రామాలకు మున్సబులుగా సర్పంచ్‌లుగా కరణాలుగా వుంటున్నారుగానీ—వాళ్లను విచారిస్తే యెవర్లోనూ ఆ బ్రౌన్ స్పృహ వున్నట్లుగా కనపళ్లేదు. ఫలితం బ్రౌన్ జాబు వొక్కటికూడా వారినుండి సేకరించడం సాధ్యంకాలేదు. పదిహేనేళ్లక్రితం యీ జిల్లా కో ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకి సెక్రిటరీగా యీ గ్రామాదులన్నీ నేను తిరిగినప్పుడు అప్పట్లో బ్రౌన్ స్పృహవుండి వెతికివుంటే వొకటీ అరా బ్రౌన్ జాబు గానీ మరో ఆధారంగానీ లభించివుండేదేమో. ఇప్పుడైనా యీ దృష్టితో అయోధ్యా పురం వారి యిళ్లు గాలిస్తే యేమైనా సత్ఫలితం వుండొచ్చుననే ఆశ లేకపోలేదు.

౭ ౭ ౭

ఈ అధ్యాయంలో మొదటగా వచ్చే 1828 నాటి జాబు (పేజీలు ౨౦-౨౪) లోని మొదటిభాగమంతా తెలుగు పుస్తకాల ప్రస్తావనతోనే నిండిపోయింది. మొత్తం యీ జాబుల్లో వచ్చే తెలుగు సంస్కృత పుస్తకాలను వొక అనుబంధంగా యివ్వడం జరిగింది. వీటిల్లో కొన్నిట్ని గురించి అయినా యిక్కడ చర్చించుకోవడం అవసరం.

1824లో వోంప్రథమంగా వేమన పద్యాలతో ప్రారంభమైన బ్రౌన్ తెలుగు సాహిత్యాధ్యయనం 1827లో ఛందోరీతులను పరిశీలించి యేకంగా వొక గ్రంథాన్ని ప్రకటించేదాకా విస్తరిల్లిందంటే, అనతికాలంలోనే తెలుగు సాహిత్య 'శాస్త్ర' గ్రంథాల ఆయువు పట్లు పట్టుకోగలిగే దశకు చేరుకున్నదంటే, ఆయన తెలుగు అధ్య యనం యెంత వేగంగా యెంత విస్తృతంగా కొనసాగిందో అర్థమవుతుంది. పై జాబులో కాలేజి బోర్డుకు సరఫరాచేసే ఆ పుస్తకాల ప్రస్తావనలున్న భాగాన్ని గురించి లోగడే ప్రకటించడం జరిగింది. మద్రాసు ఫోర్ట్‌సెంట్‌జార్జి కాలేజిలో తెలుగులైబ్రరీని యేర్పాటుచేసే విషయమై, తమిళనాడు ఆర్కైవ్స్‌లో యీ జాబుకు సమానాంతరంగా లభించే కొన్ని ఆధారపత్రాలతో సహా చర్చించడం జరిగింది.* గనుక యిక్కడ మళ్లీ మళ్లీ చెప్పడం అనవసరం.

కడపలో బ్రౌన్ యేర్పరచుకొన్న లైబ్రరీకి అయోధ్యాపురం కృష్ణారెడ్డి వొక 'ఆదర్శ' లైబ్రేరియన్‌గా అజమాయిషీ చేస్తూ బ్రౌన్‌కు అన్నివిధాలా అండగా వుంటూ వచ్చాడని తేటతెల్లమవుతుంది యీ జాబుల్ని బట్టి చూస్తే. లేకుంటే—"In these

---

* చూడు: 'బ్రౌన్ లేఖలు...', 1977, పేజీలు 104—110).

plans the zealous writer of this letter was a most noble and excellent assistant"*—అని బ్రౌన్ వూరకే ప్రశంసిస్తాడా?

తెలుగు తాళపత్రగ్రంథాలు సేకరించి వాటిని కాగితాలమీద కెక్కించి పరిష్కరణ జరిపించి శుద్ధప్రతులు తయారుచేయించడం, అచ్చుకు యోగ్యంగా చేసి టీకలు వ్యాఖ్యలు పీఠికలు సిద్ధపరచడం అనేది బ్రౌన్‌కు ఆఖరుదాకా వొక 'నితనిత్య' క్రియగా తయారైంది. ఒక లౌల్యంగా మారిపోయింది. ఆయన యీ విషయంలో తీసుకున్న శ్రద్ధ, పడిన శ్రమ,† శాస్త్ర దృష్టితో వీటిని దాదాపు 'యేకాకి'గా పునరుద్ధరించినతీరు-యిందుకు సంబంధించి యీ జాబుల్లో మనకు పెక్కు దాఖలాలు కనపడ్తున్నాయి. మచ్చుకు కొన్నిటినైనా కాస్త విపులంగా చర్చించుకోనిదే బ్రౌన్ చేసిన యీ పునాది ప్రాయమైన కృషి విలువ అర్థంకాదు.

ఉదాహరణకు తెలుగు ప్రబంధమండలిలో ప్రత్యేకస్థానం ఆక్రమించిన వసుచరిత్ర ను పునరుద్ధరించి టీకతోబాటు ప్రకటించే విషయంలో బ్రౌన్ దాదాపు పుష్కరకాలం తపనపడవలసి వచ్చింది. ములుపాక బుచ్చయ్యశాస్త్రికి తన కడప బంగళాలో కొలువు యేర్పాటుచేసి 1829-30 లో వసుచరిత్రకు వ్యాఖ్యను రూపొందింపజేశాడు. ప్రతి పదార్థ వ్యాఖ్య సామాన్య పాఠకుడికికూడా సులువుగా అర్థమయ్యేలాగున వుండాలన్నాడు. బుచ్చయ్యశాస్త్రి వట్టి వ్యాఖ్యానకారుడేగాక కవికూడా ననుకోవాలి—మాఘమాహాత్మ్యకర్తకూడానట. కాబట్టే బుచ్చయ్య తన వ్యాఖ్యకు పీఠికాప్రాయంగా బ్రౌన్ గుణగానంచేస్తూ పదిహేను అంకిత పద్యాలు రచించాడు. వేటూరి ప్రభాకరశాస్త్రి చేసిన తప్పు మూలంగా 'చాటువు'గా ప్రచారంలో వున్న 'నూర్లార్లు లెక్కచేయక' అనే పద్యం నిజానికి బుచ్చయ్యశాస్త్రి వ్రాసిన యీ పదిహేను పద్యాల్లో వొకటి.

అలనాడు రాజరాజ నరేంద్రుడు నన్నయను పిలిచి తెలుగు భారతం వ్రాయమని కోరినట్లుగా "సకల లక్షణ శాస్త్ర చక్రవర్తి శబ్దశాసన సూత్రసహిత వృత్తి లక్ష్య లక్షణ గురులఘువర్ణగణవార్తికావృత్తి విద్వన్మతానువర్తి" అయిన బ్రౌన్ తనను

---

* చూడు: ఈ గ్రంథంలో జాబుల పేజీ ౩౫.

† బ్రౌన్ కంటే యించుమించు పావు శతాబ్దిముందు అదే దీక్షతో మెకంజీ దొర యీ రంగంలో విస్తారంగా కృషిచేసిపోయినా ఆయన చేసిన తాళపత్ర గ్రంథ సేకరణ సేకరణతోనే ఆగిపోయింది. మెకంజీ భారతీయ భాషాధ్యయనం చేసినవాడు కాదు. ఆయన యే భారతీయ భాషనూ పద్ధతిగా నేర్చుకొన్నట్లు లేదు. తన ధ్యేయం నెరవేర్చుకోకుండానే మెకంజీ హఠాత్తుగా దాటుకొన్నాడు.

పిల్చి వసుచరిత్ర విషయం చూడమన్నాడని బుచ్చయ్యవ్రాసిన ఆ పద్యాల్లోనుంచి మచ్చుకు అయిదు వుదాహరిస్తున్నాను :

"క॥ నూర్లార్లు లెక్క సేయక
పేర్లందిన విబుధజనుల బిలిపించుచు వే
మార్లర్థమిచ్చు వితరణి
చార్లీసు పిలువు బ్రౌను సాహెబు కరుణన్....

క॥ ననుబిలిచి పలికె విద్వ
జ్జనములు నుతియింప నీవు సరళోక్తులచే
ఘనమైన వసుచరిత్రకు
మనమారగ టీక చేయుమా మహి వెలయన్...

తే॥ వసుచరిత్ర పదార్థ మివ్వసుధలోన
గని పరిగ్రహమొనరింతు ననుపమాన
పండితానుగ్రహాంజన ప్రతిభచేత
దాన గనరాని యర్థమెందేని గలదె.

క॥ సోమమాత్యుడు చేసిన
శ్రీమద్వ్యాఖ్యాన మిల నశేషకళావి
ద్ధీమంతులకే కాకే
సామాన్యుల కర్థమియ్యజాలదు గానన్.

క॥ అందరి కర్థంబై యా
నందంబొనగూర్చగా జనంబులు మెచ్చన్
మందార కుసుమ మాధ్వీ
కందళితోక్తులను టీక గావింతు దగన్"*

బుచ్చయ్యశాస్త్రి యీ వసుచరిత్ర ప్రతిపదార్థ ప్రకాశికను 1750 ప్రాంతంలో సోమమంత్రిచే రచింపబడిన విద్వజ్జనరంజనీ వ్యాఖ్యానాన్ని ఆధారం చేసుకొని కాస్త సుబోధకంగా వ్రాయాలని ప్రయత్నించాడు. బుచ్చయ్య వ్యాఖ్యాన రచన యేయే తేదుల్లో తయారైందీ ఆధారాలున్నాయి. మొదటిమూడు ఆశ్వాసాల విషయంలో తేదీల

---

* మ.ఓ.మే.లై. లోని వసుచరిత్ర వ్యాఖ్యాన సంపుటం డి. 760

వివరంలేదుగానీ నాలుగో ఆశ్వాసంనుంచి తెలుస్తున్నది. "విరోధినామ సంవత్సర శ్రావణకృష్ణ నవమి స్థిరవారము చతుర్థాశ్వాసము సమాప్తం" అని వుంది. ఇందుకు సరియైన యింగ్లీషు తేది 1829 ఆగస్టు 8.* "విరోధినామ సంవత్సర మార్గశీర్ష శుద్ధ పంచమి అంగారకవారము పంచమాశ్వాసము సమాప్తము." దీనికి సరియైన యింగ్లీషు తేది 1829 డిసెంబరు 1. ఈ లెక్కన చూస్తే వ్యాఖ్యాన రచనకు సుమారు వొక సంవత్సరం పట్టివుంటుందనుకోవచ్చు. పూర్తయిన తర్వాత మళ్ళీ వొకరిద్దరుచేత చదివించి తప్పులు దిద్దించినట్లున్నాడు (చూ: జాబులపేజీ 33).

ఆ తర్వాత బ్రౌన్ దీన్ని 1830 లో అయోధ్యాపురం కృష్ణారెడ్డిచేత తెప్పించుకొని చదివి చూశాడు. ఆయనకు నచ్చినట్లులేదు. జూలూరు అప్పయ్యశాస్త్రిచేత 1832-34లో మరో వ్యాఖ్యానాన్ని తయారుచేయించాడు. బుచ్చయ్య టీక కంటే అప్పయ్యదే బేషుగ్గా వున్నట్లు భావించాడు బ్రౌన్. కనుకనే దాన్ని ముద్రణకు స్వీకరించాడు. అచ్చుకు యెంత ఖర్చవుతుందో మద్రాసులోని అమెరికన్ మిషన్ ప్రెస్ నుంచి కొటేషన్ తెప్పించాడు.†

---

* An Ephemeries.-.. C. P. Brown, Madras, 1850, P. 472.

† చూడు: మ.ఓ.మే.లై.లో జూలూరు అప్పయ్య వసుచరిత్ర టీకప్రతి డి 759 సంపుటం 2. ఆ ప్రెస్ 1838 అక్టోబర్‌లో పంపిన జాబులో ప్రింటింగ్ యెస్టిమేషన్ వివరాలు యిట్లా వున్నాయి :

"To printing 500 copies of the Telugu poem

| | |
|---|---|
| 300 pages 4° at 3 Rs. | 900—0—0 |
| 31 reams of superfine paper at 11½ Rs. | 356—8—0 |
| Binding 500 copies at 1 Rs. | 500—0—0 |
| | 1756—8—0 |
| (Price per copy Rs. 3—8—3) | |
| Further: for 500 additional copies of the first volume 150 pages at 1½ Rs. | 225—0—0 |
| 15½ reams of paper at 11½ Rs. | 178—4—0 |
| Binding 500 copies at 1 Rs. | 500—0—0 |
| | 903—4—0 |
| (Price per copy Rs. 1—13—0) | |

అంకిత పద్యాల్లో తనను గురించి కవిత్వ కైవారాలతో బుచ్చయ్య పొగడ్తలు గుప్పించాడు కదా అని బ్రౌన్ దాన్నే అచ్చువేసి వుండొచ్చు కీర్తికాంక్ష వున్నవాడైతే. కానీ ఆయన ఆ పని చేయలేదు. బుచ్చయ్య వ్యాఖ్యను కాదని అప్పయ్య వ్యాఖ్యనే యెంపిక చేశాడంటే—అందులో బ్రౌన్ 'ప్రజాదృష్టి' కనపడ్తుంది. నిస్సంశయంగా బుచ్చయ్య రచన కంటే అప్పయ్య వ్యాఖ్యే సరళమైనది. లేనిపోని ప్రకర్షలకు పోకుండా సూటిగా సామాన్య పాఠకుణ్ణి వుద్దేశించి సాగిన వ్యాఖ్యాన సరళి ఆయనది. సాహిత్యానికీ ప్రజలకీ మధ్యవున్న వొక అగాధాన్ని పూడ్చి ప్రజాబాహుళ్యంలోకి సాహిత్యం చప్పున చేరుకోకుండా యేర్పడివున్న అడ్డంకుల్ని తొలగించడం తన ధ్యేయం కాబట్టి, ఆ ఆదర్శానికి అనుగుణంగా అప్పయ్య రచన వుందని గ్రహించి దాన్నే ముద్రించాడు—బుచ్చయ్య వ్యాఖ్యను కాదని.

పరిష్కరణ వొక యెత్తు. ముద్రణ మరో యెత్తు. అప్పటికి తెలుగు పద్య సారస్వతం అచ్చురూపంలో కొచ్చింది బహు స్వల్పం. తెలుగు ముద్రణలు, ప్రత్యేకించి కావ్యముద్రణలు అతి బాల్యావస్థలో వున్న కాలమది.* తప్పులు లేకుండా జాగ్రత్తగా కావ్యాలను అచ్చు వేయించాలనే తత్వం గలవాడు కాబట్టి సమర్థుడైన పండితుడు వఠ్యెం అద్వైత బ్రహ్మయ్యశాస్త్రి పర్యవేక్షణలో సొంత డబ్బుతో అచ్చు ప్రారంభించాడు. ఎన్నో విఘ్నాలు యెదుర్కొవలసి వచ్చింది. మధ్యలో బ్రహ్మయ్య పరమపదం చేరుకొన్నాడు. అచ్చుపని నిల్చిపోయింది. 1844లో గానీ అచ్చు పూర్తయి విడుదల కాలేదు.† ఖర్చు సంగతటుంచి పుష్కరంపాటు పట్టుదలగా పోరుకాడి పని జరిపించబట్టే అది అంత కాలానికైనా పూర్తయింది. జటిలమైన వొక కావ్యం తాలూకు మెళకువలు మర్మాలు సామాన్యుడికి కొరుకుడుపడేలాగున ప్రజాధోరణిలో

---

"The charge per page of the 1st vol. is charged at Rs. 1—8—0....if they be printed at the same time with the above. The probable time in which the work will be completed is eight months."

* తెలుగు 'కావ్యాలు'గా, కావ్యఖండికలుగా అప్పటికి అచ్చయినవి రెండేరెండు. అవి తనవే. వేమన పద్యాలు (1829), 'ఆంధ్రగీర్వాణచ్ఛందము' (1827)లో వివిధ కావ్యాల్లోనుంచి కోట్ చేసిన పద్యాలు.

† చూడు: "బ్రౌన్ లేఖలు...", 1977, పేజీలు 51-7.

తయారైన సులభ వ్యాఖ్యానప్రతి కడకు వెలుగు చూచింది. 'కొరకరాని కొయ్య'గా వుండిన ప్రబంధం తాళపత్ర చెరలోనుంచి బయటపడి ముచ్చటైన ముద్రణరూపంలో సామాన్యజనవేద్యమైంది. తెలుగు కావ్యోద్ధరణపట్ల ఆ రోజుల్లోనే కాదు, ఆ తర్వాతి రోజుల్లో కూడా యింతగా తపనబడ్డ మరొక వ్యక్తి కానరాడు.

ర ర ర

ఇక టూకీగా మహాభారతం గురించి బ్రౌన్ గావించిన కృషి * తాను తెలుగు మహాభారతాన్ని చదవనారంభించింది 1825లో నని తన స్వీయ చరిత్రలో వ్రాసు కొన్నాడు.† మహాభారతం తాళపత్ర ప్రతులు సేకరించి వ్రాయసగాళ్ల చేత కాగితాల మీద కెక్కిస్తూ వచ్చాడు. అడుగడుగునా గ్రంథపాతాలు, పాఠాంతరాల చిక్కులు. ఈ చిక్కులను విడదీసుకొంటూ ముందు వొక మోస్తరు శుద్ధప్రతిని తయారు చేయించాడు. మధ్యలో దేశం నాలుగు చెరగులనుంచీ మరికొన్ని తాటాకుప్రతులు వచ్చి పడ్తుండేవి. వాటిల్నికూడా సంప్రతించి శుద్ధప్రతిని దిద్దుబాట్లు చేయిస్తూవచ్చాడు. ఇన్ని ప్రతులు చూచిన తర్వాతకూడా అక్కడక్కడా కొన్ని సందేహాలు మిగిలిపోతుండేవి. సంస్కృత భారతంతోకూడా సరిపోల్చి వీలైనచోట్ల ఆ సందేహాలను తీర్పించేవాడు.

సభాపర్వంలోని పద్నాలుగు పద్యాలు తీసుకొని తాను సంశోధన ప్రతిని యెట్లా తయారుచేస్తూ వచ్చిందీ 1827లో తాను ప్రకటించిన 'ఆంధ్ర గీర్వాణచ్ఛందము'లో సోదాహరణంగా వివరించింది చూస్తే § అప్పటి తాళప్రతుల్లో భారతపద్యాలు యెంత

---

* ఉస్మానియావారి ఆంధ్ర మహాభారత సంశోధితప్రతి వారు దీన్నిగురించి బొత్తిగా పట్టించుకోకపోయినా, మొదటినుంచీ యీ విషయం చెప్తూవస్తూనే వస్తున్నాను (చూ: బ్రౌన్ గురించి నేను లోగడ ప్రకటించిన రెండు గ్రంథాలు— 1. బ్రౌన్ జాబులు...,1973, పేజీలు 35-46, 107-110; 2. బ్రౌన్ లేఖలు... 1977, పేజీలు 29-35). ఎంత చెప్పినా యింకా మిగిలున్న అంశాలు కొన్ని వుండనే వున్నాయి.

† 1866 లో ప్రకటితమైన స్వీయచరిత్రలో 1825 అనీ, 1872 లో వచ్చిన రివైజ్డ్ యెడిషన్‌లో 1826 లో అనీ బ్రౌన్ వ్రాసున్నాడు. 1825 సంవత్సరమే కరెక్టు కావచ్చు.

§ The Prosody of the Telugu and Sanskrit Languages explained ఆంధ్రగీర్వాణచ్ఛందము (1827 నాటి ముద్రణకు శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంవారి పునర్ముద్రణ), 1977, ఆఖరు అధ్యాయం.

తప్పుల తడకలుగా అస్తవ్యస్తమైన స్థితిలో వున్నదీ అర్థమవుతుంది. ఈ అవ్యవస్థ నుంచి తాను వొక సువ్యవస్థను యేర్పరచుకోవలసి వచ్చింది. గ్రంథపాఠాలను పూరించుకొంటూ పాఠాంతరాలను గుర్తిస్తూ ఆశ్వాస విభజన గావించుకుంటూ, పద్య సంఖ్య, మధ్య మధ్యలో కథకు అనుగుణంగా వుపశీర్షికలు యిచ్చుకొంటూ శుద్ధప్రతిని రూపొందింపజేస్తూ వచ్చాడు. ఇట్లా వొక్కొక్క దశను దాటుకుంటూ పర్వం వారీగా 18 పర్వాలనూ సిద్ధం చేయించడానికి యెన్ని అవస్థలు పడాలో్న అన్నీ పడ్డాడు.

మొదటగా ఆదిపర్వాన్ని స్వయంగా అచ్చువేయించి చూడాలనుకొన్నాడు. 1839లో యీ ఆదిపర్వం అచ్చు ప్రారంభించినట్లున్నాడు.* 1842లో వర్తమాన తరంగిణి పత్రికలో వచ్చిన ప్రకటననుబట్టి† ఆ మధ్యకాలంలో అచ్చు పూర్తయి ఆదిపర్వం విడుదలై వుండాలి. దీని తర్వాత మిగతా పర్వాలు కూడా అచ్చయితే బాగుణ్ణనే ఆలోచన తెలుగువాళ్ళకు కల్గింది. అంతా చందాలేసుకొని వొక సంఘంగా యేర్పడి మిగతా పర్వాలన్నీ అచ్చువేయించడానికి పూనుకొన్నారు. బ్రౌన్ శుద్ధప్రతుల సాయంతో ఆంధ్రమహాభారతాన్ని మనవాళ్ళు నానాతంటాలుపడి యెట్లాగో ముద్రించ గల్గారు.

---

* Madras Journal of Literature and Science, Madras, (July—Dec. 1839). ఈ పత్రికలో బ్రౌన్ వ్రాసిన Essay on the Language and Literature of the Telugus అనే సీరియల్ వ్యాసంలో మహాభారతం గురించి వ్రాస్తూ (పేజీ 49) ఆదిపర్వం అప్పటికే అచ్చుకిచ్చి వున్నట్లు పేర్కొన్నాడు:

"The text of Mahabharat has unavoidably been much corrupted, in the course of years: and the Adi Parvam, or first book, being a common school book, has suffered more than the rest. The whole has now been revised and the devious readings found in different manuscripts have been recorded; on this foundation a new edition is now in progress, and the first book is in the press."

† 'వర్తమానతరంగిణి' వారపత్రిక, మద్రాసు, 1842 ఆగస్టు 4, 18 తేదీల సంచికల్లోని పుస్తక ప్రకటనలు.

అరణ్యపర్వం దిద్దుబాటు గరిమెళ్ళ వెంకయ్య వంతుకు వచ్చింది, ౭౪ పేజీలోని జాబునుబట్టి చూస్తే. వెంకయ్య ఆ నాడు కడపలో కూర్చొని తీర్పుచేసిన ఆ అరణ్యపర్వం ప్రతిని నేడు మనం మద్రాసులోని ఓ.మే.లై.లో గుర్తించవచ్చు.* మొదటి పేజీలో బ్రౌన్ యిట్లా వ్రాసిపెట్టాడు: "This is the new edition, corrected and ready for printing." వెంకయ్య 1838 డిసెంబరు 17వ తేదీన బ్రౌన్‌కు వ్రాసిన జాబులో "యిదివరకు 150 పద్యములు తీర్చి వ్రాయడ మైనది"—అని తెలియజేశాడు. పై ప్రతిలో ప్రథమాశ్వాసం చివర్న "విళంబి నామ సం॥ మార్గశిర శుద్ధ 15ల్కు సరియైన 1838 డిసెంబరు నెల 1 తేది అరణ్యపర్వం తీర్పు ఆరంభించి ఆ సంవత్సరం పుష్యబహుళ 14లు 1839 సం॥ జనవరి నెల 14 తేదివరకు ఆశ్వాసం సమాప్తం" అని వెంకయ్య వ్రాసున్నాడు. అంటే సగటున రోజుకు సుమారు 9 పద్యాలు చొప్పున తీర్పు చేయగలిగాడన్నమాట. ఆ ప్రతి 598 పేజీలో "వికారి సం॥ అధిక జ్యేష్ఠశుద్ధ 14ల్కు సరియైన 1839 మే నెల 27 తేది వర్కు 7 ఆశ్వాసం సమాప్తం" అనివుంది. ఈ ప్రతిలో అక్కడక్కడా పెన్సిల్‌తో బ్రౌన్ చేసిన దిద్దుబాట్లు చేర్పులు నేటికీ చెడిపోకుండా కనపడ్తున్నాయి.

ఆఖరు పేజీలో యిట్లావుంది: "గరిమెళ్ళ వెంకయ్య కడపలో వుండి మహాభారతం అరణ్యపర్వం తీర్పుచేసి వ్రాసే సమయమందు సంభవించినవి (సందేహాలు): ఆ1.167. ఆ5.64, 365 (పద్యాలలో) అఖండ యతులు. ఆ4. 309 (పద్యంలో) రల లకు విశ్రమం చెప్పియున్నది. ఆ7. 287 అరుణ శబ్దమునకు నెత్తురు అని ప్రయోగంవున్నది. 1 ఆశ్వాసం మొదలుకొని 4 ఆశ్వాసపర్యంతంవున్న మధ్యాక్కరలు అన్నింటికి లక్షణరీత్యా గణములు సరిపడి యతీస్థానం నాలుగు గణాలపైన లక్షణ విరుద్ధమైవున్నది."

ర ర ర

అయోధ్యాపురం కృష్ణారెడ్డికి వ్రాసి కడపబంగళాలో నుంచి అహల్యా సంక్రందన విలాసం ప్రతిని 1831 డిసెంబర్లో బ్రౌన్ తెప్పించుకొన్నాడు. (చూ. పేజి ౪౮).

---

* మ.ఓ.మే.లై.లో తెలుగు వ్రాతప్రతి సంఖ్య డి. 211.

ధరణిదేవుల రామన్న వ్రాసిన దశావతార చరిత్ర*లోని అహల్య కథాభాగాన్ని (7వ ఆశ్వాసం 55వ పద్యం నుంచి 199 పద్యం దాకా వున్న భాగాన్ని) ప్రత్యేకంగా వేరుచేసి వ్రాయించి, దానికి 'అహల్యా సంక్రందన విలాసం' అని ముద్దుపేరు పెట్టుకొన్నాడు.† ఇందులోని పద్యాలకు 1824-25లో యింగ్లీషు అనువాదాలు కూడా చేసి పెట్టుకొన్నాడు ఆ ప్రతిలోనే. ఈ ప్రతిలో మొదటి పేజీలోనే బ్రౌన్ యిట్లా వ్రాసి పెట్టివున్నాడు:

THE LOVES OF AHALYA AND INDRA
A canto from the
DASAVATARA CHARITRA
By
DHARANIDEVULA RAMANNA

*Note.* The Dasavatara Charitra is considered a particularly difficult book being a masterpiece of poetry. In Telugu, as classicks, the Ramayana (of Bhascara) is the easiest. It contains 16,000 or 18,000 stanzas. The Bharatam (of Nannia Bhatt, Errapragada and Ticcana Somiazulu) is the next most difficult 80,000 or 90,000 verses. Then the Bhagavata of Bammera Potu Raz containing more vedanta than the rest, 10,917 verses. All these are easier than the Dasavatara Charitra.

---

* దశాశ్వాసాల దశావతార చరిత్రకు గరిమెళ్ల వెంకయ్యచేత వ్యాఖ్యానాన్ని కూడా వ్రాయించిపెట్టిన ప్రతి వుంది (చూ: మ.ఓ.మే.లై.లోని వ్రాత ప్రతి డి. 528 మూడు సంపుటాలు). ఈ వ్యాఖ్యాన రచన 1834 మార్చి 14 న పూర్తయినట్లు ఆఖర్లో వ్రాసున్నది. 1850 యేప్రిల్ 3 న ప్రత్యేకంగా వొక పద సూచికనుకూడా తయారుచేయించాడు (డి. 531 ఆఖరు పేజీలో పెన్సిల్‌తో బ్రౌన్ యిట్లా వ్రాసున్నాడు: "Finished on 3rd April 1850 at my desire and charge.").

† చూ: మ.ఓ.మే.లై.లోని వ్రాతప్రతి డి. 524. ఇంగ్లీషు అనువాదాలలో వుదాహరణకు 'సురపతి నట్టె చూచుచును...' అనే చంపకమాల పద్యానికి బ్రౌన్ యింగ్లీషు తర్జుమాను "ఆంధ్ర గీర్వాణచ్ఛందము"లో 20 వ పేజీలో చూడవచ్చు.

శృంగారరసం దట్టంగా వుండబట్టి కాబోలు అహల్యకథ బ్రహ్మచారి బ్రౌన్‌ను బాగా ఆకర్షించినట్లున్నది. మడికి సింగన వ్రాసిన పద్మపురాణంలోని వుత్తరఖండం ద్వితీయాశ్వాసంలోని 1 వ పద్యంనుంచి 67 వ పద్యంవరకు గల భాగాన్ని కూడా యిట్లాగే విడిగా వ్రాయించి 'అహల్యా సంక్రందనం' అనే పేరుపెట్టి 1825 మే 18 నుంచి 25 తేదీదాకా యింగ్లీషులోకి తర్జుమాచేసి పెట్టుకున్నాడు.*

సముఖ వెంకటకృష్ణప్పనాయకుడు వ్రాసిన అహల్యా సంక్రందనాన్ని కూడా సేకరించి పెట్టాడు.† ఎందువల్లనో యింగ్లీషులోకి తర్జుమా చేసుకోలేదు. అంతే కాకుండా వేమనారాధ్యుల సంగమేశ్వరుడు వ్రాసి వాపిరెడ్డి చంద్రమౌళికి అంకిత మిచ్చిన 'అహల్య సంక్రందన విలాసము'ను కూడా సేకరించాడు.§ ఇందులో మొదటి పుటల్లో బ్రౌన్ యిట్లా గుర్తుకు వ్రాసిపెట్టుకొన్నాడు: "The original of this was given to me by వేములపాటి వెంకయ్య at Ongole on 29th June 1833." ఇట్లా యెన్ని అహల్య కథలు! తృప్తి దీరా యెన్ని తర్జుమాలు!

ঙ ঙ ঙ

భానుమద్విజయం అనే ప్రబంధం గురించి కూడా చాలా చాలానే చేశాడు బ్రౌన్. మొత్తం నాలుగు ప్రతుల్ని సేకరించాడు (చూ: మ. ఓ. మే. లై. లోని వ్రాత ప్రతులు డి. 607-10). వ్యాఖ్యానం కూడా వ్రాయించాడు (డి. 610, 611). వ్యాఖ్యానంగాకుండా వట్టి ప్రబంధాన్ని తప్పులు దిద్దించి అచ్చువేయించడానికి వీలుగా

---

* చూ: మ.ఓ.మే.లై.లో వ్రాతప్రతి డి. 383. 'ఆంధ్రగీర్వాణచ్ఛందము లో రెండు పద్యాలకు యింగ్లీషు తర్జుమాలు (18, 48-49 పేజీల్లో) ప్రకటించాడు. తెలతెల వేగుడు బులుగులు—అనే పద్యం తాలూకు యింగ్లీషు తర్జుమా యీ వ్రాత ప్రతిలో మొదట వచనంలో చేసింది మరొక విధంగా వుంది. అంటే మొదట చేసిన యీ తర్జుమాను సరిచేసి యింగ్లీషు మీటర్‌లోకి పరివర్తన చేసి ప్రకటించా డని అనుకోవాలి.

† చూ: మ.ఓ.మే.లై.లోని వ్రాతప్రతి డి. 386. ఇటీవల 'రొమెసో్క బుక్స్' వారు యీ కావ్యాన్ని (1971 లో) ప్రకటించినప్పుడు యిందులోనుంచి కొన్ని 'మేలు పాఠాలు' తీసుకోవడం జరిగింది.

§ చూ: డి. 384.

వొక శుద్ధప్రతిని తయారుచేయించాడు. కాగితాలన్నీ చిరిగిపోయి, మహా శిథిలావస్థలో వున్న ఆ శుద్ధప్రతి*లో బ్రౌన్ చాలా విషయాలు వ్రాసిపెట్టుకొన్నాడు:

"If this book is printed; the title should stand thus
భానుమద్విజయం/పద్మావతి పరిణయం
The Adventures of the
Princess Padmavati
poem written by Velagapudi Krishnaia
in the Telugu Language
in five books.

This poem is translated in Tamil, perhaps from Telugu— The title.........† is affixed to it Tammul Ariyum Perumal Kathai.

The Nuptials of Padmavati
also called the
Adventures of Bhanumanta
of Telugu poem in five books
written about the year
Ad. 1740 or 1760
by the poet
VELAGAPUDI KRISHNAYA.

This entertaining and useful book is extremely rare, as it belongs to the Saiva creed, whereas the Vishnu creed prevails in the Telugu country. Fragments of it occur every where, but I never met with more than two complete manuscripts.

The name వెలగపూడి కావ్యం The Velagapudi poem is borrowed from the family name of the author. In English thus......"

ఆఖర్లో వొక 30 పేజీల దాకా ఆశ్వాసంవారీగా యింగ్లీషులో కథాసంగ్రహం వ్రాసి పెట్టుకొన్నాడు. అయిదో ఆశ్వాసంలో వేదాంతం (సాంఖ్యయోగం) గురించి వచ్చే చర్చల సందర్భంలో ప్రత్యేకంగా నోట్స్ వ్రాసిపెట్టాడు కూడా మూడు పేజీల్లో.

---

* చూ: మ.ఓ.మే.లై. లోని వ్రాతప్రతి డి. 606.

† బ్రౌన్ యిక్కడ తమిళ లిపిలోనే వ్రాసున్నాడు.

చంద్రాంగద చరిత్రతో యీ కావ్యాన్ని పోలుస్తూ. "The చంద్రాగద చరిత్ర written by పైడిమర్రి వెంకటపతి is another apocryphal legend similar to the Bhanumad Vijayam in being quite free from braminical superstition but far more learned and classical in style"—* అని వ్రాశాడు.

అవధాన్ల అప్పయ్య చంద్రాంగద చరిత్ర తాళపత్రప్రతిని బ్రౌన్‌కు పంపించి నట్లు (జాబుల పేజీలు ౬౫-౭ లో) వ్రాశాడు. చంద్రాంగద చరిత్రతోబాటు బసవ పురాణం కూడా పంపించాడు. బ్రౌన్ అప్పటికే బసవపురాణాన్ని పూరాగా మధించి వున్నాడు. అంతకు నాల్గేళ్ల క్రితమే బసవపురాణం గురించి వొక పెద్ద వ్యాసం వ్రాసున్నాడు—Account of the Basavapuran: the principal Book used as a religious Code by the Jangams-అని.† అయినా యెక్కడో కడప మండలంలో వొక మారుమూల వూర్లో బసవపురాణానికి మరో తాటాకుల ప్రతి దొరికిందన్నప్పుడు దాన్నికూడా సేకరించకుండా వుండలేకపోయాడు. ఇట్లా బ్రౌన్ తెలుగుపుస్తక సేకరణ దాహానికి వొక పరిమితి అనేది లేదేమోననుకోవలసి వస్తున్నది.

ఠ ఠ ఠ

ఇక యీ జాబుల్లో ప్రస్తావనకు వచ్చిన ఆనందతంత్రం. సౌందర్యలహరి. లొల్ల. చిద్వల్లి. కులార్ణవం వగైరా సంస్కృత గ్రంథాల విషయం గురించి చెప్పుకో వల్సింది చాలానే వున్నా. గ్రంథవిస్తరణ భీతిచేత మానుకోవల్సి వస్తున్నది.

---

* ఇటువంటి పోలికనే సారంగు తమ్మయ్య వ్రాసిన 'వైజయంతీవిలాసము' విషయంలోకూడా తీసుకొచ్చి యిట్లా అన్నాడు: "Throughout this poem there is manifested great vigour and originality of poetry. It has excited the applause of those scholars who have read it, and when published will certainly become popular...The poet evidently held neither the Gods nor the bramins in any respect..."

† Madras Journal of Literature and Science, Madras 1840 October, Pp. 271-92.

అయినా వొక్క ఆనందతంత్రం గురించి స్థూలంగానైనా చెప్పకుండా వుండలేక పోతున్నాను.

ఎట్లాగో తంటాలుపడి కొన్ని తాళపత్ర ప్రతుల ఆధారంతో ఆనందతంత్రానికి వొక శుద్ధప్రతిని వ్రాయించిన తర్వాత సరిచూచి సాపుచేయమని అద్వైత బ్రహ్మయ్య పండితునికి యిచ్చినట్లున్నాడు. ఆయన దాన్ని అట్లా యేదో పైపైన మాత్రమే చూచి దిద్దుబాటు చేసినట్లున్నాడు. చూస్తే తన కళ్ళకు యింకా యెన్నో లేఖనదోషాలు తప్పులు కనపడ్డాయి. వీళ్లను నమ్ముకుంటే కాదనుకొని తానే కరెక్టు చేసుకొన్నాడు. అందుకనే ఆ ప్రతిపైన స్పష్టంగా తెలుగులో "నేనై దిద్దుకొంన్న గ్రంథం యిదే" అని వ్రాసుకొన్నాడు. "This copy is corrected by Brahmaya Pandit—who has however not always corrected the vulgar errors of spelling as శ for స etc..." అని వ్రాసిపెట్టాడు.*

ఈ ఆనందతంత్రానికి ప్రతి పద వ్యాఖ్యనుకూడా సిద్ధం చేయించాడు.† అందులో ప్రథమాశ్వాసం చివర్న యిట్లా వ్రాసున్నది :

"ఇదం శాస్త్రమాధునికం ప్రాచీనంవేతి శంకానిరాసార్థం ఏతన్మూల గ్రంథోదాహరణం। ఇద మానందతంత్రం ద్వాత్రింశత్కోటి గ్రంథసంఖ్యా విశిష్ట నిత్యాషోడశికార్ణవతంత్ర నామక గ్రంథాంతర్గత శతసహస్ర సంఖ్యాక గ్రంథపరిమాణ విశిష్ట భగమాలినీ సంహితాఖ్య గ్రంథస్థిత మిదమానందతంత్రాఖ్య శాస్త్ర మిత్యర్థః। ఆనంద తంత్ర గ్రంథే ప్రథమాధ్యాయస్య టీకారచితా।

"శ్రీమద్రాజాధిరాజాతితర వినుత వాక్చాతురీ వైభవేన। ఫిల్లిప్చార్లీసు బ్రౌన్ఖ్యా పరివృఢమణినా సంతతం పోషితేన। శ్రీమౌద్గల్యాన్వవాయ ప్రజనిత నరసింహార్య నామ్నా ప్రణీతా। టీకా లోకోప కర్త్రీ విజయతు విదుషాం మానసం తోషయంతీ.।''

ఽ ఽ ఽ

ఇట్లా తెలుగు సంస్కృత గ్రంథసేకరణలో, పరిష్కరణలో, టీకలు వ్యాఖ్యానాదులు సంతరించి పెట్టడంలో తన కడప బంగళాలోని 'కమతం' యెన్ని విధాలుగా

---

* చూడు : మ.ఓ.మే.లై.లోని సంస్కృత వ్రాతప్రతి (తెలుగు లిపిలో) డి. 5553, డి.5567 లో కూడా ఆనంద తంత్ర ప్రతివుంది.

† చూడు : డి. 5569.

తోడ్పడుతూ వచ్చిందో, తాను సంకల్పించిన తెలుగు సాహిత్య పునరుద్ధరణ కృషిలో యీ బంగళా నిర్వహించిన భూమిక యెటువంటిదో యివి కొన్ని స్థూల వుదాహరణలు మాత్రమే.

ఇక్కడ ప్రత్యేకంగా గమనించవలసిన అంశం వొకటుంది. ఇదంతా పండితభాషకు సంబంధించి బ్రౌన్ గావించిన కృషికాగా ప్రజాభాషకు సంబంధించి బ్రౌన్ చేసింది యింతకంటే యెక్కువే వుంది. పండితలోకం వేరు, పామరలోకం వేరుగా వున్న దశలో—తెలుగు భాషలో సారస్వతంలో పండితులు ప్రజలు, వీరి వేర్వేరు పరిధులు, వీటిమధ్య గల వైరుధ్యాన్ని గుర్తించి ప్రజాపరిధికే పట్టం గట్టిన వాడు బ్రౌన్. జన వ్యవహారాన్ని పుష్కలంగా గుర్తించాడు. ప్రజల పెదాలమీద నర్తించే వాగ్రూపాలను, సామెతలనూ పలుకుబళ్లనూ సేకరించాడు. లిఖితం గాకుండా ప్రజల నోళ్లలో నానుతూ వచ్చిన చాటువుల్ని, వాళ్లు చెప్పుకొనే కథలూ గాథలనూ, పాడుకొనే పాటల్నూ పాటల చరణాల తునకలనూ సేకరించి వాటిల్లో దర్శనమిచ్చే నుడికారపు సొంపులకూ వ్యావహారిక శబ్దవిరాడ్రూపాలకూ మురిసిపోయే వాడు. సమకాలిక పత్రికలనుంచి వార్తాఖండికల్ని, మామూలు మనుషులు వ్రాసుకున్న జాబుల్నీ కాపీ చేయించి పెట్టాడు. ఇట్లా యెన్నయినా చెప్పుకోవచ్చు.

మచ్చుకు యీ కడప జాబుల్లో వొకచోట—"వసారాలో గచ్చు గుంటలు పడి...." అనే మామూలు వాక్యం తునకను తీసుకొని 'గుంట', 'గుంత' అనే మాండలిక మీమాంసలోపడి బ్రౌన్ వ్రాసిన నోట్సు చూడండి :

"కన్నులు గుంటలు పడ్డవి : his eyes are sunken. గాలిగుంట Vema 1647, a shower of dust, a whirlwind... [వసారాలో గచ్చు గుంటలు పడి the plaster has broken, there are breaches in the wall (sic). N.B. This is the Cuddapah spelling—in the north the word is గుంత]."*

'పలుగురాయి' అనే పదానికి అర్థం చెప్పుకోవడంలో నన్నపార్యుడు వ్రాసిన పద్యాన్నే శిరోధార్యంగా భావించి సంతృప్తి పడ్లేదు. కడపజిల్లా (బద్వేల్ తాలూకా)

---

* మ.ఓ.మే.లై. లోని బ్రౌన్ డిక్షనరీల నోట్స్ డి. 1391 వాల్యూమ్ 2. (ఇక్కడ జాబులో 'గుంతలుపడి' అనే కాపీ చేయబడివుంది. బహుశా అ॥ కృష్ణారెడ్డి 'గుంటలుపడి' అని జాబులో వ్రాసుంటే దాన్ని కాపీచేసిన వుత్తరాది వ్రాయసకాడు తన మామూలు వాడిక ప్రకారం 'గుంతలుపడి' అని వ్రాశాడనుకోవాలి.)

లో 'పలుగురాళ్లపల్లె' అనే వూరుంటే. అక్కడకు వెళ్లి స్వయంగా అక్కడి రాళ్లు చూచి అర్థాన్ని నిర్ధారణ చేసుకొన్నాడు. భారతం (సభాపర్వం)లో వచ్చే 'పలుగురాల కుడ్యముల రుచుల్....' అనే పద్యంలో ఆ పదానికిగల అర్థమేమిటో యెరుకకు తెచ్చుకొన్నాడు.

"పలుగురాళ్లు: R-S. is rendered సన్నపాటి మెరపరాళ్లు i.e. gravel. But I believe this is wrong. I have visited a village named పలుగురాలపల్లె in the Cuddapah District (in the year 1827) and observed that the place was full of white marble slabs."*

"కరడు: Redness of clouds, a lurid glare. This sense I ascertain distinctly in 1838 from a Cuddapah Taluq (sic)who said కొరడు was a rainbow, being a distinct word.

"గాబము: Knot grass infests fields of dry grain. Cuddapah dialect for గాదము."†

ఇట్లా నిరంతరమైన స్పృహతో వేయికళ్లతో వాక శాస్త్రవేత్తగా భాషా పరిశీలన చేస్తూ తెలుగు భాషలోని అందచందాలన్నిట్నీ పోగుచేస్తూ వాటిని వాక శాస్త్ర ప్రాతిపదికపై పరికిస్తూ ముమ్మందు ప్రభంజనంలా తెలుగు దేశాన్ని వూప బోతున్న వ్యావహారిక భాషోద్యమానికి జనకుడయ్యాడనేదానికి యివన్నీ చిన్న చిన్న సాదృశ్యాలు మాత్రమే.

ఇక బ్రౌన్ తెలుగు సామెతల పరిశీలన§ అటుంచి, ఆయన యెన్ని చాటువులు సేకరించాడో, ఆ సేకరించిన చాటువులను పదాలకు అర్థాలను నిర్ణయించుకోడానికి

---

* మ.ఓ.మే.లై.లో బ్రౌన్ డిక్షనరీల నోట్స్ సంపుటాలలో డి. 1391 వాల్యూమ్ 3. [డాక్టర్ కేతు విశ్వనాథరెడ్డి తన 'కడప ఊర్లపేర్లు' (1976, తిరుపతి, పేజీ 355)లో యీ తెలుపురంగు రాళ్లున్నట్లు పేర్కొనలేదు. "స్ఫటిక శాలుగా బండలుగా దొరికే యెరుపు బూడిద రంగుల మిశ్రశిల క్వార్జ్ (Quartz, Silicon dioxide)" గల వూరు"—అంటూ యీ రాళ్లను నల్ల (?) గాజుల తయారీకి వాడతారని కూడా వ్రాశారు.]

† మ.ఓ.మే.లై.లో డి. 1391 వాల్యూమ్ 2.

§ తెలుగు సామెతలు—బ్రౌన్ పరిశీలన అనే విషయం గురించి లోగడ ప్రకటించిన 'బ్రౌన్ లేఖలు...' (1977, తిరుపతి, పేజీలు 89—91)లో చూడవచ్చు.

యెట్లా వినియోగించుకొన్నాడో చెప్పుకోవాలంటే చాలా గ్రంథమే అవుతుంది. కడప మండలానికి సంబంధించిన వొకటి రెండు 'చాటుధార పద్యాలు':

"వంటిమిట్ట అనే వూరిలో కవి పాపరాజు సిద్ధిసాని అనే భోగందానిని ఆశీర్వాదం చేశిన సంగతిని గురించి పుట్టిన పద్యం—

తే.గీ॥ ఒంటిమిట్టను కాపురంబున్న యట్టి
సిద్ధిసానికి సంకల్ప సిద్ధిరస్తు—

ఆమె యిందుకు మారు చెప్పినదేమంటే :

చెలగి నామీద పద్యంబు జెప్పినట్టి
పాపరాజుకు మైథున ప్రాప్తిరస్తు॥"*

మరొకటి. "An epigram written by నక్కలపాల బాలసరస్వతి against the head farmer of Cuddapah says :

ఉ॥ రెడ్లమటంచు క్రొవ్వున చరించి వరాలుగడించి యూరకే
బుడ్లకొలంది నించి కడుపుల్ కడు బెంచి వివేక శూన్యులై
యెడ్లవలెన్ చరించు గుణహీనుల కెక్కడి కీర్తులోరి వి
ద్విడ్లయ కాల గోర్ల చినతిమ్మ తనూభవ తాతభూవరా॥"†

ఈ చాటుధార పద్యాల్ని యే వుద్దేశంతో సేకరించాడో యీ సంపుటంలోని మొదటి పుటలోనే యిట్లా వ్రాసుకొన్నాడు బ్రౌన్:

---

* మ.ఓ.మే.లై.లో బ్రౌన్ డిక్షనరీల నోట్స్ సంపుటాలలో డి. 1391, వాల్యూమ్ VIII.

† పైన పేర్కొన్నదే, వాల్యూమ్ VII. ఈ రెండు చాటువులూ బ్రౌన్ ప్రత్యేకంగా వ్రాయించిపెట్టిన 'చాటుధార పద్యములు' అనే సంపుటం (డి. 2884) లో కూడావున్నాయి. ఈ సంపుటంలో నుంచే—బ్రౌన్ పేరైనా చెప్పకుండా వేటూరి చోరుడు కాపీకొట్టి తన చాటుపద్య మణిమంజరిలో ప్రకటించుకొన్నాడు. ఈ దగా మూలంగా చాటు పద్యా లనగానే మనలో చాలామందికి నేడు వేటూరి గుర్తు కొస్తున్నట్లుగా బ్రౌన్ గుర్తు రావడంలేదు. ఇక్కడ 'head farmer of Cuddapah' అని బ్రౌన్ వ్రాసుంటే, వేటూరి దాన్ని బహువచనం చేసేసి కడప రెడ్ల కందరికీ అంటగట్టాడు (చూ. వేటూరి 'చాటు పద్య మణిమంజరి', మద్రాసు, 1961 (మలి ముద్రణ), పేజీ 174.

"These verses I collected either on account of their beauty, the celebrity of the composers, or their utility in illustrating the language. Many both ancient and modern may be found, that have been preserved by oral tradition alone. I propose to arrange them in books containing four or five hundreds in each...

Such short compositions often have more real, poetical merit than those which being longer are in many cases turgid and lifeless, while these, framed in the inspiration of the moment are true to nature and proportionably attractive.

It is probable that some of these verses will ultimately be found to belong fragments to some regular poem, whether still preserved or lost. Several of these are found in the writings of Appa Cavi and other old grammarians who cite them in support of them only.

The value of such collections is attested by the pains that the soundest criticks in Greek, Latin and other languages have taken in compiling anthologies.

The whole of Vemana's poems with those Bhascara etc. are like the చాటుధార unconnected but being arranged in hundreds are not called చాటు పద్యాలు but శతకాలు.... ....."*

ర ర ర

తన వుద్యోగరీత్యా వచ్చిపడే బదిలీలు తిరుగుళ్లతో నిమిత్తం లేకుండా వొక చోట స్థిరంగా చిన్న యిల్లు వంటిది వొకటుంటే—కొందరు పండితులను అందులో కుదురుగా వుంచి, తాను తలపెట్టిన తెలుగు సాహిత్య కార్యక్రమాలను ప్రశాంతంగా నిర్విఘ్నంగా జరిపించవచ్చుననే ఆశయంతోనే కడపలో బ్రౌన్ యీ బంగళాను కొనిపెట్టాడనుకోవాలి. అందువల్లనే యిన్ని పనులు అనుకొన్నవి అనుకొన్నట్లుగా వాళ్లచేత చేయించగలిగాడు. లేకుంటే తనకు బదిలీ వచ్చినప్పుడెల్లా వీళ్లను కూడా తనవెంట తరలించుకు పోవాలంటే పెద్ద యాతనగా వుండేది గదా.

ఈ బంగళాలో వొక మూల గదిలో చిన్న సాహిత్య కర్మాగారంలా వొకటి పనిచేస్తూ, పండితులు తాళపత్ర ప్రతులు ముందరేసుకొని శుద్ధ ప్రతులు తయారు

---

* చూడు: మ.ఓ.మే.లై.లోని బ్రౌన్ చాటుధార పద్యాల సంపుటి డి. 2884.

చేస్తూ వ్యాఖ్యానాలు కూరుస్తుండేవారు. నిలవ నీడలేకుండా పోయిన తెలుగు కావ్య సరస్వతిని ఆహ్వానించి తన బంగళాలో వొక సాహిత్య పర్ణశాల యేర్పరిచి ఆ వాగ్దేవి నిండు ముత్తయిదులాగా నడయాడేలా చేయగలిగాడు బ్రౌన్.

మరోమూల వొక చిన్న పాఠశాల (ములుపాక బుచ్చయ్య మాటల్లో 'పాఠక శాల') నడుస్తూ వుండేది. "బహూమంది విద్యార్థులు.... నేను తమరు సుకృతంగా పాఠకశాలబెట్టి అనేకమందికి ఆంధ్ర గీర్వాణ కావ్యనాటకాలంకారాది గ్రంథములు అభ్యసింపచేస్తూ వున్నాను" అని ౬౨ పేజీలో వచ్చే జాబులో వ్రాసిన దాన్నిబట్టి ఆ పాఠకశాల స్వరూప స్వభావాదులను వూహించుకోవచ్చు. అయోధ్యాపురం కృష్ణా రెడ్డి జాబు (౪౧ పేజీ)లో "నా తమ్ముడు అయిన నారాయణరెడ్డి అనేవాడు....పార శిన్ని తమ బడిలో అభ్యశించినాడు" అని వ్రాయబట్టి పారశీ బడి కూడా మరొకటి నిర్వహించేవాడని అనుకోవాలి.*

ఇదే కృష్ణారెడ్డి (౨౭ పేజీలో) 1829 యేప్రిల్ 13 న "హెగ్గుదార వారికి పారసీతో అర్జీ" వ్రాసిచ్చినట్లు చెప్పుకొన్నాడు. వీటిని బట్టిచూస్తే ఆ రోజుల్లో కడప జిల్లాలో అధికార భాషగా తెలుగుతోబాటు యేదో వొక స్థాయిలో 'పారశీక' భాష రాజ్యం చేస్తున్నట్లు అర్థం చేసుకోవాలి.

ఈ స్థితిని గురించి బ్రౌన్ తన స్వీయ చరిత్రలో యిట్లా వ్రాశాడు:

"I was then sent to the Cuddapa (Kadapa) district; where I presided in a Police office for two years; all the work being carried on in Telugu, Kannadi, Marata or Hindustani."†

ఇక్కడ హిందూస్తానీ అంటే పారసీక భాషకు సమానార్థకంగా మనం గ్రహించాలి. ఒక రెండు దశాబ్దాల తర్వాత బ్రౌన్ మద్రాసు ఫోర్ట్ సెంట్ జార్జి కాలేజి

---

* At different times I opened free schools with native tutors, to instruct natives :n Telugu and Hindustani. In 1821 two such schools began at Cuddapah—అని తన స్వీయచరిత్ర (1866) లో వ్రాశాడు బ్రౌన్.

† 1866 నాటి బ్రౌన్ స్వీయచరిత్ర.

బోర్డు సభ్యుడుగా పర్షియన్ ట్రాన్స్‌లేటర్‌గా ఆ కాలేజీలో ఆ భాషా బోధనను అపు దల చేయించాడు. దీన్ని గురించి ఆయనే యిట్లా చెప్పుకొన్నాడు:

"I was appointed Persian Translator to Government in January 1838; and in September I was nominaied to a seat (without pay) at the College Board......My situation as Persian Translater and examiner enabled me to point out to the College Board that Persian was useless in Madras; and at last I succeeded in abolishing the pretended study of Persian."*

అంటే యిరవై ముప్పైయేళ్ళలో యెంత మార్పు జరిగిందో చూడండి.

ఈ జాబుల్లో పెక్కుచోట్ల కడపజిల్లాలో చేరిన ప్రాంతంగా కంభం ప్రస్తావన కొస్తుంది. నిజం కూడా అంతే. కానీ డాక్టర్ బూదరాజు రాధాకృష్ణగారు వ్రాసినట్లు కడప 'కంభం జిల్లా'లో మాత్రం చేరివుండలేదు. "క్రీ. శ. 1807 లో కడప 'కంభం జిల్లా'లో చేరింది; 'బళ్లారి జిల్లా'కు సిద్ధవటం కార్యస్థానమైంది"†—అని బూదరాజు గారు వ్రాసింది శుద్ధ తప్పు. ఏనాడూ కడప కంభం జిల్లాలో చేరివుండనూ లేదు. సిద్ధవటం బళ్లారి జిల్లాకు కార్యస్థానంగానూ లేదు. స్వల్పకాలంపాటైనా సిద్ధవటం కార్య స్థానంగా వుణ్ణింది కడపజిల్లాకు మాత్రమే. ఆ కడపజిల్లాలోనే కంభం చాలా కాలందాకా చేరి వుణ్ణింది.

దత్తమండలాల (సీడెడ్ డిస్ట్రిక్ట్స్)కు మొదటి ప్రిన్సిపల్ కలెక్టరుగా 1800 నవంబర్ 1 వ తేదీన మన్రో దొరను వేశారు. అప్పట్లో ఆయనకింద నాలుగుచోట్ల నల్గురు సబార్డినేట్ కలెక్టర్లు పనిచేస్తుండేవారు. హర్పనహళ్లి, కడప, ఆదోని, కంభం—యీ నాలుగుచోట్లనుంచి ఆ సబార్డినేట్ కలెక్టర్లు పనిచేసేవారు. 1807 లో మన్రో దత్తమండలాల ప్రిన్సిపల్ కలెక్టర్‌గా రాజీనామాచేసి లండన్ వెళ్లాడు.

ఆయన రాజీనామా తర్వాత దత్తమండలాలను రెండు జిల్లాలుగా—బళ్లారి, కడపజిల్లాలుగా—విభజించి యిద్దరు ప్రిన్సిపల్ కలెక్టర్లను వేశారు. అప్పటి కడప జిల్లాలో కంభం, కదిరి, దూపాడు, చిత్తూరు జిల్లాలోని వాయల్పాడు ప్రాంతాలుకూడా

* 1872 నాటి బ్రౌన్ స్వీయచరిత్ర.

† తెలుగు అకాడమివారి ప్రచురణ "తెలుగు మాండలికాలు (కడపజిల్లా)", సంపాదకుడు: బూదరాజు రాధాకృష్ణ, హైదరాబాదు, 1972, పేజీ 2.

చేరివుండేవి. కంభంలో సబార్డినేట్ కలెక్టర్‌గా వుంటుండిన చాప్లిన్ దొర కడపజిల్లాకు మొదటి కలెక్టర్‌గా చార్జి తీసుకొన్నాడు. ఈయన కడపజిల్లా ప్రిన్సిపల్ కలెక్టర్‌గా చార్జి తీసుకోగానే తన హెడ్‌క్వార్టర్స్‌ను సిద్ధవటానికి మార్చుకున్నాడు. ఇదీ చరిత్ర. "His (Chaplain's) first act was to transfer his head-quarters from Cumbum to Sidhout...which, for some more years subsequently remained the head-quarters of the district" — అని 'కడప జిల్లా మాన్యువల్' (పేజీ 126)లో వున్న వాక్యం డాక్టర్ బూదరాజుగారి తికమకకు కారణమై వుండొచ్చునసుకొంటున్నాను.

ౘ ౘ ౘ

ఈ సందర్భంలోనే యీ అధ్యాయంలోని జాబుల్లో ప్రయుక్తమైన కొన్ని కదంబ విషయాలు పేర్కొనవల్సి వుంది.

* సేద్యం: తన బంగళా-తోటలో రకరకాల చెట్లు చేమలు—'సన్న చెట్లు', 'లావుచెట్లు' వేసి వ్యవసాయం చేయించేవాడు. వీటి సేద్యం గీద్యం కాపుదల విషయమై సేద్యగాళ్లు, రఘువాలీలు, యెద్దులు, యేతాలూ—యిట్లా పెద్ద తతంగమే వుండేది. ఈ తోటలో ద్రాక్షచెట్లు బాగానే కాపు కాస్తుండే వనుకోవాలి. '86 ద్రాక్ష గొలలు అంపించియున్నాను....పాదిరి దొరవారికి....' అని అ. కృ. రె. వొక జాబు (పేజీ ౨౫)లో వ్రాశాడు. కొన్ని అమ్మకం చేయిస్తుండేవాడు కూడా: 'మామిడి పండ్లు కాయలను....యెనభై పండ్లు మెస్తరు కేపటన్ కిలి ధొరవారికి....' (పేజీ ౩౦). ఇతర ఫలవృక్షాలతోబాటు, ఆ రోజుల్లో బ్రౌన్ కడప భూమిలో ద్రాక్షచెట్లు పెంచడం ఆశ్చర్యంగానే వుంది. ఈ మధ్యకాలంలో యెందువల్లనోగానీ కడపలో ద్రాక్ష సేద్యం అంతగా వున్నట్లు లేదు. పది పదిహేనేళ్ల యివతల యిక్కడ కొందరు ద్రాక్ష తోటలు వేయడం మొదలుపెట్టారుగానీ పెద్దగా యెక్కి రాలేదు.

* సారాయి: రాజు పెద్ద భార్య పతివ్రత అయితే మరి చిన్న భార్య సంగ తేమిటన్నట్లు. బ్రౌన్ యాభయ్యో పడిలో పడ్డ తర్వాత వైన్లు గియిన్లు వగైరా మద్య పానాలకు పూర్తిగా స్వస్తిచెప్పి గట్టిగా 'ప్రొహిబిషన్' విధించుకొన్నట్లు తన స్వీయ చరిత్రలో వ్రాసుకోబట్టి యాభయ్యేడు వచ్చేంతవరకైనా సుష్టుగా తాగేవాడు—అని అనుకోవాలి.

"...Towards the close of my fiftieth year...latterly I had laid aside wine and all such poisons, and now was a tee-

totaler.—" † వొట్టి తాగడమేకాదు, పెళ్లీ పెడాకులూ లేవు గనుక, యెప్పుడూ సాహిత్య గొడవలే గాకుండా అడపాదడపా అడవుల్లో వేటా వినోదాదుల్లోనూ కాలక్షేపం చేసేవాడు. కడపదగ్గర్లో 'కిన్నెర లింగసాని' వంటివాళ్లతో లైంగిక సంబంధాలు కూడా వున్నట్లు కొన్ని అస్పష్ట దాఖలాలున్నాయి. బ్రౌన్ మద్యపాన సేవనంగూర్చి యీ జాబుల్లోనే కొన్ని సాక్ష్యాలు లేకపోలేదు. ౨౮-౨౯, ౪౩ పేజీల్లోని అ.కృ.రె. జాబుల్లో సారాయి ప్రస్తావనలు వుండనే వున్నాయి. కృష్ణారెడ్డి న్యాయమైన ధరకు ('వాజిబిధారణ ప్రకారం') 120 కాళీ సీసాలు అమ్మగా 7½ రూపాయలు వచ్చినట్లు ౪౩ పేజీలో వ్రాశాడు. ఇవన్నీ బ్రౌన్ తాగి కాళీచేసిన మద్యం సీసాలే అనుకోవాలి.

* ఇల్లే కాలేజి: ఎక్కడున్నా తన యింటిని కాలేజీ అని పిల్చేవారని(చూడు: ౪౪ పేజి) బ్రౌన్ తన స్వీయచరిత్రలో వ్రాసుకొన్నాడు: "...and I saved no money—indeed there were always from ten to twenty Bramhans and Sudras in my pay; employed in transcribing native authors, in preparing correct editions, in framing indexes and commentaries...Thus there were three separate sets of Brahmans engaged under my roof, which people called 'Brown's College." §

ఆ రోజులు కాబట్టి 'కాలేజి' అన్నారు. ఈ రోజుల్లో అయితే వొక 'యూనివర్సిటీ' అనివుండేవారేమో. తన యింట్లో యెప్పుడూ అంతమంది పండితులకు పన్లు కల్పించి తెలుగు సాహిత్య సముద్ధరణ మహాయజ్ఞాన్ని జరిపిస్తూ వుండేవాడు కాబట్టి, తెలుగు విద్య దేదీప్యమానంగా వెలుగొందుతూ తెలుగు శారద గజ్జెల గలగలలు వీనుల విందు చేస్తూండబట్టి ఆ బంగళాను ఆ రోజుల్లో వొక కాలేజీ అనడంలో ఆశ్చర్యమేముంది? అందువల్లనే యీ బంగళాకు సంబంధించిన జాబుల్లో కాలేజా కొట్టు, కాలీజా కచ్చేరి, కాలేజీ పండితులు, కాలీజా పని—అనే పదాలు తరచు ప్రయుక్తమవుతూ వచ్చాయి.

---

† మిన్నెసోటా (అమెరికా)లోని ఏమ్స్ లైబ్రరీలో భద్రపరచ బడివున్న బ్రౌన్ స్వీయ చరిత్ర లిఖిత ప్రతి "Narrative of the Literary life of Charles Philip Brown, late of the Madras Civil Service (1854)."

§ బ్రౌన్ స్వీయచరిత్ర రెండవ యెడిషన్: "Literary Life of Charles Philip Brown," London, 1872, Pp. 13, 20.

* అప్పులు—ఆర్థిక విషయాలు: తన ఆర్థిక స్థితిగతుల గురించి బ్రౌన్ తన స్వీయ చరిత్రలో వ్రాసుకొన్న దాంట్లోనుంచి వొక రెండు వాక్యాలు:

"Four or five years I had lived in very humble style, giving every farthing to pay first my brahmans and secondly my debts. Even when in the greatest difficulties I gave from two to three hundred rupees a month to my book schemes..."†

బహూ కాలందాకా బ్రౌన్‌ది అప్పుల బ్రతుకుగానే వున్నింది. వచ్చే జీతంరాళ్లు చాలేవి కావు. అప్పులుతెచ్చి తన సాహిత్యోద్ధరణ కార్యక్రమాలకు పెట్టేవాడు. ఈ సాహిత్య వ్యసనంకోసం తన సొంత అలవాట్లను కొంతమటుకు తగ్గించుకొనేవాడు కూడా—'సొంతలాభం కొంతమానుకు గట్టిమేల్ తలపెట్టవోయ్' అని గురజాడ దేశభక్తి గేయంలో అన్నట్లు. ఈ జాబుల్లో యిందుకు కొన్ని ఆధారాలు వున్నాయి. "వోబళరావు దగ్గెర తమరు రెండు మూడు మారులు అయివజు తీసుకొని పత్రాలు వ్రాశి యిచ్చివున్నారు...." అని బ్రౌన్ ప్రోనోట్ల గొడవల గురించి వొక జాబు (పేజీ ౨౮) లో అ. కృ. రె. వ్రాశాడు. ఒకరి అప్పు తీర్చడానికి మరొకరిదగ్గర అప్పు పట్టేవాడు. మాణిక్య మొదలారి అప్పు చెల్లించడానికి గజ్జెలరెడ్డిని అడ్డం పెట్టవలసివచ్చింది (పేజీ ౩౧).

ఒకసారి కడప బంగళా బాడుగ డబ్బులోనుంచి ఖర్చులుపోగా మిగిలిన 40 రూపాయలు కృష్ణారెడ్డి పంపవలసివస్తే—కడప షావుకారు దగ్గర 'హుండీ' తీసుకొని బందరులో వొక షావుకారుకు చూపితే డబ్బుయిచ్చే 'బ్యాంకింగ్' పద్ధతి గూర్చి బ్రౌన్‌కు వ్రాస్తాడు (పేజీ ౧౨). 40 రూపాయల హుండీకి కమీషన్ ఖర్చు (హుండావణి) $1\frac{1}{4}$ రూపాయలు.

* బ్రౌన్ జీతబత్తేలు: ఆఖ్రోజుల్లో వేల రూపాయల జీతంలోకి వచ్చినా, తెలుగు సాహిత్య కృషిలో ప్రవేశించిన తొలి దశనాటికి బ్రౌన్ జీతం పట్టుమని 300 రూపాయలైనా వున్నట్లులేదు. వేమన పద్యాలైన తర్వాత మహాభారతంలోకి వచ్చేనాటికి 1825లో ఆయన జీతం $262\frac{1}{2}$ రూపాయలు మాత్రమే. జీతంగాక హౌస్ రెంట్ అలవెన్స్ 35 రూపాయలు, టెంట్ (డేరా) అలవెన్స్ నెలకు 42. టూర్ వుంటే దేరా అలవెన్సు రోజుకు అదనంగా 2 రూపాయలా 10 అణాల చొప్పున

† మిన్నెసోటా (అమెరికా) లైబ్రరీలోని బ్రౌన్ స్వీయచరిత్ర వ్రాతప్రతి.

వుండేది. (౨౪ పేజీలో- 200 రూపాయలకు అమ్ముడుబోయిన డేరాను బ్రౌన్ యీ అలవెన్స్‌ల సంబంధంగా కొనుక్కున్నదై వుండొచ్చు). ఈ బత్తేలతోబాటు 'అమానీ' (ప్రభుత్వ) భూములపై వచ్చే శిస్తు గిస్తు ఆదాయాల్లోనుంచి స్వల్పంగా ఫసలీకి యింత శాతం అని కొంత కమీషన్ కూడా లెక్కగట్టి యిచ్చేవారు. 1826 జనవరిలో వొక్కదెబ్బన జీతం బాగానే పెరిగినట్లున్నది. అడిషనల్ అలవెన్స్‌తోకల్పి నెలకు రు. 525 లు అయింది.*

ఇంత చిన్న జీతంలో వున్నప్పుడే సాహిత్య సంబంధమైన అంత గట్టి సంకల్పం కల్గడం, ఆ సంకల్ప సిద్ధికోసం ఖర్చుకు వెనకాడకుండా రంగంలోకి దిగి బ్రౌన్ కృషి సల్పడం యిక్కడ గమనించదగ్గ విషయం.

అవీ-యివీ: ఈ జాబులు వ్రాసినవారిలోనూ, వీటిల్లో ప్రస్తావనకు వచ్చిన వారిలోనూ యెక్కువమంది నేటి మన చరిత్రకారుల దృష్టిలో అనామకులు కావచ్చుగానీ బ్రౌన్ దృష్టిలో ఆలాకాదు. ఆయన వీర్ని గురించి అక్కడక్కడా శకలప్రాయంగా వ్రాసిపెట్టిపోయిన వివరాలనుబట్టి చూస్తే అట్లా అనిపించడంలేదు. అయోధ్యాపురం కృష్ణారెడ్డిని గురించి రెండుచోట్ల రెండు జాబులకు పాదపీఠికల రూపంలో యేమి వ్రాశాడో వాటిదగ్గరే యివ్వడం జరిగింది. ౩౧ పేజీలో వొక జాబులో ప్రస్తావన కొచ్చిన గజ్జెలరెడ్డి యెవరో మనకు యిప్పుడు యేమీ తెలియడంలేదుగానీ, బ్రౌన్ వ్రాసిన దాన్నిబట్టి చూస్తే ఆనాడు ఆయనవద్ద పెద్ద లైబ్రరీయే వుండేదని అర్థమవుతుంది: "Libraries open to me; at Masulipatam that of Mamidi Vencaya, at Punganoor that of Raja, at Madras that of Langar Papaya~"† అని కడపలో "that of Gajal Reddi" వారి సరసనే పేర్కొనబట్టి గజ్జెలరెడ్డి సాహిత్య స్తోమతగురించి మనం అంచనా కట్టుకోవచ్చు.

---

* హైద్రాబాదు, ఆం. ప్ర. స్టేట్ ఆర్కైవ్స్‌లోని గోదావరి డిస్ట్రిక్ట్ రికార్డ్సు వాల్యూమ్ నెం. 4640, పేజీలు 261_63 (1825_26 సంవత్సరాల మధ్య కాలంలో బ్రౌన్ జీతబత్తేల వివరాలు 'వివరగతి'గా యిందులో యివ్వబడి వున్నాయి).

† మ.ఓ.మే.లై. లో బ్రౌన్ డిక్షనరీ నోట్సుల సంపుటం నెంబర్ డి. 3140. (శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ప్రచురణ 'బ్రౌన్ లేఖలు...' పేజీలు 126_7లో ఈ భాగంలో కొంత ముద్రితమైవుంది.)

తనకు పరిచయమున్న తెలుగువార్నిగురించి బ్రౌన్ యిక్కడే వ్రాసిపెట్టిపోయిన వొక పెద్ద జాబితాలోనుంచి కడప ప్రాంతీయులైనవారికి సంబంధించిన వివరాలు:

"...ములుపాక Buchana Sastri in Nandaloor wrote the వెంకటేశ్వర మహాత్మ్యం. మాఘ్య మహాత్మ్యం in the Uttara Kanda of the Padma Purana· Chincholi Appanna Chari in Pata Cudpa has a noble Sanscrit library. Runga Reddee in Nosum has a noble library సంస్థానం. In pallapaud of Duoor the son of Raghavachari has a library, is a good fellow. Condoori Chitambaram of Mogallur (south of Guntoor) near Cumbum offers me his library (a bullock load). In avok of Covilaguntla lines అక్షింతల సుబ్బారాయ శాస్త్రి who resided 30 years in Bengal, knows the Bengali & is a profound scholar......

In Duoor, Gudipaud, in the Curnam Lakshmipathi's house is a Telugu library. Vangipuram Venkata Cristama Chari, very humble & proper fellow at Nagireddi Pully in Cambam at 32 is a fire scholar and poet. Miduturi Lachminarasu, Curnam at Uyyalavada 3 amadas from Cumbum is a superior scholar and poet. Manchala Kristam Raz brought me 3 chapters of Appa Cavi which he knows by heart..."

బ్రౌన్ ప్రకటించిన కొన్ని గ్రంథాలు, వ్యాసాలు— ప్రత్యేకించి కడపకు సంబంధించినవే వున్నాయి. ఉదాహరణకు "మిరాసివాదం...." అనే రెండు సంపుటాల ఆంధ్రాంగ్ల గ్రంథం. కడపజిల్లా ప్రొద్దుటూరు దగ్గర్లోని రామేశ్వరం గ్రామ కరణీకపు మిరాశీ వివాదాల నేపథ్యానికి సంబంధించిన గ్రంథం యిది. అట్లాగే "Telugu Spells" అనే వ్యాసం. కడపలో 1839 లో జరిగిన వొక హత్య కేసుకు సంబంధించిన కొన్ని డాక్యుమెంట్ల తర్జుమాయే. మద్రాసు పత్రిక యీ వ్యాసం ప్రకటిస్తూ జతచేర్చిన 'యెడిటోరియల్ నోట్'ను బట్టి దీని స్వరూపాన్ని వూహించుకోవచ్చు.

"......the following translations, which were made by Mr. C. P. Brown, late Telugu Translator to Government, while he was Registrar of the Madras Sadr Court. The translations were made from two documents, which were referred to in the evidence of the prosecutor in a criminal case, F. A. No. 1435 of 1839,

No. 22 of the Cuddapah Calendar for the first Sessions of 1839, and sent up to the Faujdari Adalat in return to their precept of the 5th August 1839. The prisoner appears to have been indicted for the murder of a girl named Venkatasubbamma, whom he had enticed into his house and killed with a view of using her corpse as an ingredient in one of the following incantations. The murder took place on a Saturday evening and the body was found next day in a pagoda near the prisoner's house."†

ఠ ఠ ఠ

ఈ పుస్తకం అచ్చు పూర్తవుతున్నదశలో—లండన్‌లోని 'ఇండియా ఆఫీస్ లైబ్రరీ & రికార్డ్స్' వారినుంచి యింతకాలం అసూర్యంపశ్యలుగావున్న బ్రౌన్ వ్రాతప్రతుల సంచయంలో మొదటి కిత్తాగా—దాదాపు 22 మైక్రోఫిల్మ్ రీళ్ళు—ఇంచుమించు 12 వేల పేజీలకు ఫోటో ఫిల్మ్ ప్రతులు వచ్చాయి. మిగతా సగ భాగం బ్రౌన్ వర్ధంతినాటికి అంటే డిసంబరు 12 నాటికి రావచ్చునని ఆశ. బ్రౌన్ విద్యార్థిగా యీ ఫిల్మ్ ప్రతులలో శ్రద్ధగా పరిశీలించవలసిన విలువైన విషయాలు అనేకం కనపడ్తున్నాయి. ఈ 12 వేల పేజీలనూ చదివి ముఖ్యమైన విశేషాలను గుర్తించి వర్గీకరించడానికి దీర్ఘకాలమే అవసరమవుతుంది.

ఈలోగా యీ మైక్రోఫిల్మ్ రోల్స్‌ను త్వరత్వరగా తిప్పుకొంటూ చూచిన దాన్నిబట్టి వొక ముఖ్యమైన విషయం అర్థమైంది: బ్రౌన్ వుండిపోయింది లండన్‌లో అన్నమాటేగానీ, తెలుగు పుస్తక ప్రపంచం మధ్యనే బ్రతుకుతూ వచ్చాడు. తెలుగు సాహిత్య గాలులనే వూపిరిగా పీల్చుకొంటూ వచ్చాడు. శాశ్వతంగా ఇండియా వదిలి 1855 లో లండన్ చేరుకున్న బ్రౌన్ 1884 డిసెంబరు 12 దాకా జీవించాడు. ఈ మధ్యకాలంలో ఇండియాలో అచ్చయిన తెలుగు పుస్తకాలన్నీ-దాదాపుగా అన్నీ-చదువుతూనే వున్నాడు. చదివి ముఖ్యమైన విశేషాలు రికార్డు చేసుకొంటూనే వున్నాడు. ఒక్క మాటలో చెప్పాలంటే—తెలుగు దేశంలోని 'లేటెస్ట్ ట్రెండ్స్'తో తన పరిచయాన్ని పోగొట్టుకోకుండా, తన తెలుగు విజ్ఞానాన్నీ పరిజ్ఞానాన్నీ కాపాడుకొంటూ వీలున్నంతవరకూ వృద్ధిచేసుకొంటూనే వున్నాడు.

కొన్ని ఉదాహరణలు చెప్పాలంటే—చిన్నయసూరి బాలవ్యాకరణం, మిత్రలాభ మిత్రభేదాలు, వీరేశలింగం గ్రంథాలు, సామినీన ముద్దు నరసింహనాయని

---

† MJLS, 1864 July సంచికలో ఈ వ్యాసం ప్రకటితమైంది.

హితసూచని. నరహరి గోపాలకృష్ణమ శెట్టి రంగరావు చరిత్ర 'నవల'నూ, మదన కామరాజు కథలనూ, అచ్చవుతూ వచ్చిన తెలుగు కావ్యాలనూ, ఇంకా యీనాడు మనం పేరైనా వినని పెక్కు తెలుగు గ్రంథాలనూ లండన్‌లో వుంటూనే శ్రద్ధగా పఠిస్తూ వచ్చాడు. తన డిక్షనరీలు, గ్రామర్ సంపుటాలను పెంపు చేసుకొంటూ వచ్చాడు. తెలుగు శబ్ద స్వరూపాన్ని మథిస్తూ వచ్చాడు.

కడపకు సంబంధించి బ్రౌన్ లండన్‌లో యీ వ్రాత ప్రతుల్లో నోట్ చేసుకొన్న కొన్ని విషయాలను యీ సందర్భంలో పొందుపరచకుండా వుండలేక పోతున్నాను. ముందుగా కడప వూరుపేరుకు సంబంధించి వొకచోట పెద్ద నోట్ వ్రాసి పెట్టివున్నాడు. ఆ 'నోట్'ను యథాతథంగా దిగువ యిస్తున్నాను:

"కడప: The town Cadapa denotes a doorway, and the people there, fancy the town was so named because it is on the route to the holy city Tirupati తిరుపతి (Tripetty of the maps). Thus the city of Genoa in Italy was formally called Janua, as being this gate by which the Gauls entered. గడప a threshold is the Root in A of గడచుట to pass: the passage or place of crossing. So in Hebrew......'Ober and in Arabic.........' Obr. In some Geographical dictionaries which copy the assertions made by Sir Charles Wilkins we are assured that the name was Cripa, the Sanscrit word for grace, favour. But this is a mistake, and arose thus:—the Musulmans were unable to pronounce the hard D in Kadapa and changed it into the hard R, calling it Kurpa or Kripa. There upon Wilkins guesses it to be Kripa a notion unknown to all natives. But the people on the spot deny that its name was either Kripa or Kirpa. It was thus affirm merely Kadapa a threshold; also pronounced Gadapa. Some natives fancy it was so called as being one way to shrine at Tirupati: an etymon as absurd as that imagined for Genoa from Janua."*

ర ర ర

* ఊర్ల పేర్ల పైన అనర్ఘ పరిశోధన చేసిన డాక్టర్ కేతు విశ్వనాథరెడ్డి తన తీసిస్ "కడప ఊర్ల పేర్లు" (తిరుపతి, 1976, పేజీ 211) లో కడప వూరుపేరు విషయమై యీ లోతులు స్పృశించలేదు. అందరూ కడప అని వుచ్చరిస్తుంటే 'కృప' శబ్ద భవమనే సంస్కృతీకరణకు తావు వుండేది కాదేమో. ముస్లిమ్‌లు మొదట్లో కడఫ అని వుచ్చరించలేక కరప, కర్ప అని అంటూండటంతో—అది

కడప జిల్లాలోని దువ్వూరు గ్రామపరంగా యేర్పడినట్లు బ్రౌన్ పేర్కొన్న వొక సామెత. (తాను లండన్లో రికార్డుచేసిన డజన్ల సామెతల్లో యిదొకటి): "ఏ వూరే ఏతామా అంటే దువ్వూరే దూలామా అన్నదట." Duvvuru is in the Kadapa district. Davv + oor is the dusty town. The best place for water works"— అని వివరణ కూడా వ్రాసిపెట్టుకొన్నాడు.

ర ర ర

తన కడప వుద్యోగ కాలంలోనే కడపలో మిషనరీగా వుంటున్న (తెలుగులో ప్రావీణ్యం సంపాదించిన) హోవెల్‌కూ బ్రౌన్‌కూ పరిచయమేమైనా వుంటుందా అని ఆధారాలకోసం అన్వేషిస్తుంటే (తన కడప బంగళా-తోటలో పండిస్తుండిన ద్రాక్ష గొలలు పంపుతూ వచ్చిన పాదిరిదొర హోవెల్ అయివుండొచ్చు) వొకచోట బ్రౌన్ తెలుగు దేశంలోని వివిధ పట్టణాల్లో వుంటూండిన పెక్కుమంది మిషనరీలను గూర్చి

---

సరికాదయ్యా హాజరత్లూ, 'కృప' అనే పదోత్పత్తి క్రమాన్ని వూహించడానికి కారణమై వుంటుంది. కడప 'కృప' శబ్దభవమనే సంస్కృతీకరణ ప్రభావం వెనుక యింత చరిత్ర వుందని యీ బ్రౌన్ నోట్ మూలంగా విశదమవుతున్నది. ఈ సంస్కృతీకరణ వాదానికి సంబంధించి 'కళా ప్రపూర్ణ' జనమంచి శేషాద్రి శర్మను ప్రస్తావించారు డాక్టర్ కేతు. ఎప్పటివాడీ కళాప్రపూర్ణుడు? కడప కృప శబ్ద భవమనే వాదానికి శేషాద్రిశర్మ మూలపురుషుడేమీ కాదు. శర్మకంటే దాదాపు నూరేళ్ళ క్రితమే విల్కిన్స్ (Wilkins) యీ తప్పుడు డెరివేషన్‌ను ప్రచారంలోకి తెచ్చాడు. ఇట్లాగే తెలుగు, తెనుగు—'తెన్' శబ్దభవమనే వాదానికీ, శుష్కమైన మైతాలజీ గొడవను కాదనే హేతుబద్ధమైన డెరివేషన్‌కు మూలపురుషుడుగా ఆచార్య గంటిజోగి సోమయాజిగార్ని పేర్కొంటూ వుంటారు మనవాళ్లు. ఆ క్రెడిట్ సోమయాజిగారికి అంటగట్టడంలో యేమాత్రం సబబులేదు. ఎవరి సిద్ధాంతాన్నో అప్పటంగా తెచ్చుకొని తనదిగా ముద్రవేసుకున్నారాయన. ఈ సోమయాజిగారికంటే దశాబ్దుల క్రితమే యల్. డి. బార్నెట్ (L. D. Barnett) 1912లోనే తెలుగు 'తెన్'శబ్దభవమని స్పష్టంగా సూచించాడు: "The most reasonable derivation, however, is from *ten*, 'south', so that *tenugu* would mean 'southern'; and this may well have become corrupted into *telugu* ..." (చూడు: A Catalogue of the Telugu Books in the Library of the British Museum, L. D. Barnett, London, 1912, Preface page.)

వ్రాస్తూ హొవెల్‌ను గురించి యిట్లన్నాడు: "The Protestant missionary formerly (1820s) at Kadapa was the Rev. W. Howell, He was born among the Telugus and spoke Telugu fluently."

ర ర ర

"Plans for the Revival & Promotion of Telugu Literature 1825—1867"—అనే వొక చిన్న సంపుటంలో చాలా చాలా విషయాలు వ్రాసిపెట్టి పోయాడు బ్రౌన్. తాళపత్ర గ్రంథాల సేకరణ, కాగితాలపై వాటికి కాపీల తయారీ, కావ్యపరిష్కరణ పద్ధతులు, శుద్ధప్రతుల తయారీ, వివిధ పద్దులకింద అయ్యే ఖర్చులు, వ్రాయసగాళ్ల కూలీలు, వ్యాఖ్యానాలు సమకూర్చడం, పదసూచికలు రూపొందించడం, తెలుగు ముద్రణలో ప్రవేశపెట్టతగు మార్పులు, అక్షరాల విరామ చిహ్నాల అచ్చుల పోత, తెలుగు లైబ్రరీ యేర్పాట్లు, యెటువంటి కాగితాలు వాడాలి, బైండింగ్ సామాన్లు యేవేవి అవసరమవుతాయి—యిట్లా పద్ధతిగా యెన్నో సంగతులు పూస గ్రుచ్చినట్లు అనుభవరీత్యా వివరించాడు. అప్పుడప్పుడూ తనకు కల్గుతూవచ్చిన ఆలోచనలను కూడా డైరీలో మాదిరి రికార్డుచేసి పెట్టాడు.

లండన్‌నుంచి వచ్చిన యీ మైక్రోఫిల్మ్ సంపుటి రోల్‌లోనుంచి ఉదాహరణ ప్రాయంగా వొక పేజీ తాలూకు ఫోటో-ప్రింట్ ముద్రణను పక్క పేజీలో పాఠకుల సౌకర్యార్థం యిస్తున్నాం. మహాభారతం 18 పర్వాలకూ కేవల శుద్ధప్రతిని రూపొం దించడానికి తనకెంత ఖర్చయివుంటుందో వొక కనీస అంచనాను యీ పేజీలో బ్రౌన్ వివరించాడు. అప్పట్లో తనకు నెలకు 500 రూపాయల జీతం వస్తుందే దనుకొంటే వొక్క మహాభారతం కాపీ తయారీకి 2,714 రూపాయలు ఖర్చు పెట్టడమంటే తన అయిదునెల్ల కష్టార్జితాన్ని బ్రౌన్ వెచ్చించాడనుకోవాలి. ఇట్లా యెన్ని కావ్యాలు? యెంత కృషి? యెంత తతంగం? ఈ లెక్కన బ్రౌన్ జరిపించిన పునాదిప్రాయమైన తెలుగు సాహిత్య పునరుద్ధరణ కృషి ఖరీదు మొత్తం యెంతో విలువ కట్టడానికి యెందరు సాహిత్య షరాబులు అవసరమవుతారు?

---

Payment 49

Estimate of cost of correcting the Telugu
Maha Bharata

The rate of correction is about fifty verses per day 1250 per month and of fair transcription about the same including variations; but allowing for Sundays, feasts, sickness &c say 30 verses per day, the month being 30 days = 900 padyams per month. Then for 23,000 verses, which is the extent of the work, allow two years and a quarter at least (more exactly 2 y. 1 m. 15 days) 13 transcribers of the rough copy do about 50 or 60 verses per day, at 200 verses per rupee. Then, the monthly charge is

| | |
|---|---|
| 2 sastries at 15 Rs | 30 |
| 1 corrector | 12 |
| 3 readers | 24 |
| Rs | 66 per month for 900 verses |

for 27 months, is Rs 1782 for correction alone 1782
Rough copy, 23,000 verses at 200 for Rupee = Rs 115
Fair copy with variations at 100 — Rs 230
Fair do without 115
Paper for 3 copies at 288
Pens, binding &c &c 184
2714

and very cheap indeed at that rate

లండన్ ఇండియా ఆఫీస్ లైబ్రరీలోని బ్రౌన్ వ్రాతప్రతుల సంపుటం నెంబర్ Mss. Eur. B. 62 లోనుంచి మాదిరికి ఒక పేజీ— మహాభారతం పద్దెనిమిది పర్వాలకూ శుద్ధప్రతి వ్రాయించడానికి అయిన ఖర్చు అంచనా వివరాలున్న పేజీ.

# జాబుల క్రమం

ఉయ్యాలవాడ నరసింహారెడ్డి

సాయుధ తిరుగుబాటు

సి. సుబ్బయ్య జాబు (1846 సెప్టెంబర్ 14)
కొండూరు కరణం అర్జీ (తేదీ లేదు)

'గుంటూరు కరువు'లో

కడప కటకటలు

అయోధ్యాపురం కృష్ణారెడ్డి జాబులు 4 (1832–33)
—సి. పి. బ్రౌన్ జాబు (1832 సెప్టెంబర్ 5)

మగ్డానల్డ్ హత్య

అ. కృష్ణారెడ్డి జాబు (1832 యేప్రిల్ 8)

కడపలో 'బ్రౌన్ కాలేజి'

బంగళా—తోట....

అ. కృష్ణారెడ్డి జాబులు 18 (1828–38)
కృష్ణారెడ్డి అన్న జాబు (1852)
ములుపాక బుచ్చయ్యశాస్త్రి జాబు (1830?)
పైడిపాటి వెంకటనరసయ్య ,, (1829 మే 20)
ధర్మపురం సుబ్బన్న జాబులు 3 (1838–50)
—సి. పి. బ్రౌన్ జాబు (1840 డిసెంబర్ 12)
కంభం నరసింహాచారి జాబులు 3 (1830–34)
నరసింహాచారి కొడుకు జాబు (1852 సెప్టెంబర్ 10)
చల్లా సుబ్బన్న ,, (1833 నవంబర్ 29)
గరిమెళ్ల వెంకయ్య ,, (1833 డిసెంబర్ 17)
అవధానం అప్పయ్య జాబులు 2 (1844)

# ఉయ్యాలవాడ నరసింహారెడ్డి సాయుధ తిరుగుబాటు

## 1

మహారాజశ్రీ సి. పి. బ్రౌన్ యిస్క్వయరుగారి సముఖానకు—

శేవకుడు సుబ్బయ్య అనేక సలాములు చేశి వ్రాసుకున్న విజ్ఞాపనము. యీ నెల 14 తేదివరకు ప్రభువులవారి అనుగ్రహాము వల్లను కడపలో క్షేమం. అచ్చట ప్రభువులవార్లయొక్క క్షేమసంతోషాతిశయములు మాకు తెలిశి సంతోషాంని పొందుటకు అనుగ్రహా పత్రికె దయచేసి అంపించవలయునని ప్రార్థిస్తున్నాను.

యిటీవల కర్నూలులో రెడ్డిగారిగుండా యెక్కువలు జరిగినట్లు తెలియనందున విజ్ఞాపనం వ్రాసుకోనభ్యంతరమైనది... సముఖానకు వస్తున్నానని తెలియపరుచుకున్న ప్రకారం యీ నెల 6 తేదిని ప్రయాణమై మొన్నటిరోజ్కు కడపకు వచ్చిచేరినాను. యిచ్చట కడపలోనున్న చుట్టుపక్కల 5 - 6 ఆమడ పరియంతం రెడ్డియొక్క భయంవల్లను ధనీకులు వూళ్ళు విడిచిపెట్టిపోయిన వారున్ను ధనము మాత్రం బైట జాగ్రతపరచివుండేవాండ్లున్నుగా వున్నారు. కడమ సాధారణమైనవారు సాయంత్రం 5—5½ ఘంట ప్రొద్దుకు వీధి తలుపులు పెరటి తలుపులు వేసుకునేవారు. కొందరు ఆవేళకే భోజనములు కాచేసుకొని పక్కవీధులలో నిరుపేదలైన వారి యిండ్లల్లో పరుండేవారున్ను పల్లెలకు పోయి పరుండేవారుగా వున్నారు. యిదిగాక పదిరోజులనాడు యిచ్చటి సెసన్ జెడ్జిగారికి రెడ్డి అర్జి మూలముగా కడప ఖజానా

కొళ్ళకు వస్తున్నాను మీరు వుండవలసిన జాగ్రతలో వుండవలసినదని తెలియజేసు కున్నాడు. అది మొదలు ఖజానా వద్దను 200 కి శిఫాయిలను కత్తులు తుఫాకిలతో సిధ్ధపరచి కావిలి వుంచివున్నారు. జవాన్‌లు మొదలు తుపాకిలు కత్తులతో వుషారుగా వున్నారు. అయితే రెడ్డిగారి తరఫు దివిటీ దొంగల వుపద్రవము వల్లను ప్రజలు అత్యంతమైన భీతిని పొందుతున్నారు. 5_6 రోజుల కిందట దివిటి దొంగలు వచ్చి రెండు యిండ్లు దోచుకునిపోయినారు. వారు రావడం 150కి 200 దివిటీలు వేసు కొని బొగ్గులు పూసుకుని తుపాకిలు కాల్చుకుంటూ వచ్చి యిండ్లల్లో జొరబడి వున్న వల్లా యెత్తుకుని చేతుల వేళ్ళకు గుడ్డలు చుట్టి నూనె పోశి ముట్టించి వున్నద్రవ్యమంతా అగుపరచమని శ్రమపెట్టుతున్నారని యిచ్చోటివారలవల్లను తెలిశినది. నేను యిచ్చటికి వచ్చిన రోజు సమాచారం బెతంచెరువువద్దను రెడ్డిగారు వున్నారని కడప కలకటరు వారు యింకా కొంత జనమున్ను కర్నూల్ నుంచి కమీసనర్ వారు కొంత తురుపున్నుపోయి కాచివుండగా సదరహీ రెడ్డిగారు కోవెలగుంట తాలూకాకు వచ్చి పొద్దుటూరిలో వుండేవారికి వక వుత్తరం మూలంగా రెండు మూడు రోజులలో యీవూరు కొళ్ళకు వస్తున్నాను మీరు తగు జాగ్రత్తలో వుండవలసినదని వ్రాసిన వుత్తరమును కలకటరువారి వద్దికి అంపించగా కలకటరువారు పొద్దుటూరికి పోవుటకు 4 కుంపిణిలను దొడు అంపించమని వ్రాసిన ప్రకారం అంపించినారున్ను కొంతమంది జవానులను నూతనముగా జీవనము కలగచేసి అచ్చోటికి సహాయార్థమై అంపించి నారు. యింతకు మించిన సమాచారములు తెలియలేదు. చక్కగా విచారించుకొని వస్తున్నాను.

కర్నూలువద్ద జరిగే సంగతులు ప్రభువులవారికి విశదమైయ్యేకొరకు అచ్చట వుండే రైటరుగుండా సముఖానకు అర్జీవచ్చును. ఒకవేళ నా పేర వచ్చినా ధొర వారు చిత్తగించవలశినది. యిచ్చట జరిగే సమాచారములు యిచ్చట నాకు మిక్కిలి స్నేహితుడున్నాడు గనుక ఆయనగుండా ముందు వుత్తరములు వచ్చేలాగున జాగ్రత్త పరిచివున్నాను. దివ్యచిత్తానకు తేవలెను.

నేను రేపటి దినం యిచ్చటనుంచి తర్లివస్తున్నాను. దివ్యచిత్తానకు తెచ్చి రక్షించకోరుతున్నాను.

యిదే అనేక సలాములు.

Sir,

Cuddapah
14 Sept. 1846.

your most obedient
humble servant
C. Soobiah.*

---

* మ.ఓ.మే.లై.లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 419, పేజీ 126.

# 2

మహారాజరాజశ్రీ ఘనమైన రివిన్యూ బోర్డువారి సముఖానకు—

కడప జిల్లాలో చేరిన చిట్టివేల్ తాలూకా కొండూరు కరణం వున్నం సుబ్బరాయుడు అనేక సలాములు చేశి వ్రాసుకున్న మనవి అర్జీ యేమంటే తాము దయ చేశిన హిండేరసుంన్యా* వక అర్జిన్ని కలకటరు క్యాకరిన్ ధొరవారు తిమ్మానాయణిపేట ముకాంల్లో వుండగా యిస్తిని. అవి చిత్తగించి తిరుగా నా చేతికి యిచ్చి తారహీల్ ధొరవారి చేతికి యిస్తే వారు నీకు వుత్తర్వు యిస్తారు పొమ్మని శలువ్వ యిచ్చిరి. ఆ ప్రకారం హిండెరసుంన్యా పెద్ద ధొరపేర వ్రాసుకున్న అర్జిన్ని చిన్న ధొరపేర వక అర్జిన్ని యీ మూడున్ను చిన్నధొరవారికి యివ్వగా వారు చూచుకొని నీవు బోర్డుకు యేల పోయినావు మేము విచారించక పోతిమె, అయినా మంచిది నీ కరిణీకం పని నీకు యిస్తున్నాము, యిప్పట్లో నారశింహ్వారెడ్డిని పట్టే యెత్నంల్లో వున్నాము, నీవు యిక్కడనే వుండమని శలవు యిచ్చినందున నెలా పదిహేను దినములు వుండిన పిమ్మట మునిషిల మాట అంగీకరించి బోర్డు వారు పని యిమ్మని వ్రాయలేదు. సబబునామా యిమ్మని వ్రాశినారు అని సబబు యిచ్చి పొమ్మనిరి. అదే తేదిని యీ యొక్క సబబునామాంన్నా యిద్దరు ధొరలున్నా మునిషిలు జర్గించినవైనం వక అర్జిన్ని తాము దయ చేశిన హిండేరసున్ను యీ మాటికిన్ని తేదివారితో కూడా నకలు వ్రాసుకొని అసల్ను పోష్టు మునిషి దువ్వూరి వెంకోజీరావు దగ్గర యిచ్చి రశీదు పుచ్చుకొని వూరికి పోయి ఖర్చుకు సంపాయించుకొని సముఖానకు వత్తామని వస్తూవుండగా కడప బాజారులో పండుకొని వుండగా ఆ రాత్రి మూప దొంగలు తీసుకపోయినందున యీవత్తు దస్తైవజులు పోయినందున తారీఖులు అర్జీలు దాఖల్ చేయలేదు.

నా భాగానకు గుమాస్తాగా వుండేవాడు ధనవంతుడయినందున మునిషి నిండా ఆమోదించి వారి యిష్టానుసారం ప్రకారం సబబునామా యిచ్చినారే కాని యీ పైకి నేను వప్పుకున్నది లేదు. అనుభవించినదిలేదు. యిదే జిల్లాలో చేరిన తాలూకాల్లో 400, 500 రూపాయలు ఛఫావణి చేశిన కరణాల్కు జురమ్నా పుచ్చుకొని వారి పనులు వారికి యిచ్చివున్నారు. నేను చఫావణె చేశివుండలేదు. నా ఫిర్యాది ధనవంతుడయినందున తహాశ్శీల్దారు నరశింగరావు మునిషి నారాయణ రాయుడు యీ యిద్దరు నా మీద కార్పణ్యంచాత ధొరలకు వారి యిష్టప్రకారం

*Indorse అని బ్రౌన్ వ్రాత.

తెలిపి రు. 50 జురుమానా భరతరఫి నా హిస్సాకు నా ఫిర్యాదిని గుమాస్తాగా వుంచి నాకు మూడు శిక్షలు జరిపినారు. యీ కుంఫిణీలో మూడు శిక్షలు జరపడం యిదివరలో లేదు. నన్ను బహు అన్యాయం చేశినారు గనుక తాము ధర్మప్రభువులని సముఖాన మనివి అర్జీ యిచ్చుకున్నాను. నా మనవి చిత్తగించి నా పని నాకు దయచేయించే లాగున కల్కుటరు ధొరకు హుకుం దయ చాయవలెనని ప్రార్థిస్తూ వున్నాను. చిత్తగించవలెను.*

* మ.ఓ.మే.లై.లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 420, పేజీ 163.

## ‘గుంటూరు కరువు’లో కడప కటకటలు

### 3

బందరుజిల్లా అదాలతుకోర్టు జడ్జీగారు అయిన మహారాజరాజశ్రీ మేస్తర్ సీ. పీ. బ్రౌన్ యిస్క్వాయరుదొరవారి సముఖానకు—

నిజపోష్యవర్గుడైన కడపజిల్లాకోర్టు నాజరు అ॥ కృష్ణారెడ్డి పదివేలు సలాములుచేసి అత్యంత వినయపూర్వకముగా వ్రాసుకున్న మనవి యేమంటె యీ కడ్పలో తమయొక్క బంగళా తోటకు యేట్లోనుంచ్చి బంగళా తోటవరకు కాలవ తీసి ఆ కాల్వనుంచి రాబడిన యేటినీళ్ళు తోటలోవుండే భావిగుంతకు నిండించిన తర్వాత ఆ భావి కపిలెనీళ్ళవల్ల తోటకు నీళ్ళుపారడం తోట పూర్జితం కావడం యీప్రకారం అవుతూవున్న సంగతి యేలినవారి దివ్యచిత్తానకు తెలిసివున్నది. యిట్లా వున్నందువల్ల వర్షాకాలములో యేట్లో యథేచ్ఛముగా నీళ్ళు వున్నంతమట్టుకు యేటికాలవ నీళ్ళవల్ల తోటలోవుండే భావికి రావడం ఆభావి కపిలె వల్ల తోటకు నీళ్ళుపారడాన్కి అభ్యంతరంలేక జరిగేదిన్ని యంతకాలం అయి యేటిలో నీళ్ళు తక్కువ అయ్యేకొలదికి తోటలోవుండే భావికి నీళ్ళురావడం ప్రయాస అవుతూవచ్చేదిన్ని నిండా యండాకాలంలో బహుప్రయాసపైన నీళ్ళు వచ్చేదిన్ని తోటకు చక్కగా నీళ్ళుపారడంలేక కొన్ని సన్నచెట్లు మొదలయ్నివి యెండిపొయ్యేదిన్ని యీ ప్రకారం యిదివరకు జరుగుతూ వచ్చినది—

యీ సం॥లో యీ సంవ్వత్సరాది మొదలుకుని యీదేశంలో వర్షాలు లేనందు వల్ల తోటకు నీళ్ళుపారడం బహుప్రయాసపైన పారుతూవున్నది అని యీ సంవ్వత్సరం జులాయినెలలో యేలినవారి సముఖములోకి వ్రాసుకోబడిన అర్జీలో విజ్ఞాపన చేసి వున్నాను—ఆ తాగాయతి యేటిలో కొద్దిగానీళ్ళు వున్నప్పటికిన్ని తమ బంగళాలో దిగివున్న మేస్తరు యింగ్లీషుదొరగారి సహాయము వల్లనున్ను బహుప్రయాసమీద నున్ను యిప్పటికి 15 రోజులవర్కు చాలి చాలములుగా నీళ్ళుపారినవి. 15 రోజుల నుంచి బొత్తిగా యేటిలో నీళ్ళు లేనందున్ను తోటలోకి నీళ్ళు రావడానికి సందర్భించక పోయెను. సదరు ధొరగారున్ను యేటిలో యిదివరకు కొంచెంగానైనా నీళ్ళువుంటె కట్టిస్తిని యిఖమీద నన్నుంచి యేమి అవుతుంది మీకు తోట కావలిస్తే జాగ్రతగా భావి తొవ్వించమని చెప్పినందున భావి తవ్వించి ఆ నీళ్ళవల్ల తోటకు నీళ్ళు పార వలస్నిది వినహాయించి వేరే ఆధారం లేనందువల్లనున్ను నీళ్ళులేక తోట యెండి పోతూ వస్తూవున్నందుననున్ను మును పు నీళ్ళు నించుతూవున్న గుంత చక్కజేసి మజూరులపెట్టి తొవ్విస్తే కొంచంగా నీళ్ళు వూటపడినవి. ఆ నీళ్ళు మంచినీళ్ళు పడి నవి. అక్కడ విశాలంగా భావి తొవ్వించి చుట్టూరు రాతికట్నము కట్టిస్తె యెల్లప్పటిక్కి శాశ్వితంగా తోటకు నీళ్లు తక్కువలేకుండా వుండును.

ప్రస్తుతం తోటకు యేవిధము చేతనైనా నీళ్ళురావడాన్కు వసతిలేక యెండి పోతూ వున్నందున యిప్పుడు ఆ గుంతలో నిత్యం కపిలె తోలడాన్కు నీళ్ళువుండే దాన్కి కూలివాండ్లను పెట్టి ప్రతిదినం భావి లోతుగా వెడల్పుగా నీళ్ళు వూరే టట్టుగా పనిచేయిస్తూ వున్నాను. దానివల్ల తోట పారుతూవున్నది.

ఇప్పుడు భావి తవ్వించడాన్కు 40 రూపాయలు పట్టును. ఆ మాత్రం తొవ్వించి విడ్చిపెట్టితె వకవర్షం రెండువర్షాలు కురిస్తేగాని లేక కొద్దిరోజులు జరిగినా గడ్డలు పొర్లి భావిలో మన్ను నిండి భావి పూడి నీళ్ళులేక భావి యధాప్రకారం పాడుగా వుండును. యిప్పుడు తొవ్వడం శిద్ధంఅయిన పాటునె్న రాతి కట్నము కట్టించి గచ్చుచేయించి బందోబస్తీ చేయవలశ్నిది. యీప్రకారం చేయడాన్కు సుమారు 200 రూపాయలు యిన్నూరు తగులునని తోచుచూవున్నది.

బంగళాలోవున్న మేస్తరు యింగిలీషు ధొరగారు బంగళాకు యిచ్చేబాడిగ గాక యీభైరూపాయిలు భావి నిమిత్తం యిస్తూవున్నాను అనిన్ని, తోట యెండి పోతూవున్నది త్వరగా చేయించ వలశ్నిదని శెలవుయిచ్చి, నితనిత్యం యెంతపని చేశేదిన్ని చూస్తున్ను త్వరచేస్తూవున్నారు. వారినుంచి రు. 50 యేభై రూపాయలు తీసుకోవడాన్కు యేలినవారి ఆజ్ఞ యెలాగైతే అట్లా నడ్చుకుంటావున్నాను. తోట

సంరక్షణ నిమిత్తం ప్రస్తుతం యీపని చేయిస్తూవున్నాను. భావి తొవ్వించి రాతి కట్నము కట్టిస్తె యెల్లప్పటికి నిరాచ్ఛేదముగా జరుగును. లేకపోతే అప్పుడప్పుడు యిదేలాగ్ను జరుగుతూవున్నది. ప్రస్తుతం బాడిగె అయివజు చిల్కు రు. 150 నూట యాభైరూపాయలు చిల్లర నా వశాన్నివున్న సంగతి చిత్తాన్కు వేద్యం చేశినాను. యింకా కావలెనంటే రెండుసెలల బాడిగె అడ్వాన్సుకూడా యిత్తురు. యిందు నిమిత్తం త్వరగా తాము శెల్వు దయచేయించవలెనని కోరుతూవున్నాను. భావి తొవ్వించడాన్కు సుమారు రు. 40 నలుభైరూపాయల క్రయంలో అవుతూ వున్నందునన్ను అట్లా తొవ్వించకపోతే తోట యెండిపోతూ వున్నందువల్లనున్ను తమ ఉత్తర్వు రావడాన్కి ఆలస్యము అవుననిన్ని ప్రస్తుతం తొవ్విస్తూవున్నాను.

4, 5 రోజులలో భావి తొవ్వించడం సిద్ధం అవును. భావి రాతికట్నం కట్టు బందోబస్తీ చేయడాన్కు తమ వుత్తర్వు వచ్చే పరియంతరం నిరీక్షించి వుండవలెను అనివున్నాను గన్కనున్ను, భావి సిద్ధం అయ్నిపాటున్నె రాతికట్నం కట్టించ్చి బందోబస్తీ చేయకపోతె పడిపోవును గన్కనున్ను భావి బాగా సిద్ధం చెయించవలశ్నిదని బంగళాలోవున్న ధొరవారు నిత్యం త్వరచేస్తూ వున్నారుగన్కనున్ను తమ వుత్తర్వు త్వరగా దయచేయించ వలెనని కోరుతూవున్నాను.

1832 సం॥ ఆగస్టునెల 26 తేది

—అ॥ కృష్ణారెడ్డి చెవ్రాలు*

4

మహారాజశ్రీ సీ॥ పీ॥ బ్రౌన్ యిస్కోయరు ధొరగారు—అయోధ్యాపురం కృష్ణారెడ్డికి వ్రాయించ్చిన హుకుం—

నీవు ఆగస్టునెల ది 26వ తారీఖున్ను వ్రాసుకున్న అర్జీ. అందులో ఆ దేశమందు వరషాలు లేకుండా వున్నందున యేటిలో నీళ్ళు యెండిపోవడంచాత తోటలో వుండే భావిగుంటకు నీళ్లు రానందున్ను తోట యెండిపోతూ వున్నదనిన్ని మా బంగళాలోవుండే ధొరగారు భావి తవ్వించ్చి బాగుచేయించిన పక్షమందు అందుకింద అద్దెగాక యాభైరూపాయలు యిస్తామన్నారు అనిన్ని యింకా రెండునెలల అద్దె అడ్వా

*మ. ఓ. మే. లై. లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 410, పేజీ 74. (యమ్. 417, 418 లలో కూడా యిది కాపీ అయింది). 'తెలుగు రీడర్' (132-5 పేజీల)లో యీ జాబును బ్రౌన్ ముద్రించివున్నాడు కూడా.

నుసుగా కోరిన పక్షమందు యిప్పిస్తారనిన్ని వ్రాశినావు. ఆ తోటవల్ల మాకు యేమి కిపాయతు అయితే లేదు. అయినప్పట్కి నీవు వ్రాశ్నిప్రకారం భావి తవ్వించ డాన్కి మాత్రం అంగీకరించడ మయ్నిది.

నీవు త్తరం వచ్చేవరకే నీదగ్గిర నిలవవుండే రూపాయీలలోనుంచి వంగీపురం నరసింహ్వాచార్యులకు డెఖైరూపాయలు యిప్పించ వలశ్నిదని నీపేర వుత్తరం వ్రాయించడమయ్నిది గన్కు ఆ రూపాయీలు పోగా తతిమ్మా నీదగ్గిర నిల్వావుండే రూపాయీలున్ను రెండునెలల అద్దె అడ్వానుసు పుచ్చుకని ఆ రూపాయలున్ను పెట్టి భావికి రాతికట్టు గచ్చు వగయిరా మరమ్మతు చెయించవలశ్నిది. ఆ రూపాయలు చాలని పక్షమందు బంగళాలోవుండే ధొరగారు భావి నిమిత్తం యిప్పిస్తామన్న యాభై రూపాయలున్ను ప్రస్తుతం తీస్కొని పని జర్గిన్తూవుండ వలశ్నిది. యింకా కొద్దిగా రూకలు యేమైనా కావలసివున్నట్టు అయితే ఆ వయినం మా పేర వ్రాయిస్తే అందుకు అప్పట్లో జవాబు వ్రాయిన్తూ వున్నాము.

ది 5 శపిటెంబరు ఆన 1832 సం॥

—(C. P. Brown.)*

## 5

మహారాజశ్రీ—సీ—పీ—బ్రౌన్ యిస్కోయరు దొరగారి సముఖానకు నిజపోష్యవర్గుడైన అయోధ్యాపురం కృష్ణారెడ్డి పదివేలు సలాములు చేసి అత్యంత వినయపూర్వకముగా వ్రాసుకున్న మనివి యేమంటే...

తమకు చిత్తూరుజిల్లా ఆకటింగు జెడిజీ పనికి పైంటు అయినట్టు గౌరన్ మెంటు వారు యీ జిల్లాకోర్టుకు పంపించిన పబ్లికు నూసుపేపరువల్ల యీరోజున తెలిసి చాలా సంతోషాన్ని పొందివున్నాను.

తమరు యీ నెల 20 తేదిన వ్రాయించిన అజ్ఞపత్రికెన్ను యీరోజున చేరి అపరిమితమైన సంతోషాన్ని పొందివున్నాను. తమకు అతిశయమైన ప్రభుత్వం వినడమే కాకుండా తమరు చిత్తూరికి పోయ్యేటందుకు యీ కడప దోవన వత్తురనిన్ని తమరు యీ మార్గాన రావడంవల్ల నాకు తమ దర్శనం కలుగుననిన్ని యిక్కడ సమీపంలో తమకు గొప్ప ప్రభుత్వం కావడంవల్లనున్ను మిక్కిలీ నా అదృష్టం అని యెంచి నాకు కలిగివుండే సంతోషం యింతా అని వ్రాయడానకు అలవికాకుండా వున్నది. అయితే

*మ.ఓ.మే.లై. లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 410, పేజీ 76.

తమరు యే తారీఖున గుంటూరు విడిచి బయలుదేరేదిన్ని యీ కడపకు యే తారీఖున వచ్చి చేరేదిన్ని సవిస్తారంగా వ్రాయించి పంపించేలాగున ఆజ్ఞ దయచేయవలెను అని కోరుతూవున్నాను. తమ దర్శనం కావలెనని బహుదినములనుంచి నానా అభిలాష వున్నది గనుక యిందునగురించి విస్తారంగా మనివి చేసినాను. చిత్తగించకర్తలు.

మరిన్ని కడప షహరుబాజారు దోపిడి అయిన సంగతి యావత్తు వ్రాసి పంపించేలాగున ఆజ్ఞాపించినారు. ఆ సంగతి యొక్క పూర్వోత్రం యేమంటే యిప్పటికి సుమారు ఇరవై దినముల కిందట యీ కడపలో ప్రతాపం వెంకటపతి, ప్రతాపం చెలం అనే పేరుగలవాండ్లు ఘనమైన సాహుకార్లు వక కుటుంబంలో చేరినవాండ్లే యీ కడప కాపరస్థులై వున్నందుకు వారింటికి అర్ధరాత్రివేళ సుమారు 100 మంది జనం యెవరో దొంగలు స్తోమమయివచ్చి యింటివాకిండ్లు బీగాలు పగలగొట్టి సుమారు 3,000 రూపాయల పర్యంతం దోచుకుని, యింకా దోచుకోవలెనని యత్నం చేస్తూవుండగా యింతలో షహరులో వుండబడిన పోలీసులు బారుశిఫాయిలు మొదలయినవారు స్తోమమయి పోయినందున వాండ్లు పారిపోయినారు. ఇంటి జనం ఆ దొంగల చేతిలో చిక్కుపడక పారిపోయినందున వాండ్లకు శరీరాయాసం యేమి జరిగివుండలేదు. ఆ సంగతిలో కలసివున్నట్టుగా 6 మంది జనాన్ని క్రిమిన్యాల్ కోర్టుకు పంపించివున్నారు. వాండ్లమీద విస్తారం రుజావు అయివుండలేదు.

అమీనా మొదలైన పోలీసు వుద్యోగస్థులు ఆ దొంగల పట్టే నిమిత్తం అనేక విధముల యత్నం చేస్తూవున్నారు. సామానులుగాని దొంగలేకాని యిదివరకు చిక్కివుండలేదు. గనుక యెవరివల్ల జరిగినది పరిష్కారంగా తెలియబడలేదు. చిత్తానకు రావలెను.

లేటు శిరస్తాదారు సంగతి యావత్తు క్రిమిన్యాల్ కోర్టులో విచారణ అయి సరికోర్టు కమీటు చేసివున్నందుకు సరికోర్టు దొరవారు ఆ నెంబరు తిరిగి క్రిమిన్యాల్ కు రిఫరుచేసి కైదిపరం సాక్షులను కూడా విమర్శించి రిగులేసన్ ప్రకారం జరిగించేది అని వుత్తరువు వ్రాయించినారు. క్రిమిన్యాల్ కోర్టులో యావత్తు విచారణ జరిగింది. యింక యేమి విచారణ జరిగేటట్టు తోచలేదు. అయితే ఆ॥ జెడిజి దొరవారు పరిష్కారం చేయలేదు. కొద్ది రోజులలో మేస్తరు పి। హె। స్త్రాంబందొరవారు వస్తారని వదంతి వున్నది. చిత్తానకు రావలెను.

యీ కడపలో బీదవాండ్లను గురించి యిక్కడ వుండే జనం యే రీతిగా యేర్పరచినదిన్ని వాండ్లకు నిత్యం యేమి ఖర్చు తగిలేదిన్ని యిందుల వివరం వ్రాసి పంపించేలాగున ఆజ్ఞాపించివున్నారు. అయితే యీ వూళ్ళో రు. 1కి శే. 13 బియ్య

మున్న రు. 1కి జొన్నలు శే. 18 యీ ప్రకారం ధారణ వున్నది. బీదవాండ్లు విస్తారం జనంవుండి అన్నం పెట్టేవాండ్లు లేనందున మిక్కిలి జీవశ్రమను పొందుతూవున్నారు. వర్షం లేనందున మంచినీళ్ళు దొరకక వాటికిన్ని శానా శ్రమపడుతూవున్నారు. యిక్కడవుండే కల్కటరు మేస్తరు లేకన్ దొరవారు వక ధర్మపట్టి యేర్పరచి ప్రతినెలకు యెవరైనా బీదవాండ్లకు సహాయము చేసేవాండ్లు ఆ పట్టీలో చేయవలసినది అని నిర్ధారణ చేసి తాను నెల 1కి రు. 10లు యిస్తానని వేసినారు. దాని కింద కొంత మంది దొరలున్ను యింకా కొంత మంది నల్లజనమున్ను తమ శక్తిమాత్రం వేసివున్నారు. ఆ అయివజు నెల 1కి రు. 50లు జమ అవును. యిందుకు లంగరుఖానా వకటి యేర్పరచి బీదవాండ్లకు 30, 40 మంది జనాన్ని వక జాబితా వ్రాసి ఆ జాబితాలో వ్రాసిన జనానికి వారానికి వకదినంనాడు నదరుప్రకారం నెలకు రాబడె అయివజుకు తగుమాత్రం ఖర్చు చేస్తూవున్నారు. అదృష్టవశాత్తు ఆ జాబితాలో దాఖలుకాబడిన జనంగాక విశేషంగా వుండబడిన బీదవాండ్లకు ఆ లంగరుఖానా నుంచి యేమి వుపయోగంలేదు.

యీ బస్తీలోవుండే పుణ్యాత్ములైన కొందరు బిక్షం మొదలైనవి పెట్టించేటందువల్ల వాండ్ల జీవనానికి కొంచెం ఆధారం అవుతూవున్నది. యీ పట్నంలో బహుజనం నిరాధారంగా అన్నంలేక బహుప్రయాసపడుతూవున్నారు. భాగ్యవంతులైన వారికిన్ని ప్రభువులైన వారికిన్ని వాండ్లమీద కరుణవుంచి జీవనానికి సహాయము చెయ్యవలెననె బుద్ధిలేనందువల్లనున్ను వాండ్లకు సహాయపరచవలెనని బుద్ధి కలిగిన వాండ్లకు సదరు జనాన్ని సంరక్షణ చేసేశక్తి లేనందున వాండ్ల కోరిక ప్రయోజనం లేకపోవుట చేతనున్ను బహుజనం అత్యంతమైన ప్రయాసపడుతూవున్నారు. యిట్టి సమయంలో వాండ్లయొక్క సంరక్షణ చేసిన పురుషునికి విశేషమయిన కీర్తి పొందడమే కాకుండానున్ను యీశ్వరుడు వాణ్ని సకల రీతుల సంరక్షణ చేసునని తోచుతూవున్నది. అయితే వాండ్లయొక్క సంరక్షణ నిమిత్తం ప్రతినిత్యం యింత వ్రయమవునని వ్రాయడాన్కి నిబంధన యేర్పడనేరదు.

ఆఖైరుకు నిత్యం రు. 4, 5 రూపాయల మాత్రం ఖర్చుచేసి అన్నం పెట్టించినా బహుజనం జీవనం నిమిత్తం మిక్కిలి శ్రమపడే వాండ్లకు శానా సహాయపరుస్తున్నది. ఆ ప్రకారం వ్రయంచేసి వాండ్లను సంరక్షణచేయడం తమకు సంతోషంగావున్న పక్షమందున తమయొక్క ద్రవ్యం నిరర్ధకంగా వ్రయంకాకుండా జాగ్రతపెట్టి జరూరుగా కావలశిన అన్నపేదలకు అన్నంపెట్టించే విషయంలో నన్నుంచి అయ్యేప్రయాసలు వెలితిలేకుండా జరిగించడానకు నాకు చాలా సంతోషం

వున్నది. ఆ సంగతి వివరంగా తమకు తెలియడానికి నెలనెలకు అందుల వివరగతి లెఖ్ఖ కూడా పంపిస్తున్నాను గనుక్క వున్న సంగతి చిత్తానకు వేద్యం చేసినాను.

మన బంగళాతోట యావత్తు ఖబరదారీగానె కాపాడుతూ వున్నాను. బంగళా మొదలైనవాటికి మరమ్మతు చేయించవలసిన జరూరు వున్నందున చేయిస్తు న్నాను. యీ నెల ఆఖైరున అందుల వివరం యావత్తూ శృతపరుస్తూవున్నాను. అంతు అయిదు కలములు దివ్యచిత్తానకు తెచ్చి కాపాడ గలందులకు తాము ఖామందులు వున్నారు.

1833 సం॥ మార్చి నెల 25 తేది
అ॥ కృష్ణారెడ్డి (నాజరు).*

6

మహారాజశ్రీ మేస్తరు సీ. పీ. బ్రోన్ యిస్క్యయరు ధొరవారి సముఖానకు—

నిజపోష్యవర్గుడైన అ॥ కృష్ణారెడ్డి పదివేలు సలాములు చేసి అత్యంత వినయ పూర్వకముగా వ్రాసుకున్న అర్జీయేమంటే—

...తమరు యీ దినంవరకు యే దేశములో యెక్కడవుండేది తెలియక తమకు విజ్ఞాపన వ్రాసుకోవడాన్కి తోచక యిప్పట్లో మీరు బందరులో వున్నట్టు సూచ నగా తెలిసి యీ విజ్ఞాపన వ్రాసుక్కన్నాను. చిత్తగించ కర్తలు—

యీ సం॥రం జూన్ నెల 28 తేదీని తమ బంగళాలో దిగివుండే సీ. పీ. స్కేలటన్ ధొరవారు అశక్తత అయినందున అరు నెలల్కు శెల్వుతీసుక్కని పోయి నారు. ఆ తాగాయతి బంగళా కాలిగా వున్నది. ప్రస్తుతం యీ కోర్టుకు అక టింగు రిజెష్టరుగా వచ్చివున్న మేస్తరు హారిష్టుధొర బంగళాలో దిగడాన్కు పెండ్లి

*మ.ఓ.మే.లై.లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 411, పేజీ 59. (యమ్. 418లో కూడా కాపీ చేయబడివుంది). ఇండెక్స్ పేజీలో దీనిని గురించి బ్రౌన్ యిట్లా వ్రాసున్నాడు: "From Krishna Reddy—A capital letter." వేటూరు ప్రభాకరశాస్త్రి యిదే జాబును మధ్యలో కొన్ని వాక్యాలు తొలగించి ఆంధ్రపత్రిక (దినపత్రిక, 1944 మార్చి 12 తేది)లో ప్రకటించాడు. వ్యాఖ్యాన మేమీ లేదుగానీ, బ్రౌన్‌ను గురించి 6—7 వాక్యాలలో పరిచయం మాత్రం వ్రాసు న్నాడు.

చేసుక్కునేటందుక్కు పోయివచ్చిన తర్వాత దిగవలెను అని వున్నారు. యెన్ని రోజులుక్కు వారు పోయివచ్చేదిన్ని వారు దిగేదిన్ని లేనిదిన్ని తెలియలేదు.

యిదివరకు యీ దేశములో వర్షములేక వున్నందున రు. 1 కి శే. 7, శే. 8 బియ్యమున్ను శే. 3 రాగులు 1 జొన్నలున్ను అమ్ముతూ నిండా క్షామంగా వున్నది. నీళ్ళు తాగేటందుక్కు లేవు.

అయితే మన తోటలో విస్తారంగా మంచినీళ్లు భావి వున్నందున నిత్యం విడవకుండా కపిలె తోలిస్తూ వున్నందున చెట్లు యెండిపోకుండా వున్నవి చిత్తానుక్కు రావలెను.___

యీ సం॥రం జూన్ నెలవరకు తోటమాలీల జీతం యెద్దుల ఖర్చు వగైరా బంగళాలో వుండే ధొరవారు యిచ్చినారు. యీ సం॥రం జూలాయి నెలకు మాలీలుక్కు హెడ్డుమాలి వెంకట్రాముణ్కి రు. 5 లు, పాలి అనేవాణ్కి రు. 4, బుడ్డడు అనేవాణ్కి రు. 2, ఝూడుమాలీ బంగళా వూడచడానుక్కు నియమించిన బికు అనేవాణ్కి రు. 1, ఈ ప్రకారం రు. 13 జీతం నిష్కర్ష చేసి వాండ్లనుంచి పనులు తోస్కోవడం అయినది. యెద్దులకు గడ్డి వులవలుక్కు యిప్పుడు కరువు కాలమైనందున్ను రు. 8లు తగులుబడి అయ్యినది. వెరశి రు. 21 లు తగులుబడి అయ్యినది. పెద్దబోయి గురవప్పను బంగళాపయిన రఖువాలి* వుంచినాను. సదరు గురవప్ప బంగళా సామానులు చెదలు పట్టకుండా తుడ్వడం సామానులు చెడిపోకుండా కాపాడించడం తోటలో కూలీలచేత పనిచేయించడం యీ మొదలైనవి పనులు చేయిస్తూ ఝూడమాలిన్ని గురవప్పన్ను తోటలోకి పశువులు మొదలైనవి రాకుండా ప్రతినిమిషం రాత్రిపగలు హాజరుగా వుండేలాగున్ను దిట్టంచేసి వుంచినాను. నేను ప్రతిదినము పోయి విచారిస్తూ వున్నాను. యీ సం॥రం జూలై నెలలో సదరు ప్రకారం మాలీలుక్కు యెద్దుల ఖర్చుకు యివ్వవలసిన్ని రు. 21 లున్ను 1831 సం॥రం శెప్టెంబరు నెలలో వ్రాయించిన ఆజ్ఞ ప్రకారం మామూలుగా యిస్తూవున్న ప్రకారం అసదుబేగుకు రు. 8లు, పెద్దబోయి గురవప్పకు రు. 4 లు వెరశి 33 లున్ను చెల్లించి రశీదు తీసుక్కుని అందుల లెఖ్ఖ పంపించినాను. యీ ఆగస్టు నెల 1 తేదివరుక్కు బంగళా బాడిగె జమ అయిన ద్రవ్యంలో యీ నెల 1 తేదివరకు మరమ్మతు వగైరాకున్న కూలీల జీతం వగైరాకు చెల్లు యిచ్చినది గాక్కు రు. $66\frac{1}{2}$లు నా వశాన్ని శిలుక్కు వున్నవి. యిప్పట్లో బంగళాలో యెవరు దిగివుండలేదు. ప్రస్తుతంలో యెవరు దిగే యోచనన్ను లేదు. యీ నెల మొదలుక్కుని మాలీల జీతం రు. $11\frac{1}{2}$,

---

* Rakhwali అనగా కాపు - బ్రౌన్ నోట్సు.

ఝాడ్ మాలీ జీతం రు $1\frac{1}{2}$, గుర్వప్పక రు. 4లు అసదబేగుకు రు. 8లు వెరశి రు. 25లు జీతాలున్ను యెద్దుల్కు వులవలమేత యీ కర్వుకాలంలో నిండా ప్రియంగా అమ్ముతూ వున్నందున రమారమి రు. 7లు వెరశి రు. 32లు ప్రకారం యివ్వవలశి వస్తూవున్నది. యిందునగురించి యేలినవారి ఆజ్ఞ అయ్ని ప్రకారం నడుచుకుంటూ వున్నాను.

యీ కోర్టు శిరస్తాదారుపైన వచ్చివున్న న్యాయం సరికోర్టు జెడిజి మేస్తరు తామస గేగను ధొరగారు విచారించి విడదల చేశినారు.

ప్రస్తుతం నేను యిదివర్కు యిక్కడవుండే ప్రభువువారియెడల యేమి వారిని ఆశ్రయించి వుండేవారి యెడల యేమి నేను ఆశ్రయించినట్టుగా జరుపుతూ సర్కారు పనులయందు నా చేతనయిన ప్రయాసలో వంచనలేకుండా జాగ్రతగానె జరిగిస్తూ వున్నాను. ప్రస్తుతం నాకు వుండే నేటైవు రిజెస్టరు పనిలో నా తాబేలో యోగ్యమయిన గుమాస్తాలు లేనందు చేతనున్ను యిప్పుడు వుండే యిద్దరు గుమాస్తాలు నవీనులు అయివున్నందుచేతనున్ను విశేషముగా పనివుండడమున్ను యీలాగున వుండడమువల్ల రాత్రి పగలు నేను కష్టించి పనిచేసినా నిర్వాహకం కాకుండా వున్నది. ప్రభువువారి మర్జి కానా నాజూకుగా వున్నది. యే పనిలో కొంచం తప్పు వచ్చినా సుస్తీ జరిగినా క్షమ అయ్యే మార్గములేదు.

యిట్లావుండగా లోగడ శిరస్తాదారుగా వున్నవార్కి ప్రకృతం నిర్దోషి అయ్నందున్ను వారికి తిరిగి శిరస్తాదారు పనిన్ని వారి కొమారుణ్కి నేటైవు రిజెస్టరు పనిన్ని నాకు యేదైనా ఒక కొద్ది పనిన్ని చేయించడాన్కు ప్రకృతం యోచన జరుగుతూవున్నది. యిదివర్కు నామీద యేమి తప్పితాలు లేదుగాని ప్రకృతం యీ నేటైవు రిజెస్టరు పనిలో నాకు వుండే ప్రయాస చూస్తె సర్కారుపనుల్లో తప్పితంవల్ల కొద్దిపన్కి వేశ్నిట్టుకాకుండా మానుషంగానే పూర్వం నేను వున్న పని దొరికితే చాలా సంతోషింతును. అట్లా కాకుండా యీ పనిలో నేను తప్పితాలు చేశినవాడను అయినట్టున్ను వేరే కొద్దిపనికి వేశినట్టుగా చేసే యోచన జరగడంవల్ల యీ పనిలో నేను పడ్ని ప్రయాస నిరర్ధకం అయ్యేదిన్ని గాక యెప్పటికి సర్కారులో నాలీషు పొందవలశివస్తూవున్నదని నాకు కానా భయము తోచి నిండా విచారపడ్తువున్నాను. వకవేళ నామీద లేనిపోని హేత్వుచేత వేరే కొద్దిపన్కి వెయ్యతలిస్తే నేను రాజీనామా యివ్వవలెను అనివున్నాను. దైవానుగ్రహం యేలాగ్ను అయ్యేదిన్ని తెలిశ్నిదికాదు. యిందునగురించి యేప్రకారం ఆజ్ఞ అయితె

అట్లా నడుచుకుంటూ వున్నాను. అంతు 5 కలములు ఆర్జీ దివ్యచిత్తానక్కు తెచ్చి కాపాడగలందులకు తాము ఖామందులు వున్నారు.

1833 సం॥రం ఆగస్టు నెల 8 తేది
—అ॥ కృష్ణారెడ్డి చెవ్రాలు.*

7

మహారాజశ్రీ మేస్తరు సీ. పీ. బ్రౌన్ యిస్క్వయరు ధొరవారి సముఖానకు—

నిజహొష్యవర్గుడైన అయోధ్యాపురం కృష్ణారెడ్డి పదివేలు సలాములు చేశి అత్యంత వినయపూర్వకముగా వ్రాసుకున్న మన్వి అర్జీ యేమంటే యేల్నివారు యీ నెల 11వ తేద్ని వ్రాయించిన ఆజ్ఞలో పూర్వము నేను పంపించిన లెఖ్ఖల ప్రకారం నా వశాన శిల్కువున్న రూపాయలున్ను ఆగస్టునెల బాడిగె అయివజున్ను హుండీ చేశి పంపించేది అని ఆజ్ఞాపించినారు. యీ సంవత్సరం జూన్ నెల 30 తేద్ని తమ బంగళాలో దిగివున్న మేస్తరు స్కెలటన్ ధొరవారు బంగళా విడిచిపోయినారని యింతకుపూర్వం నేను వ్రాసుకున్న విజ్ఞాపనలవల్ల చిత్తానకు వేద్యం చేశివున్నాను.

యీ సంవత్సరం జూన్ నెల 30 తేద్ని అదివరకు తమ బంగళాలో దిగివున్న మేస్తరు స్కెలటన్ ధొరవారు బంగళా తన సామాను యావత్తూ తీసుకొనిపోయి బంగళా మన సామానున్ను నా స్వాధీనం చేశి సదరు జూన్ నెల 30 తేద్ని లేచి పోయినారు. జూన్ నెల 30 తేది మొదలుకొని యీవల బంగళాలో యెవ్వరు లేనందున ఖాలీగావున్నది. యిదివర్కు యవ్వరు దిగలేదు.

యీ సం॥ జూలాయి నెలలో బంగళాలో యవ్వరు లేనందున ఆ నెలలో మాలీలు వగైరాలకు యివ్వవలశ్ని జీతమున్ను యెద్దుల మేతఖర్చు వగైరా నా వశాన్న శిల్కువున్న రూపాయిలలో యిచ్చి ఆగష్టునెల 8 తేదివరకు నా వశాన్న శిలుకు బాకి రు. 66¾-పై. 8లు వున్న సంగతి చిత్తానకు వేద్యం చేశివున్నాను. ఆ రూపాయిలుగాక యీవల జమ రావడానకు బంగళాలో యిదివర్కు యవ్వరు దిగివుండనందున్ను యింకా జమ రావడానకు హేతువ లేకపోయ్నిది. ప్రస్తుతం యేల్నివారి ఆజ్ఞప్రకారం సదరు రూపాయలు యావత్తు హుండీ చేసి పంపించడానకు ఆగస్టు నెలకు మాలీలు జీతం రు. 11½ ఝాడిమాలివాన్కి రు. 1½ పెద్దబోయి గురువప్పకు రు. 4లు వెరశి రు. 17లు జీతాలున్ను యెద్దుల్కు వులువలు వేయించినందుక్కు అయ్ని

---

* మ.ఓ.మే.లై.లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 401, పేజీ 229. (యమ్. 417 లో కూడా కాపీచేయబడివుంది). ఇండెక్సు పేజీలో "Famine etc. and a good letter" అని దీన్నిగురించి బ్రౌన్ వ్రాసున్నాడు.

ఖర్చు రు. 3½ వరిగడ్డికి రు. 2½ వెరసి రు. 6లు యీ ప్రకారం రు. 23 ఆగష్టు నెలకు యివ్వవలశ్నిది.

మాలీలు పోయ్ని నెల జీతం తమకు యిదివరుకు ముట్టలేదు. ఆ నెల జీతం అయినా ప్రస్తుతం తమకు యివ్వకపోతే యీ కరువుకాలంలో మాకు నిర్వాహకం కాలేము, శెల్వు యిస్తే యెక్కడనైనా పోయి జీవిస్తామని చెప్పుతున్నారు. యెద్దులకు మేతఖర్చు ప్రతిరోజు వెయ్యక అభ్యంతరం చేస్తే యెద్దులు చెడిపోతున్నవి. యెద్దులు చిక్కిపోతే తోటకు నీళ్ళు పారడాన్కు కపిలె తోల్ని కాని నీళ్ళుపారవు. యీ సంగతి పోయిన నెలకు మాలీలకు యెద్దులు ఖర్చుకు యివ్వవలశ్నిన రు. 23 నా వశాన్ని వుంచుకొని నిల్చిన 43½-8 పైసాలుకి ప్రస్తుతం రు. 40లకు యీ కడ్పలో వుండే సాహుకారు గంగప్ప గోవిందప్పగారినుంచి హుండీ తీసుకుని యీ అర్జీలోవుంచి పంపించినాను—హుండావణీ నిమిత్తం రు. 1¼ తీసుకున్నారు. యీ హుండీ బందరులో సాహుకారి గిరిధరదాసు మాణికజి గోవర్ధనదాసు మారీపత్తున యిప్పిస్తే రూపాయిలు యిస్తున్నారు గనుక చిత్తానకు వేద్యం కావలెను.

ప్రస్తుతం నా వశాన్ని వుంచిన రూపాయిలకు పోయ్ని నెలకు మాలీలకు యివవలశ్ని జీతాలున్ను యెద్దుల కర్చున్ను వాండ్లకు చెల్లించడాన్కు ఆజ్ఞ అయిన ప్రకారము నడుచుకుంటూవున్నాను.

యిప్పట్లో తోటలో మరి యేమి ఫలం లేదు. బంగళాలో యిదివరకు యెవ్వరు దిగివుండలేదు. యిఘ ముందర యెవ్వరు దిగుదురో తెలిశ్నిది కాదు. ప్రస్తుతం ఖాలీగావున్నది. తోటఫలం వక వేళ విస్తారమవుతున్నది, వక వేళ యేమిన్ని లేక వుండును. ప్రస్తుతం కూలీలు మొదలయ్నివారిని వుంచితేనే కాని తోట బంగళా సంరక్షణ కానేరదు. అట్లావుంచితే వాండ్లు ప్రతినెలకు తమరు యే ఆధారంవల్ల జీతాలు దొరుకునో తెలియలేదని మన్వి చేస్తున్నారు. బంగళాలో నిత్యం చెదులు పట్టకుండా వూడ్వడం పశువులు మొదలయ్నివి రాకుండా ఖబరదారీ చేయించి బంగళాలో యితర మనుష్యులు రాకుండా రాత్రిపగలు జాగ్రతగా వుంచితేనే కాని లేకపోతే చెడిపోతున్నది. యిందు నిమిత్తం గురుకప్పన్ను ఝుడుమాలీ వుండవలశి వస్తున్నది. భావినుంచి నీళ్ళు తోలడాన్కు యెద్దులను వుంచినాగాని తోటకు నీళ్ళుపారవు. ఆ యెద్దులకు యిక్కడ కరువుకాలంలో ప్రతినెలకు మేత ఖర్చు ఆ ఖైరుకు రు. 6, 7లు తగులుతూవున్నది. యిందున గురించి యేల్నివారి ఆజ్ఞ యట్ల అయితే అట్లా నడుచుకుంటూన్నాను. చిత్తానకు రావలెను.

1833 సం॥ శెపిటెంబరు నెల 24 తేది

—అ॥ కృష్ణారెడ్డి చైత్రాలు.*

* మ.ఓ.మే.లై.లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 401, పేజీ 260.

## 8

మహారాజశ్రీ మెస్తరు సి. పి. బ్రౌన్ యిన్స్పెక్టయరు ఆక్టింగు జెడిజి జిల్లా చిత్తూరు గారి సముఖానకు——

నిజపోష్యవర్గుడు అయిన అయోధ్యాపురం కృష్ణారెడ్డి పదివేలు సలాములు చేసి అత్యంత వినయపూర్వకముగా వ్రాసుకున్న మనవి యేమంటె—తమరు గుంటూరు విడిచి ప్రయాణము అయి చిత్తూరికి వచ్చినారు అని యిక్కడ సూచనగా వర్తమానం వినబడి తమరు చిత్తూరు చేరినదిన్ని లేనిదిన్ని తెలియగలందులకై మన్వి వ్రాసుకున్నాను. చిత్తానకు రావలెను.

మార్చి నెల 27 తేద్ని తమరు గుంటూరులోనె వుందురు అనిన్ని లేక చిత్తూరికి పొయ్యేటట్టు అయితె యిదె దారిన వత్తురు అనిన్ని తమ పేర అర్జి వ్రాశి గుంటూరికి టప్పాలలో పంపించివున్నాను. ఆ అర్జి తమకు చేరినదిన్ని లేనిదిన్ని తెలియలేదు. గనుక వేద్యం చేశినారు.

యీ యెప్రిల్ నెల 8 తేద్ని మహారాజశ్రీ యీ జిల్లా జెడిజిగారు అయిన మేస్తరు పి॥ హె॥ స్త్రాంబంధోరగారు యీ వూరు ప్రవేశించి చార్జి తీసుకున్నారు. మేస్తరు వూషుధోరగారు యీ వూరులో వూరికె వున్నారు.

యీ వూరులో లోగడ మేస్తరు మగడనలు ధొరగారిని చంపబడ్డి తురక వాండ్ల 6 మందిని గల్లుకు వేశినారు. 5 మందిని బంకోలుకు పంపించెలాగ్ను వుత్తర్వు వచ్చింది. యింకా మరియేమి అతిశయ వర్తమానములు మరి యేమిన్ని లేవు. చిత్తగించి కాపాడగలందులకు తాము ఖామందులు వున్నారు.

యిప్పట్లో నూత్నంగా జడిజి ధొరగారు యిక్కడికి వచ్చినందున ప్రస్తుతం నేను శెలవు అడగడానకు యుక్తంగా వుండలేదు. యింకా 15 రోజులు పోయిన తరువాత శెలవు పుచ్చుకుని వచ్చి తమ దర్శనం చేసుకుని రావలెను అని అభిప్రాయం వున్నది. చిత్తగించకర్తలు.

1833 సంవత్సరం యేప్రిల్ 8 తేది

—కృష్ణారెడ్డి (నాజరు)*

* మ.ఓ.మే. లై.లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 411, పేజీ 9. (యమ్. 417లో కూడా యిది కాపీ అయివుంది). "Krishna Reddi–execution of Murderers of Macdonald"—అని ఇండెక్సు పేజీలో బ్రౌన్ దీన్ని గురించి వ్రాసున్నాడు.

# కడపలో 'బ్రౌన్ కాలేజి' బంగళా—తోట....

## అయోధ్యాపురం కృష్ణారెడ్డి జాబులు

### 9

హాజరత్తు మేస్తరు చారలిస్ ఫిలెప్ బ్రౌన్ ధొరవారి సముఖానకు—

నిజపోష్యవర్గుడయిన క్రిష్ణారెడ్డి పదివేల సలాములు చేసి అత్యంత వినయ పూర్వకముగా వ్రాసుకునంన అర్జీ వింనపం యేమంటె*—నాయందు సంపూర్ణమయిన దయచాతను 15 నవంబరు వ్రాయించిన ఆజ్ఞ పత్రికెన్ను చ॥ 16 నవంబరు వ్రాయించిన ఆజ్ఞ పత్రికెన్ను ముట్టి చాలా సంతోషం అయినది.

కాలేజా బోరడు వారు కోరిన గ్రంథాల పయికి ఆంధ్రకౌముది । కవిసిరో భూషణం । సులక్షణసారం । విష్ణు ఆంధ్రం । ఆంధ్రభాషార్ణవం । ఆంధ్రభాషా భూషణం । కావ్యాలంకార చూడామణి । ప్రబంధరాజీయ్యం । యీ గ్రంథాలుంను విష్ణుపురాణ ప్రతులుంను అగత్యం కావలసినదనింని యీ గ్రంథాలపయికి ఖంమంలో వుండే పుస్తకాలు జాగ్రతగా తెప్పించుకుని త్వరగా అంపించేది అని వ్రాయించినారు.

---

* కృష్ణారెడ్డి బ్రౌన్‌కు వ్రాసిన జాబుల్లో—యిదే మనవి వాక్యంతో ప్రతి జాబూ ప్రారంభమవుతుంటుంది కాబట్టి—ముున్ముందు వచ్చే వాటిల్లో యీ వాక్యాన్ని మినహాయించి ముద్రించడం జరిగింది.

కంభములో తమరు వుండప్పుడు కాలేజా వార్కి అప్పగించవలసిన పుస్తకాలు యిక్కడ సిద్ధం చేయిస్తూ వుండంతలో, కాలేజాకు యివ్వవలసిన గ్రంధాలు అక్కడ యేమి సిద్ధమయినవో అంపించేది అనిన్ని కాలేజావారికి అప్పగించవలసిన పుస్తకాలు అంని యిక్కడ నుంచి అంపిస్తామనిన్ని కంభాన్నుంచి నా పేరట హుకుం వ్రాసినందున ఆజ్ఞప్రకారం అదివరకు సిద్ధంగావున్న కావ్యాలంకార చూడామణి। ఆంధ్రకౌముది। సులక్షణసారం। రసికజనమనోభిరామం। లక్షణ దీపికె। సివాంధ్రము। ప్రబంధరాజీయ్యం। యీ గ్రంధాలుంను బందరులో చీనా కాగితాలపైన వ్రాయించియుంన ఆంధ్రభాషార్ణవం వగైరా వుండబడిన యఱ్ఱబొక్కుంను। యివి యావత్తు జూలై నెల 25 తేదిన కంభానికి అంపించివుంనాను. కవిసిరోభూషణం వగైరా గ్రంధాలు వుండె పెద్ద బొక్కు 1827 సం॥రం అక్టోబరు నెలలో కంభాన్కి అంపించివుంనాను.

యీ హేతువువల్ల కాలేజావారి నిమిత్తము తమరు అప్పగించేటందుకు పంపించమని వ్రాసిన గ్రంథాలు యావత్తుంను కంభములోనె వుంనందున తమ హుకుం చేరిన 18 తేదిన యందు సదరు గ్రంధాలు త్వరగా అంపించేది అని కోదండ్రామయ్య పేరిట వుత్తరం వ్రాసి అంపించివుంనాను.

తమరు యిప్పుడు కాలేజావారి నిమిత్తం అంపించమని వ్రాయించిన గ్రంధాలపయికి ఆంధ్ర కౌముది। సులక్షణసారం। శివాంధ్రము దిద్దినప్రతి। కావ్యాలంకార చూడామణి। ప్రబంధరాజీయ్యం। యీ 5 గ్రంధాలు యిక్కడనే సిద్ధం చేయించిన గ్రంధాలు కంభాన్కి అంపించియుంటిని. అవి తిర్గి రానేవస్తూవుంనావి. కాలేజా వారికి అప్పగించేటందుకు సిద్ధం అయ్యేవుంనావి. యివిగాక కవిసిరోభూషణం బాలసరస్వితియ్యం రెండు గ్రంధాలు వుండబడిన పెద్దబొక్కు కంభములోనే వుంనావి. సదరు గ్రంధాలు వకటె బొక్కులో వుంనందుచాతనుంను అవి వినహా మరి వేరె వక్క గ్రంధము లేనందుచాతనుంను బొక్కులోనుంచి వేరె వక నూతన గ్రంధము వ్రాయించి కాలేజావారికి యివ్వవలసి వుంటూ వుంనవి అని లోగడ తమరు శలవు యిచ్చివుంటిరి. కంభములో వుండేవారు వేరేవక ప్రతి వ్రాయించి వుంనాగో లేదో తెలిసినదికాదు.

ఆంధ్ర భాషార్ణవం। విష్ణు ఆంధ్రం। శివాంధ్రం। ఆంధ్ర భాషాభూషణం। కావ్యాలంకార చూడామణి। యీ వగైరా గ్రంధాలు బందరులో చీనాకాగితాల మీద వ్రాయించియుండె యఱ్ఱ బొక్కుంను కంభములోనే వున్నావి. సదరు బొక్కులో కొంని చీనా కాగితాలుకూడా అక్కడక్కడ శిధిలంఅయివుంనావి. ఆ

బొక్కు వినహాగా ఆంధ్ర గ్రంధాలకు వేరే ప్రతులులేవు. యిప్పుడు కాలేజావారికి యివ్వవలసిన విష్ణు ఆంధ్రం। ఆంధ్ర భాషార్ణవం। ఆంధ్ర భాషాభూషణం యీ గ్రంధాలుకు వేరే ప్రతులు వ్రాయించివుంనారో లేదో తెలిసినదికాదు.

యీ గ్రంధాలు వేరే నూతనప్రతులు పుట్టించివుండి అంపించిరే సరేవున్నాది. లేక వారు వేరే నూతనప్రతులు పుట్టించి వుండనట్టయితె కాలేజావారికి యివ్వగలందులకై ఆ పాతప్రతులె అంపించవలెనో లేక వేరే కొత్తప్రతులు పుట్టించవలెనో తెలిసినదికాదు. పాత ప్రతులు కాలేజాకు అప్పగించే యోచనచేస్తే సదరు గ్రంధాలుకు తమదగ్గిర వేరే ప్రతులుంను లేవు. అదిగాక వకవక బొక్కులో కాలేజావారికి అప్పగించవలసిన గ్రంధాలుగాక యింకా కొంని గ్రంధాలతో కూడా మిశ్రమంగా వుంనావి. ప్రకృతం నూతనంగా వాటికి వేరేప్రతులు వ్రాయించే యోచనచేస్తే నెల దినములకు పైన సావుకాశం సంభవిస్తూ వుంనావి గనక యేప్రకారం శలవుఅయితే ఆ ప్రకారం శిరసావహించి నడుచుకుంటూ వుంనాను. చిత్తానకు రావలెను.

జూలై నెలలో కాలేజావారు కోరిన గ్రంధాలు యావత్తు యిక్కడనుంచె శిధ్ధంచేసి అంపిస్తాము అనింని అక్కడ శిధ్ధం అయిన గ్రంధాలు అంపించేది అని తమరు హుకుం వ్రాయించినారు. అందువల్ల యిక్కడ అదివరకు శిధ్ధం అయివుంన గ్రంధాలు అంపించి నిలిచిన గ్రంధాలు కంభములో సిధ్ధం చేయించి వుంనారేనని యిదివరకు నాకు నంమికవుంనవి. వారు వ్రాయించినారో లేదో తెలిసినదికాదు. అంతకు పూర్వం కాలేజావారికి యివ్వవలసిన గ్రంధాల నిమిత్తం నాల్గు అయిదు మార్లు తమకు అర్జీలు సహా వ్రాసుకొని వుత్తరువు తెప్పించుకొని 10, 11 గ్రంధాలు యిక్కడ శిధ్ధం చేయించియుంటిని. కంభములో వుండేవారు కాలేజావారికి కావలసిన గ్రంధాల పయికి రాధా మాధవి సంవ్వాదం వక గ్రంధం వినహా మరియేమి వ్రాయించి యుంనట్టు అగుపడలేదు. చిత్తానకు రావలెను.

తమ యొక్క బంగళాలోనుంను బంగళా వసారాలలోనుంను దరవాజాలలోనుంను గచ్చు గుంతలుపడి బెల్లు యెత్తిపోయినదనింని వివరగతిగా అర్జీ వ్రాసుకొని వుంనందుకు మరంమతు నిమత్తంఅయి రు. 50 లుకు హుకుం చేసినందున నేను నిండా విచారించి రు. 20 లు నేను తీసుకుని యుంటిని. గుర్రంలాయం మొదలయినవి చక్క చేయించిన తర్వాత బంగళాలో కింద బెల్లు యెత్తిపోయివుండే గుంతలు మాత్రం పూడిపిస్తూ వచ్చినందున పూడిపించిన జాగా తెల్లగా యుండడం లోగడ గచ్చు చేసిన జాగా నల్లగాయుండడం గాక తొక్కితే అణిగిపోవడం, యీ ప్రకారం అలంకారం తప్పి పోవుటగాకుండానుంను బేబందోబస్తీగా యుండినందున బంగళాలోనుంను వసారాలోనుంను కొఠిణీలోనుంను యావత్తు బంగళా మూడువేళ్ళు

యెత్తు గచ్చుచేయించి సుంనగార మొదలయినవి చేయించి కొత్తగా కట్టించి నప్పుడు చేయించినపని రీతిగా యావత్తు చేయించి వుంనాను. బంగళానిండా అలంకారంగా వుండేటందుకుగాను బంగళా మేడపయినానుంను బంగళా వెలిగా గోడలకుంను స్తంభాలకుంను వండుసుంనము పూయించి చక్క చేయించినాను.

యిందు నిమిత్తమయి నేను నిష్కర్షగా చేయించవలెనని లోగడ వుద్దేశించి వుండే పనికంటే అలంకారంగానుంను బందోబస్తిగానుంను లోగడ నూతనంగా కట్టించినప్పుడు వుండబడిన రీతిగానుంను వుండేలాగున యెక్కువగా పని చేయించినందుకు మోర్బ్యి చేశియుండే రు. 20 లకంటే రు. 12లు రు. 13లు యెక్కువ తగులుబడి అయ్యేయోచన యుంనావి. యీ రు. 12, రు. 13 యెక్కువగా కర్చుకాకుండా నేను లోగడ తీసుకునియుండె రు. 20 లుకు మాత్రమె కామగారి చేయించినట్టయితె అలంకారముకుంను బందోబస్తికిని తక్కువ సంభవిస్తూవుండే హేతువవల్ల యీ సంగతి యావత్తు తమకు యరుకచేసి తమ హుకుం తెప్పించుకుందామని ఆలోచన చేస్తే తమ వుత్తరువు వచ్చే యింతలోగా యిప్పుడు సంనాహాముచేసిన పని నిలిపి యిప్పుడు తిరిగి మొదలుపెట్టుట చాత విస్తారం తగులంబడి అయ్యే హేతువు చాతనుంను యిదివరకు రు. 27, 28 లు పని చేయించివుంనాను. యిప్పుడు యింక చేయిస్తూవుండే పనికి నాలుగు అయిదు రూపాయీలు తగులుబడి అయ్యే యోచనవుంనాది. అదింని మూడుదినములలో సమాప్తి అవుతుంది.

అయితే, యీ కామగిరి విషయములో యేయే దినం యేయే బేలుదారు యేయే కూలి మనిష్యి యేయే పనిచేసినదింని, వారు వారు చేసినపనికి యంనెంని పైసాలు యివ్వవలసినదింని వాళ్ళ పేరులుంను వివరగతిగా వక బొక్కులో మొదలుపెట్టి వ్రాసి హారహార దినము* బయ్యావరిగా వ్రాసి హారహారదినము సాయంత్రం కచేరివారి సమక్షమందు వారికి యిచ్చి అందుకు వాళ్ళచేతనుంను కచేరివారి చేతనుంను చెవ్రాలు చేయిస్తూ వచ్చివుంనాను. నా యొక్క ప్రయాసలోనుంను ఆలోచనలోనుంను యంతమాత్రం తక్కువ కాకుండా జరిగించి పనివాళ్ళు చేసే పనులయందుంను వాళ్ళకు యివ్వవలసిన కూలియందును యింకా యే విషయమందయినా వక గవ్వ అయినా నిరర్ధకం కాకుండా జాగ్రతచేసివుంనాను. నేనువుంచిన వివరగతిగా రుజువు మొకాబిలా వుంచబడిన లెఖ్కున్ను యిందు నిమిత్తం చేయించిన

---

* 'అర అర దినము' అని తన తెలుగు రీడర్లో బ్రౌన్ ముద్రించివున్నాడు; ఇంగ్లీషు తర్జుమాలో half day అనే అన్నాడు. ఇది తప్పు. హారహార దినంఅనడమే సబబు, హార్ దిన్ అంటే ఉర్దూ (హిందీ)లో ప్రతిరోజూ అని అర్థం కనుక, అప్పుడే అన్వయం సరిపోతుంది.

కామగారి పనింని తమరు నిండా తనక్కీచేసి విచారించవలెను అని కోరుతుంనాను. కామగారి యావత్తు అయినట్టుగానే వివరగతిపట్టీ సముఖానకు రవాణి చేస్తుంనాను. చిత్తానికి తేవలెను. సావుకాశం మీద లోగడ అర్జీకి వివరముగా వుత్తరువు దయచేస్తానని శలవు యిచ్చినారు. ఆ ప్రకారం దయచాయవలెనని కోరుతుంనాను.

చింన కల్కటరు ధొరవార్కి డేరా యివ్వవలశినదనింని ఆ డేరా సంమంధం రు. 200 లు నీవు తీసుకుని దాచి పెట్టవలసినదనింని వ్రాయించినారు. తమ వుత్తరవు చేరగానే మహారాజశ్రీ హేగ్గు ధొరవారితో మనివిచేస్తే వారు కామలాపురానికి చింనకల్కటరు దొరవారికి వుత్తరము వ్రాసినారు. యింకా రూకలు రాలేదు. రెండు మూడు దినములలో వచ్చునని తోస్తూవుంనాది. చిత్తానకు రావలెను.

నంమాళ్లకు యిక్కడ జీతంభత్యంకూడా యిస్తూవచ్చివుంనాము అనింని వాని జీతం తీసుకుని లెఖ్కకు దాఖలా చేసేదనింని వ్రాయించినారు. అతడు ఆగస్టు నెలలో యిక్కడికి వచ్చివుంనాడు. అతనిది మూడు నెలలజీతము కంభము కోర్టు ఖజానాలో అనామత్తు వుండవలశినది గన్క ఆ నెలల జీతం అంపించేలాగున కంభంకోర్టు సిరస్తాదారు పేరట వుత్తరం వ్రాసివుంనాను. ఆగస్టు నెల జీతాలలో దాఖలు అయివుంన గురప్ప జీతం అనామత్తు వుంచిన రూ. 6 లు తమ లెఖ్కకు ముజరా వేసివుంనాను. [యిందులో రెండో పట్టీ ధొరవారు వ్రాయవద్దని శలవు యిచ్చినారు గన్క నిలుపు చాయడమయినది.]

ఆన 1828 డిశంబరు 26 తేది

అ॥ కృష్ణారెడ్డి*

---

* మ.ఓ. మే.లై.లో వున్న బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 411, పేజీ 26. ఇండెక్సు పేజీలో యీ జాబును గురించి "From Krishna Reddi - first half about mss. is worthless: the second half about repairing house is good"—అని వ్రాసిపెట్టి వున్నాడు బ్రౌన్.

అన్నట్లుగానే మొదటి భాగాన్ని తొలగించి, రెండో భాగాన్ని మాత్రం (బంగళా రిపేర్ విషయాలున్న భాగాన్ని), ౨౨ పేజీలో 'తమయొక్క బంగళాలోనుంను' అనే దగ్గర్నుంచి 'తెలుగు రీడర్'లో 147–49 పేజీల్లో ముద్రించి వున్నాడు. కృష్ణారెడ్డిని గూర్చి పాద పీఠిక (ఇంగ్లీషు తర్జుమా)లో యిట్లా వ్రాసున్నాడు. "The writer of this letter was the son of a Telugu farmer in the neighbourhood of Kadapa. He subsequently was made a Munsif and died on 26th March 1844, holding that appointment."

# 10

హాజరతు మేస్తరు చారులిసు ఫిలేబు బ్రౌన్ సాహెబు ప్రవిన్ శ్యాలు కోర్టు రిజిష్టరు తిరచనాపల్లెగారి సముఖానకు___

...మహారాజశ్రీ జెడిజి హెగ్గు ధొరవారి వుత్తర్వు ప్రకారం వాయిలిపాటి మునసపు కోర్టుల వాజమా యావత్తున్నూ విఠలరాయుడు అనే అతని స్వాధీనంచేశి యీ నెల 27 తేది శుక్రవారంనాడు కడప• చేరినాను_ మామూలు ప్రకారం కాలీజా కచ్చేరి వగైరాల పయ్నినున్ను బంగళా వగైరా పయ్నినున్ను చక్కగా ఖబరుదారి చేశి జర్గిస్తూ వున్నాను.

మహారాజశ్రీ హెగ్గుధొరవారు నన్ను పిలుపించి కాలీజా కచ్చేరి బ్రాహ్మణులకున్ను తోటమాలీల వగైరాలకున్నూ యివ్వవలశ్ని జీతాల గురించి పట్టీవ్రాశి తీసుకొనిరమ్మని శెల్వు యిచ్చినందున్ను 1828 సం॥ నవంబరు నెల తాగాయితి వారికి యివ్వవలస్ని జీతాలపట్టీ వ్రాశి తీసుకొనిపోయినందున్ను రు. 300 లు మేము యిస్తామని శెల్వు యిచ్చినారు.

కాలీజా కచ్చేరి బ్రాహ్మణులు నవంబరునెల తాగాయతి వారు కచ్చేరికి రావడమున్ను వారు చేశ్ని తీర్పులున్నూ విచారించినంతల్లో కానా అశ్రద్ధగా జర్గించి వున్నారు. యిందు నిమిత్తము అయి- నవంబరునెల తాగాయతి హరహరదినము వారు వచ్చే ఘంటలున్నూ వారు చేశ్ని పనిన్ని యావత్తున్నూ విచారిస్తూ వున్నాను. యిందుమీదట యీ అయిదునెలల్లో వారు హాజరువుండి నవుకరీ చేశ్ని దినాలు యెన్ని అయినదిన్ని గైరుహాజరు అయిన దినాలున్ను లెఖ్ఖచేశి హాజరు అయిన దినాలకున్నూ చేశ్ని పనికిన్ని వారికి యుక్తం ప్రకారంగా కొంచము అయివజు యిప్పించి ఆ తకరారు సంగతి యావత్తున్నూ పాదాల సముఖానకు విజ్ఞాపన చేస్తూ వున్నాను. హెగ్గు ధొరవారు యిప్పించిన అయివజు యెవరెవరికి యేమి యిప్పించినదిన్ని ఆ వైనం యావత్తున్నూ వారి చాత రశీదులు తీసుకొని విజ్ఞాపన చేస్తూ వున్నాను.

తెనుగు బొక్కులు వినహా నిలిచిన యింగిలీషు బొక్కులు యావత్తున్నూ పట్టీ వ్రాశి శిద్ధంచేసి వుంచేది అని శెల్వు యిచ్చివున్నారు. అదేప్రకారం శిద్ధంచేసి వుంచినాను. మేస్తరు కేపటన్ కల్లీధొరవారికి హెగ్గు ధొరవార వుత్తర్వు ప్రకారం 86 ద్రాక్షగొలలు అంపించియున్నాను. తోటయొక్క ఫలములు హెగ్గు ధొరవారి వుత్తర్వు ప్రకారం పాదిరిధొరవారికి అంపిస్తూవున్నాను. జిలదు కట్ట

వలశిన పొస్తకాలు యావత్తు ఆజ్ఞప్రకారం శిద్ధంచేసి వుంచివున్నాను. తోటన్నూ సరంజామున్నూ బంగళా వగైరాన్నూ చక్కగా కాపాడుకొని వుండినాను.

నిలిచిన సంగతి యావత్తున్నూ అయిదు ఆరు దినములలో తిర్గి విజ్ఞాపన చేస్తూ వున్నాను. మేస్తరు హెగ్గుధొరవారు యీ యేప్రెలు నెల 15 తేది మొదలు కొని ఆరునెలలు శెల్వు కావలెను అని గౌనరుమెంటుకు వ్రాసుకొని వున్నాడు. యింకా వారికి శెల్వురాలేదు. యిక్కడికి యెవరు వచ్చేదిన్ని యేర్పడలేదు. యీ వైనం చిత్తానుకు రావలెను అని మన్వి చేశినాను. చిత్తగించి కాపాడగలందులకు తాము ఖామందులు వున్నారు.

చ॥ 31 మార్చి 1829 సం॥
—క్రిష్ణారెడ్డి చెప్రాలు.*

# 11

హుజరత్తు మేస్తరు చారులిను ఫిలెప్ బ్రౌన్‌సాహెబు రిజిష్టరు ప్రవిన్‌శ్యాలు కోర్టు తిరచనాపల్లెగారి సముఖానకు—

...మహారాజశ్రీ హెగ్గు దొరవారు యేప్రెల్ నెల 15 తేది తాగాయతి నీలగిరికి పోవడాన్కి ఆరునెలలు శెల్వు కావలెనని సదరు అదాలతువార్కి వ్రాసుకని వున్నందుక్కు అదే ప్రకారం శెల్వు వచ్చివుండెను. తర్వాత యేప్రెలు 27 తేది వరకు యే ధొరవారు పైంటు అయివుండే సంగతి తెలియనందున, తిర్గి హెగ్గు ధొరవారు యెండాకాలం కొంచెం తక్కువ అయ్నిది తనకు శరీరం స్వస్తంగా వున్నదనిన్ని తనకు యివ్వబడిన 6 నెలల శల్వు తనకు నిమిత్తం లేకుండా తోశి వెయ్యవలశ్నిది అనిన్ని వ్రాసుకుని వున్నందుకు పి॥ హెచ్చి॥ స్త్రాంబం (Strom-bom అని బ్రౌన్ వ్రాత) అనే ధొరవారిని ఆకటింగు జెడిజిగా పైంటు చేసినాము అనిన్ని నీకు శెల్వు యిచ్చినది తోసి వెయ్యకూడదు అనిన్ని ఆకటింగు జెడిజి ధొరవారే నీవు శెల్వు కోరిన దినాలు పర్యంతం పని చూడవలశ్నిది అనిన్ని వుత్తర్వు వచ్చినది. సదరు స్త్రాంభం దొరవారున్ను మొన్నటిదినము రాజమహేంద్రంనుంచి

* మ.ఓ.మే.లై. లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 401, పేజీ 232. "Report on my property at Cuddapah" అని యీ జాబును గురించి వొక నోట్ వ్రాశాడు బ్రౌన్.

వచ్చి చేరివున్నారు. హెగ్గు ధొరగారు యీ మే నెల 20 తేదీన్ని యీ స్త్రళం విడిచి పోతువున్నానని వ్రాసివున్నాడు. అయితే యే వూర్కి పొయ్యేదిన్ని తెలియలేదు.

యిట్లావుండగా యేప్రెల్ నెల 15 తేదిన్ని వాయిలిపాటి మునసపు విరల రాయుడు చనిపోయినందున్ను ఆ పని నాజరు గురుమూర్తికి యివ్వవలసినది అని యేప్రెల్ నెల 13 తేదిన్ని ప్రవిన్శ్యాలు కోర్టువార్కి వ్రాసివున్నాడు. సదరు దినం నేను (హెగ్గు దొరవారికి) ఫారసీతో అర్జీవ్రాసి యిచ్చివుండగా, నా అర్జీకింద నాజరు పనికి హైంటు చేస్తాము అని తన స్వదస్తూరి వ్రాసి వుద్యోగపు చేవ్రాలు చేసి అర్జీ నాకు వాపసు యిచ్చివున్నారు. నాకు వుండే ఆరువరహాల గుమాస్తాగిరి సుబ్బారావు అనే అతనికిన్ని అతని 5 వరహాల పని రామబ్రహ్మము అనే అతనికిన్ని యిస్తాము అని దస్తావేజు వ్రాసి యిచ్చివున్నారు. కోర్టులో పబ్లికగానున్ను శెల్వు యిచ్చినారు. గురుమూర్తికి మునసపు పని నిమిత్తము అయి యిదివరకు ప్రవిన్శ్యాలు కోర్టునుంచి వుత్తర్వు రానందువల్ల నాకు నిష్కర్ష చేసిన్ని నాజరు పనిలో ప్రవేశించడాన్కి అభ్యంతరం అయివున్నది. యీ మే నెల 20 తేదికి మునసపు పని నిమిత్తము అయి హెగ్గు దొరవారు యిక్కడ వుండేలోగా గురుమూర్తికి హుకుం వచ్చినట్టు అయితే నేను నాజరు పనిలో ప్రవేసించడాన్కి అభ్యంతరం అగపడలేదు. హెగ్గు ధొరవారు యీ స్థళం విడిచి పోవడాన్కి లోగా హుకుం రాకపోతే తాను చేసిన్ని నిష్కర్ష ప్రకారం జరిగించవలసిన్నది అని కొత్త (స్త్రంబం) ధొరవారితో చెప్పిపోదురు అని తెలుస్తూవున్నది.

అయితే యిప్పుడు వచ్చివుండే కొత్త ధొరవారికిన్ని నాకున్ను యేమిన్ని పరిచయంలేదు గనుక్కనున్ను, యిక్కడవుండే వారిపైకి మహారా॥ హెగ్గుధొరవారు వినహా నా క్షేమం కోరేవారు లేరు గనుక్కనున్ను, యిప్పట్లో గొప్ప పని తటస్థమై నాకు పొందే మార్గము వున్నది గనుకనున్ను మన్వి చేసినాను.

సదరు స్త్రంబంధొరవారు తెన్గు మాటలున్ను తెల్గు చదువున్ను వచ్చిన వారు. తెల్గుయందు నిండా ఆసక్తియున్నది. యిదిన్ని గాక యీ కొత్త ధొరవారి సామాను వెంబడి వకరు యిద్దరు మనుష్యులు వుద్యోగం కావలెనని వస్తూవున్నారు గనుక్క యిప్పట్లో హెగ్గు ధొరవారి శిఫారస్సుకు తోడుగా తమయొక్క శిఫారసు వుంటే కొత్త ధొరవారు ఆ పని నాకు యివ్వకుండా తోసివెయ్యడాన్కి అనుకూలించరు అని నాకు నిజముగా తెలుస్తున్నది. యిప్పట్లో తమరు నా నిమిత్తమై యేమి వ్రాశిన్నప్పటికిన్ని నిండా వుపయోగంగా వుంటూవున్నది. హెగ్గు ధొరవారు నా నిమిత్తము అయి చెప్పుదురు అని తోస్తూవున్నది. కొత్త ధొరవారితో నీ

నిమిత్తమై చెప్పి పోతూవున్నానని కూడా లోగడ సెలవు యిచ్చివున్నారు. వారు చెప్పినదాన్కి సహాయంగా తమరు యేమి వ్రాశ్నిప్పటికిన్ని నాకు నిండా వుప యోగ మాతూవున్నది అని తమ సముఖాన్ని గురించి ప్రార్థిస్తూవున్నాను. చిత్త గించి త్వరగా వక కాగితము దయచేసేలాగ్ను చేయవలెను అని కోరుతూవున్నాను. అన్నిటికి నాయొక్క సంరక్షణ చేసేటువంటి భారకత్వం తమరు వహించివున్నారు. గన్కునున్నూ తమరిని వినహా అన్యత్ర నేను నమ్మి వుండలేదు గన్కునున్నూ మన్వి చేసినాను. చిత్తగించి యేప్రకారం శెల్వు అయితే అట్లా నడుచుకుంటూ వున్నాను.

వోబళరావు దగ్గర తమరు రెండు మూడు మారులు అయివజు తీసుకొని పత్రాలు వ్రాశియిచ్చి వున్నారు. ఆ పైకి కొంత అయివజు చెల్లు యిచ్చివున్నారు. పత్రాలు అన్ని అతని వశ్నానే వున్నవి. లెఖ్కచూచుకొని చెల్లు అయివజుకి కొన్నిపత్రాలు వాపస్సు తీసుకొని బాకి యింత అయివజు అని లెఖ్క చూచుకుంటే యుక్తంగా వుంటూ వున్నది అని వోబళరావు చెప్పుతూవున్నాడు. అయివజు చెల్లించి వుండిన్ని పత్రాలు వారి వశ్నానే వుండడము యీ కాలములో యేమిన్ని యుక్తంగా అగుపడలేదు. తమయొక్క వుత్తర్వు అయితె తారీఖువారీగా వాయిదా ప్రకారం లెఖ్కచూచుకొని చెల్లు అయివజుకు యీడుగా వారికి మీరు వ్రాశియిచ్చి వుండే కొన్ని పత్రాలు వాపస్సు తీసుకొని ఆ పత్రాలున్ను లెఖ్క వివరగతి జాబితా యింగిలీషుతో వ్రాయించి ఆ జాబితాన్ను సముఖంలోకి పంపిస్తూవున్నాను. బాకీ అయివజ్కు తమ తావుకు యెవరిని అయినా అంపించవలెను అని యోచ్న చేస్తూవుంటే యీల నిమిత్తము లేదు వకటి రెండు నెలల్లో పంపిస్తారు అంపించవద్దు అని నిలిపివున్నాను. యీ సంగతికి యే ప్రకారం శెల్వు అయితే అట్లా నడుచు కుంటూ వున్నాను.

పెద్దబోయ గురప్ప అంకాళు యిద్దరు చేరివున్నారు. కాగితాల శిక్కెనులు దస్తాలు 21, పేనాలు కట్టలు 196 తీస్కొని వచ్చివున్నారు. యింగిలీషు పుస్త కాలు పట్నానికి అంపించేదాన్కి కూలివాండ్లనుంచి కాదు. కూలిక్ బండ్లు మాట్లాడి నాల్గు దినములలో రవానా చేస్తూవున్నాను. తమయొక్క ఖాసగితి కూలీల వగై రాలు నిత్యం నిత్యం యేమి యేమి పనిచేసేదిన్ని చెయ్యానిదిన్ని దినంసాయంత్రం విచారిస్తూ వున్నాను. తమయొక్క సామానుపైకి చీన చిప్పలు మొదలయ్నివిన్ని సారాయిన్ని కొందరు ధొరలు కావలెనని చెప్పుతూవున్నారు. హెగ్గు ధొరవార్కి యెరుక చేసి యిస్తామని చెప్పినాము యింకా తీసుకోలేదు. యే ధొరయైనా యే

దైనా ఖరీదును అడిగితే యివ్వవలెనో లేదో ఆసంగతి వ్రాయించే లాగ్నున్ను దయ చేయవలెను.

13 మే 1829 సం॥
క్రిష్ణారెడ్డి చైవ్రాలు. *

## 12

మహారాజశ్రీ మేస్తరు చారలిస్ ఫిలెప్ బ్రౌన్ ధొరవారి సముఖానకు—

...తమయొక్క బంగళా మేస్తరు ప్రిజరు సాహెబు తీసుకోవలెనని వున్నాడు. వారిని ఆ బంగళాలో బాడిగెకు దిగేలాగున చెయ్యవలశ్ని ది అని తమరు ఆజ్ఞ దయచేశినందుకు ప్రిజరు ధొరన్ను యీ జిల్లా ఆకటింగు మేజస్ట్రీటు యింగిలీషు ధొరవారున్ను యీ యిద్దరు మొన్నటిరోజున యీ కడపకు వచ్చినందున తమరు వ్రాసిన ప్రకారం యీ సంగతి వారితో చెప్పగా ఆ బంగళా బాడిగె యెంత అని అడిగితే తోట గాకపోతే ౫ 15లు బాడిగెకంటె తక్కువ మేము తీసుకోన్యారము అని మా ధొరవారు రెండు సంవత్సరములకింద చెప్పినారు అని చెప్పినాను. తిరిగి నిన్నటిదినము పిలిపించి అడిగితె నేను చెప్పినది తోటమాలీల జీతం యెద్దుల ఖర్చు మీరే యిచ్చేటట్టు అయితె ౫ 15లు లెక్క వాండ్లకు జీతాలు మేము యిచ్చేలాగ్ను అయితె ౫ 20 లు మీరు యివ్వవలశ్ని ది అని చ॥ 21 మే తమరు వ్రాయబడిన ఆజ్ఞ పత్రికె నిన్నటిరోజున చేరినందున్ను ఆ వుత్తరంకూడా చూపించి నందున చదివి వినిపించుకొని వున్నారు.

మీ బంగళా కుశిని మొదలయినవి మాకు బందోబస్తి చేశియివ్వవలశ్ని దనిన్ని బంగళా మరమ్మతు యెవరు చేయించి యివ్వవలశ్ని ది అనిన్ని అడిగినందుకు కామగారి నేను చేయిస్తూ వున్నాను అని చెప్పినాను. బ్రాహ్మణులు వుండే బంగళా మాకు కావలెను అని అడిగినందుకు అది నన్నుంచికాదు, బ్రాహ్మణులకు అని వేరే కట్టించివున్నారు, యీ సంగతి మా ధొరవారుకూడా వప్పడం దుస్తర మేను అని చెప్పినాను. యీ సంగతికి యిద్దరు ధొరలు ఆలోచన్నచేశి యింగిలీషు

---

* మ.ఓ.మే.లై.లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 401, పేజీ 203. యమ్. 417 లో కూడా కాపీ వ్రాయించాడు. దీనిని గురించి వ్రాసివున్న నోట్ లో "A. Good and easy..." అని అర్థంకాని లిపిలో యేదో వ్రాసున్నాడు. తెలుగు రీడర్ (పేజీలు 171-3)లో యీ జాబు ముద్రణై వుందికూడా. అయితే "వోబళరావు దగ్గర..." అనే పేరాగ్రాఫ్, సారాయి ప్రస్తావనవున్న వాక్యమూ తొలగించబడి వున్నాయి.

ధొరవారు చెప్పినారుగదా × 10 వరహాలు బాడిగె యిస్తూ వున్నాము, తోట ఖర్చు యావత్తు మేము యిస్తూ వున్నాము, బ్రాహ్మణులు నడిమి బంగళాకు వారు రావడంవల్ల మాకున్ను బ్రాహ్మణులకున్ను తొందర సంభవిస్తూ వున్నది గనుక యీ సంగతి నిమిత్తము అయి మీ ధొరవారికి వ్రాశి పంపించి వుత్తరం తెప్పించ వలెను అని చెప్పినారు. యిదిన్నిగాక బంగళాలో మేము దిగితె కొన్ని దినాల మట్టుకు దిగి తిరిగిపోవచ్చునా యప్పటికి మేము వుండి బాడిగె యిస్తూ రావలశ్నిదో అని అడిగితె అది నాకు తెలియదు అని చెప్పినాను. అందుకు వారు చెప్పినారు—సధ్యా ఆరునెలల మట్టుకు వుంటూవున్నాము తర్వాత యేమి మాట అయినా చెప్పుతాను అని చెప్పి యీ సంగతికూడా మీ ధొరవారికి వ్రాశిపంపించేది అని చెప్పినారు. తర్వాత మూడు ఝాముల వేళ యీ సంగతి నీవు వ్రాయవద్దు మేము మీ ధొరవారికి వ్రాస్తాము అని చెప్పినారు. వారు యేమి వ్రాసినారో తెలిశ్నదికాదు.

ఆ దొరలు తమ మాటప్రకారం నేను నడవలేదు అని కొంచెము కోపముతో వున్నారు. వారినుంచి నాకు కావలశ్నదిలేదు. చిప్పలసామాను వగైరా యవరు అయినా అడిగితె యివ్వమని వ్రాశారు. అందులు ఖరీదు యేమి అయ్యేదిన్ని తెలియ లేదు. చిత్తగించి ధరయొక్క వైనం వ్రాయించి పంపేలాగ్ను దయచేశినట్టు అయితె కొంత్త సరంజాము అయినా అమ్మడబోవును అని తెలుస్తున్నాది. మామిడిపండ్లు కాయలను ఆజ్ఞప్రకారము యెనభై పండ్లు మెస్తరు కేపటన్ కిలి ధొరవారికి వుత్తరం రాశి కూలివానికి యిక్కడ రు. 2 లు యిచ్చి మామూలు ప్రకారం ఆ ధొరవారు రెండు రూపాయీలు యిచ్చేలాగ్ను వ్రాసివున్నాను.

మామిడికాయలనుంచి యిదివరకు రు. 30 లు వసూలు అయ్నిది. యింకా రు. 20 లు పర్యంత్తరం వసూలు అవునని తెలుస్తున్నాది. వానాఘాలీ నుంచి పాతికె అర్ధపాలు కాయలు రాలిపోయినందున కొంచంగా వసూలు అయ్నిది చిత్తగించవలెను అని కోరుతూ వున్నాను. నిలిచ్ని సంగతులు అన్ని మూడు నాల్గు దినములలో శ్రుతం చేస్తూవున్నాను. మెస్తరు స్త్రంబం ధొరవారు హెగ్గు ధొర వారి బంగళాలో దిగివున్నారు. వారు రెండోచోటికి వచ్చె యోచ్న కనిపించలేదు. చిత్తగించి కాపాడగలందులకు తాము ఖామందులు వున్నారు.

చ॥ 28 మే 1829 సం॥

—క్రిష్ణారెడ్డి చైత్రవాలు *

---

* మ.ఓ.మే.లై.లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 411, పేజీ 14. దీన్ని గురించి "Krishna Reddi. good but not producible"—అని బ్రౌన్ వొక నోట్ వ్రాసున్నాడు.

## 13

హాజరతు మెస్తరు కెపటన్ కిలి ధొరవారి సముఖానకు—

అర్జిదాస్తు ఫిదివి జిల్లా కోర్టు గుమాస్తా క్రిష్ణారెడ్డి సలాములు చేశి వ్రాసుకున్న మన్వి అర్జియేమంటె మహారాజశ్రీ సి. పి. బ్రౌన్ ధొరవారియొక్క బంగళాలో వుండబడ్ని వారి యింగిలీషు బొక్కులు తమ తావుకు అంపించుమని నా పేరిట ఆ ధొరవారు హుకుం వ్రాయించి పంపించినందున వారి వుత్తర్వు ప్రకారం యింగిలీషు బొక్కులు 275 రెండుతోలు పెద్ద పెట్టెలలోనున్నూ వొక యెదురుపెట్టెలోనున్న జుమలా మూడు పెట్టెలలో వేయించి మైనముగుడ్డ వగైరా పెట్టెలు పయ్ని వేయించి బండిమీద అంకాళు అనేవాణ్ని వెంబడి సముఖానకు పంపించివున్నాను. చిత్తగించి సదరహీ బొక్కులు పట్టీప్రకారం తమకు చేరిన సంగతి ఫిదివికి తెలియ గలందులకు అయి హుకుం సాదరు చేయించవలెను అని కోరుతూ వున్నాను. యింతే సలాములు.

1829 సం॥ జూను నెల 12 తేది

—క్రిష్ణారెడ్డి చ్రైవ్రాలు.*

## 14

మహారాజశ్రీ మెస్తరు చార్లిసు పిలీపు బ్రోన్ సాహెబు ప్రావీన్సయాల్ కోర్టు రిజిస్టరు తిరుచనాపల్లెగారి సముఖానకు—

...కొత్రపాటి చితంబరంమును సముఖానకు పంపించెలాగ్ను ఆజ్ఞ దయచేశి వున్నారు. ఆజ్ఞమేరకు సముఖానకు వచ్చివున్నాడు. కాలీజా కచేరీ నుంచి వసు చరిత్ర తీర్పుచేయించేది అని ఆజ్ఞ దయచేశివున్నారు. పొస్తుకాలు కంభములో వున్నందున కోదండ్రామయ్యకు వుత్తరం వ్రాశి పంపించినాను. అవి రాగానె ఆరంభము చేయిస్తూవున్నాను. నిలిచిన యిక్కడ సంగతులు వేద్యం చెయ్యడానకు మాణిక్యము మొదలారికి గజలరెడ్డి యివ్వవలశ్ని రూపాయీలకు యింకా నాల్గు దినములు ఆలస్యం సంభవించి వున్నందువల్లనున్నూ టప్పాల పరిముఖంగా యావత్తు సంగతి మనివి చేస్తూవున్నాను. కొత్రపాటి చితంబరంవల్ల యిక్కడి సంగతులు

---

* మ.ఓ.మే.లై. లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 411, పేజీ 13. ఈ జాబుపైన "Krishna Reddi's letter to Capn. Keighly..." అని బ్రౌన్ వొక వివరణ వ్రాసిపెట్టాడు.

యావత్తు చిత్తానకు వేద్యం అవుతూవున్నవి. సౌందర్యలహరి వ్యాఖ్యానం లొల్లా చిద్వల్లి యీ రెండున్నూ యీ దేశములో విచారించి వ్రాయించేది అని ఆజ్ఞ అయి వుండెను. యిప్పట్లో అవధానుల అప్పయ్య మూలం లొల్లా అనే వ్యాఖ్యానం సంపాదించుకొని చిద్వల్లి అనే వ్యాఖ్యానం దారిలో కంచి ఆప్రాంత్యాల వున్నది అది సంపాదించుకొని సముఖానకు పోవలెనని ప్రయాణం అయి వచ్చివున్నాడు. చిత్తానకు రావలెను. చితంబరం లోగడనుంచి తమ ప్రాపకమె నమ్మివుండె సంగతి చిత్తానకు తెలిశెవున్నది. ప్రస్తుతం త్మ ప్రాపకమే నమ్మి సముఖానకు వున్నాడు. చిత్తగించి కాపాడగలందులకు తాము ఖామందులువున్నారు.

1 నవంబరు 1829 సం॥
క్రిష్ణారెడ్డి చైత్రాలు.*

## 15

మహారాజశ్రీ మేస్తరు సి. పి. బ్రౌన్ యిస్కోయరు ధొరవారి సముఖానకు—

...తమరు యీ డిశంబరు నెల 6 రోజ్ను వ్రాయించిన ఆజ్ఞ పత్రికె చేరి అందుల బుద్ధి గ్రహించి అపరిమితమైన సంతోషం అయినది. పెద్దబోయి గురువప్ప చేతికి తమరు నా ఆజ్ఞపత్రికలో మలుపూఫు చేసి అంపించిన యింగిలీషు వుత్తరం యిచ్చి వేపేరిలో తమ పనులను గురియించి యెవరికి వుత్తరాలు యిచ్చినారో వారికి యీ వుత్తరం యిచ్చేలాగ్ను తాకీదుచేశి మొన్నటి దినము ప్రయాణముచేశి పట్నానికి అంపించినాను. చిత్తానకు రావలెను.

తమకు బందరుజిల్లా అశిష్టాంటు జెడిజి పయింటు విని యిదివరకు మేము చేశ్ని తపస్సు పండినది అని అపరిమితమైన సంతోషం అయ్నిది. అయితె తమ దర్శనం చేసుకోవలెనని మిక్కిలి అభిప్రాయం వున్నది. నేను యిక్కడి ధొరలతో శెల్వు తీసుకొని రావడానకు తమ వుత్తర్వు లేనంద్ను వూరికె వున్నాను. తమరు పట్నములో వుండగా గాని లేక బందరుకు పొయ్యే మార్గము అయిన నెల్లూరిలోగాని తమ దర్శనం చేసుకోవడానకు వసతి వుంటూవున్నది గనుక శెల్వు అయితె తమ దర్శనప్రాప్తి కల్గును అని తోస్తూ వున్నది. అయితే తమరు యెన్ని దినాల పర్యంత్తరం పట్నములో వుండేదిన్ని యే తేద్ని బందరుకు ప్రయాణం అయి పట్నము విడిచేదిన్ని తెలియలేదు.

---

* మ.ఓ.మే.లై.లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 411, పేజీ 15. (యమ్. 417, పేజీ 441 లో కూడా కాపీ అయివుంది). ఈ జాబును గురించి "Kr. Red. Regarding mss." అని బ్రౌన్ వొక నోట్ వ్రాసున్నాడు.

తమ దర్శనం చేసుకోవలెనని బహు అభిలాష వున్నందున మనవి చేశినాను. దర్శనం చేసుకొన్నంతల్లో కొన్ని సంగతులు తమ సమక్షమందు మనివి చెయ్యవలెనని కూడా కోరికెవున్నది గనుక వకవేళ యిక్కడి జెడిజివారు శెలవు యివ్వడానకు అనుమానిస్తే బదులు మనిష్యిని వుంచి రావలెననికూడా అభిలాష వున్నది గనుక నాకు శెల్వు అయ్యే విషయానకు ప్రస్త్రంభం ధొరవారికి తమరు వక చీటి వ్రాయడం యుక్తముగావున్న పక్షమందు వ్రాసిపంపిస్తె శెలవు అవునని తోస్తూవున్నది. లేకపోయినప్పటికిన్ని నేను అయినా శెల్వు అడ్గి తీసుకుంటూవున్నాను. చిత్తానకు తెచ్చి యేప్రకారం అజ్ఞ అయితె ఆప్రకారం శిరసావహించి నడుచుకుంటూవున్నాను. యీ విషయములో తమరు యేచొప్పున అజ్ఞ దయచేస్తె ఆప్రకారం నడుచుకుంటూ వున్నాను. చిత్తానకు తెచ్చి కాపాడగలందులకు తాము ఖామందులు వున్నారు.

ది 25 డిశంబరు 1829 సం॥
—క్రిష్ణారెడ్డి చైవ్రాలు*

(తా. క.॥) నాకు శెలవు అయ్యిన పక్షమందున యిక్కడ తోట బంగళా ఖబరదారీ నిమిత్తము ధర్మపురం సుబ్బన్న యిక్కడవున్నాడు. యితణ్నిన్ని నా తమ్ముడు అయిన నారాయణరెడ్డిన్ని యిక్కడ వుంచిరావలెనని అభిలాషవున్నది. నేను నెలదినాలుకు శెల్వు అయితె తమ దర్శనం చేసుకుని తిరిగీ యిక్కడ చేరకలను అని నాకు తోస్తూవున్నది గనుక మనవి చేశినాను.

కాలేజా కచేరివారు వసుచరిత్ర వ్యాఖ్యానంతో కూడా మొకాబిలాచేసి తీర్పుచేస్తూవున్నారు. నాలుగో ఆశ్వాసము రెండుదినములలో సమాప్తి అయ్యినది. వసుచరిత్ర యావత్తు పదిహేను రోజులలో అంత్తా సమాప్తి అయ్యినని తోస్తూవున్నది. చిత్తానకు రావలెను. వసుచరిత్ర అయిన తరువాత కచేరివారు యేమి జరిగించవలశ్నిది తెలిశినదికాదు గనుక యేగ్రంథము ఆరంభము చేశేది అజ్ఞ దయచేస్తె అజ్ఞప్రకారం నడుచుకుంటూవున్నాను. ద్రాక్ష పందిలి కస్తిచేయించి మసాలా వేయించినాను. దివ్యచిత్తానకు తేవలెను అని కోరుతూవున్నాను...

---

* మ.ఓ.మే.లై. లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 411, పేజీ 22. ఈ జాబును గురించి ఇండెక్స్ పేజీలో "Krishna Reddi, Tolerably good"— అని వ్రాసిపెట్టాడు బ్రౌన్.

## 16

మహారాజరాజశ్రీ మేస్తరు సీ. పీ. బ్రౌన్ యిస్కొయరు మహాప్రభువులుగారి సాన్నిధ్యమునకు...

...యీ లోవైనం తమపేర నాల్గు విజ్ఞాపన పత్రికెలు వ్రాసుకునివున్నాను. అవి తమకు చేరినదిన్ని లేనిదిన్ని తెలియలేదు. యిదిగాక తమరు తిరచనాపల్లెలో వుండేదిన్ని చన్నాపట్నములో వుండేదిన్ని తమయొక్క క్షేమసమాచారము వకటి తెలియక తమయొక్క శ్రేయస్సు నిరంతరం ఆపాదిస్తూవుండేవారికి నిండా వ్యసనంగా వున్నది. చిత్తగించి తమయొక్క క్షేమసమాచారము వక చీటీ దయచేయించి తమయొక్క క్షేమం కోరుతున్నవారికి సంతోషాన్ని పొందేటట్టు చెయ్యవలెను అని మిక్కిలి తమయొక్క ఘనాన్ని కూర్చి ప్రార్థిస్తూవున్నాను.

యిదిగాక తమరు బందరుజిల్లాలో వుండే రశిడెంటు పనికిన్ని రశిడెంటువారు తమయొక్క అశిష్టాంటు జెడిజి పనికిన్ని బదలాయించుకుంటూ వున్నారు అని యిక్కడ వదంతి వున్నది. బందరులోను వదంతివున్నట్టుగా విన్నాను. ఆ రశిడెంటు పనిలోవున్నవారికి యెన్నిదినాలుకు అయినా రేంకి బడాయించదు అనిన్ని నిరాధికారమైన వ్యాపారపు వుద్యోగము అనిన్ని ఆ పనిలోవుండే అతను తిర్గి జాడైశాలు పనికిగాని రివిన్యూపనికిగాని రాడు అనిన్ని చెప్పుతూవున్నారుగనుక చిత్తానకు వేద్యం చేశివున్నాను.

తమకు కల్గివుండే అశిష్టాంటు జెడిజి పనితో సమానము అయినదిన్ని సర్వాధికారము పనిన్ని అయివున్నది. అశిష్టాంటు కోర్టుపనిలో తమకు విశేష సావుకాశం దొరుకును. కాలేజా* పని జర్గించడానకు హేతువ వుంటూవున్నది. యీ యొక్క జాడైసాల పనియందు తమరు అభ్యశించిన తెన్గు విద్యన్నూ తెనుగువిద్యలో తమకు తెలిశ్ని న్యాయములు అన్నీ సార్థకాన్ని పొంది తమయొక్క కీర్తి బహుదూర పర్యంతరం వుంటూవున్నది. రేంకిలోనున్నూ జాగ్రత్తగా బడాయిస్తూవున్నది. అధికారం పనిలోవుంటే తమరు సన్నాహాముచేశ్ని తెన్గువిద్యకు కావలశ్ని పాస్తక

---

* "The establishment of bramins in my house for twenty years was always called a college" అని ఈ వాక్యంవద్ద వొక అధోజ్ఞాపిక వ్రాసిపెట్టాడు బ్రౌన్. (చూడు: 'తెలుగు రీడర్' ఇంగ్లీషు తర్జుమా గ్రంథం, పేజీ 111).

సామగ్రి మొదలయ్నివి దొరకడానకు అధికారం పనివల్ల నిండా సహాయం యిస్తూ వున్నది.* యిదిగాక తమరిని నమ్మినవాండ్లను కృతార్థత చెయ్యడానకు అట్లా కృతార్థత పొందిన మనుష్యులు వారి జీవనము ఉన్నంత శేపు తమరిని తలుచుకుంటూ వుండడానుకు హేతువ కలగడానుకు సందర్భం అవుతూవున్నది.

ఆ రశీడెంటు పనిలో ప్రవేశించినట్టు అయితే పైన వ్రాశ్ని పనులు మీవల్ల కానేరవు అని తోస్తూవున్నది. వకవేళ యీ రశీడెంటు పనిలో ప్రవేశించితె తరువాత మీరు చింత చెయ్యబోదురు అని తోస్తూవున్నది. వకవేళ బందరు అశిస్టాంటు జెడిజిపనికి పోవడానకు తమకు సమ్మతిలేని పక్షమందు రశీడెంటు పనులు వినహా యింకా వేరే జాడైసరయీలు పనులలోగాని సిక్రికేటరి పనులలోగాని ప్రవేశించడం నిండా వుత్తమంగా వుంటూవున్నది.

నిరంతరం తమయొక్క క్షేమానిన్ని తమయొక్క ప్రభుత్వాన్ని అభివృద్ధి కావలెను అని కోరుతూవుండేవారు అయ్నిందున్ని యీ సంగతి మన్వి చేసుకున్నాను. ఆ రశీడెంటుపని తమకు పొందకుండా పోయినది అని యెప్పుడు వినుదును అని నిరంతరం భగవంతుణ్నికూర్చి ప్రార్థిస్తూ వున్నాను. తమయొక్క క్షేమ సమాచారమున్ను యీవిద్యమానం సంగతిన్ని వక చీటి అయినప్పటికిన్ని వ్రాశి నన్ను కృతార్థుణ్ని చెయ్యవలెను అని కోరుతూవున్నాను.

కాలేజావారు జర్గించడానుకు పని యేమీలేదు. బంగళా, తోట చక్కగా వున్నావి. మాలీలు వగైరాలు అన్నానకులేక బహుశ్రమ పడుతూవున్నారు. చిత్తానకు రావలెను...

చ॥ 30 జెనవరి

క్రిష్ణారెడ్డి వ్రాలు.†

---

* క్రిష్ణారెడ్డికి బ్రౌన్ యిచ్చిన కితాబు : "In these plans the zealous writer of this letter was a most noble and excellent assistant" అని తెలుగురీడర్ ఇంగ్లీషు తర్జుమాలో బ్రౌన్ వ్రాసిపెట్టిన అధోజ్ఞాపిక.

† మ.ఓ.మే.లై. లో బ్రౌన్ జాబుల సంపుటం యస్. 401, పేజీ 226. 'తెలుగురీడర్' 180_81 పేజీల్లో యీ జాబు ముద్రణైందికూడా. దీనిని గురించి వ్రాయబడివున్న నోట్ : "A.—Krishna Reddi begging me not to become a Commercial Resident."

## 17

హుజరతు మేస్తరు సి. పి. బ్రౌన్ యిసాక్వయరు ధొరవారి సముఖానకు__

...మహారాజశ్రీ యీ కోరటు రిజిష్టరు మెస్తరు ఫ్రానసిస్ అలకజాండరు వెష్టు ధొరవారు యీ నెల 18 తేద్ని తమ బంగళాలో తిర్గి ప్రవేశించినారు. బంగళాలో పశినీ మొదలయ్నివి చక్కచేయించి యివ్వమని ఆగ్జయిచ్చినారు. ఆ ప్రకారమే చేయించినాను.

తమ అలమారలు మంచము పొస్తుకాలు వుంచిన పెట్టెలు పొస్తుకాల అలమార్లు చిల్లర సామాను వగైరా వుంచడానకు తమ కాలేజా కచేరి బంగళా మూడో కొఠడి యిచ్చినారు. అందులోనె సామాను యావత్తు యిమిడించినాను. అది వినహా వేరె కొఠడి యిచ్చేది లేదని శెల్వు యిచ్చినారు. బంగళా సామాను కొంత, తమ ఖాసా సామాను కొంత వారు వాడుకొనే నిమిత్తము తీసుకున్నారు. ఆ సామానుకు యింగిలీషున పట్టీవ్రాయించి అందులో వారి చైవ్రాలు చేయించి తీసుకొని నా దగ్గర వుంచుకుంటూవున్నాను.

తమరు వ్రాయించిన ఆగ్జచొప్పున x 10 లు బాడిగెన్ను తోటమాలీల జీతమున్నూ యెద్దుల ఖర్చున్నూ యివ్వవలశ్నిది అని చెప్పినాను. అందుకు సమ్మతించి వక దినము వుండిరి. తర్వాత మరసటి దినము తోటమాలీలు అయిదుగురు మాకు పని లేదు యిద్దరు వుండవలశ్నిది, కడమ ముగ్గురుమాలీలు మాకు అగత్యంలేదు అని శెలవు యిచ్చినారు. యిద్దరు మా నుంచ్చి కాన్యారదు, తోట గొప్పది, కపిల తోలవలెను, కాలువ తియ్యవలెను, పని కావా వుంటూవున్నాది అని చెప్పుకుంటె మిమ్మల యిద్దరిని వుంచేదిలేదు, మేము వేరే యిద్దరినివుంచుతాము అని శెలువు యిచ్చినందుకు నేను బహువిధాలగా తోటగొప్పది, యేటికాలువ తియ్యవలెను, కపిలె తోలవలె, యింకా తోటలో చెట్లు మొదలయ్నివి వేశేచోటవెయ్యవలెను, యిదివరకు యెన్నడు యిద్దరి మాలీలనుంచి అయివుండలేదు, యీతోటపైన యిరవై సం॥రాలనుంచి వుండివున్నారు అని చెప్పినాను. యిది అంతా విని తోట నేను యెవరినుంచి అయినా నేను బాగుచేసుకుంటాను, ఆ మాటకు మీరు చెప్పడం యేమి, నేను యిద్దరిని మాలీల వుంచుతాను, లోగడి వున్నవాండ్లనె కుదురుచమని చెప్పినారు. అందుకు వెంకట్రాముని పాలిని యిద్దరిని నిలిపినాను. కడమ ముగ్గురిని తీశివేశినారు.

బరతరఫయిన ముగ్గురు_మేము కానాదినాలనుంచి యీ తోటపయ్నివుండి జీవనము చేస్తావుంటిమి, అనేకమంది ధొరలు సంరక్షణ చేసుకుని వచ్చినారు, యీ సంగతి ధొరవారికి తెలిపి తమకు యేమి అయినా ధొరవారినుంచి యేమి పనిపాటలు

అందైనా వుంచేలాగ్ను చేసుకుని జీవనముచేశె మార్గము చేయించవలెను అని తమకు విన్నపం చెయ్యమని మన్విచేశినారు. చిత్తానకు రావలెను.

యిదిగాక తోటమాలీలు అందరిని తీశివేశినారు, మా పనివాళ్ళను అందరిని తీశివేశినావు, మా కాలేజా కచేరివారిని బంగళాలోకి రాకుండాను చేశినారు, వారికి మేము యెక్కడనైనా స్థళం కుదరచవలశివస్తూవున్నది, లోగడివలెనె మీరు కొద్ది రోజులు వుండి తిరిగి వేరె బంగళాకు పొయ్యేటట్టు అయితె మాకు నిండా నష్టం సంభవిస్తూ వున్నాది అని మ్నవి చేశినాను. అందుకు వారు చెప్పినారు_మేము యీ కడ్పులోవుండె పర్యంతరము యీ బంగళాలో వుంటాము అని శెల్వుయిచ్చినారు. చిత్తానకురావలెను.

ఫలాయతు వెంకటచలంను బందిఖానా బిల్లే వేసుకొని పహారాయివ్వమని శెలవుయిచ్చినారు. అందుకు వెంకటాచలం సమ్మతించనందున అతని బందిఖానా బిళ్ళ తీసుకున్నారు. యిఘముందర యేమి అవుతుందో తెలియలేదు. పెద్ద బంగళా చుట్టు పందిలి పెట్టించుమని చెప్పినారు. అదే ప్రకారం పెట్టిస్తాను అని చెప్పినాను. యిరవై రూపాయిలు యిచ్చినాడు. ప్రస్తుతం ఆ ధొరవారు శెలవుయిచ్చినప్రకారం పందిలి వేయించాడనుకు సుమారు అయిదు రూపాయలు తగులుబడి అవునని తోస్తూ వున్నది. యెంత అయ్యేది పని అయినాగాని తెలియదు. రేపటమొర్నాట ఆ పందిలి వేయించి అందుకు తగులుబడి అయ్ని బయావరి జాబితా సముఖంలోకి పంపిస్తూ వున్నాను.

బరతరఫు అయివుండె ముగ్గురుమాలీలు అయ్ని సుబ్బడు అప్పన్న బుడ్డెంన్న ముగ్గురు యీ ఫిబ్రవరినెలగాక యెనిమిదినెలల జీతాలు మాకు యివ్వవలశ్నిది, ఫిబ్రె వరి నెల 20 రోజువరకు కొలువులోవున్నాము, మా జీతములు అయినా మాకు యిచ్చే లాగ్ను చెయ్యవలశ్నిది. నవుకరిలోనుంచి తీశివేశినారు అనే వదంతి అయితె అప్పుల వాండ్లచాత నిండా వుపాధిపడుతువున్నాము అని చెప్పితె ప్రస్తుతం ఆ ధొరవారు యిచ్చిన యిరువైరూపాయీలలో వారి ముగ్గురికి వక నెల జీతం రు 10 లు యిచ్చి రశీదు తీసుకున్నాను. సదరు ముగ్గురికి—సుబ్బన్నకు రు. 3$\frac{1}{4}$॥, అప్పన్నకు రు. 6, బుడ్డన్నకు రు. 2$\frac{1}{6}$లు వెరశి రు 86$\frac{1}{2}$-లుకు పోలుయిచ్చిన రు 10 లు గాక రు. 76$\frac{1}{2}$లు వారి ముగ్గురికి యివ్వవలశ్నిది. బరతరఫయిన తర్వాత వారికి యివ్వవలశ్ని జీతాలు యిస్తామని వారితో నేను జరపడం ప్రయాస చాలా వున్నాది. చిత్తానకు రావలెను.

యిదివరకు తమరు నా మారీఫతుచేశిన తాగాయతి తోటయేమి బంగాళాయేమి తమ సామాను మొదలయ్నివి తమరు వుండేటప్పటికన్న యెక్కువగా వుంచివుంటిని.

యే ధొరవారు వచ్చి చూచినా నిండా సంతోషపడుతూ వస్తూవుండిరి. అయితె నా దురదృష్టంకొలదికి నేను చేశ్ని మెహనత్తుం తమరు చూచి నేను చక్కగా వుంచినది చూచి తమరు సంతోషపడడానకు లేకపోయెను. తోటలో అయిన ఫలాలున్ను ధొరలకుగాక నిలిచిన ఫలాలపట్ల యెద్దులుకు గడ్డి యింకా తమ బంగళావ తోటకు అయ్యే చిల్లరఖర్చులకున్ను వ్రయంచేశి చక్కగా నా శక్తతలో యేమిన్ని వంచన లేకుండా కాపాడివున్నాను.

యికమీదట యిద్దరి కూలీలనుంచి యెట్లా తోటసంరక్షణ అయ్యేది తెలిశ్నిది కాదు. అదిగాక యెద్దులకు దినమున్ను శే.౩లు వులవలు తెస్తూ వారు దినము శే. 1½ వులవలు వేయిస్తూవున్నారు. వారి తావున జొల్లేరేకాని యింకా గొప్ప తెలిశ్ని నవుకర్లెకాని వకడులేడు. బంగళాలో నిత్యం తుడుస్తూ వుంటేనేకాని లేకపోతె చదలువల్ల చెడిపోతుందిగన్క తోట యథాప్రకారము కాపాడే నిమిత్తమున్ను, బంగళా చదలుపట్టకుండా జాగ్రత్తచేశె నిమిత్తమున్ను, యెద్దులను సంరక్షణచేశే నిమిత్తమున్ను ఆ ధొరవారికి మీరు వకవుత్తరము వైనముగా వ్రాసిపంపించెలాగున్న చేస్తే నిండా వుత్తమంగా వుంటూవున్నది. అట్లా లేకపోతె యీ బాడిగెవల్ల తోట బంగళా చెడిపోవడం నిండా మీకు లుకసాను సంభవించపోతూవున్నాది. చిత్తానకు రావలెను.

యీ ధొరవారు యీ నెల 1వ తేద్ని బంగళాలో చేరినారు. లోగడ 5 దినాలు వున్నారు. యిందు నిమిత్తము అయి ఆ అయిదురోజులు యీ నెలలో వేసుకొని యీ నెల 13 రోజు మొదలుకొని బాడిగె యిస్తామని చెప్పినారు.

కాలేజి కచేరివారు జరిగించడానకు పనియేమి లేని సంగతికి ధొరవారికి విజ్ఞాపన చేశేవున్నాను. ప్రస్తుతం బుచ్చన్నశాస్త్రుర్లవారు చేసిన టీక మొకాబిలా చేస్తూవున్నారు. వారు యిఖమీదట యేమి పని జరిగించడానకు తెలియలేదు. వారు అందరు వక స్థళంలో కచెరి చేస్తేనేకాని యెవరు యెప్పుడు వచ్చేదిన్ని యేమి పని చేశెదిన్ని తెలియన్యారదు. యిద్దరు ముగ్గురు కూడినాగాని పని జరగడానకు వసతి లేకుండా వున్నది. వారికి స్థళం సంగతికిన్ని వారు యేమిపని చెయ్యవలశ్నిదిన్ని తెలియలేదు. తమకు బహుదినాలనుంచి జీతాలురాలేదు, అన్నానకులేక చస్తూ వున్నాము అని చెప్పుతూ వున్నారు.

యీ ప్రకారం వుండడమువల్ల దినాలుకావడం పని జరగడం విశేషము లేకుండా వుండడంవల్ల మీకున్ను విశేషము నష్టమున్ను వారికి జీతాలు ముట్టలేదు అని వారు తొందరపడుతామని వారు చెప్పడమున్ను యిందువల్ల తమకు నిండా

లుపసాను సంభవించినది అని నిత్యం నిత్యం చింతిస్తూవున్నాను. యిందు నిమిత్తము అయి సవిస్తారమయిన విద్యమానం తిరచనాపల్లెలో తమరువుండగా వ్రాశ్ని అర్జివల్లనె వేద్యంచేశినాను. అయితె నిరంతరం తమయొక్క శ్రేయస్సునమ్మి తమరినుంచి గొప్పపొందవలెను అని తమయొక్క దయ మిక్కిలి నమ్మినవారికి తమ పనులలో అయ్యే లాభనష్టాలు తెలియచాయడంకంటె విశేషకార్యములేదు గనుక మన్విచేశినాను. చిత్తగించవలెను.

వెంకటచలం నేను బందరు కాపరస్తుణ్ని యిక్కడ నాకు బంధువులుగాని అయినవారుగాని యెవరులేరు, ధొరవారినె నమ్మి ధొరవారి పని యెందెవుండి యిదివరకు జీవనము చేస్తూవుంటిని. యిఘుమీదట నా సంగతినిగురించి ధొరవారు నా సంరక్షణను గురించి యేలాగ్ను వుత్తర్వు దయచేస్తె ఆ ప్రకారం నడుచుకుంటూ వున్నాను అని మన్విచేస్తూవున్నాడు. యిదిగాక యిదివరకు అయిదురూపాయీలు బందిఖానా జీతము రు. 4లు ధొరవారి జీతం ముట్టుతూవున్నందువల్ల సంరక్షణ అవుతూవుంటిని. బందిఖానా జీతం మోఖూబు అయినది. యేల్నివారి చిత్తానకు యే ప్రకారం దయవొచ్చి కాపాడినా సంతోషము వున్నాది అని మన్విచేసినాడు.

కాలేజా కచేరికి వేరేస్ధళం యేర్పరచే పక్షమందున అక్కడ వక మనిష్యి వుండవలశివస్తూవున్నది. అదే మనిష్యి బంగళా చెదలుపట్టకుండా మన సామాను చెడిపోకుండా ఆ మనిష్యి చూడగలడు. యేప్రకారం ఆజ్ఞ అయితె అట్లానడుచుకుంటూవున్నాను. అంకాళుకు విశేషం పనిలేదు. అతని సంగతిలో యే ప్రకారం ఆజ్ఞ అయితె అట్లానడుచుకుంటూ వున్నాను. తోట బంగళా సంగతిని గురియించిన ఖబరుదారి తమ వుత్తరం తిర్గివచ్చేదనుకా నేను చేస్తూవుంటాను. తమ ఆజ్ఞ యేప్రకారం అయితే అటుతరువాత అట్లా నడుచుకొంటూ వున్నాను.

బోయనిపల్లె అప్పయ్య తమ దర్శనం నిమిత్తము నెల్లూరుకు వచ్చివుండి పట్నానకు తమ సముఖంలోకి వచ్చినాడు అని చెంచయ్య విని తమతో మన్విచెయ్యమన్నాడు. అతను తమదగ్గిర చేర్ని సమాచారము తెలియక వ్యసనపడుతువున్నాను అనిన్ని అతణ్ని కాపాడవలశ్నిది అనిన్ని మన్విచేశినాడు గనుక చిత్తానకు వేద్యంచేశినాను. యిదివరకు పూర్వము నాల్గు అయిదు అర్జీలు తమరు బందరుకు యెప్పుడు విజయంచేశే దిన్ని చీబు ధొరగారి రూకలు సంగతికిన్ని నా సంగతికిన్ని యీ మొదలైన సంగతులకు వ్రాసుకొనివుంటిని. అందులకు యేవి వుత్తర్వు దయచేయించలేదు. చిత్తానకు

తెచ్చి తమ క్షేమసమాచారమున్ను నేను వ్రాసుకొన్న సంగతులకు నేను నడుచుకోవ డానకు ఆజ్ఞపత్రికెన్ను దయచేయించవలెను అని కోరుతూవున్నాను.

చ॥ 21 ఫ్రబ్రేవరు

—క్రిష్ణారెడ్డి చెవ్రాలు*

## 18

మహారాజశ్రీ మేస్తరు సి. పి. బ్రౌన్ యిస్కోయరు మహాప్రభువులుంగారి సాన్నిధ్యమునకు—

......తమకు బందరు అశిష్టాంటు జెడిజిపని కాయంఅయినట్టున్నూ అందు పయిన రాజమహేంద్రవరం ఆకటింగు జెడిజి ప్రభుత్వము అయినట్టున్నూ రాజమహేంద్రవరం జెడిజి వుద్యోగమునుగురించి చన్నపట్నము విడిచిపోయినట్టు విని చాలా సంతోషము అయినది. తమరు చెన్నపట్నములో వుండగా తమ దర్శనం నిమిత్తము రెండుమూడుమారులు విజ్ఞాపన చేసుకొని తమ ఆజ్ఞనిమిత్తము నిరీక్షిస్తూ వుంటిని. యింతలో తమరు రాజమహేంద్రవరం ప్రవేశించినట్టు విన్నాను. తమకు గొప్ప ప్రభుత్వము యెన్నటికి అవును అనిన్ని తమ సముఖములో వుండడా నకు యెప్పటికి సందర్భము అవును అనిన్ని బహుదినములనుంచి భగవంతుణ్ని కూర్చి ప్రార్థిస్తూ వుండినందుకు నేటికి సఫలము అయినది. బహుదినములనుంచి పాదాల దగ్గిర నవుకరీ చాయవలెను అనిన్ని తమనుంచే గొప్పకావలెను అనిన్ని తమరిని వినహా నేను అన్యత్రా నమ్మివుండని సంగతి దేవరవారి దివ్యచిత్తానకు వేద్యం అయ్యేవున్నది.

యిదిగాక కాలీజా కచేరివారిని రప్పించే యోచ్చనచేసినారని విన్నాను. యిప్పట్లో వర్రె వీరవెంకయ్య, కొండయ్య సముఖంలోకి రావడానకు యత్నపడి వున్నారు. తమపని యిక్కడ లేకపోతే నేను యిక్కడ వుండవలశ్ని అగత్యం యేమి నాకు కనుపించలేదు. కంభానికి తమరు గొప్పపనికి పిలుపించినప్పుడు తమ కార్యములు యిక్కడ విఘ్నములు అవుతుంది అనే యోచ్చనవల్లనున్నూ అప్పట్లో తమరు పట్నంపొయ్యేసమయం అయినందువల్లనున్నూ రాకండా నిలిచివుంటినేకాని పాదాల సముఖంలోకి రావడానకు సమ్మతిలేక వుండినవాణ్ని కాను.

---

* మ.ఓ.మే.లై. లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 411, పేజీ 26. దీనిని గురించి బ్రౌన్ "Good and long but not producible"—అని ఇండెక్సు పేజీలో వ్రాసి పెట్టాడు.

మహారాజశ్రీ హెగ్గు ధొరవారు శెలవుయిచ్చినారుగదా— నేను గొప్పపని నీకు యిచ్చినా నీవు యెప్పుడు మేస్తరు బ్రౌన్ ధొరవారిదగ్గిర వుండడంవల్ల ఆ ధొరవారియొక్క కార్యములు నీవు నెరవేరిచే శక్తిగలవాడవు గనుకనున్ను నీపయిన్ని ఆ ధొరవారు నిండా దయకల్గివున్నారుగనుకనున్ను ఆ ధొరవారి సముఖం యెప్పటికి వదలకుండా వుండడం నాకు నిండా సంతోషం అని శెలవుయిచ్చినారు. సరకారుపనిలో యేపనియిచ్చినా నిర్వాహకం కాయంగలవాడు అనిన్ని, బాహోష మనిష్యి అనిన్ని, యేధొరవారు యీ మనిష్యిని దగ్గిరవుంచుకున్నా ఆ ధొరవారి చిత్తానుసారం నడుచుకునేటంత శక్తిగలవాడు అనిన్ని — నాకు సరిటిపికేటు యిచ్చినారు. ఆ ధొరగారు తిరిగివచ్చేమాట యిదివరకు స్పష్టంగా తెలియదుగాని వారు వచ్చినట్టుఅయితే నాకు యోగ్యమయిన వుద్యోగం యిత్తురు అని నిండా నమ్మికె వున్నది. అయినప్పటికిన్ని తమ సముఖం యెన్నటికి చూచెను అనిన్ని సముఖంలో నవుకరి చాయడానకు యేద్నిము వసతిపడును అనిన్ని నిత్యం భగవంతుణ్ని కూర్చి ప్రార్థిస్తూవున్నాను.

తమ సముఖములోకి నన్ను రప్పించే ప్రయత్నము తమరు చేస్తే యిక్కడ తోట బంగళా చెడిపోవును అని మీరు నిండా ఆలోచింతురు. నా తమ్ముడు అయిన నారాయణరెడ్డి అనేవాడు యేమిపనిలేక వూరికెవున్నాడు. పారిశిన్ని తమ బడిలో అభ్యశించినాడు. తమ బంగళాన్ను తోటన్ను కాపాడుకునేటంత శక్తిగలవాడు అయివున్నాడు. శెలవు అయితే వాణ్నివుంచి నేను సముఖములోకి వస్తూవున్నాను. తమరు కంభానికి విజయం చేశేటప్పుడుకూడా శెలవుయిచ్చినారు — సరకారు వుద్యోగములో నీవు ప్రవీణుడవు అయ్యే నిమిత్తము ధొరల పరిచయం కల్గి ధొరలు నిన్ను పనివాడవు అని చెప్పే నిమిత్తము వుంచినానుఅనిన్ని సరకారు పని నీకు తెలియగలందులకు ప్రస్తుతం యీపని యిచ్చినాను అనిన్ని సముఖములోకి పిలుస్తాము అనిన్ని శెలవుయిచ్చినారు. అదేమేరకు తమరిని నమ్మి తమ పనులనిమిత్తము అయి నేను యిక్కడ వున్నానేకానీ యీ నవుకరి నిమిత్తం వక క్షణం అయినా యిక్కడ వుండవలశ్ని జరూరు నాకు యేమాత్రం లేదు.

తమ పనులలో లేనివారికిన్ని తమరిని కొంచంగా నమ్మినవారికిన్ని యిదివరకు అనేకమందికి గొప్పపన్లు దొరికి (వారు) కృతార్థులు అయినారు.* నాకున్ను

---

* తెలుగు రీడర్ (ఇంగ్లీషు తర్జుమా)లో యీ వాక్యంలోని నుడికారం గురించి బ్రౌన్ యిట్లా వ్రాశాడు: "Let the reader observe the elegant style in which the Telugu sentence is framed. It is hard to turn

మీరు చాయవలశ్ని ప్రయత్నములు శానా చేశినారు. నా దురదృష్టంవల్ల ఆటంకాలు సంభవించినవి. తమకు యొక్క ప్రభుత్వం అయినందున తమ సముఖంలో నాసంగతి మనవిచేసుకోడానకు సమయం అయినందున మ్నవి చేశినాను. యిదివరనుంచి తమకు యిఘముందర యెప్పటికి అధికారమైన ప్రభుత్వాన్ని పొందివుంటూవున్నారు గనుక నా దురదృష్టము యిదివరకు వదిలిపోయినది అని యోచిస్తూవున్నాను. అన్నిటికి నాయొక్క తల్లిదండ్రిని విడిచి తమరె తల్లితండ్రి అని నమ్మివున్నాను.* తమరు యేలాగ్ను ఆజ్ఞ దయచేయించినా శిరసావహించి నడుచుకుంటూ వున్నాను. యిక్కడ నవుకరిలోవుండి శెలవు తీసుకొనివచ్చి సముఖంలోకి రావడానకు సందర్భం కావడము శానా ప్రయాసగా తో స్తున్నది. చిత్తానకు తెచ్చి ఆగ్నదయచేయించినంతల్లో ఆజ్ఞప్రకారం నడుచుకుంటూ వున్నాను.

మహారాజశ్రీ వెస్టు ధొరవారు యీ ఫిబ్రెవరి నెలలో తమ బంగళాలో ప్రవేశించిన సంగతి దివ్యచిత్తానకు వేద్యం చేశేవున్నాను. తమ బంగళా చుట్టు వసారా వేయించమని అడ్డలోకి చెల్లంగా రు. 20 లు నా దగ్గర యిచ్చివుండెను. అందుకు బంగళా చుట్టు పందిలి వెయ్యడానకు అయిదు రూపాయల ముప్పాతిక మువ్వీసం† తగులుబడి అయినది. అందుల వివరం లెఖ్ఖజాబితా యిందుతోకూడా పంపించినాను. చిత్తానకు రావలెను. నిలిచిన రూపాయీలలో బరతరఫయినవాండ్లకు నెల జీతం బుడ్డెన్నకు రు. 3, సుబ్బనికి రు. 4 లు, అప్పన్నకు రు. 3, వెంకటచలంకు రు. 4 లు వెరశి రు. 14 లు యిచ్చినాను. వక అణా నా దగ్గర శిలుకు వున్నది. యిఖ ముందరనుంచి ఆ ధొరవారు యిచ్చే బాడిగరూకలు యిక్కడ జీతాలవారికి యివ్వవలశ్నిదానికి చెల్లుగా కొంచం యివ్వమని ఆగ్న అయితె యిస్తూవున్నాను. లేక తమ ఆగ్న యేమేరకు అయితె అట్లా నడుచుకుంటూవున్నాను.

---

these expressions into English without losing the beauty of phrase." ఈ వాక్యాన్ని ఇంగ్లీషులోకి యిట్లా తర్జుమాచేశాడు: "Men who are not engaged in your honour's business, men who have but slightly relied on you, have already by your patronage obtained high employ and their desires are fulfilled."

* ఈ వాక్యం దగ్గర యిట్లా వొక ప్రత్యేక వివరణ వ్రాశాడు: "This is a mere figure of rhetoric. The writer was then living in the midst of his friends, and flourishing as a wealthy farmer." (చూ. తెలుగురీడర్ ఇంగ్లీషు తర్జుమా పేజీ 107).

† రు. 5-15-0.

కంభంనుంచి తెచ్చిన కాలి సీసాలుపైకిలోగడ అమ్ముడుపోయిన సీసాలుగాక వాలి వుండబడిన సీసాలు పగిలిపోతూ వున్నందువల్ల వాజిబిధారణ ప్రకారం డజను 1 కి ముక్కాలురూపాయి (పండెండు అణాల) ప్రకారం అమ్మినందువల్ల రు. $7\frac{1}{2}$ వసూలు అయ్నింది. అవి నా వశాన్నవున్నవి. యేప్రకారం ఆజ్ఞఅయితే అట్లా నడుచుకుంటూ వున్నాను.

జనవరినెల 5 తేదిని వసుచరిత్ర దిద్దుబాటు సమాప్తం అయినందువల్లనున్ను ఆ తాగాయతీ* యేమిపనిలేకనున్నూ గరిమెళ్ళ వెంకయ్యవంట్లో అశక్తతవల్ల కచేరీకి రానందువల్లనున్ను యీ మార్చినెల 1 తేదివరకు కచేరీవారు యేమిపని జరిగించివుండలేదు. యిప్పటికిన్ని వెంకయ్య రావడంలేదు. మార్చినెల తాలూకు చెంచయ్య తాము దిద్దుబాటుచేశి తీర్పుచేశిన పద్యాలప్రకారం బుచ్చన్న శాస్త్రుల్లవారి టీక వుండేలాగుననున్నూ ఆ టీకలో వుండే పొరబాట్లున్ను దిద్దుతూ వున్నాడు. వెంకటచలం, అంకాళు వూరికె § వున్నారు. వెంకటాచలం యీదేశంవాడు కాడు గనుక అతణ్ని గురించి యే వుత్తర్వు అయినా దయచాయవలెను. కచేరీ సంగతి నిమిత్తము అనేక ఆవర్తుల చిత్తానకు వేద్యంచేశివున్నాను...

1830 సం॥ మార్చినెల 20 తేది

క్రిష్ణారెడ్డి వ్రాలు †

---

* 'అది మొదలుకొని' అను ముద్రితపాఠం ('తెలుగురీడర్').

§ ఈ వాక్యందగ్గర బ్రౌన్ ప్రత్యేక వివరణ: "Observe the force of the word urike (వూరికె); that is without (employ)"—తెలుగురీడర్ ఇంగ్లీషు తర్జుమా, పేజీ 107.

† మ.ఓ.మే.లై. లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 411, పేజీ 9 (యమ్. 417 లో కూడా యిది కాపీచేయబడివున్నది). తెలుగురీడర్ (పేజీలు 173_76)లో యిది ముద్రణైవుంది. లోగడవచ్చిన 11వ జాబు (పేజీలు ౭౭_౭౯)లో సారాయి ప్రస్తావనవున్న భాగం తొలగించబడినట్లుగానే యీ జాబులోకూడా కంభంనుంచి తెచ్చిన కాలి సీసాల విషయంవున్న భాగం ముద్రితపత్రిలో కానరావడంలేదు. వ్రాతప్రతి ఇండెక్సు పేజీలో 'Krishna Reddi—a good and long letter' అని బ్రౌన్ వ్రాసిపెట్టాడు.

## 19

మహారాజరాజశ్రీ మేస్తరు సీ. పీ. బ్రౌన్ యిస్కాయరు ధొరవారి సముఖానకు—

...యిప్పట్లో మహారాజశ్రీ హెగ్గుధొరవారికి తిరచనాపల్లె ప్రవిన్సయాలు కోర్టు ఆక్టింగ మూడో జడిజిగా పయింటు అయినారు. హెగ్గుధొరవారు తిరిగి యీ దేశానికి వచ్చే యోచన యీ జెడిజీపనికి తిరిగి వస్తారని యంతమాత్రమున్ను తోచ లేదు. వారున్నూ యిదే ప్రకారం చెప్పుతున్నారు. హెగ్గుధొరవారు యిక్కడ యింకా కొంచం దినాలు మాత్రం వుంటే నన్ను గొప్పచేశే యోచన చేసివుండిరి. నన్ను గొప్పచేసును, నా దురుఅదృష్టమువల్ల యిప్పట్లో వారికి పయింటు అయ్యినది కాకుండా స్త్రాంబంధొరవారె తిరిగీ యీ జిల్లాకు పాయింటుకావడం నా యొక్క గ్రహచారం యేమని చెప్పవలసినది. లోగడ స్త్రాంభంధొరవారు యిక్కడ వుండే దినాలలో కానా శ్రమలుపడి దైవాధీనంచాత మానంతో కడతేరివుంటిమి. అదిన్ని గాక అప్పట్లో హెగ్గుధొరవారు వస్తారని వదంతివల్ల మా క్షేమానికి అనుగుణంగా వుండెను. యిప్పట్లో అదిన్నీ లేదు. యిఘముందర ఆ ధొరవారి దగ్గిర మేము క్షేమంతో మానంతో వుంటాము అనే నమ్మికె యేమాత్రం లేకుండా వున్నది. వక వేళ వక దినము చక్కగావున్నా రెండో దినం యేమోనని నిత్యం భయపడుతూ వ్యసనపడుతూ వుండడానికి కారణం అయినది. యెంత భయభక్తితో యంతజాగ్రత్తగా నడుచుకున్నాగాని వారు యితర వుద్యోగస్తులకు చేశేరీతి చూస్తే నాకు యేమాత్రం నమ్మికె లేకుండా వున్నది. మానం మాకు దొరకనేరదు అని అవునమ్మికచాత యీ కొలువులో వుండడం నాకు యంతమాత్రం సమ్మతిలేకుండా వున్నది. యెందుకంటె మానానికంటె నాకు కొలువు గొప్పలేదు. యెక్కడ అన్నము సంపాయించుకోలేని వాండ్లు వక వేళవుంటే వుండ వచ్చునుగాని నా యింట్లో వున్నప్పటికిన్ని నా స్వంత క్షేమానికి యీ కొలువులో వుండేదానికంటే యేమిన్నీ తక్కువలేదు.

లోగడనుంచి తమ దయ నిమిత్తము యీ కొంచం కొలువులో వుండడానుకు కారణం అయినదిగాని లేకపోతే వక నిమిషం వుండడం నాకు సమ్మతిలేదు. వక వేళ నా యిల్లు విడిచినప్పటికిన్ని తమదయవల్ల నేను పొందిన తరుబియ్యతునుంచి కొందరు ధొరలు పరిచయం కలిగివున్నారు. వారి దగ్గెర దయ సంపాయించుకుని నవుకరీ సంపాయించుకునేటందుకు శక్తి కలిగివున్నది, అయితే తమరిని విడిచి అన్యత్రా ధొర తావుకుపోవడం నాకు యంతమాత్రం సమ్మతిలేదు. తమరు యెక్కడ వున్నప్పటికిన్ని తమ యిలాకాలో వుండవలెననే అభిలాష చాలా కలిగివున్నది. బహు దినాలనుంచి

తమ పాదాలు నమ్ముకొని తమకు గొప్ప ప్రభుత్వం కావలెను అనిన్ని, తమ సముఖములో గొప్పగా వుండవలెను అనిన్ని కోరుతూ వున్నందుకు తమకు గొప్ప ప్రభుత్వం అయినప్పుడు అయినా తమ సముఖములో వుండడానికి మాకు ప్రాప్తి లేకపోయెను.

యిప్పట్లో హెగ్గుధొరవారుగాని స్త్రంభంధొరవారుగాని యింకా యే ధొరవారుగాని యిక్కడవుంటె మీరై పిలిపించే పరియంతరం మీతో నా సంగతి నిమిత్తము తొందరపడి మనివిచాయను. తమయొక్క పాదాలు నమ్ముకొని బహుదినాల నుంచి తమయొక్క కార్యాలలో పడిన తొందరలో పదిపాళ్ళకైనా తక్కువపడిన వారికి తమరినుంచి వారికి కృతార్ధత అయినారు. ప్రస్తుతం స్త్రంభంధొరవారు తమరు వుండే మార్గానసె వత్తురు. వారున్నూ ధొరల్ యొక్క రూబకారి శిఫారసు చాలా అంగీకరించేవారు గనుక వారితో కలిసి నా నిమిత్తము వారితో నిండా చెప్పి వారి నుంచి మాట తీసుకుంటే యింకా కొన్నిదినాలు అయినా వుండడానకు నిభావు అవుతుంది. లేకపోతే యిక్కడ వుండడం అప్రయోజకముగా నాకు తోస్తున్నది. తమరు నా విషయములో నా తల్లిదండ్రికంటె యెక్కువగా మీరు నడిపిస్తూ వున్నారుగనుక వున్న సంగతి మీతో మనవిచేసినాను.

తమ యిలాకా కోర్టులో వుండే నేను యిప్పుడు యిక్కడ వుండే పనికంటే యెక్కువగావుండే తగిన వుద్యోగం కాలీచేసి పిలుపించునట్టు అయితే నన్ను యిప్పట్లో మానం చేసినట్టుగా భావించుకొని నిండా సంతోషిస్తూ వున్నాను. తమరు నాయందు అనుగ్రహం కలిగితె యింతమాత్రం పనిచేసి యివ్వడం బహుప్రయాసలోది కాదు. బహుగొప్ప పనిన్నికాదు. ప్రస్తుతం నా నిమిత్తము యింత కొంచం అయినా తొందర తమదుపడి నన్ను నిర్వాహకంచేస్తే తమ సముఖములోకి వచ్చిన పిమ్మటనైనా తమకు సంతోషం అయినరీతిన నడుచుకుంటూ వున్నానుగానీ నన్నుంచి మరియేమి తమకు తొందరలేకుండా ప్రవర్తిస్తున్నాను. తమయొక్క కార్యాలలోనున్ను వుపయోగంగా వుంటూవున్నాను. యీసంగతి తమచిత్తానకు తెచ్చి యే తీరునకైనా తీవ్రంగా పిలిపించేలాగున చేశ్నిట్టు అయితె అపరిమితమైన సంతోషాన్ని పొందుతూవున్నాను.

నేను యే ధొరవారితోనైనా యేసంగతి అయినా చెప్పుకున్నా తమ దయ నామీద కలిగివున్నది అనిన్ని తమనుంచి నేను గొప్పను పొందుతూవున్నాను అని, నా మనవి అంగీకరించడానకు సందేహిస్తూవున్నారు. తమరు ఆలస్యంచేసి పరామరికె తప్పితె ఆ ధొరవారి దగ్గెర అవుమానంపొందిన తరువాత తమరు యెంత గొప్పచేసినా మానం తిరిగి రానేరాదు. యీ ప్రకారం అవుతుంది. చిత్తానకు తెచ్చి కాపాడ గలందులకు తాము ఖామందులు వున్నారు.

గుఱ్ఱపుశాలన్నూ కశినిన్ని కట్టించేది అని ఆజ్ఞ అయివుండెను. కశిని తయారు చేశి అందుల వివరగతి లెఖ్ఖ సముఖానకి అంపించినప్పుడు గుఱ్ఱపుశాల చెడిపోయిన విధమున్నూ అందుల నకషాన్ను అందాజాన్నూ వ్రాశిపంపించి ఆజ్ఞ కావలెను అనికోరి వుంటిని. తరువాత రెండుమూడు ఆవర్తుల ఆదేసంగతి నిమిత్తం విజ్ఞాపన చేసి వున్నాను. యిదివరకు వుత్తరం దయచేయలేదు.

ప్రస్తుతం యింగిలీషు ధొరవారు మీరు కట్టిస్తారా మేము కట్టించేదా అని అడుగుతూ తీవ్రంచేసి గుఱ్రాలను కట్టివెయ్యను స్తళంలేదు జాగ్రత్తగా తయారు చెయ్యమని చెప్పి వకనెల బాడిగె యిచ్చినందున లోగడనే కట్టించమని తమ ఆజ్ఞ అయివున్నందున కోలుబందీచేసి కట్టిస్తూవున్నాను. నాలుగు అయిదు దినములలో తయారు అవుతూ వున్నది. తయారుకాగానె అందుల వివరగతి బయావరి జాబితా లెఖ్ఖను సముఖములోకి పంపిస్తూవున్నాను. చిత్తానకు రావలెను.

బంగళాయొక్క బాడిగె సం॥రూకలు కాలేజావారి బాకీలోకి చెల్లుగా యిస్తూవుండమని గురువప్పతో తమరు శెలవుయిచ్చి పంపించినారు. అయితే తమ యొక్క చెవ్రాలుగల హుకుం రాలేదు. అయితే వోలు యిక్కడివుండేవారు అయిన బుచ్చనశాస్త్రి చెంచయ్య అసదుబేగు తోటమాలీలు పాలి వెంకట్రాముడు—యీ జెనులు సదరు రూకలు తమకు యిమ్మని ధొరవారి శెలవు అయినది మాకు యివ్వమని నిత్యం నన్ను బహువిధాల తొందరచేస్తూవున్నారు. యిప్పుడు గుఱ్రపుశాల మరమ్మతు నిమిత్తము యిచ్చిన నెల బాడిగె గాక జూలాయి ఆగష్టు యీ రెండు నెలల బాడిగె యివ్వవలశినది సదరురూపాయలు వాండ్లకు యివ్వవలశినది లేక యేమి చెయ్యవలసినది తమ హుకుం దయచాయవలెనని కోరుతూవున్నాను. హొగ్గుధొరవారు తన రూకల నిమిత్తం వకసారి గ్జాపకం చేశినారు. చిత్తగించి సంరక్షణ చాయగలందులకు తాము ఖామందులు వున్నారు.

5 శపటంబరు 1830 సం॥

—అ॥ కృష్ణారెడ్డి చెవ్రాలు. *

---

* మ.ఓ.మే.లై. లో బ్రౌన్ జాబుల సంపుటం 401, పేజీ 210. (యమ్. 417లో కూడా కాపీ చేయబడివుంది). “Repining, but a good letter”—అని యీ జాబును గురించి ఇండెక్సులో బ్రౌన్ వొకనోట్ వ్రాసున్నాడు.

## 20

మహారాజశ్రీ మేస్తరు సీ. పీ. బ్రౌన్ యిస్కోయరు మహాప్రభువులుంగారి సముఖానకు—

...తమరు నాయందు సంపూర్ణమైన దయవల్ల యీనెల 5, 13 తేదీలయందు వ్రాయించిన ఆజ్ఞ పత్రికెలు చేరి అపరిమితమైన సంతోషాన్ని పొందినాను. యీ లోవైనం యిక్కడవుండే తమ నవుకర్లు వగైరాలకు చారవలశ్ని లెఖ్ఖ సం॥ రూపాయిలు అంపించనందువల్ల ఆజ్ఞపత్రికె వ్రాయడానకు సంకోచం అయ్నిది అని వ్రాయించినారు. అయితే తమ క్షేమానుంచి జీవనముచేశే మాబోటివార్కి తమయొక్క క్షేమంతోనే మాకు ముఖ్యమైన అభిప్రాయంగాని కడమ దేనికీ విచారంలేదు (?). బహుదినాలనుంచి సంరక్షణచేశే ప్రభువులుకు సమయం కొలదికి వకవేళ యిక్కట్టువస్తే అందునిమిత్తము యేనిమిషములోనైనా వ్యసనపడవలశ్నిది లేదు. అయితే యీలోవైనం మూడునాల్గు నెలలు తమ ఆజ్ఞపత్రికెవల్ల తమ క్షేమం తెలియకపోయెను అనిన్ని దేవరవారి చిత్తము యేలాగున్ను వున్నదో తెలిశ్నిది కాదు అనిన్ని యిందునిమిత్తము శానాదినములు చాలా వ్యసనపడడాన్కి కారణం అయ్నిదికాని యితరంలేదు. చిత్తానకు రావలెను.

యీనెల 5 తారీఖ్ను తమకు నేను విజ్ఞాపన వ్రాసుకున్న పిమ్మట మేస్తరు స్త్రాంబం ధొరవారు యిక్కడికి విజయం చేశినారు. నానిమిత్తము కోర్టులో హెగ్గు ధొరవారు నా యెదుట స్త్రాంబం ధొరవారితో శానాగా శిఫారసు చేశినారు. వారు విని అవును నాకు తెల్సును అని చెప్పినారు. యిదిన్నిగాక 1830 సం॥రం 2 దొరాకు విచారణ నిమిత్తము సరికోర్టు రెండో జెడిజి తామసు గేగను ధొరవారు వచ్చినారు. వారి దగ్గర వుండే తెనుగు మునిషీ చక్కగా పనిచెయ్యలేదు అనిచెప్పి యీ జిల్లాకోర్టు గుమాస్తాలపైకి నన్ను కోరుకొని మేస్తరు హెగ్గు ధొరవారితో చెప్పి నన్ను తన తైనాతిలోకి తీస్కునివుండెను. నేను వారి మర్జీని కనిపెట్టి వాగ్మూలాలు వ్రాయడం సునావణీ చెయ్యడం యీ మొదలయ్ని పనులయందు జాగ్రత కల్గి జరిగించివున్నాను. వారి పనిఅంతా అయ్నితర్వాత నా తారీఫు శానా చేశినారు. నా పూర్వోత్తరం విచారించినారు. వారై నాకు వక క్యారకటరు యిచ్చినారు. అందుల నకలు యిందుతో వెంట పంపించినాను. చిత్తగించవలెను.

యిదిన్నిగాక వారిదగ్గరవుండే ౪ 8 వరహాలు జీతం, 8 వరహాలు భత్యం దొర్కుతూవుండే తెనుగుమునిషీ గిరి యివ్వడానకుకూడా యోచించినారు. అయితే వారి తావున యిప్పట్లో వప్పుకుంటే నన్ను శానా గొప్పచేసును. వారిదగ్గర వప్పుకున్న పిమ్మట వారు యీ శీమలోవుండే పర్యంతరం నన్ను వదలరు అనిన్ని నేను

వారిని విడవడం చాలా ప్రయాసం అవును అనిన్ని సమ్మతించలేదు. వారు శెల్వు యిచ్చినారు—నీవు మాదగ్గర శానా కష్టపడినావుగనుక్కు నిన్ను మేము కనిపెట్టు తాము అని శెల్వుయిచ్చినారు. యిదిన్నిగాక్కు వారిగుండా—యిక్కడవుండే ధొరలుకు శిఫారసు చేశేటందుకు నేను మన్విచేసుకుంటే వారు ఆగత్యం చేతురు. అయితే తమరు యిప్పట్లో నన్ను పిలుపించే ప్రయత్నములో వున్నందువల్లనున్ను యిదిన్నిగాక్కు బాల్యంనుంచి తమ దయవల్ల తరబియ్యత్తు అయి తమ కటాక్షానిక్కి పాత్రుణ్ణి అయినందువల్ల యీ మమత చాత తమ సముఖంలోవుండి తమ ప్రభుత్వం చూడవలెను అనిన్ని తమయదుటవుండే నవుకరి చాయవలెను అనిన్ని తమ సముఖంలో గొప్పగా వుండవలెను అని నాకు వుండే కోరిక యీదేశం నా స్వదేశం అయ్యినప్పటికి యిక్కడ నేను గొప్ప నవుకరీ సంపాదించుకునేటందుకు చెయ్యతగ్గ ప్రయత్నములుకు అభ్యంతరపరుస్తున్నది. తమ కటాక్షము నిమిత్తము యీ కొంచం కొలువులో యిన్ని దినాలనుంచి యీ కడపలో వుండివున్నందుకు నా ఖర్చువ్రయాలుకు నా తండ్రిగారి సహాయంవల్లనున్ను యీ దేశములో నా పరిచయస్తులవల్ల అప్పు మొదలయ్యినవి దొరకడంవల్లనున్ను ప్రయాసమీదనే కాలం జరపడం అయ్యినది. ప్రస్తుతం అక్కడ నాకు కొత్తదేశంలో నా ఖర్చువ్రయాలుకు తగుమాత్రం అయ్యేటట్టుగా తమ కోర్టులో వుండే పనులలో యేదైనా గొప్పపని కాలీచేశి పిలుపించేలాగ్ను చాయవలెను అని కోరుతూవున్నాను. యిందువల్ల గొప్పపనిక్కి పిలుపించినారు అని తమకు నిండా ఖ్యాతిగావుండేదికాకుండా ప్రస్తుతం అక్కడ నా ఖర్చువ్రయాలుకు తొందరలేకుండా జర్గును. చిత్తానుకు తెచ్చి కాపాడగలందులుకు తాము ఖామందులువున్నారు. అయితే నా స్వంత సంగతిని గురించి తమరిని మిక్కిలీ తొందరచెయ్యవలెను అనినాకు యెప్పటిక్కి అభిలాష లేదు గాని అయితే నా తల్లితండ్రికంటే నాయందు అతిశయముగా తమరు కటాక్షంవుంచి జర్గిస్తూవున్నారు గనుక్కు అప్పటప్పటిక్కి నా సంగతి విజ్ఞాపన చేస్తూ వున్నాను.

లోవైనం నేను వ్రాసుకున్న అర్జీలలో యింకా కొన్నిసంగతులుకు మన్వి చేశివుంటిని. ఆ సంగతులలో తమ అభిప్రాయం యేలాగ్ను వుండేది తెలియలేదు గనుక్కు మన్విచేశినాను. చిత్తగించి వుత్తర్వు దయ చాయవలెను అని కోరుతూ వున్నాను.

21 శపెటేంబరు 1830 సం॥

—అ॥ కృష్ణారెడ్డి చేవ్రాలు.*

---

* మ.ఓ.మే.లై. లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 441, పేజీ 207. ఇండెక్సు పేజీలో బ్రౌన్ 'కృష్ణారెడ్డి. good but dry'—అని వ్రాసున్నాడు.

## 21

మహారాజరాజశ్రీ మేస్తరు సీ. పీ. బ్రౌన్ యిస్కాయరు మహాప్రభువులుంగారి సముఖానకు ___

......తమరు యీనెల 4 రోజ్నా దయచేయించిన ఆజ్ఞప్రకారం పెద్దబోయి గురువప్ప యీరోజ్నా వుదయాన యిక్కడినుంచి సముఖానకు వచ్చివున్నాడు. తమ నవుకర్లు పైకి యితడు యిక్కడవున్న దినాలలో అందరి నవుకర్లకంటే యెక్కువగానున్నూ నమ్మికెగానున్నూ తమయొక్క కార్యాలయందు ప్రవర్తిస్తూ వచ్చివున్నాడు. యిక్కడ బంగళా ఖబరుదారీ పన్కిగాని మరమ్మతుపనిలోగాని యితణ్ని యిక్కడ వుంచుకోవడం నాకు నిండా సమ్మతిగనుక్క తమకు అక్కడ వుండబడ్ని ఆగత్యమయ్ని కార్యాలు తీరిపోయి అక్కడ యితనినుంచి పనిలేని పక్షమందు అక్కడ యేదొక నవుకరి ఆసామిలో దాఖలుచేశి తిర్గి యిక్కడికి పంపించేలాగ్ను చాయవలెను. అట్లా అయ్నట్టు అయితే యితనికి జారీకాబడ్ని అక్కడి జీతం సాధారణంగా ముట్టుతూవున్నది. యిక్కడ తమయొక్క కార్యాలలో వుపయోగంగా వుంటూవున్నాడు. చిత్తానకు రావలెను.

యితణ్నిగురించి నేను శిఫారసు చెయ్యలేదుగాని నడుచు విద్యమానం విజ్ఞాపన చేశినాను. యిక్కడ యింకా జర్గబడ్ని సంగతులు యీవత్తున్నూ గురువప్ప యిజహారువల్ల చిత్తానకు శృతం అవుతుంది. చిత్తగించి కాపాడగలందులకు తాము ఖామందులు వున్నారు.

14 అకటోబరు 1830 సం॥
అ॥ కృష్ణారెడ్డి చెవ్రాలు *

## 22

మహారాజరాజశ్రీ మేస్తరు సి.పీ. బ్రౌన్ యిస్కాయరు జెడిజి జిల్లా బందరు వగైరా గారి సముఖానకు ___

......యేల్నివారి ఆజ్ఞానుసారం ప్రకారం బుచ్చయ్యశాస్త్రుర్లవారు చేశ్ని వసుచరిత్ర టీకప్రతిన్ని వసుచరిత్ర విభేదాలప్రతిన్ని సవ్యాఖ్యానంప్రతిన్ని వసుచరిత్ర సాపు విభేదాలది కొరతలగావుండే ప్రతిన్ని తూములూరుకొండయ్య వ్రాశ్ని అహల్యాసంక్రందన విలాసము ప్రతిన్ని యివి పంపించినాను. వాటియొక్క

---

* మ.ఓ.మే.లై. లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 401, పేజీ 190. ఇండెక్స్ పేజీలో "E.—కృష్ణారెడ్డి about Gurapa"—అని వ్రాసున్నాడు.

వివరం జాబితాతోకూడా ప్రత్యేకంగా వ్రాశి యిందులో ప్రత్యేకంగా వుంచి పంపించివున్నాను. చిత్తానుకు రావలెను.

వీరవెంకయ్య సదరుసాఫీ విభేదాలప్రతి వ్రాస్తూవుండగా యింతలో శాలీజా కచ్చేరి సంక్షేపం అయ్యిందున్ను పూరాప్రతి వ్రాయించడానకు అసందర్భము అయ్యినది. యిదిగాక్క బుచ్చయ్యశాస్త్రుల్లవారు చేశిన టీకప్రతిలో సుమారు 20 పద్యాలు తక్కువవున్నది. వసుచరిత్ర సవ్యాఖ్యానంప్రతి యిదివరకు దొర్కనందున్నున్ను యిప్పుడు అంపించివుండే సవ్యాఖ్యానం ప్రతిలో ఆ 20 పద్యాలు లేనందున్నున్ను సదరు 20 పద్యాలుకు టీక చెయ్యలేదు అని బుచ్చయ్య శాస్త్రుల్లవారు చెప్పూతూవున్నారు.

తమరు కూలివానిచేత పంపించిన రూలువేశ్ని శికసనులు 160 నూట అరువై ముట్టినవి. తమరు వ్రాయించిన పుస్తకాలు నిమిత్తము కొంత్రపాటి చితంబరాన్ని పంపించివున్నాను. ఆ పుస్తకాలు అతను తెచ్చిన పాయన్నె వ్రాయించడానకు ఆరంభము చేయిస్తువున్నాను.

1829 సం॥రంలో తమ శాలీజా కచేరివారికిన్ని తోటమాలీలు వగైరాలుకు అదివరకు వార్కి యివ్వవలశ్ని బాకీలోకి యిచ్చే నిమిత్తముగా మీరు మేస్తరు హెగ్గు ధొరవార్కి వ్రాశినందున్న వారు రు. 300లు యిచ్చినందున్న తమ నవుకర్లుకు యిచ్చినందున వారు యివ్వబడ్ని రశీదుసహా అప్పుడే పాదాల సముఖానకు పంపించి వున్నాను. యిదిగాక్క అప్పుడప్పుడు యెద్దులుకు వరిగడ్డికిగాను వెంకటచలం వశాన్నున్ను యిచ్చినారు. వారు సదరు రు. 300 లు తోకూడా మీ పనుల్కుగానున్ను మీ నవుకర్లు జీతాల్కుగానున్ను రు. 310 యిచ్చినారు. యిట్లావుండగా యిప్పటిక్కి 1829 సం॥రంలోనె మేస్తరు హెగ్గు ధొరవారు నీలగిరి కొండమీద వుండగా సదరు రూపాయీలకు వివరంగా జాబితావ్రాశి పంపించమని యిక్కడికి వుత్తరంవ్రాశినందున్న సదరు రు. 310 కు వార్కి జాబితా వ్రాశియిచ్చి ఆ సంగతి తమకుకూడా ఆ తక్షణం విజ్ఞాపన చేశినాను.

1830 సం॥రం జూలై నెలలో మేస్తరు హెగ్గు ధొరవారు యీ కడప్పకు వచ్చివుండి సదరు రూపాయిలు మీరు పంపించలేదు, ఆ రూపాయిల నిమిత్తము మీకు అర్జీవ్రాయమని చెప్పినందున్న అప్పుడున్ను తమకు విజ్ఞాపనచేశివున్నాను. యిప్పట్లో హెగ్గు ధొరవారు శీమకు పోవడానకు శెల్వు దొరికినందున్న వారు పోవడాన్కు శిద్ధంగా వుండినవారై సదరు బాకీరూపాయిల నిమిత్తము యిక్కడ మేస్తరు త్రొంబం ధొరవార్కి మెమో వ్రాశినారు. మేస్తరు త్రొంబం ధొరవారు నన్ను పిలిచి నీతరఫ్న రు. 310 వచ్చినదే వాటికి యెవరెవర్కి యేమి యిచ్చినావో

ఆ ఖర్చు జాబితా వ్రాసియివ్వమని శెలవు యిచ్చినందున్ను వివరగతిగా జాబితా వ్రాశి యిచ్చినాను. ఆ జాబితా ప్రకారం యిప్పుడు వక జాబితా వ్రాశి యిందులో మలఫూపు చేశివున్నాను. సదరు జాబితా చిత్తగించవలెను అని కోరుతూ వున్నాను. నడుచు సంగతి యేల్నివారి దివ్యచిత్తానకు వేద్యం కావలెను అని విన్నవించుకున్నాను.

యిక్కడ నాకు నాజరు పని యిదివరకు చక్కగానే జరుగుతూవున్నది గాని చిల్లర సంగతులు దేవరవారికి వేద్యం చేయడాన్కి విస్తారమవుతోందిగన్క మన్వి చెయ్యలేదు. యెట్లాగైనప్పటికిన్ని యేల్నివారి సముఖంలోవుండవలెను అనిన్ని యేలినవారి యదట నౌకరీ చెయ్యవలెను అనిన్ని నాకు కానా అభిప్రాయం కల్గి వున్నందుకు దైవం యెన్నటికి సంఘటన చేశేది తెలిశ్నిదికాదు.

యిప్పట్లో మేస్తరు హెగ్గుధోరవారు శీమకు వెళ్ళుతున్నారుగన్క యిప్పట్లో తమరు యిక్కడ విజయం చెయ్యడానకు మంచి యోగ్యమయ్ని సమయం అయివున్నదిగన్క తమరిని కనిపెట్టివున్న మాబోటి దీనజనుల సంరక్షించే నిమిత్తముగానైనా తమరు ప్రయత్నముచేశి యిక్కడికి విజయంచేశి మాబోటి ఆశ్రితుల సంరక్షించి కీర్తిపొందవలెను అని వేడుకుంటూవున్నాను. తమకు యిక్కడ పని అవుతుంది అని జనవాక్యముగా యిక్కడవుండే యావత్తు జనులు వాడుకుంటూవున్నారు. తమ సముఖం చూడడాన్క యెన్నటికి సంఘటన పడును అనిన్ని తమ యిలాకాలో నవుకరీ చెయ్యడానుకు యెన్నటికి సంఘటన పడును అనిన్ని నిత్యం దైవాన్ని కూర్చి ప్రార్థిస్తూవున్నాను. చిత్తాన్క రావలెను......

1831 సం॥ డిశంబరు...
అ॥ కృష్ణారెడ్డి చైత్రాలు *

## 23

మహారాజశ్రీ మేస్తరు సీ. పి. బ్రౌన్ యిస్కాయరు మహా ప్రభువులుంగారి సముఖానకు—

......తమకు నాయందు సంపూర్ణమైన అనుగ్రహంవల్ల జనవరి నెల 9, 14 యీ రెండు తేదీల వ్రాయించిన ఆజ్ఞపత్రికలు రెండు చేరి అపరిమితమైన సంతోషం అయ్నిది. మనవిచేసేది యేమంటే—

---

* మ.ఓ.మే.లై. లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 401, పేజీ 197. ఇండెక్సు పేజీలో బ్రౌన్ యిట్లా వ్రాసిపెట్టివున్నాడు: ‘B.—about mss. etc.’

చిద్వల్లి, లాళ్ళ, కులార్ణవం—యీ గ్రంథములు వ్రాయించడానకు లెఖ్ఖ శానా పెరుగుతున్నదనిన్ని ప్రస్తుతం నిలిపివెయ్యవలశ్నిదనిన్ని ఆజ్ఞాపించివున్నారు. అందులపైకి యిదివరకు కొంత చిదంబరం వ్రాసుకుని వున్నాడు. యిఘమీదటనుంచి నిలిపివేశేలాగున యేలినవారు ఆజ్ఞాపించినసంగతి ఆయనకు తెలియచేశినాను. యిక్కడి నుంచి పంపించిన శికసనులలో యిదివరకు లోగడ వుత్తర్వుప్రకారం సదరుగ్రంథ ములు వ్రాయడానికి చిదంబరం వశాన్న యిచ్చిన శికసనులుగాక చిక్కిన 134 శిక్సనులు హాజరు వున్నవి. అవి దాచిపెట్టుకున్నాను. చిత్తానికి రావలెను.

అవుధాండ్ల అప్పయ్యాదగ్గెర వుండబడ్ని శుకసప్తతి లోగడ వ్రాయించిన ప్రతికి సమానమైనదో లేక వేరే దొరికిందో విచారించి వ్రాయించేలాగ్ను ఆజ్ఞ అయి వున్నది. వకప్రతి అవుధాండ్ల అప్పయ్యాదగ్గెర వున్నది. ఆ ప్రతి యీ దేశములోనే పుట్టినది. లోగడ వ్రాయించినప్రతి తమ సముఖాన వున్నది. సముఖాన వుండబడిన ఆ ప్రతిన్ని యిక్కడవుండే ప్రతిన్ని సరిచూస్తేనేగాని తమదగ్గెర వుండే ప్రతికి సమానమైనదిన్ని ప్రత్యేకమైనప్రతి అయినదిన్ని తెలుసుకోవడానకు అసందర్భమై వున్నది. ఈ వైనం చిత్తానకు రావలెనని వేద్యంచేశినాను.

తమ బంగళా ఖరీదుక్కగాని అద్దెకు అయితే ౹ 20 వరహాలకుగాని యివ్వడా నకు అభిప్రాయంవున్నది అనిన్ని ఆజ్ఞాపించివున్నారు. తమ బంగళాలో దిగివున్న ధొరవారు యేమి, యిక్కడ వుండబడిన యితరదొరలుయేమి ప్రస్తుతం కొనేటందుకు యెవ్వరికీ సమ్మతిలేదు. యెందుకంటె యిక్కడ కలకటరుధొరవారు 1, ఆక్టింగు జెడిజి ధొరవారు 1, హెడ్డశిష్టాంటు కలకటరు వీరు ముగ్గురు కడపలోవున్నారు. కలకటరు ధొర లోగడి కలకటరు ధొర బంగళా కొనుక్కొని వారు వున్నారు. ఆక్టింగు జెడిజి స్ట్రాంభం ధొరవారు జెడిజి హొగ్గు ధొరవారి బంగళాలో బాడిగెకు దిగివున్నారు. హేడ్డుఅశిష్టాంటు కలకటరు మ్న బంగళాలో దిగివున్నారు. వీరు వినహాయించి ప్రస్తుతం యే దొరలులేరు. బంగళాలు జరూరుకావలశి యిక్కడ వుండేవారికి ప్రస్తుతం యిక్కడవుంటున్నామని నమ్మకంలేదు అనిన్ని వాండ్లదగ్గెర ప్రస్తుతం ద్రవ్యసానుకూలతలేదు అనిన్ని వకవేళ వాయిదాలమేరకు వేసుకున్నా యిక్కడినుంచి లేచిపోతె ఆ బంగళా క్రయానకుపోక తమకు నష్టం సంభవిస్తు వున్నది అనిన్ని యెవరు యిందు నిమిత్తం కొనుకోక్కవడానకు సమ్మతిలేదు.

మన బంగళా గాక యింకా 3, 4 బంగళాలు ఫాదరీ ధొరవారి యిలాకాలో వున్నవి. వాటికి రు 5, 6, 100కు బాడిగెకు యిచ్చేటందుకు సమ్మతివున్నది. అంత మట్టుకు బాడిగెకు అయినా యేవొర అయినా వుండి ఆ యిండ్లు చక్కగా వుంచే టందుకు లేక పాడుబడి శిధిలం అయివున్నవి. యిప్పట్లో వాటియొక్క అస్సలు ఖరీ

చుకు నాల్గోపాలికి అయినా క్రయానకుపొయ్యేటట్టు నాకు తోచలేదు. యింకా కొన్నాళ్ళుపోతే పూరా సిధిలమవుతూ వున్నవి. మళ్ళి యెందుకు పనికి రాకుండా పొయ్యేటట్టుగా వున్నవి. యిప్పట్లో మన బంగళాలోవున్న ధొరవారికి గ॥ 10 లు బాడిగె మాలీలకు జీతం యెద్దుల ఖర్చు యింతకంటె వేరే వకరూపాయి అయినా జాస్తి యివ్వమని అడిగితె యీ బంగళా విడిచి పాదరీ దొర యిలాకాలో యింత కంటె సుళువుగా అద్దెదొరికే బంగళాకు పోగలవారై వున్నారు. నేను యింతకు పూర్వమే అద్దె అతిశయమయ్యే విషయమై నానుంచి అయిన రీతిని అందుల జాగ్రత చేశినాను. యెంత చేశినా యెక్కువ అద్దెకు పొయ్యేమార్గములేదు. మన బంగళా లోగడ తమరు తీసుకున్నప్పుడు యేరీతిగా వున్నదో అదే రీతిగా వున్నది. కానీ యేమి శిధిలం కావడమేకాని అయోగ్యముగా వుండడమేకాని మరి యేమిన్ని లేదు. తోటన్ను బాగా వున్నది. చూచేటందుకు మనము కొన్నదానికి అతిశయము క్రయం చేసే రీతిగా వున్నది. అయితే కొనే గిరాకి లేక అమ్మకం పోకవున్నది. చిత్తానుకు రావలెను.

అకుటోబరు నెల బాడిగెవరకు ఖర్చు అయిన సంగతి తెలిశి యిదివరకు పూర్వం పంపించిన అర్జీలవల్లను లెఖ్ఖలవల్లనున్ను చిత్తానకు వేద్యం అయివున్నది. నిలిచిన నవంబరు నెల బాడిగె రు. 35 లు జమ అయినందుకు అందులో బుచ్చయ్య శాస్తుర్లకు రు. 8½, చెంచయ్యకు రు. 5లు, బోయిగురువప్పకు రు. 8లు, అసదుబేగుకు రు. 12లు తోటపాదల వగైరాలకు రు. 1½, వెరశి రు. 35లు ఖర్చు అయినవి. అందుకు వారినుంచి రశీదు యిందులో వెంటపంపించినాను. చిత్తగించవలెను.

యిప్పుడు డిశంబరు, జ్నవరి, యీ నెల—యీ మూడు నెలల బాడిగె రు.105లు ఆ ధొరగారినుంచి రావలశ్నిది. యిందుకు యిక్కడ చెంచయ్యకు బాకీలేదు. బుచ్చయ్య శాస్తుర్లకు రు. 16½ తమ వుత్తరువు ప్రకారం శెపటంబరు నెల మొదలు కొని పెద్దబోయి గురవప్పకు యీ నెల ఆఖైరువరకు యివ్వవలశ్ని నెలలు 6 కి జీతం రు. 24 లలో యిదివరకు చెల్లు రు. 18 లు గాక బాకి రు. 6 లున్ను, వస్తాద్ అసద బేగుకు సదరుప్రకారం నెలలు 6 కి నెల 1 కి రు. 8 ల ప్రకారం రు 48 లలో చెల్లు రు. 32గాక రు. 16లు యివ్వవలశ్నిది వెరశి ముగ్గురికి రు. 48½ యివ్వవలశ్నిది. బాడిగ అయివజు రు. 105 లు ఆ దొరవారినుంచి రావలశ్నిది. వెనకనుంచి బంగళా పట్టు బాడిగె అయివజు అందుకు జమా ఖర్చు లెఖ్ఖ వివరంగా యీవత్తూ సావకాశంపైన పంపిస్తూవున్నాను. క్షమించకర్తలు. చిత్తానకు రావలెను. పెద్దబోయి గురువప్ప తమ బంగళా మొదలైనవి జాగ్రత్తచేశే పనియెందు హాజరు వున్నాడు. చిత్తానకు రావలెను.

యిష్టేశినరీ లెఖ్ఖ పంపించమని ఆజ్ఞ అయినది. ఆమేరకు యిష్టేసినెరి కాగిదాల లెఖ్ఖ పంపించి వున్నాను. ముశిలి యెద్దును నా స్వంతానకు తీసుకునే లాగ్ను నున్ను మంచియెద్దును బంగళాలో కొని వుంచేలాగ్ను ఆజ్ఞ అయివున్నది. యిప్పుడువున్న ముసిలి యెద్దును అమ్మివేశి అందుల క్రయం యిప్పుడు కొనబొయ్యే యెద్దుక్రయంలో చెల్లుపెట్టి తతిమ్మా రూకలు లెఖ్ఖకింద ఖర్చు వ్రాస్తానుకాని నా స్వంతానికి కావలశినది యేమి అన్నిటికి తమ దయ వుండడమే పదిలక్షల వరహాలు వున్నట్టు యెంచుకుని సంతోషిస్తున్నాను. తమ దరిశనం చేసుకోవలెనని బహు విధాల నాకు ఆపేక్ష వున్నది. నాకు యెన్నడు కల్గునో తెలిశినదికాదు. నిత్యం తమ దర్శనం యెపుడు కల్గునో అని విచారం కానావున్నది. యెట్లా ఘటించవలెనో నాకు తెలియక చిత్తానకు వేద్యం చేశినాను......

1832 సం॥ ఫిబ్రేవరి 22 తేది

—అ॥ కృష్ణారెడ్డి చెవ్రాలు*

## 24

మహారాజశ్రీ మేస్తరు సీ। పీ। బ్రౌన్ ధొరగారి సముఖానకు—

......తమరు యీనెల 7 తేదిన వ్రాయించిన ఆజ్ఞ పత్రికెలో యిక్కడ లేటు శిరస్తాదారుణి సంగతి దరియాప్తి కాగానె వకనెల శలవు పుచ్చుకొని వస్తె బాగావుంటూవున్నదని ఆజ్ఞాపించిన సంగతి తెలిసి చాలా సంతోషకరం అయినది. అయితె తమ ఆజ్ఞప్రకారం శలవు తీసుకొని రావడానకు యిప్పట్లో ఆ శిరస్తాదారుణి వగైరాల దరియాప్తి క్రిమిన్యాల్ కోర్టులో విచారణ అయినది. ప్రస్తుతం విచారణకు వచ్చివుండె సరికోర్టుకే ఆ నంబరు విచారణకు కమీటు చేసినారు. సరికోర్టు విచారణకు యింకా 10, 15 రోజులు పట్టును, అని తోస్తూవున్నది. విచారణ కానాగా జరిగేటట్టు వున్నది.

యిదిగాక యిప్పుడు యిక్కడ వచ్చివుండె మేస్తరు ప్రూషుదొరవారి తావున యిప్పుడు జరుగుతూ వుండె కృత్రిమములవల్ల కొన్ని రోజులుపని వేరే మనిషి చూడడంచేత తిరిగీ అతడు ఆ పనిలో ప్రవేశించడానకు అభ్యంతరాలు సంభవించేటట్టుగా తోస్తూ వున్నది. అందువల్ల నేను మనివిచేసేది యేమంటె అక్కడ సముఖ

---

*మ.ఓ.మే.లై. లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 411, పేజీ 20. ఇండెక్స్ పేజీలో బ్రౌన్ యిట్లా వ్రాసున్నాడు: 'Krishna Reddi, very long, chiefly about my house.'

ములో ఒక గొప్ప వుద్యోగానికి నిష్కర్ష చేశి ఆజ్ఞపత్రిక వ్రాయించినట్టు అయితే యిక్కడ శలవు అయ్యే మార్గానికి యత్నంచేసి శెలవు అయితే శెలవుమీదగాని లేకపోతే రాజీనామా యిచ్చిగాని రావడానకు యుక్తపడుతూ వున్నది. యీ సంగతికి తమకు యట్లా యుక్తమో ఆ ప్రకారం ఆజ్ఞదయచేసిన చొప్పున నడుచుకుంటూ వున్నాను. యీ అర్జీకి తమరు వ్రాయించె ఆజ్ఞ నాకు చేరేవరకు ఆ విచారణ అవునని తోస్తున్నది.

యిక్కడ తమయొక్క బంగళాసంగతికి యిప్పుడు యీ కోర్టుకు రిజేష్టరుగా వచ్చివుండే మేస్తరు సీ. పీ. స్కెలటన్ యిస్కాయరు దొరగారు తమ బంగళాలో ప్రవేశించినారనిన్ని బంగళాకు తోటకు అద్దె X. 15 వరహాలు యిచ్చేలాగుననున్ను తోటమాలీలు వగైరా ఖర్చు ఆ అయివజులో మనవల్ల పెట్టుకునేటట్టుగా నిష్కర్ష పడినది అని యింతకు పూర్వం సముఖంలోకి విజ్ఞాపన చేసివుంటిని. కరారు అయిన 4, 5 రోజులు అయిన తరువాత వారి తాలూకు నవుకర్లు యేమి మనివి చేసినారో తెలియదుగాని ఆ దొరగారు నన్ను పిలిపించి లోగడ మేస్తరు యింగిలీషు దొరవారు యిచ్చిన ప్రకారం X. 10 వరహాలు బాడిగె తోటఖర్చు మాలీలు వగైరాలకు జీతం మేమే యిస్తామని శెలవు యిచ్చినందున మేస్తరు యింగిలీషుదొరవారు యిప్పుడు వుండే యిద్దరు మాలీలుగాక 6 వెట్టివాండ్లనున్ను కావలశిన ఖర్చులున్ను యిస్తూ వుండెను అని చెప్పినాను. అందుమీదట యిప్పుడు వుండే యిద్దరు మాలీలుగాక యింకా యిద్దరిని వుంచుతాను అనిచెప్పి యిద్దరిని వుంచినారు. మాలీల జీతం 15 రూపాయలు యేర్పాటు చేసినారు. యద్దులకు మేత వులవలు ఖర్చు వగైరా వారే యిస్తున్నారు. యీ సంగతికి తిరిగీ మా దొరవారికి మనివిచేస్తాను అని చెప్పినాను.

యిప్పట్లో తోట ఖబరుదారీగానె చేస్తూవున్నారు. యీ కరువుకాలంలో వారు వుంచిన ప్రకారం మాలీల వగైరా జీతంకూడా X. 6, X. 7 ఖర్చు వారికి తగిలేటట్టు వున్నది. అయితే మాలీలు వగైరా మా స్వాధీనంలో వుంటె తోటలు ఫలాలు మొదలైనవి మాలీలగుండా అన్యతలపోవును అనిన్ని మాలీలు తమ ఆజ్ఞలో వుండరు అని యీ ప్రకారం చేసినట్టు తోచుతూ వున్నది. గనుక వున్నసంగతి మనవి చేసినాను. చిత్తగించి యేప్రకారం అగ్న అయితే అట్లా నడుచుకుంటూ వున్నాను.

1833 సం॥ ఫిబ్రవరి నెల 15 తేది

—అ॥ క్రిష్ణారెడ్డి (నాజరు)*

---

* మ.ఓ.మే.లై.లో బ్రౌన్‌జాబుల సంపుటం యమ్. 411, పేజీ 146. ఇండెక్సు పేజీలో బ్రౌన్ యిట్లా వ్రాసిపెట్టివున్నాడు: 'C.- Krishna Reddi. Answer to my offer Seristadari on garden: & Mr. Skelton.'

## 25

మహారాజశ్రీ మేస్తరు శీ.పీ. బ్రౌన్ యిస్కాయరు ధొరగారి సముఖానకు__

......యేల్నివారు మే నెల 18వ తారీఖ్ను నా పేర వ్రాయించిన ఆజ్ఞ ప్రకారం తమ బంగళాలో దిగివున్న మేస్తరు శీ. పీ. స్కెలటన్ ధొరగారు యీ కడ్పకు వచ్చిన తర్వాత తమరు వ్రాయించిన వుత్తరం వార్కి యిచ్చి తమ అభిప్రాయం తెలియచేశినాను.

ఆ ధొరగారు బంగళా కరీదుకు తీసుకోవడాన్కు యంతమాత్రం శక్తిచాలదు అనిన్ని బాడిగెకు అయితె వుంటామనిన్ని తమరు వ్రాయించిన వుత్తరంలో బంగళా కరీదుకు తీసుకోని పక్షమందు బాడిగెకు యివ్వడం సమ్మతిలేనట్టు పరిష్కారంగా వ్రాశివున్నారు గనుకనున్ను యిందున్ను గురించి మేము వేరే బంగళాలో చేరుతామని తమ బంగళా విడిచి జూన్ నెల 12 తేద్ని వేరే వక బంగళాలో చేరినారు. నేను ఆ ధొరగారితో మీరు యధాప్రకారం బంగళాలో వుండండి యీ సంగతి మా ధొరగార్కి యెర్కిచేస్తాను అనిన్ని తర్వాత వారియిష్టం యేలాగ్నువుండేది తెలుసుకొని మీరు యేపని అయినా చేయవలశ్నిది అనిన్ని నేను మనవిచేశినాను.

అందుకు ఆ ధొరగారు శెలవుయిచ్చినారు__మీ ధొరగారి దగ్గరనుంచి తాము బాడిగెకు వుండాన్కు సమ్మతివున్నది అని వుత్తరంవ్రాశే పర్యంతరం తాను చేరడానకు యుక్తంలేదని శెలవుయిచ్చినారు. ఆ ధొరగారు మీకు బాడిగెకయిస్తే మీరు బాడిగెకు తగుమాత్రం పనులు చేయించడమున్ను లేదు. విస్తారం మరహమ్మతు పనులు తటస్తమైతే మీ బాడిగె అయివజు అడ్వాంసుగా యిచ్చి చేయించడమున్ను లేదు. పూర్వం మా ధొరగారు ఆ బంగళాగా x 1,000 వరహాలకు కొనివుండగా యిప్పట్లో తిరిగి మా ధొరగారు ఆ బంగళా నిమిత్తం వ్రయంచేయడంవల్ల నిండా నష్టం సంభవించును. కాగా బంగళా మరహమ్మతు పనులకు మా ధొరను ప్రయాసపెట్టకుండా మీ బాడిగెకు తగుమాత్రం చేయిస్తూ వస్తామనిన్ని లేక విస్తారముగా మరహమ్మతు పని చేయించవలశివస్తే బాడిగె అయివజులోకి చెల్లుగా అడ్వానుసుగా యిచ్చి చెల్లుచేసుకుంటూ వుంటామనిన్ని బంగళా తొందర మా ధొరకు నిమిత్తం లేకుండా జరిపేడాన్కు మాటయిస్తే మీరు బంగళాలో వుండేటందుకుగాను మా ధొరగారికి మన్విచేసి వుత్తరం తెప్పిస్తాను అని మన్విచేశినాను. వారు యీ మాటకు కరారుపడి వప్పినారు. యిందు నిమిత్తం మన్విచేయడం యేమంటే ప్రస్తుతం యిక్కడవుండే ధొరగారు బంగళా ఖరీదుకు తీసుకోవడానకు శక్తిలేక వేరే చేరేటందుకు నిశ్చ

యించినారు. యింకా ప్రస్తుతం యిక్కడవుండే ధొరలు క్రయానికి తీసుకోవడానకున్ను బాడిగెకు వుండడానికే గాని యవ్వరు లేరు.

బంగళా ఖాళీగా వుండడంవల్ల బేదరుస్తు అయి చెడిపోవుటమాత్రమే కాకుండా నౌకర్లు కూలీల జీతాలు ప్రతినెలకు మీరు యివ్వడంవల్ల నిండా నష్టం సంభవిస్తున్నది. బంగళా మరహమ్మతు వగైరా పనుల నిమిత్తం మిమ్ముల తొందర చేయకుండా ఆ ధొరగారు మాటయిచ్చినారు. బాడిగెవల్ల మరహమ్మతు పనులు అవుతూ వచ్చినా బంగళా దురుస్తుగా వుంటున్నది. ప్రస్తుతం కొన్నిదినాలు జర్గిన తర్వాత వకవేళప్పుడు బాడిగె అయివజు మిగులును. కాగా ప్రస్తుతం తిర్గి ఆ ధొరగారు వుండడం అనేక్కవిధములు యుక్తంగా నాకు తోచినది గనుక మన్విచేశేది యేమంటే ఆ బంగళా మరహమ్మతు వగైరా పనులకు మీరుయిచ్చే బాడిగె అయివజులో చేసుకొని వుండిన పక్షమందు మీరు బాడిగెకు వుండవచ్చును అని ఆ ధొరగారికి తిరిగీ మీరు జాగ్రత్తగా వుత్తరం దయచేయించవలెను అని కోరుతూవున్నాను. అట్లా మీరు వుత్తరం వ్రాయని పక్షమందు ఆ ధొరగారు తిర్గి బంగళా చేరడంలేదు. బంగళా కాలీగా ఉంటూవున్నది. మన్విచేశినాను. చిత్తగించి ఆజ్ఞ దయచేయించిన ప్రకారం నడుచుకుంటూ వున్నాను.

పెద్దబోయి గుర్వప్పను బంగళాలో పరిచే జెత్తపుత్సాపలు నిమిత్తం ప్రేమ తీసుకొని వచ్చినాడు. ప్రేమత్సాపలు కట్టించి వేయిస్తూ వున్నాను. జంబుఖానా మీరు పంపించవలశిన అగత్యంలేదు. చిత్తానకు రావలెను. అంతట రెండుకలములు అర్జీ దివ్యచిత్తానకు తెచ్చి కాపాడగలందులకు తాము ఖామందులు వున్నారు.

బతారీఖు చందు 14 జూన్ సనీ 1834 సం॥

అ॥ కృష్ణారెడ్డి చెవ్రాలు *

## 26

మహారాజరాజశ్రీ మేస్తరు సి. పి. బ్రౌన్ యిస్కోయరు ధొరవారి సముఖానకు—

తమ ఆజ్ఞాధారకుడయిన కదిరి మునసిఫు అయోధ్యాపురం కృష్ణారెడ్డి అనేక సలాములు చేసి వ్రాసుకున్న అర్జీయేమంటె, యేలినవారు యీ నెల 9 తారీఖున

---

*మ.ఓ.మే.లై. లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 401, పేజీ 251. ఇండెక్స్ పేజీలో బ్రౌన్ యీ జాబును గురించి యిట్లా వ్రాసున్నాడు: 'Unproduciable—dispute with స్కాట్ about house-purchase.'

వ్రాయబడిన ఆజ్ఞాపత్రికె యీ దినం పగలు 7 ఘంటలవేళ నాకు చేరినందున తాము శీమకు పోయినట్టు వర్తమానం తెలిసిన దారభ్యం యీ దినం వరకు తమయొక్క క్షేమ సమాచారం యేదిన్ని తెలియకుండా వుండినందున న గు॥ అహర్నిశం నాకు కలిగివుండే అత్యంతమైన వ్యసనం యీ దినంతోటి పరిహారమై విశేషమైన సంతోషాన్ని పొందియున్నాను. మరిన్ని తాము శీమకు విజయం చేశేటప్పుడు నాకు యీ జిల్లాలో చేరిన మారకాపురం మునసఫు పనికి, మహారాజ॥ కాష్మేజరు (Casamajor) దొరగారికి శిపార్సు చేసిన ప్రకారం సదరు మునసఫు పని నాకు అయి 1834 సం॥ డిశంబరు నెల మొదలుకొని 1837 సం॥ మార్చి నెలవర్కు మారకాపురంలో వుండి వుంటిని. సదరు మార్చి నెలలో యీ జిల్లాలో చేరిన కదిరిగ్రామం కడపకున్ను నా స్వంత గ్రామానికిన్ని సమీపమైనందున యీ కదిరి మొకాం పని వర్గ అయి వచ్చివున్నాను. యిప్పట్లో కదిరి మొకాం మునసఫు పనిలో కదిరి గ్రామంలో వుండివున్నాను.

తమరు వ్రాయించిన ఆజ్ఞ ప్రకారం తాము శీమకు విజయం చేసిన దినం మొదలు యీదినంవరకు తమయొక్క బంగళా అద్దె సమ్మంధం లెఖ్కయావత్తున్ను వివరగతిగా నాలుగైదు దినములలో సముఖములోకి పంపిస్తున్నాను. తమవల్ల వృద్ధిని పొంది తమరె జీవనంగా నమ్ముకొని తమయొక్క క్షేమ సమాచారానికి ప్రతిదినం నిరీక్షిస్తుండే నాకు తమయొక్క క్షేమ సమాచారములు అప్పటప్పటికి ఆజ్ఞాపత్రికలవల్ల తెలిసి సంతోషపరచవలెనని కోరుతున్నాను. తమయొక్క దర్శనం చేసుకోవలెనని నిండా అభిప్రాయం కలిగివున్నది. అయితే యిక్కడి నుంచి యిప్పట్లో శెలవు తీసుకొని తాము ప్రకృతం వుండే స్థళానకు వచ్చేవరకు తాము యేయే దేశానకు సాంబ్రాజ్య పదవిని పొంది విజయం చేస్తారనే సంశయం వల్ల విజ్ఞాపన చేసివున్నాను. యిందుకు ఆజ్ఞప్రకారం ప్రవర్తిస్తున్నాను. మరిన్ని యీ జిల్లా కలెక్టరు దొరగారున్ను వేరే పనికి యత్నం చేసుకొని పోగలవారై వున్నారు అని విని వున్నాను. యేలినవారు యీ పనికి దయచేసిన పక్షమందు నా అదృష్టం విశేషమైనదిగా యెంచుతున్నాను. యింతే అన్కే సలాములు. ఆజ్ఞానుసారం బోయ గురవప్పను సముఖములోకి పంపిస్తున్నాను. చిత్తగించ కర్తలు.

1838 సం॥ జనవరి నెల 20 తేది

అ॥ కృష్ణారెడ్డి*

---

* మ.ఓ.మే.లై. లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 432, పేజీ 51.

27

మహారాజశ్రీ సి. పి. బ్రౌన్ యస్క్వయరు దొరవారి సముఖానకు—

కడపజిల్లా రాయచోటి తా॥ హసనాపురం గ్రామం అయోధ్యాపురం శిద్దారెడ్డి పెద్దకొమారుడయిన చిన్నకృష్ణారెడ్డి అనేక సలాములుచేశి అత్యంత వినయపూర్వకముగా వ్రాసుకొన్న మనివి అర్జియేమంటే. నా తమ్ముడైన రామకృష్ణారెడ్డిని దేవరవారు అనేకవిధములు పోషణచేశి జిల్లా కోర్టు గుమాస్తాగా తొలుత నియమించి త॥ నాజరు పని యిప్పించడమే కాకుండ నేటీవు రిజిస్తరు పనియిప్పించి తర్వాత యీ కడప జిల్లాలో చేరిన మారకాపురం వగైరా తాలూకాలకు మునసఫు పనికి మహారాజశ్రీ సరికోర్టు క్యాషు మేజరు దొరగారికి దేవరవారు శిఫారసు చేశిన్ని ఆ తాలూకా మునసఫు పనిలో వుండగా కొద్దిరోజులకు కదిరి తాలూకా వగైరా తాలూకాల మునసపు పనికి వర్దుచేశి మా తండ్రి అయిన శిద్దారెడ్డికి నేను వగైరా మా అన్నతమ్ములకు దర్బారులో మాన్యత కలగజేశి ఆ రామకృష్ణారెడ్డివల్ల మా యావత్తు మందికి జీవనోపాయం చేయించివుండి వున్నందుకు దేవరవారియొక్క కటాక్షవీక్షణముచేత మేము బహుమంది జీవనం చేస్తూ వుంటిమి.

మా దురదృష్టమువల్ల నా తమ్ముడయిన రామకృష్ణారెడ్డి నా తండ్రి అయిన శిద్దారెడ్డి గతించివున్నారు. వారు గతించిన తరువాత చక్కగా జీవనోపాయం జరగక నా తండ్రిఅయిన శిద్దారెడ్డి సంపాదించిన కదింమిరాశి గ్రామాదులు హసనాపురం, చిట్లూరు, నల్లగుంట్లపల్లె, సరస్వతిపల్లె—యీ గ్రామాదులలో మాన్యం మిరాసులు మా అన్నతమ్ములము భాగాలు యేర్పరచుకొని ఆ గ్రామాదులకు నేను వగైరా కొందరము రెడ్డి మిస్సల్లో వుండి స్వల్ప జీవనాలతో జీవనాలు జరగక నిండా ప్రయాసలో వుండివున్నాను.

అయితే నాకు హసనాపురం గ్రామం రెడ్డిమిస్సలు దాఖలా వుండి 15 సంవత్సరములనుంచి ఆ నవుకరి చేస్తూవుండగా లోగడ నా తండ్రి అయిన శిద్దారెడ్డి వుండేటప్పుడు 1820 యిసవీ నవంబరు 23 తేదీన మా గ్రామానకు సమీపకము ముక్కాలు కోసులో వుండే వీరబల్లె అనే గ్రామం రెడ్లు నారపురెడ్డి మాచిరెడ్డి ముసలరెడ్డి వీండ్లచేత రు. $485\frac{1}{4}$ లకు రెడ్డి మిరాశి మాన్యం (దశబంధాలు) దసమందాలు విక్రయపత్రము వ్రాయించుకొని జిల్లాకోర్టు రిజస్తరు దొర తావున పైసలునామాలున్ను పొంది ఆ గ్రామం మా తండ్రిఅయిన శిద్దారెడ్డి రెడ్డిపనులున్ను చూస్తూవుండెను.

యీవల ఆ వీరబల్లె గ్రామం సుబ్బారెడ్డి అనేవాడు మా తండ్రికి కొంత వడంబడికె చెప్పి నా తమ్ములయిన నారాయణరెడ్డిని నారశివార్డ్రెడ్డిని అయిదు సంవత్సరములు దగ్గిర వుంచుకొని సాకుతూ యీ వీరబల్లె గ్రామం మిస్సలు చేయించి యిస్తానని నమ్మకం చెప్పినందున మా తండ్రి నేను వగైరాలు సమ్మతించి యీ గ్రామం పని మీరు చూచుకొంటూ వుండమని ఆ సుబ్బారెడ్డి వగైరాలతో చెప్పి వుంటిమి. యింతలో ఆ సుబ్బారెడ్డి అనేవానికి మరికొన్ని దినములు చిన్నపరెడ్డి అనేవాడు సంతానం కలిగినందుననున్ను మాకు మాట యిచ్చిన సుబ్బారెడ్డి గతించినందుచేత ఆ చిన్నపురెడ్డి మా తండ్రి తావుకువచ్చి మీ వంశములో రామకృష్ణారెడ్డి గొప్ప వుద్యోగాలు సంపాదించి చక్కగా మీకు జీవనం నడుస్తూ వున్నది. అందువల్ల మీకు జీవనోపాయం జరుగుతూవున్నది. నేనున్ను మీ కొమాళ్ళలో చేరినవాణ్నేను అని చెప్పుకొన్నందున దొరలతో మనవిచేశి యీ వీరబల్లె గ్రామానకు ఆ చిన్నపురెడ్డిని ముసలిరెడ్డి కొడుకు సుబ్బారెడ్డిని మాచిరెడ్డి కొడుకు ఆరంరెడ్డిని మిస్సలు దాఖలు చేయించివుండగా యీవల స్న 1256, 57 ఫసలీలల్లో సుబ్బారెడ్డి అనేవాడు యీ తాలూకాలో భారీ నేరాలు చేస్తూవుండి 500 రూపాయీలకు యిస్తిహారులో చేరిన ఖయిది చీకటి వెంకటేశుగానితో కలిశి వానికి అన్నపానాదులు సహా జరుపుతూ వానికి అప్పుయిచ్చినట్లు సర్కారు వారికి స్పష్టముగా తెలిశి మిస్సలు మిరాశితో కూడా బరతరఫు చేశివున్నారు. ఆరంరెడ్డి, చిన్నపురెడ్డి యిండ్లో నంబరు ఛపావణి దస్తు బాకీ మొదలయిన సంగతులలో పూర్తిగా రుజావు అయినందున మహారాజశ్రీ కాకిరిన్ దొరగారు ప్రతి మనిషికి (per head) ఫియి సం 1 కారు 100 వంతున జులుమానా శిక్షవిధించి మిస్సలు మిరాశితో కూడా బరతరఫు చేశినందుకు సదరు యిందరు రివిన్యూ బోర్డుకు అప్పీలు అయివుండగా బోర్డువారు మనిషి యిసం 1 కారు 50 రూపాయీల మాఫుచేశి రూపాయీలు 50 వంతు జులుమానా ఖాయించేశి మిస్సలు మిరాశి బరతరఫు చేశినందుకు కలక్టరు దొరగారికి బోర్డువారు వుత్తర్వు చేశివున్నారు.

సదరు వీరబల్లె గ్రామానకు సర్కారు పరంగా రెడ్డిని నియమించమని యీ తాలూకా తహాశ్శీలుదారు గంగిరెడ్డికి హుకుం వచ్చినందున నా తండ్రి తాగాయతీ యీ గ్రామానకు మేము పూర్వీకులము అనిన్ని యీ గ్రామంల్లో అనేక జనం గుమాస్తీలున్నూ పాకీర్లున్నూ దొంగలున్నూ భారీ ఖూని మొదలయిన నేరములలో కలిశి విడుదల అయివచ్చి వుండేవాండ్లు బహుమంది వున్నారు అనిన్ని యీ వీరబల్లె గ్రామానకు బరతరఫు అయిన రెడ్డి వుండవలెనన్ని నా యోగ్యతను గురించి తాలూకా తహాశ్శీలుదారు గంగిరెడ్డి హుజూరుకు నాకు శిఫారసు చేశినందున యీ సంగతి తెలిశి

మాజీరెడ్లు అయిన ఆరంరెడ్డి చిన్నపురెడ్డి యింక కొంతమంది గుమానీలు వగైరాలను వెంటబెట్టుకపోయి కలక్టరు దొరగారి తావున యీ చెన్నక్రిష్ణారెడ్డి మా గ్రామానకు రెడ్డిపనికి మిస్సలు అయినట్టయితే మేము నిభాయించలేము అని అర్జీ యిచ్చినందుకు హుజూరు సన్నిధి నవుకర్లనున్ను తహాశ్శీలుదారు మొదలయినవారిని కలక్టరు దొర గారు విచారించి సదరు బరతరఫు అయిన రెడ్లు గుమానీ వగైరాలు యిచ్చిన అర్జీ మంజూరుచేయక యీ ఆరువై 60 ఫసలీ చందు 18 మాహే నవంబరు తేదీన యీ వీర బల్లె గ్రామానకు నన్ను రెడ్డిపనికి మొకరర్రుచేశి జమాబంది కాలము వంటిపట్టాకు దాఖలు చేయడమవుతూ వున్నదని నెం 310 హుకుం తహాశ్శీలుదారుకు మేస్తరు కల క్టరు మ్రిదొరగారు సాదరుచేయించినందున ఆలాగున తహాశ్శీలుదారువారివల్ల తాఖీదు పొంది ఆ త॥ యీ వీరబల్లెగ్రామం రెడ్డిపనిలో ప్రవేశించి దొరతనంవారియొక్క చట్టానుసారము వోట్టు హుకుముల ప్రకారం యీ గ్రామంలోనేమి ఆజూ బాజూ గ్రామాదుల్లోనేమి దొంగతనాలు మొదలయినవి కాకుండా బందోబస్తు పరిచిన్ని యీ 60 ఫసలికి గ్రామంలో 59 ఫసలి బేరీజుకున్నూ యీ 60 ఫసలికి 800 రూపా యీల పరియంతరం తనక్కీచేశి జాస్తిచేయడమేకాకుండా అవ్వల్‌కిస్తు తాగాయితీ ఆఖైరు కిస్తీవరకు 3500 రూపాయీలు బిన్‌తకరారుగా (with out) సర్కారు ఖజానాకు చెల్లించి 1, 2 అవర్తుల కలక్టరు దొరగారికిన్ని తహాశ్శీలుదార్లవారికి నా యొక్క మొహానతు తెలుపుకొన్నందుకు యీ వీరబల్లె గ్రామానకు వోంటిపట్టా కాక మునుపే సన్న 1851 సంవత్సరం చందు॥ యేప్రెల్ 2 తేదీన గ్రామమునసఫీ సన్న దున్ను యిచ్చివున్నారు. నాకు గ్రామానకు రెడ్డిపనికి నియమింపబడిన తాఖీదు యొక్క నకలున్ను మునసఫీ సన్నదు నకలున్ను యిందుతోకూడా బిడాయించి దేవర వారియొక్క సన్నిధానమునకు విన్నపించినాను.

అయితే యీ వీరబల్లెగ్రామం మాజీరెడ్లు కొందరు పోకిర్లను గుమానీలను జమ చేసుకొని జమాబంది కాలమందు యీ గ్రామానకు నాకు వోంటిపట్టా యివ్వకుండా కలక్టరు వారికి అర్జియిచ్చి నాకు పొందకుండ చేయవలెనని యెత్నపడివున్నారు. జమాబందికి కలక్టరు దొరగారు యీ నెల 8 రోజులకులోగా తాలూకా ప్రవేశించి జమాబంది ఫైసలాతి చేస్తూవున్నారు గనుక మనివిచేశేది యేమంటే నా తమ్ముడయిన రామకృష్ణారెడ్డికి దేవరవారు యేప్రకారం కటాక్షంవుంచి సంరక్షణచేసి కాపాడి జీవనం కలగజేశివున్నారో ఆలాగున పేదవాణ్ని అయిన నాయందు నిండా కటాక్షము వుంచి యీ వీరబల్లె గ్రామం వోంటి పట్టాకు నాపేరు దాఖలుచేయించి యీ గ్రామం రెడ్డి యినాం వగైరా నాపేరట జారీ అయ్యేలాగున మహారాజరాజశ్రీ కలక్టరు మ్రి దొరగారికి శిఫారసు దయచేయించవలెనని దేవరవారియొక్క దివ్యసన్నిధికి అనేక

విధముల ప్రార్థిస్తున్నాను. యిదిన్నిగాక నాకు దేవరవారే తల్లిదండ్రి అనిన్ని దేవర వారు మినహా యితర ఆధర్వు లేదు అనిన్ని యిచ్చట నా నిమిత్తము సిఫారసుచేశే జనులు యెవ్వరు లేరుగనుక దేవరవారే నాకు దైవమని యెంచి అనేకవిధముల ప్రార్థిస్తున్నాను. మిక్కిలి వ్రాసుకోవడానకు శక్తిచాలదు. యింతే అనేక సలాములు.

స్న 1260 ఫసలి మహే మే చందు 29 తేది

—అయోధ్యాపురం చిన్నకృష్ణారెడ్డి వ్రాలు*

## ములుపాక బుచ్చయ్యశాస్త్రి జాబు

## 28

స్వస్తిశ్రీ మన్మహారాజరాజశ్రీ చార్లీసు ఫిలీపు బ్రౌం ధొరగారి సముఖానకు—

తమ పండితుడు ములుపాక బుచ్చయశాస్త్రి వినయపూర్వకముగా అనేక సలాములుజేసి వ్రాసుకున్న విజ్ఞాపన పత్రిక యేమంటే తమ శెలవుప్రకారము కృష్ణారెడ్డి పంపించిన వసుచరిత్ర ప్రతిపదార్థప్రకాశిక తమరు అంగీకరించినదీ లేనిదీ తెలియ లేదు. యిక్కడనైతే బహుమంది పెద్దలు అంగీకరించి బహుదేశములవారు వ్రాసుకొని పోతూనూ వున్నారు. ఆ ప్రకారము బహుమంది విద్యార్థులు వ్రాసుకొని వర్ణిస్తా వున్నారు. తమపేరిట కృతిగనుక తనంతటనే విస్తరిల్లుతూ వున్నది. నేను తమరు సుకృతంగా పాఠకశాలపెట్టి అనేకమందికి ఆంధ్రగీర్వాణ వ్యాకరణ కావ్యనాటకా లంకారాది గ్రంథములు అభ్యసింపచేస్తూవున్నాను. యింత పర్యంతరము తమరు యిప్పిస్తూ వచ్చిన ద్రవ్యముపయోగించి కాలయాపన చేస్తూవుంటిని. యిప్పుడా ద్రవ్యము సరిపోయినందున అశనాచ్ఛాదనాలకు సేనా శ్రమపడుతూ వున్నాను. లోగడ సముఖాన మనవిజేసుకున్న ప్రకారము నా ఘటము వున్నంతకు అన్నము యిచ్చి కాపాడితే తమకు బహుపుణ్యము వస్తూవున్నది. తమరు వుపేక్షచేసిన పక్షమందు యీ వార్ధికములో బహుకష్టపడేను. కాంగా నాయందు కటాక్షించి నాకు అన్నానకుగా కృష్ణారెడ్డికి వ్రాయించి దయచేయకర్తలు. పత్రిక ముఖాంతరం విశేషము యేమివ్రాయవలసినది యీ పత్రికనే నన్నుగా కటాక్షించి అన్నమిచ్చి కాపాడవలెనని కోరుతూవున్నాను.

---

* మ.ఓ.మే.లై.లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 425, పేజీ 225. Krishna Reddy died 26 March 1844—అని యీ జాబుపైన బ్రౌన్ వ్రాసి పెట్టుకున్నాడు.

యీ చిన్నగురువరాజు మనవిచేయగా నా వర్తమానమంతా చిత్తానకు వచ్చేని యింతే విజ్ఞాపన పత్రిక.

వైశాఖ కృష్ణ 8 లు.
బుచ్చయ్యశాస్త్రి స్వహస్తము వ్రాసుకున్న
విజ్ఞాపన పత్రిక. కడప నుంచీ
పంపించడమైనది___*

## పైడిపాటి వెంకటనరసయ్య జాబు

### 29

మహారాజరాజశ్రీ చార్లీసు ఫిలీపు బ్రౌన్ ధొరవారి సముఖానకు___

తమ కవీశ్వరుడు పైడిపాటి వెంకటనరసయ్య అనేక సలాములుచేసి వ్రాసుకున్న విజ్ఞాపన యేమంటే, తమరు చన్నపట్నము విజయముచేసిన నాటనుంచి నేను యిక్కడ కంభంలో తమపనిలోనే వుండివున్న వైనం కోదండరామయ్యగారు వ్రాసే వుత్తరమువల్ల తమ చిత్తానకు విశదమయ్యేవుండును. తమరు నా నిమిత్తమై చన్నపట్నములో కవీశ్వరులయొక్కానున్ను రాజులయొక్కానున్ను పూర్వోత్తరములు పద్యాలుగా చెప్పేపనికి సిఫారసుచేసివున్నారనిన్ని ఆ పని నాకు సమ్మతి అవునోకాదో తెలుసుకుని వ్రాయమని తమరు క్రిష్టారెడ్డిపేర ఆజ్ఞ వ్రాయించినారట. యీ సంగతి విని అపారమైన ఆనందమును పొందినాను. కవనం చెప్పేపని నాకు విస్తరించి అభ్యాసముగనుక తమ ఆజ్ఞ శిరసావహించి యెక్కడికి రమ్మంటే అక్కడికి వస్తూవున్నాను.

అయితే యిక్కడ నేను పనిచూచినమట్టుకు నా జీతం తాలూకు నలుభై రూపాయలు బాకీ వున్నది. యీవల మూడు నెలలనుంచి తమ శలవుకు నిరీక్షిస్తూ కంభంలోనే వున్నాను. యిక్కడ యేమి ముట్టడంలేదు గనుక అప్పులవాండ్లు తొందరచేస్తున్నారు. క్రిష్టారెడ్డిపేర నాకు రావలశిన అయివజు యిచ్చేలాగుననున్ను నన్ను ప్రయాణంచేసి పంపించేలాగుననున్ను హుకుం వ్రాయించినట్టైతే యిక్కడ అప్పులవాండ్లకు యిచ్చివేసి తక్షణం తర్లి సముఖానకేకాని చన్నపట్నానకేకాని శలవుప్రకారం వస్తూవున్నాను. నేను తమ్మున వినహా మరివేరే యవరిని నమ్మివుండలేదు. నేను సమక్షమందువున్నా పరోక్షమందువున్నా రక్షించవలశ్ని భారకులు

---

* మ.ఓ.మే.లై. లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 410, పేజీ 69.

తమరేగనక నాకు యెక్కడవుండానకు సంశయంలేదు. విన్నప పత్రం తప్పు క్షమ శాయవలెను.

1829 సం॥ మే 20 తారీఖు
(పైడిపాటి వెంకటనరసయ్య)*

## ధర్మపురం సుబ్బన్న జాబులు

## 30

మహారాజశ్రీ సీ. పి. బ్రౌన్ యిస్కాయరు ధొరవారి దివ్యసముఖానకు—

తమ పోష్యవర్గుడైన ధర్మపురం సుబ్బన్న అనేక సల్లాములుచేసి అత్యంత వినయ విధేయపూర్వకముగా వ్రాసుకున్న మనవియేమంటే—తమయొక్క బంగళాలో దిగివుండబడిన మేస్తరు కోపివేష్టన్ ధొరగారు లోవయినం కొత్తగా కట్టించిన దక్షిణపు తట్టు సఘం బంగళాచుట్టూ మూడు పార్శ్వములయెందున్ను వుండబడిన వసారాకు పయిన చేయించివున్న గచ్చు పగలకొట్టించి పెంకులు కప్పించి అందుకు సమానముగానే వుత్తరపుతట్టు సఘం బంగళాయొక్క తూర్పున్ను వుత్తర భాగంలో సఖమున్ను వసారా విప్పిదీయించి చావడివి సందు బిగువులు వేయించి రెండేశి అంఖణాలు కల్పి వక అంఖణంచేసి అద్దముల తల్పులు తీసివేసి పూరా దర్వాజాలువుంచి యీప్రకారం బంగళా కట్టిస్తూవుండి సదరహీ ధొరగారు పట్నానకు వేంచేసివున్నారు. 7-8 రోజులలో మరహామత్తు సిద్ధమవుతూవున్నది. మరిన్ని వేరే పశువులను కట్టివేస్తు వుండబడిన వక ఇల్లున్ను చక్కచేయించివున్నాను.

యిదిన్నిగాక బంగళాకు కొంచెం పశ్చిమం తట్టు వుండబడిన రెండు దిరసనపు చెట్లున్ను బంగళాయొక్క తూర్పువసారాకు వుత్తరపుతట్టున్ను కాలీజా కొట్టానికి తూర్పుభాగాన వుండబడిన వక వేపచెట్టున్ను యీ ప్రకారం మూడుచెట్లున్ను కుతారంకొట్టించి వున్నారు గనుక వున్న సంగతి వేద్యంచేసి వున్నాను—

బంగళాకు చేరిన పక్వశాలయున్ను అశ్వశాలకు వేయబడిన వక దూలం విరిగి పోయి వున్నందున అదిన్ని చక్కచేయించవలసినది గనుక వున్న సంగతి మనివి వ్రాసుకున్నాను—వెరసి మూడు కలముల అర్జిన్ని దివ్యచిత్తానకు తెచ్చి నన్ను సంరక్షించగలందులకు తాము ఖామందులు వున్నారు—

దివి 4 అకటంబరు 1838 సం॥
—ధర్మపురం సుబ్బన్న †

---

* మ.ఓ.మే.లై. లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 401, పేజీ 189.
† ,, ,, యమ్. 419, పేజీ 463.

## 31

ధర్మపురం సుబ్బన్నకు___

మహారాజశ్రీ సి. పి. బ్రౌన్ ధొరవారు వ్రాయించిన ఆజ్ఞ యేమంటే___నీవు మా పేర వ్రాశి పంపించిన వుత్తరం చదువ్వుకోంగా చాలా సంతోషమయినది. వుత్తరం పట్టుకుని వచ్చిన మనిష్యికి భత్యఖర్చుకింద వక రూపాయి యిప్పించి వున్నాము. మాకు కొన్ని గ్రంథములు కావలశివుండగా జాగ్రత్త చేస్తానని వ్రాసినావు గనుక సంతోషించినాము. అట్లా చేసిన పక్షమందు అయ్యే ఖర్చు ముజరా యిప్పిస్తున్నాము.

మరిన్ని భానుమద్విజయం అనే తెలుగు గ్రంథం కడపలో యిప్పుడు దొరికితే దానికి ప్రతి పుట్టించుకుని పది రూపాయీలు యినాం యిప్పిస్తున్నాము. మాతృక మా దగ్గరకు పంపించడానకు అభ్యంతరమయ్యే పక్షమందు అక్కడనే ప్రతి పుట్టిస్తున్నాము. ముఖ్యంగా యిది శైవకావ్యము. అయిదు ఆశ్వాసములు గలది. వెలగపూడి కృష్ణయ్యాకవి చెప్పినది. యిది తెలుగు కావ్యము గనుక వక వేళ కడపలో దొరకవచ్చును. పయిగా పయిడిమర్రి వెంకటపతి చెప్పిన చంద్రాంగద చరిత్ర అయిదు ఆశ్వాసములు గలది ముఖ్యం కావలశియున్నది. యిదిగాక జంగమ పుస్తకాలలో కొన్ని కావలశియున్నవి. అవి కన్నడభాష గనుక కన్నడవాండ్ల వద్ద విచారించవలెను. యేవంటే___ప్రభులింగలీల। బసవపురాణం। బసవకాల జ్ఞానం। వీటిలో ముఖ్యంగా లీల కావలసినది గనుక దానికి రెండు మూడు ప్రతులు దొరికే పక్షమందు చాపా చేయించేటందుకు మాకు భావం కలిగివున్నది. యీ పనికిగాను అక్కడ యేదయినా వక పుస్తకం వ్రాయించవలసివచ్చే పక్షమందు సాధారణంగా వచనం రీతిగా వ్రాయవలశినది. పద్యములు నాలుగేశి చరణములుగా యేర్పర్చి వ్రాయవలశిన జరూరులేదు.

వ్రాత అయిన తరువాత మొకాబిలా చేయించవలశినది. యీ మనిషి నీ తావుకు పొయ్యేటప్పుడు వీని పరంగా నీ తావుకు కొన్ని పుస్తకములు దానంగా పంపిస్తున్నాము. సదరహి వ్రాశిన గ్రంథములేకాకుండా యీ దిగువను వ్రాశిన గ్రంథములు కూడా మాకు కావలశివున్నవి గనుక వీటిని గురించికూడా తలాషు చేశి పంపించవలెను.

1 సూర్యతనయా పరిణయం

1 చారు చంద్రోదయం

1 పండితారాధ్య చరిత్ర

1 రత్నావళి పరిణయం

4

యీ పుస్తకములు కూడా జాగ్రత్తచేశి పంపించవలెను.

యిటని మా వ్రాలు

ది 12 డిశంబరు అన 1840 సం॥ (Signed) C. P. Brown.*

## 32

మహారాజశ్రీ శి. పీ. బ్రౌన్ యిస్కాయరు ధోరవారి దివ్యసముఖానకు—

పోష్యవర్గుడయిన ధర్మపురం సుబ్బన్న అనేక సల్లాములు చేశి అత్యంత వినయవిధేయపూర్వకముగా వ్రాసుకున్న మనివి యేమంటే తమ అనుగ్రహం (వల్ల) ముఫ్తి సదరమీన్ వారి కోర్టులో రెండో గుమాస్తాగా వుండివున్నాను.

నోసం మునసఫుగావున్న అయోధ్యాపురం కృష్ణారెడ్డి మార్చినెల 25 తేది సాయంత్రం విషమజాడ్యంవల్ల నోసంలో కాలంచేశినాడు. జ్యోతిరాజప్ప మదనపల్లె ముససఫుగావుండి యీ కడపకువచ్చి వుబ్బసపు జాడ్యం నిండా ప్రబలించి చనిపోయినాడు. లోవయినమే తమ నవుకరయిన ముశిలిమడుగు గురవప్ప చనిపోయివున్నాడు. యీసంగతి చిత్తానకు వేద్యం కాగలందులకై శ్రుతపరచినాను. చిత్తగించవలెను.

ది 12 యేప్రల్ 1844 సం॥

ధర్మపురం సుబ్బన్న వ్రాలు †

* మ.ఓ.మే.లై. లోని బ్రౌన్ జాబుల సంపుటం ఎమ్. 411, పేజీ 54. ('బ్రౌన్ లేఖలు' గ్రంథంలో వ్యాఖ్యానరహితంగా యీ జాబు ముద్రింపబడింది కూడా. ధర్మవరం అని తప్పుగా అందులో పడింది.)

† మ.ఓ. మే.లై. లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 418, పేజీ 525.

# 33

మహారాజశ్రీ సి. పి. బ్రౌన్ యిస్క్వాయరు దొరవారి దివ్యసముఖానకు—

...1845 సం॥ ముఫ్తి కోర్టు ఫయిలు నంబరు 180లో వాది కొమ్మొత్త సంజీవ కొండు అనే అతను ప్రతివాదులు 7 రిక్కైనరు 1576 సు॥కు దాఖలు చేయబడిన వ్యాజ్యములో వాది తరఫున ప్లీడరు దత్తయ్యాన్ను - మొదటి ప్రతివాది తరఫున ప్లీడరు శిబతుల్లా సాహేబున్ను వకాల్తునామాలతో కూడా వాదికి 1 ప్ర॥ది అచ్చుకొనే లాగున 1849 సం॥ జూన్ నెల 13 తేదిన రాజీనామా దాఖలు చేయబడినారు.

సదరహీ దావా ద్రవ్యం తతిమ్మా ఆరుగురు ప్రతివాదులున్ను వాది కచ్చుపనే లాగున ప్రైవేట్లో వాదిన్ని సదరు వకీళ్ళున్ను కలిశి రాజీనామా మోసనున్ను సదరు ఆర్గురు ప్ర॥ల తరఫున 1 ప్ర॥ది తరఫు ప్లీడరు పేరటనే వకాల్తునామా యున్ను కలగచేసినట్టున్ను ఆ 6 రి పైకి వొకడు మాత్రం వ్రాలు చేసేవాడైనందున వానియొక్క చేవ్రాలు వలెనే సదరహీ వ్రాలు చేసినట్టున్ను అందునగురించి కడపజిల్లా హేడ్డు మేజస్ట్రీటు మేస్టరు కాకరెన్ దొరవారియెదుట పిర్యాదు కాబడినట్టున్ను వారు వాదిని కైదీగా చేర్చి కమిట్ చేసివున్నందున 1850 సం॥ కెలండరు నంబరు 45లో సెస్సన్ కోర్టువారు సు॥ కైదీని ఖులాసా చేయించి సు॥ ప్లీడర్లున్ను మరివొక ప్లీడరున్ను వెరశి 3-రినిన్ని సస్పెంటు చేయబడినారు. యేయొక్క ప్లీడింగ్సులేకాని దాఖలు పరుచుకొనే అధికారం హూదాదార్లకు కలిగియుండే ఆచారం చొప్పున అధికారి కోర్టు కూడియున్న కాలమందు కైదీఅయిన వాది తరఫు వకీలు సు॥రం నాడు తేబడినటువంటి రు. ½ క్రయంగల వకాల్తునామాయొక్క స్టాంపులో వ్రాశేవాని హస్తదోషంవల్ల కొన్ని పజ్క్తులు తప్ప వ్రాసుకొని గీచివేసి తిరిగి వ్రాసుకొనిన్ని కొన్ని అక్షరములు దిద్దుకొనిన్ని వున్నందున నేను ఆక్షేపించినప్పటికిన్ని సు॥ వకీలు మనివిపైన మరివొక గుమాస్తావల్ల ముఫ్తీవారే దాఖలు పరచుకొని ఆ గుమాస్తా యొక్క అక్షరములతోటి ఫైలు చేసుకొని అధికారపు చెవ్రాలు చేయబడి వున్నటువంటిదాన్ని నేను తనకి చేయబడినాననే నిందారోపణ నాపైన కలగజేసి 1850 సం॥ జూన్ నెల 5 తేది నన్నున్ను సస్పెంటుచేసి నాయొక్క రూ. 14 ల జీతంగల ముఫ్తి కోర్టు గుమాస్తా పనికి మరివొక సదరమీనోక్కోర్టుయొక్క రూ. 10 ల జీతంగల అతణ్నిన్ని ఆ పనికి సీవిలోక్కోర్టు గుమాస్తా రూ. 10 లు జీతంగల అతణ్నిన్ని జూన్ నెల 20 తేది సీవిల్ జడ్జిగారు పైంటు చేసినారు.

జడ్జిగారి వెంబడిని ఖాస్గీగా రాబడియున్న జనాల పైకి పనులయెందు ప్రవేశింప బడినవాండ్లు 3రు గాక తంగటూరి వెంకట్రామయ్యా అనే అతనికి తంగటూరి మున్సఫు కోర్టులో రు. 12½ జీతంగల పనికి 1849 సం॥ డిశంబరు నెల 22 తేదిన పైంటుచేసి అతను అక్కడికి వెళ్ళకుండా అందులో సగం జీతానకు ఆ పని చూడగలందులకై మరి వొకణ్ని పైంటుచేసి సెషన్ కోర్టులో యింటర్ పిటరుగా అతనినుంచి పని పుచ్చుకుంటూ వుండి జడ్జిగారికి ముఖ్యం కావలసినవాడైనందువల్ల సీవిల్కోర్టులో ఖాలీచేయబడిన రు. 10 ల జీతంగల పని స॥ వెంకట్రామయ్యకు యిచ్చివేసి ఆయ్న పేరట నమోదు వుండబడిన పనికి అక్కడివాండ్లకే భర్తీచేసి నాకు యేయొక్క వుత్తర్వున్ను యివ్వక నిర్నిమిత్తం నన్ను తొందరలోకి తేబడినారు.

నాయొక్క పని అపాయం కలగవలెననే హేతువచేత స॥ హి 45 నంబరు యొక్క కేలండరులో నన్నుగురించిన్ని జడ్జిగారు రిమార్కువ్రాసి సదరు కోర్టువారి సముఖములోకి పంపించియున్నట్టు వదంతి పుట్టియున్నందున తమకంటె అన్యధా ప్రాపకులు నాకు లేనందువల్ల వేద్యం కాగలందులకు జరుగు సంగతిని కృతపరిచి యున్నాను.

వెరశి అయిదు కలముల మనివి అర్జిన్ని దివ్యచిత్తానకు తెచ్చి నన్ను సంరక్షణ చేయించవలెనని తమ ఘనాన్ని మిక్కిలి ప్రార్థిస్తున్నాను. చిత్తగించవలెను.

ది 6 జూలై 1850 సం॥

—ధర్మపురం సుబ్బన్నవ్రాలు *

## కంభం నరసింహాచారి జాబులు

### 34

మహారాజరాజశ్రీ సి॥ పి॥ బ్రౌన్ యిస్కోయర్ అశిష్టాంట్టు జెడిజి ధొరగారి సముఖానకు—

తమ ఆశ్రితుడు కంభంలో వుండె వంగిపురం నృసింహాచార్యులు అనేక సల్లాములు చేసి వ్రాసుకున్న అర్జి 1830 య్యువి జూలాయి నెల చ॥ 26 తేదీవరకు కంభంలో కుశలంగా వున్నాము. త॥ లోవయినం రెండుమూడు పర్యాయముల నాయొక్క విద్యమానం అర్జీమూలంగా మనివి వ్రాసుకుని వుంట్టిని. అవి సముఖానకు

---

* మ.ఓ.మే.లై.లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 431, పేజీ 10.

చేరి సునావణీ అయిన సంగతి నాకు తెలియలేదు. యీ లోవయనం తమ నౌకరు వెంకటాచలం కడపనుంచ్చి సామాను పంపించ్చుకుని వస్తువుండ్డగా అతని వెంబడిన ముంగమూరి లక్ష్మీనరసుగారి తావునుంచ్చింన్ని నేను తీసుకుని వచ్చిన బుక్కులు వసుచరిత్ర వ్యాఖ్యానం ప్రతి। విక్రమార్క చరిత్ర। యీ రెండు ప్రతులుంన్ను పంపించ్చివుంటిని. అవి సముఖానకు చేరిన సమాచారం నాకు తెలియలేదు.

నా శరీరస్థితి యనిమిది నెలలనుంచ్చి మంచ్చం మీదినుంచ్చి దిగే సామర్థ్యం లేకుండా అనేకమైన శ్రమలు సంభవించి తలలో వ్రణంపుట్టిన అందువల్ల అయిన వుపద్రవం యిదివరకు నివర్తించలేదు. యింన్ని దినములు దీర్ఘాశక్తత సంభవించినందువల్ల వ్రయప్రయాసలు మొదలుకొని నేనుపడే శ్రమ యింత్త అని వ్రాశితీరదు. దైవయోగంవల్ల నెల రెండ్డు నెలల్లో దేహం కుదరవచ్చునని తోస్తుంన్నది. యీ రీతిగా అశక్తత సంభవించినందుచాతను తమ దర్శనం చాయడానకు ప్రాప్తం లేకపోయి నప్పటికింన్ని తమ హస్తాక్షరములు కలిగిన వుత్తరమైనా చూడవలెనని కోరుతాను. యింత్తె అర్జి. చిత్తగించవలెను.

కంభం
1830 య్యివి జూలాయి నెల }
చ॥ 26 తేది

నృశింహ్వాచార్యులవ్రాలు*

## 35

మహారాజరాజశ్రీ సీ. పీ. బ్రౌన్ యిస్కొయరు ధొరవారు సముఖానకు—

తమ కాలేజీ పండితుడు కంభం నరశింహాచార్యులు అనేక సలాములు చేసి వ్రాసుకున్న అర్జీ విన్నపం.

ది 13 మార్చి తారీఖున వ్రాయించిన ఆజ్ఞాపత్రికలు అంది అందుల సంగతులు గ్రహించినాను. యీరోజున నే తమ ఆజ్ఞాప్రకారం గ్రంథములకు పట్టీవ్రాయడముకు ఆరంభించినాను. ఆనందతంత్రం టీక సహా అన్ని ప్రతులున్ను పంపించడమయినది.

యీ మధ్య పైడిపాటి వెంకటనరసయ్య పేరట వేమన గ్రంథమును గురించి వ్రాయించిన హుకుములో నన్ను రాఘవపాండవీయానకు టీక జరిగించవలశ్నిదని ఆజ్ఞ అయివున్నది గనుక సదరహీ గ్రంథం ప్రారంభించి రెండో ఆశ్వాసములో

---

* మ.ఓ.మే.లై.లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 411, పేజీ 243.

అరువై పద్యముల వరుకు ప్రతిపద్యముకు రెండు అర్ధములు విశదముగా యేర్పడేలాగున జరిగించడమయినది. యీ రాఘవపాండవీయానకు వేరే ప్రతులు యిక్కడ హాజరు లేనందున మరివక పరిశుద్ధ ప్రతి కూడా సంపాదించడమైనది. ఆనందతంత్రం టీక సమగ్రం జరిగించడానకు అప్పట్లో ఆ తరహా కాగిదములు హాజరులేనందున్ను పని నిలిచి వుండగా సదరహీ హుకుముప్రకారం రాఘవపాండవీయం ప్రారంభించి జరిగించడమయినది. యీ హుకుముల్లో వ్రాశివున్న యింగిలీషు పుస్తకములుకూడా వీరాస్వామిగారు యిప్పుడే రవానాచేశినారు గనుక విశదం నిమిత్తం విన్నపం వ్రాసుకున్నాను. గ్రంథములపట్టీ తయారు అయినట్టుగానె సముఖమునకు పంపించుకుంటూ వున్నాను. దివ్యచిత్తానకు తేవలెను.

ది 18 మార్చి ఆన 1834 సం॥

—నరసింహాచార్యులి వ్రాలు *

# 36

మహారాజరాజశ్రీ సీ. పీ. బ్రౌన్ యిస్కుయరు ధొరవారి సముఖానకు—

తమ కాలేజి పండితుడు కంభం నరసింహాచార్యులు అనేక సలాములు చేశి వ్రాసుకున్న అర్జి విన్నపం.

తమరు మార్చి తే13 దిని 14 తేదిని వ్రాయించి దయచేయించిన హుకుముల ప్రకారం యిప్పుడు తమ బంగళాలోవున్న తమ స్వంత గ్రంథములకు తబిశీలువారిగా అనగా బంగారు అక్షరంగల జీలుకట్టినవిన్ని, యఱ్ఱతోలు జీలుకట్టినవిన్ని కాగిదపు సంచులలో వేశివుంచిన శిక్సనులున్ను, యఱ్ఱగుడ్డ దస్త్రం కట్టినవిన్ని, యఱ్ఱగుడ్డ వేశిన తాశేకు పుస్తకములున్ను విభజనగా యేర్పరచి అందులో గీర్వాణం, పురాణాలు, కావ్యాలు మొదలైనవిన్ని తెలుగులున్ను విభజనగా తెలిశేలాగున పట్టీ వ్రాయించడమైనది. గుంటూరునుంచి వచ్చిన గ్రంథములకు అవి చాలా అసమగ్రములుగా వుండడమున్నూ, వక్క గ్రంథములో అనేక గ్రంథములు కలిశి వుండడముచేతనున్ను విభజనగా వ్రాయడానకు చాలాకాలం అవుతుందని తోచి తమరు వ్రాయించిన రెండో హుకుమ్ప్రకారం దండాయమానంగా వ్రాయించినాను. సదరహీ పట్టీలు తమ సముఖములోకి పంపించుకుంటిని. దాఖలు చిత్తగించవలెను.

---

* మ.ఓ.మే.లై.లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 401, పేజీ 313. ఇండెక్సు పేజీలో యీ జాబునుగురించి "From a pandit: tolerably good" అని బ్రౌన్ వ్రాసిపెట్టాడు.

ప్రకృతమందు జూలూరు అప్పయ్యపంతులుగారు చేశే వసుచరిత్ర టీక 6 ఆశ్వాసములకు సమగ్రంగా అయినది. అప్పయ్య పంతులుగారు వెంకటనర్సయ్యగారు కూడా వేమనపద్యముల తీర్పు జరిగిస్తూవున్నారు. నేను చేశే రాఘవపాండవీయం టీక రెండో ఆశ్వాసం 80 పద్యముల మట్టుకు అయినది. యీ గ్రంథము స్వల్పం ప్రతులు వుండడమున్ను ప్రాచీన వ్యాఖ్య అతి సూక్ష్మమున్ను నిండా స్ఖాలిత్యములు గనుక కొంచం ఆలశ్యంగా జరుగుతూ వున్నది గనుక దివ్యచిత్తానకు విశదం కాగలందులకు విన్నపం వ్రాసుకున్నాను.

ది 7 యేప్రెల్ ఆన 183[illegible] సం॥

——కంభం నరసింహాచార్యులు వ్రాలు *

## 37

మహారాజరాజశ్రీ—సి—పి—బ్రౌన్—పోస్టుమేస్టరు జనరల్ గారి సముఖానకు——

తమ పోషణలో చేరిన కంభం వంగిపురం నృసింహాచార్యుల కొమారుడు అయిన వంగిపురం వెంకటాచార్యులు సలాంచేసి వ్రాసుకున్న మనివి యేమంటే నా తండ్రిగారయిన నృసింహాచార్యులవారు తమవల్ల శెలవుపొంది యిక్కడికి వచ్చి గృహకృత్యములు విచారించుకొని తమ సన్నిధానమునకు వచ్చేనిమిత్తం ప్రయాణమై వచ్చినతర్వాత కడపలో వారికి అమితమైన జ్వరంవచ్చి అందువల్ల 15 రోజాలు శ్రమ పడి శ్రావణశుద్ధ బుధవారం సాయింత్రం కడపలో గతించినారు.

వారు తమ సన్నిధికి వచ్చి యిదివరకు చేస్తూవుండివున్న కృషి ముగింపుచేసి తమవల్ల విశేషమయిన బహుమానమును పొందవలెననే తాత్పర్యంగలవారై వుండిరి. ఆయుస్సు లేకపోవుటవల్ల వారి తాత్పర్యం నెరవేరడానకు లేకపోయినది.

వారి పోషణలో 24 సం॥ముల వయస్సుగల నేనున్ను వారి ద్వితీయ భార్య। ఆమె సంతతి వివాహముకాని యిద్దరు ఆడచిన్నవాండ్లు, వుపనయములేని వొక మగ చిన్నవాడు, మా పినతండ్రి సంతతిలో చేరిన జనులు నలుగురు——యీప్రకారం వుండి వున్నాము. యీ జనులయొక్క సంరక్షణభారం తమయందే చెంది వున్నది కాని యితరంకాదు. నేనుమాత్రం కంభం సబ్ డివిజనులో చేరిన దూపాడు తాలూకా కచేరీలో రు 7 లు జీతంగల పోలీసు వకీలు పనిలో వుండివున్నాను. యిందువల్ల జీవ

* మ.ఓ.మే.లై.లో బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 401, పేజీ 309.

తమరు పంపించిన భారతం బొక్కులు వుత్తు కాగిదాల నీకన్నులు నాకు చేరగానే తమపేర విజ్ఞాపన పత్రిక వ్రాసుకునివుంటిని. ఆ వుత్తరం తమ తావున చేరనట్టు ధర్మపురం సుబ్బన్నకు పంపించిన వుత్తరంద్వారా నాకు తెలిసి బహు డోలాయమానంగా వున్నది. చేరిన సంగతి వ్రాయించి పంపించవలెనని కోరుతూ వున్నాను.

యిక్కడ పేపాలు దొరకడం ప్రయాస అయినందున కొన్ని పేపాలున్న ఒక పేపాకత్తిన్ని శెలవు దయచేసి పంపించవలెనని ఆ వుత్తరంలో వ్రాసుకొనివుంటిని. యిదివరకు ఆజ్ఞ దయచేయనందున నాకు వ్రాయడమును గురించి ప్రయాసగావున్నది. త్వరగా శెలవు దయచెయ్యవలెనని కోరుతూ వున్నాను.

గ్రంథం తీర్పుచేసి వ్రాయడానకు ఆరంభించాను. యిదివరకు 150 పద్యములు తీర్చి వ్రాయడమైనది. అయితే యీ అరణ్యపర్వమంతా యితిహాసములు కథలు కనుక నడుమనడుమ శ్రుత్యర్థములు స్మృత్యర్థములు చాలాగా వస్తుంటవి గనుక కొన్ని చోట్ల సందేహములు తట్టుతూ వచ్చినందున రెండు గీర్వాణప్రతులు తెచ్చి దగ్గర వుంచుకొని వున్నాను. అందువల్ల సందేహములు చక్కగా నివర్తి అవుచూ వున్నవి.

గ్రంథం జరుగుతూవున్నది. లోగడ తమరు బొక్కులలో అధ్యాయములు కూడా తగిలించి వుంచుట యిప్పుడు సందేహం వచ్చినచోట గీర్వాణములో నేను శానాసేపు వెతుక్కోకుండా నాకు చక్కగా వుపయోగించివున్నవి. కడమ సంగతులనుగురించి తమరు సర్వజ్ఞ ప్రభువులు నేను విశేషించి వ్రాసుకోవలసినది యేమి వున్నది. సకలవిధములా నన్ను పోషించుటకు తమరె కర్తలై వున్నారు. చిత్తగించ కర్తలు. యింతే అనేక సలాములు—

1838 సం॥ డిశంబరు నెల 17 తేది

(గరిమెళ్ల వెంకయ్య) *

* మ.ఓ.మే.లై. లోని బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 419, పేజీ 487.

## అవధానం అప్పయ్య జాబులు

### 40

మహారాజశ్రీ మేస్తరు-సీ-పీ- బ్రౌన్ ధొరగారి దివ్యసముఖానకు—

కడపజిల్లాలో చేరిన నొసం తాలూకు మున్సపు కోర్టు గుమాస్తా అయిన తమ పోష్యవర్గుడు అవధానం అప్పయ్య అనేక సల్లాములు చేసి మిక్కిలి వినయ పూర్వకముగా వ్రాసుకున్న అర్జి విజ్ఞాపన యేమంటే తాము లోవయినం తాలూకు మునసపుగావున్న అయోధ్యాపురం క్రిష్ణారెడ్డిగారికి వ్రాయించివున్న ఆజ్ఞప్రకారం ప్రభులింగలీలా- బసువపురాణం- చంద్రాంగద చరిత్ర, పల్నాటివీరులచరిత్ర యీ గ్రంథములు విచారించి పంపించమనేదిగా తమయొక్క ఆజ్ఞ అయివున్నందుకు క్రిష్ణారెడ్డిగారు నన్ను సదరు గ్రంథములు విచారించి తీసుకురమ్మని: ఆ ప్రకారం ప్రభులింగలీలా బసువపురాణం యీ 2 న్నూ గంద్రగుళి శివమల్లప్ప అనే వక మనిష్యి తావుననున్నూ— చంద్రాంగదచరిత్ర యిసకపల్లె నరసింగరావు అనే వక మనిషి తావుననున్నూ ప్రతులు వ్రాసుకుని తిరిగి యిస్తాననేదిగా వారికి చెప్పి తెచ్చినందున ఆ గ్రంథముల పయికి ప్రభులింగలీల పలనాటివీరులచరిత్ర యీ 2 న్నూ మాత్రం యిక్కడ నిట్టూరి సుబ్బయ్యచాత ప్రతులు వ్రాయంచడం అయివుంది.

కడమ బసవపురాణం చంద్రాంగదచరిత్ర యీ 2 గ్రంథములు వ్రాయించడానకు సావుకాశం లేకవుండి ఆయొక్క అస్సలు గ్రంథములె నాచాత యేలినవారి సముఖంలోకి పంపించినందున నేనున్నూ సదరు సుబ్బయ్యయున్ను సముఖంలోకివచ్చి సదరు గ్రంథములు ముట్టచెప్పి తమచాత సెలవు పుచ్చుకొని వచ్చేటప్పుడు బసువ పురాణం చంద్రాంగద చరిత్ర యీ 2 తాట్యాకుల పుస్తుకాలున్నూ వారికి తిరిగి చేర్చవలెను గనుక మాతృకలు దయచేయించవలెను అని మనవి చేసివున్నందుకు ప్రతులు సిద్ధంకాగానే పంపించడం అవుతున్నదని ఆజ్ఞ దయచేయించి వుండిరి.

పిమ్మట సదరుగ్రంథములను గురించి సామ్ము ఖామందులు నన్ను తగాదా చేసినందున ఆ సంగతి రాజశ్రీ క్రిష్ణారెడ్డిగారితో సదరుగ్రంథములు తెప్పించవలెను అని మనవి చేస్తే సముఖంలోకి విజ్ఞాపన వ్రాసి తెప్పించుతానని చెప్పూతూవుండి పిమ్మట-1844 సం॥ మార్చి నెల 26 తేదీలు క్రిష్ణారెడ్డిగారు కాలంచేసివున్నారు కాబట్టి సదరు రెండుగ్రంథములున్నూ చేరివుండనందున ఆ గ్రంథములయొక్క

సొత్తుదార్లు పొస్తుకాలు యివ్వమని నన్ను నిండా తొందరచేస్తూవున్నారు గనుక నేను ఏలినవారి సముఖంలోకి వచ్చి మనవి చేస్తూవున్నాను గనుక నేను ఏలినవారి సముఖంలోకి వచ్చి మనవిచేసి పుస్తుకాలు తెచ్చి వారికి యివ్వడానకు నాకు శలవు కావడముకు ప్రయాస అయినందున విజ్ఞాపన పత్రికె వ్రాసుకున్నాను—

నా మనవి చిత్తగించి బసువపురాణం—చంద్రాంగద చరిత్ర యీ 2 పుస్తుకాలున్నూ నొసం అనే గ్రామములో నాకుచేరేలాగున ఆజ్ఞ దయచేయించిన పక్షమంగు అ గ్రంథములు మాలికులకు వొప్పచెప్పతూవున్నాను గన్కు నా మనవి చిత్తగించి దయచేయించ కర్తలు—

మరిన్నీ యిక్కడ వెంకటసుబ్బకవి అనేఅతడు నూతనంగా మన్మథన సంవాదం అనే గ్రంథమున్నూ కల్యాణరాజుచరిత్ర అనే గ్రంథమున్నూ పేరు జ్ఞాపకంలేని మరివక గ్రంథమున్నూ చెప్పివున్నాడు గనుక అ గ్రంథములు వున్నవి అని క్రిష్ణారెడ్డిగారితో నేను ప్రస్తాపన చేసివుండగా అ గ్రంథములను గురించి సముఖంలోకి లోవైనం క్రిష్ణారెడ్డిగారె విజ్ఞాపన వ్రాసుకని వుండిరి. అందుకు ఏమిన్ని ఆజ్ఞ అయివుండలేదు గనుక అ గ్రంథములు ప్రతులు వ్రాయించమని ఆజ్ఞ దయచేయించిన పక్షమందు ఇక్కడనే ప్రతులు వ్రాయించి సముఖంలోకి తీసుకని వొస్తూ వున్నాను.

చిత్తగించి ఆజ్ఞ దయచేయించగలందులకు తాముఖామందులు వున్నారు.

చ—20 జూన్ సన్ 1844 యిసవి
అప్పయ్య చేవ్రాలు *

---

* మ.ఓ.మే.లై. లోని బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 419, పేజీ 459.

## 41

మహారాజశ్రీ మెస్టర్_సి_పి_బ్రౌన్ దొరగారి సముఖానకు___

కోయిలకుంట్ల తాలూకా నోసం మున్సఫికోర్టు గుమాస్తా అవధానం అప్పయ్య అనేక సల్లాంచేసి వ్రాసుకున్న అర్జీ విగ్నాపిన యేమంటె లోవయిన్ని చెంద్రాంగద చరిత్ర బసవపురాణం యీ మొదలయిన్ని నాల్గు గ్రంధములున్ను మునసఫ క్రిష్టారెడ్డి పరిముఖంగా సముఖంలోకి తీసుకుని వచ్చివుండి సమర్పణ చెశి తిర్గి తమ్మ చాత శెల్వు పుచ్చుకొని వచ్చేటపుడు చెంద్రాంగ్గద చరిత్ర బసవపురాణం యీ రెండ్లు గ్రంథములు మాత్రం దయచెయిప్పించవలెనని మన్వి చేసినందుకు వెనక నుంచ్చి పంపిస్తు వున్నామని ఆజ్ఞ దయచెయించ్చి వుంటిరి.

పిమ్మట యీ రెండ్లు గ్రంథములును గురించి సొంమ్ము ఖామందులు తగాదా చేస్తుంన్నారనెదిగా యీ సంవ్వత్సరం జూన్ నెల 20 తేదిన సముఖంలోకి వక అర్జీ వ్రాసుకునివుంటిని. నా మన్వి చిత్తగించి సదరురెండు పుస్తకములుంన్ను దయచేయించ్చలేదు గనుక యిప్పుడు నగిరి సుబ్బడు అనె వక మనిష్యిని సముఖం లోకి అంపించివున్నాను. చిత్తగించి సదరు రెండు పుస్తకములుంను యీ మనిష్యి వశాన దయచెయించిన పక్షమంద్దు నాకు ముట్టుతూ వుంన్నవి. నాకు అందగానె ఆ సొంమ్ముల వాండ్లకు యిచ్చి వెయ్యడమవుతావుంన్నది. నా మన్వి చిత్తగించి దయచెయించ్చవలెనని మిక్కిళి ప్రార్థిస్తువుంనాను. చిత్తగించ కర్తలు.

(అ. అప్పయ్య) *

* మ.ఓ.మే.లై. లోని బ్రౌన్ జాబుల సంపుటం యమ్. 419, పేజీ 487.

# అముద్రిత గ్రంథ సూచి

## బ్రౌన్ సేకరించినట్లు సేకరించ ప్రయత్నించినట్లు ఈ జాబుల్లో ప్రస్తావనకొచ్చిన వివిధ అముద్రిత తెలుగు సంస్కృత గ్రంథాల జాబితా

# అన్యదేశ్య పద సూచి

ఈ జాబుల్లో వచ్చిన అన్యదేశ్యపదాల జాబితా యిది. ఇంగ్లీషు మొదలైన యూరోపియన్ భాషాపదాలను వొక వర్గంగానూ, హిందూస్తానీ (అరబ్బీ, పర్షియన్, వుర్దూ వగైరా) భాషాపదాలను వేరొక వర్గంగానూ చూపటం జరిగింది. పదం పక్కనున్న అంకె పేజీ సంఖ్య– వొక పదం భిన్న పేజీల్లో వచ్చినప్పుడు ఆ పేజీలన్నీ యివ్వకుండా, యేదోవొక పేజీ సంఖ్య మాత్రమే యివ్వడం జరిగింది. బ్రాకెట్లలో ఆ పదం తాలూకు వర్ణక్రమ వైవిధ్యాన్నికూడా గుర్తించడం జరిగింది.

## (ఇంగ్లీషు పదాలు)



[1] అలమార్లు పోర్చుగీసు పదమని బ్రౌన్ జిల్లా నిఘంటువు, ఫ్రెంచి పదం కూడా నని బ్రౌన్ మిశ్రనిఘంటువు.

[2] కశినీ ఫ్రెంచి పదమని బ్రౌన్ మిశ్రనిఘంటువు.

గౌనరుమెంటు (గౌరన్‌మెంటు) ౧౦

ఛార్జి ౧౭

జడ్జీ (జెడిజి, జెడ్జి) ౭, జనవరి (జెనవరి) ×౭, జుడైశాలు (జుడైశయాలు) ౩౫, జూన్ ౬౭, జూలాయి (జులాయి, జులై) ౭, జనరల్ ౭౧

డజను ౪౩

తురుపు (Troop?) ౪

నంబరు (నెంబరు) ×౪, నవంబరు ౭౩, నూసుపేపరు ౧౦, నేటీవు (నేటైవు) ౧౪

పబ్లీకు ౧౦, పయింటు (పాయింటు, పైంటు) ౪౪, పేనా (పేనాకత్తి) ౭౪, పోలీసు ౭౧, పోస్టు (మేష్టరు జనరల్) ౭౧, ప్రవిన్‌శ్యాలు ౩౧, ప్రైవేట్లో ౬౭, ప్లీడరు (ప్లీడింగ్స్) ౬౭

ఫయిలు (ఫైలు) ౬౭, ఫాదరీ (పాదిరి దొర) ౨౫, ఫిబ్రవరి (ప్రబ్రేవరు) ౪౦

బంకోలు[3] ౧౯, బాక్సు ౨౧, బాల్లేరు ౩౭, బోరడు ౫

మార్చి ౬౯, మెమో ౫౦, మెస్తరు (మేస్తరు) ౩౧, మే ౨౭, మేజస్ట్రీటు ౬౭, మోషన్ ౬౭

---

[3] 'బంకోలు':—'కల్లు' పురిశిక్ష అయితే 'బంకోలు' ద్వీపాంతరవాస శిక్ష. బంకోలు అనేది సుమత్రాలోని 'బెన్‌కూలెన్' అనే 'దీవి' ప్రాంతం. ఇటీవలవరకూ ద్వీపాంతరవాస శిక్షకు 'అండమాన్స్' సంకేతమైనట్లు, ఆ రోజుల్లో 'బంకోలు' సమానార్థకమై వుండాలి. బ్రౌన్ మి.ని.లోనూ, 'జిల్లా డిక్షనరీ'లోనూ యీ వివరం యిచ్చాడు. మారిస్ తన 'తెలుగు సెలక్షన్స్ గ్లాజరీ'లోనూ యీ అర్థం యిచ్చాడు. వెబ్‌స్టర్స్ జగ్రాఫికల్ డిక్షనరీనిబట్టి చూస్తే సుమత్రాలోని యీ ప్రాంతంలో బ్రిటీష్‌వారు 1684 లో వొక సెటిల్‌మెంటును యేర్పాటు చేసుకొని, కొన్నేళ్లతర్వాత వొక కోటకూడా కట్టుకొని సుగంధ ద్రవ్యాల వాణిజ్య కేంద్రంగా వినియోగించుకొంటూ వచ్చి 1824 లో డచ్చివారికి దఖలుపర్చి, వారి వద్దనుంచి 'మలాకా'ను తీసుకొన్నారు. ఈ నేపథ్యాన్ని పట్టించుకోకుండానే శ.ర. స్వాములు 'జన్మఖయిదు వేయబడినవారిని పంపు ద్వీపాంతరము' అని అర్థమిచ్చి 'వైకృత విశేష్యం' అన్నారు!

యింగిలీషు ౩౬, యింటర్ పిటరు ౬౭, యిష్టేశినరీ (యిష్టేసినెరి) ౫౪, యిస్కా్యరు (యస్క్వ్యయరు) ౮, యేప్రల్ (యేప్రెల్, యేప్రిల్) ౬౬

రశీడెంటు ౩౪, రశీదు ౧౪, రిగులేసన్ ౧౧, రిజిష్టరు ౨౫, రిసైనరు ౬౮, రిఫరు ౧౧, రిమార్కు ౬౭, రివెన్యూ ౫, రూలు ౫౦, రేంకి ౩౪, రైటరు ౪

లేటు (శిరస్తాదారు) ౧౧

శపిటెంబరు (శపెటెంబరు) ౧౦, శికసనులు (శిక్సనులు) ౫౦

సబ్ డివిజను ౮౧, సరటిఫికెటు ౪౧, సరికోర్టు (Circuit?) ౫౪, సస్పెండు ౬౮, సిక్రిటేరి ౩౫, సీవిల్కోర్టు ౬౮, సెస్సన్ కోర్టు (సెషన్ కోర్టు) ౬౩, సెసన్ జెడ్జి ౩, స్టాంపు ౬౮

హిండెరసు (హిండేరసు) ౫, హెడ్డు (మాలి, హెడ్డశిస్టాంటు) ౧౪

(హిందూస్తానీ పదాలు)

అందాజు ౪౬, అణా ౪౨, అదాలతు ౨౬, అనామత్తు ౨౪, అమీనా ౧౧, అయివజు ౯, అర్జి ౫, అర్జిదాస్తుఫిదివి ౩౧, అవ్వల్ ౬౧, అస్సలు ౫౨, అసల్లు ౫

ఆఖైరు ౧౨, ఆఖైరుకిస్తు ౬౧, ఆజూబాజూ ౬౧, ఆసామి ౪౯

కచేరీ (కచ్చేరి, కచెరి) ౮౧, కదింమిరాశి ౫౯, కరారు ౫౫, కలములు ౧౩, కస్తి ౩౩, కాగితాలు (కాగిదాలు, కాగిదం) ౨౧, కామగారి ౨౩, కాయం (ఖాయం, ఖాయిం) ౪౦, కోట్టు (కాలీజాకోట్టు) ౬౪, కిఫాయతు ౧౦, కిస్తీ ౬౧, ఖాలి ౨౩, కైది (ఖయిది) ౧౧, కొరిణి (కొరిణీ) ౩౬, కోలుబందీ ౪౬

ఖజానా ౩, ఖబరదారీ (ఖబరుదారి) ౧౩, ఖరీదు (కరీదు) ౫౨, ఖర్చు (కర్చు) ౫, ఖాన్గీ ౬౭, ఖాసగతి (ఖాసాసామాను) ౨౭, ౩౬, ఖులాసా ౬౮, ఖూని (ఖూనీ) ౬౦

---

[4] 'గల్లు'కు వేశినారు అంటే ఉరితీశారు అని అర్థం (బ్రౌ.మి.ని). 'గాడిదను దొంగిలించి (చంపి) గల్లుకు పోయినట్టు' అనే సామెత కడప జిల్లాలో వాడుకలో విన్నాను.

[5] 'గార' అంటే గోడల పూతకు పనికి వచ్చేట్లు సునుమెత్తటి యిసుకలో కొన్ని ప్రత్యేక దినుసులు కలిపి తయారుచేసిన సున్నం, పింగాణి పూతలా కనపడే సున్నగారను పూర్వం ధనికుల కట్టడాలకు వాడేవారు. బ్రౌణ్యాన్ని చూచి కాబోలు బహుజనపల్లి దేశ్యంగా గుర్తించాడు కానీ బూదరాజు రాధాకృష్ణగారు 'వాస్తుపద కోశం'లో హిందీనుంచి వచ్చినట్లు వ్రాశారు. వాస్తుపదకోశంలో గార, గారాసున్నం వుంది కానీ యీ 'సున్నగార' లేదు. అంతేకాదు, యీ లేఖల్లో వచ్చే వందుసున్నం, లాయం, కామగారి వంటి వాస్తుసంబంధమైన పదాలుకూడా ఆ కోశంలో కానరావడం లేదు.

తాగాయతీ (తాగాయితి) ౨౫, తాబే ౧౫, తారీఖు ౨౯, (బతారీఖు ౫౭), తారీఫు ౪౭, తాలూకా ౭౧, తాలూకు (తాల్కు) ౬౩, తుఫాకి (తుపాకి) ౪, తురక ౧౯, తేది ౩౨, తైనాతి ౪౭

దరవాజా (దర్వాజా) ౨౨, దరియాప్తి ౫౪, దర్బారు ౫౯, దసమందాలు (దశబందాలు) ౫౯, దస్తా (దస్తావేజు, దస్తెవజు) ౨౭, దస్తు (దస్తుబాకీ) ౬౦, దస్తూరి ౨౭, దస్త్రం ౭౦, దాఖల్ (దాఖలా) ౫, దావా ౬౭, దివిటీ ౪, దురుస్తు (బేదురుస్తు) ౫౭, దొర(?) ౫౨, దొడు ౪, దొరా ౪౭, ధారణ ౧౨

నకలు ౫, నకషా ౪౬, నమోదు ౬౮, నవుకరు ౩౮, నాజరు ౨౭, నాజూకు ౧౫, నిభావు (నిభాయించు) ౪౫

పట్టా (వంటిపట్టా) ౬౧, పట్టీ ౩౧, పసలీ (ఫసలి) ౬౧, పహరా ౩౭, పిర్యాది (పిర్యాదు) ౫, పూరా ౫౦, ఫైసలునామా ౫౭, పైసా(?) ౨౩

ఫిదివి ౩౧, ఫియి ౬౦, ఫైసలాతి ౬౧, ఫారసీ (పారిశి) ౨౭

బంగళా ౧౦, బందిఖానా ౩౭, బందోబస్తి ౨౩, బడాయించు (బడాయిస్తూ) ..., బదలాయించు ౩౪, బదులు ౭౩, బయావరి (బయ్యావరి) ౨౩, బస్తీ ౧౨, బాకీ ౧౬, బాజారు ౫, బారుశిఫాయిలు ౧౧, బాహాలోప(?) ౪౧, బిడాయించు ౬౧, బిన్ తకరార్ ౬౧, బీగాలు(?) ౧౧, బేరీజు ౬౧, బేలుదారు ౨౩, భరతరఫి ౬, భర్తీ ౬౮, భారీ ౬౦

మంజూరు ౬౧, మజారులు ౮, మరమ్మతు (మరహమ్మత్తు) ౧౦, మర్జీ ౧౫, మలపూపు (మల్పూపు) ౫౧, మాజీ ౬౧, మాపు ౬౦, మారీపత్తు ౧౭, మాలి (మాలీ) ౫౩, మాలికులు ౭౬, మహే ౬౧, మిరాశి ౫౯, మిస్సలు (రెడ్డి మిస్సలు) ౫౯, మసాలా ౩౩, ముష్కి ౬౭, ముజరా ౨౪, మునసఫు (మునసిఫు) ౨౭, మునిషి (మునిషీగిరి) ౪౭, మొకర్రరు ౬౧, మొకాం (మొక్కాం) ౭౨, మొకాబిలా ౨౩, మొఖాబు ౩౯, మొహనత్తు (మెహనత్తు) ౧౬, మోర్చి ౨౩

యింగిలీషు ౩౧, యిజహారు ౪౯, యినాం ౬౫, యిలాకా ౪౪, యిసం ౬౦, యిసవీ ౫౯, యిస్తిహారు ౬౦

రఘువాలి ౧౨, రమారమి ౧౫, రవాణి (రవానా) ౨౪, రాజీనామా ౧౫, రూపాయలు ౩౭, రూబకారీ ౪౫, రోజు ౩, రూకలు ౧౦

## అనుబంధం-2

లంగరుఖానా ౧౨, లాయం[6] (గుఱ్ఱపు లాయం) ౨౨, లుకసాను ౩౯

వకాల్తునామా ౬౭, వకీలు ౬౭, వగైరా ౨౧, వరు[7] ౫౯, వసారా ౨౨, వసూళ్లు ౩౦, వాజమా ౨౫, వాజిభిధారణ[8] ౪౩, వాపస్సు ౨౫, వాయిదా ౨౯, వినహా ౨౧, వుషారు ౪, వెరశి ౧౪, వోట్టుహుకుం[9] ౬౧, వస్తాద్ ౫౩

శిఫాయిలు ౪, శిఫారసు ౪౯, శిరస్తాదారు ౧౧

షహరు బాజారు ౧౧

సదరమీన్ ౬౬, సదరహి (సదరు) ౪, సన్నదు ౬౧, సబబు (సబబునామా) ౫, సరంజాము ౨౬, సరకారు ౪౧, సలాము (సల్లాం) ౭౭, సవ్వారి ౭౨, సాదరు ౩౧, సాపు (సాఫీ) ౪౯, సామాను ౧౬, సాహుకార్లు ౧౧,

---

[6] లాయం అనే పదం విషయమై బ్రౌన్ చాలా వూహాలు చేశాడు. అసలు నిఘంటువులోనూ మిశ్ర నిఘంటువులోను యిచ్చాడు. Cavalry 'lines' నుంచి వచ్చివుంటుందని వూహించాడు. జిల్లా డిక్షనరీలో తమిళ పదం అన్నాడు. అసలు నిఘంటువులో 'మందటీడు' దగ్గర యిచ్చిన కావ్యప్రయోగం (మహాభారతం)లో యీ పదం యీ అర్థంలో ప్రయుక్తమై వుంది. బహుజనపల్లి యింత శ్రమపడకుండానే బ్రౌణ్యంలోనుంచి కాపీకొట్టినవాడు గనుక అట్లాగే యిచ్చి 'వై. వి.' అన్నాడు. అతగాడి 'ప్రణాళిక'లో పాకృతసమాలూ, సంస్కృత ప్రాకృతభవాలూ వైకృతాలు.

[7] 'వర్గు' మరాఠీ పదం అన్నాడు బ్రౌన్ మి. ని. లో.

[8] వాజిభిధారణ: ధారణ (మరాఠీపదంనుంచి వచ్చిన ధర). ధర అంటే సంస్కృతంలో భూమి. వెల అనే అర్థంలో అన్యదేశ్యంగా గుర్తించుకోవల్సి వుంటుందేమో. దానికి వాజిబీ అనే అరబ్బీ పదం కల్సి న్యాయమైన, సరియైన ధర అనే అర్థం వచ్చినట్లు బ్రౌన్ వూహించాడు.

[9] వోట్టుహుకుం——చూ: బ్రౌ.మి.ని. 'గిర్దావరి'.

సాహేబు ౨౫, సీసా ౪౩, సునావణి[10] ౪౮, సుమారు ౩౮, సుస్తీ ౧౫, స్న(సన్) ౮౬

హజరత్తు(తు) ౨౫, హారహారదినము[11] ౨౩, హాజరు ౨౫, హాలి ౪౩, హాలు ౪౬, హిస్సా ౬, హుండావణీ ౧౮, హుండీ ౧౬, హుకుం (వోట్టుహుకుం) ౬, హుజూరు ౬౦, హోదా ౬౮.

---

10 'సునావణి'కి సునామణి అనే రూపాంతరంకూడా యిచ్చాడు బ్రౌన్ మి.ని.లో. హిందూస్తానీ రూపంకూడా చూపాడు. జిల్లాడిక్షనరీలో మరాఠీనుంచి వచ్చినట్లు వూహాచేశాడు. శ.ర. కారులు యీ 'యిబ్బంది' లేమీ యెదుర్కోకుండానే వూరకే హిం. అనేశారు. శ.ర.లో సునావణి రూపం చూపనేలేదు. చఘావణి, హుండావణి మొదలైన రూపాలు కూడా మరాఠీద్వారా వచ్చినట్లు బ్రౌన్ వూహా.

11 హారహారదినం—చూ: జాబుల పేజీ ౨౩లోని పాదపీఠిక.

# బిబ్లియాగ్రఫీ

ఏయే రుజువులతో దాఖలాలతో యీ పుస్తక రచన
సాగిందో ఆ ఆధారాలను యిక్కడ స్థూల
వర్గీకరణ చేయడం జరిగింది—
ముద్రిత గ్రంథాలను మాత్రం
మినహాయించడమైంది.

## వ్రాతప్రతులు

బ్రౌన్ స్వహస్త లిఖిత సంపుటాలు:

లండన్: ఇండియా ఆఫీస్ లైబ్రరీలో 'యూరోపియన్ మేనుస్క్రిప్ట్స్' విభాగంలో భద్రపరచబడివున్న 54 సంపుటాలు (వీటిలో యింతవరకు 22 సంపుటాలకు, అంటే 11,662 పేజీలకు మైక్రోఫిల్మ్ కాపీలు శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలోని సి.పి.బ్రౌన్ ప్రాజెక్టులో వున్నాయి. మిగతావి త్వరలో రానున్నాయి).

మిన్నెసోటా (అమెరికా): ఏమ్స్ లైబ్రరీ సేకరణల్లో వున్న బ్రౌన్ స్వీయ చరిత్ర: "Narrative of the Literary life of Charles Philip Brown, late of the Madras Civil Service, 1854" (దీని జెరాక్స్ కాపీ బ్రౌన్ ప్రాజెక్టులో వుంది).

మద్రాసు: గవర్నమెంట్ వోరియంటల్ మేనుస్క్రిప్ట్స్ లైబ్రరీ (మ.ఓ.మే.లై.) లో వున్న సంపుటాలు.

* ఇక్కడ బ్రౌన్ సేకరించి పెట్టిన లేఖల అర్జీల సంపుటాలు 20 (యమ్ 401, 410_11, 413, 417_32. ఇందులోని కడప జాబులను వీటిలో నుంచే యెంపిక చేయడం జరిగింది).

* బ్రౌన్ డిక్షనరీల నోట్స్ సంపుటాలు 25 (వీటిలో ముఖ్యంగా నాలుగు యిందులో బాగా వుపయోగించుకొన్నాను — వీటి నెంబర్లు గ్రంథంలో ఆయా చోట్ల యివ్వడం జరిగింది).

* బ్రౌన్ వందలాది తెలుగు సంస్కృత కావ్య సేకరణల్లో ముఖ్యంగా వసుచరిత్ర, మహాభారతం అరణ్యపర్వం, అహల్యా సంక్రందన విలాసం, భానుమద్విజయం, అనందతంత్రం, చాటుధార పద్యాలు వగైరా సంపుటాలు (వీటి నెంబర్లు తదితర వివరాలు ఆయాచోట్ల యివ్వబడ్డాయి. వీటి తాలూకు తాళపత్ర ప్రతులు కొన్ని తిరుపతి శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలోని వోరియంటల్ రీసర్చి యిన్‌స్టిట్యూట్‌కు తరలించబడి వున్నాయి).

ఆర్కైవ్స్ రికార్డులు: అముద్రితాలు:

మద్రాసు: తమిళనాడు ఆర్కైవ్స్‌లోని వివిధ కన్సల్టేషన్ల ఫైళ్లు.

* జుడీషియల్ కన్సల్టేషన్లు 1832–33 సంవత్సరాల నాటివి (గుంటూరు కరువుకు సంబంధించి బ్రౌన్ పంపిన వివాదాత్మకమైన నోట్, ఆ తర్వాతి వుత్తర ప్రత్యుత్తరాలు వీటిల్లో దొరికినవే).

* బోర్డ్ ఆఫ్ రివెన్యూ కన్సల్టేషన్లు 1832–33 నాటివి.

హైద్రాబాదు: ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఆర్కైవ్స్‌లోని జిల్లాల రికార్డులు.

* కడప డిస్ట్రిక్ట్ రికార్డ్స్. ముఖ్యంగా 639, 646, 4580, 4585, 4606, 4607 నెంబర్ల సంపుటాలు (బ్రౌన్ మొదటి అపాయింట్‌మెంట్ ఆర్డర్ 646 సంపుటంలో దొరికినదే).

* గుంటూరు డిస్ట్రిక్ట్ రికార్డ్స్. ముఖ్యంగా 3988, 89 సంపుటాలు ('నందన' కరువు గురించి బ్రౌన్ కలెక్టర్‌గా పంపిన నివేదికలు వీటిలో వున్నవే).

* గోదావరి డిస్ట్రిక్ట్ రికార్డ్స్. సంపుటం 4640 (ఇందులో 1825–25 మధ్యకాలానికి సంబంధించి బ్రౌన్ జీతబత్తేల వివరాలు లభ్యమవుతున్నాయి).

బెంగుళూరు: యునైటెడ్ థియలాజికల్ కాలేజ్ లైబ్రరీ అండ్ ఆర్కైవ్స్‌లో భద్రపరచబడివున్న లండన్ మిషనరీసొసైటీ (యల్.యమ్.యస్.)

ఆర్కైవ్స్‌వారి వివరణాత్మకమైన డ్రైఫ్ క్యాటలాగ్ తాలూకు మైక్రో ఫిల్మ్ రోల్స్ (కడప మిషనరీ హావెల్ కడపనుంచి లండన్‌కు వ్రాసిన జాబులకు సంబంధించిన వివరాలు వీటిలో దొరికినవే).

ఇతర వ్రాతప్రతులు:

విజయవాడ: దిగవల్లి వెంకటశివరావుగారు తన సొంత ధోరణిలో బ్రౌన్‌కు సంబంధించిన ప్రాథమిక వివరాలను నోట్ చేసి పెట్టుకున్న చిత్తుప్రతి: "Notes on C.P. Brown". (ప్రస్తుతం యిది బంగోరె వద్ద వుంది).

తిరుపతి: తంగిరాల వెంకటసుబ్బారావుగారు "తెలుగు వీరగాథా కవిత్వం" గురించి శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయానికి 1968 లో సమర్పించిన మూడు సంపుటాల తీసిస్ డ్రైఫ్ ప్రతి. (ఉయ్యాలవాడ నరసింహారెడ్డిని గూర్చిన జానపద గేయాల చర్చకు వీలు కల్గించింది).

## ముద్రితాలు

ప్రభుత్వ ఆర్కైవ్స్‌ల రికార్డులు :

—A Selection of papers from the old records of the Cuddapah district: official report of a revolt by poligar Narasimha Reddy in Koilkuntla taluk (which formed part of Cuddapah district) in 1846 (5 volumes), Printed at the Cuddapah District Press, 1915-19.

—A Selection of Papers from the Old Records of the Cuddapah District: Official correspondence between the district magistrate, Cuddapah, and the Government of Madras regarding the riot committed by the mussalmans of Cuddapah town which ended in the death of Mr. Macdonald, I.C.S., sub collector and joint magistrate, Cuddapah, Madras. 1926.

—Handbook to the Revenue Records of the Ceded Districts, Madras, 1932.

—Selection from the Records of the late Masulipatam Zilla (Reports of collectors of Masulipatam Zilla to the Board of Revenue relating to the famine of 1832), Masulipatam, 1906.

—Memorandum on the Madras Famine 1866, R. A. Dalzell, Madras, 1867.

—List of Inscriptions on Tombs or Monuments in Madras, J. J. Cotton, Madras, 1905.

మాన్యువల్స్, గెజిటీర్స్ :

—A Manual of the District of Cuddapah, J.D.B. Gribble, Madras, 1875.

—Gazetteer of the Cuddapah District, C. F. Brackenbury Madras, 1915.

—A Manual of the Kurnool District, Narahari Gopala-Krishnamah Chetty, Madras, 1886.

—A Manual of the Kistna District, Gordon Mackenzie, Madras, 1881.

—Gazetter of the Nellore District, Madras, 1942.

—Imperial Gazetteer of India: Provincial series : Madras: vol. 1, W. Francis, Calcutta, 1908.

## పత్రికా వ్యాసాలు

ఇంగ్లీషు పత్రికలు :

—Asiatic Journal, London, November 1833. (news report on the "execution of the Cuddapah murderers").

—Athenaeum, London, Jan. 3, 1885. (obituary note on Brown by R. M. Macdonald).

—Fort St. George Gazette, Madras, 1832–33. (weekly reports on the flooding migrations of the Guntur Famine-stricken belts into the Madras city, poor feeding particulars, and such other famine notifications).

—Madras Journal of Literature and Science, Madras, containing the following essays:

* C. P. Brown. Essay on the Language and Literature of the Telugus in 2 parts. (July–Dec. 1839).

* ......Account of the Basavapuran : the principal Book used as a religious Code by the Jangams. (Oct. 1840).

* ......Telugu Spells. (July 1864. Brown's translations from a Telugu court-document).

* Captain Best. Effects of the Famine of 1833. (no. 30, 1844).

* John F. Thomas. Notes on Ryotwar, or Permanent Annual Rents, in South India. (Jan. 1839).

* ...Notes on the Duty of Government in periods of Famine. (April 1839).

—Missionary Chronicle, London Mission Society, London, 1830–36. (mainly for letters and reports written by Cuddapah missionary Rev. W. Howell).

—Missionary Notices etc., London (?), Aug. 1837. (Bangalore Missionary Rev. T. Hodson's letter).

—Transactions of Missionary Society, L.M.S., London, 1830–32. (Howell's reports and dairies).

తెలుగు పత్రికలు:

—వర్తమాన తరంగిణి (వార పత్రిక), మద్రాసు, 1842–43. (తెలుగు ముద్రణ గ్రంథాలను గురించిన వ్యాపార ప్రకటనలు. మ.ఓ.మే.లై.లో యీ సంచికల సంపుటం వొకటి బ్రౌన్ సేకరించినది భద్రపరచబడి వుంది. ఆంధ్ర శేషగిరిరావుగారు తన వద్ద కొన్ని విడి సంచికలున్నవని మూడేళ్ల క్రితం బంగోరెతో చెప్పారు. అవి యే సంవత్సరానివో అసలున్నాయో లేదో తెలియదు).

—ఆంధ్రపత్రిక (దినపత్రిక), మద్రాసు, 1944–45. (బ్రౌన్ జాబులను యీ మధ్యకాలంలో వేటూరి ప్రభాకర శాస్త్రి ప్రకటించాడు).

—భారతి (సాహిత్య మాసపత్రిక), మద్రాసు, జూన్ 1969. (డాక్టర్ తంగిరాల వెంకటసుబ్బారావు వ్యాసం: 'ఉయ్యాలవాడ నరసింహారెడ్డి కథ'. చారిత్రక వివరణలో ప్రాథమికమైన లోపాలున్నా జానపద గేయాల ఆధారంతో వ్రాసినది).

—ఆంధ్రజ్యోతి (దిన పత్రిక, విజయవాడ)లోని ఈ క్రింది వ్యాసాలు, వార్తాంశాలు:

* 1972 లో బ్రౌన్ లేఖలు కొన్నింటిని విస్తృత వ్యాఖ్యానంతో మూడు నాలుగు సంచికల్లో బంగోరె ప్రకటించాడు అసలు పేరుతోనూ, సాహిత్య విమర్శకుడు అన్న పేరుతోనూ.

* 1976 మార్చి 29, జూన్ 30 లో కడప బ్రౌన్ బంగళాను గురించిన వార్తాంశాలున్నాయి.

—నెల్లూరు స్థానిక వార పత్రికలు జమీన్ రైతు (1972–3), యూత్ కాంగ్రెస్ (1974–5)లలో బ్రౌన్ నెల్లూరు జాబులను బంగోరె ప్రకటించడం జరిగింది.

## డిక్షనరీలు

—సి.పి. బ్రౌన్. బ్రౌణ్య తెలుగు–ఇంగ్లీషు నిఘంటు. మద్రాసు. 1852.

— ,, బ్రౌణ్య మిశ్ర భాషా నిఘంటు. మద్రాసు. 1854.

—C.P. Brown. The Zilla Dictionary. Madras. 1852.

—బహుజనపల్లి సీతారామాచార్యులు. శబ్దరత్నాకరం. మద్రాసు. 1885. (బహుజనపల్లి మరణానంతరం పేర్లు తెలియని పండితవర్గం 'తప్పులు' కొన్ని 'సవరించీ', కొత్తపదాలు కొన్ని చేర్చి ప్రకటించిన మలి ముద్రణలే నేడు ప్రచారంలో వున్నాయి).

—బూదరాజు రాధాకృష్ణ. మాండలిక వృత్తిపదకోశం (వాస్తుపదజాలం). హైద్రాబాదు. 1968.

—J. C. Morris. 'Glossary of Revenue Terms' as published in his 'Teloogoo Selections'. Madras. 1823. (second edition 1845, third revised edition by Ravipati Guravayya [probably the son of Gurumurti Sastri], 1858).

—William Brown. A Vocabulary of Gentoo and English. Madras. 1818. (reprinted in Madras, 1953).

—Webster's Geographical Dictionary. U.S.A. 1963.

—C. E. Buckland. Dictionary of Indian Biography. London. 1906.

ఆంగ్లాంధ్ర ముద్రిత గ్రంథాలు:

[ఈ పుస్తక రచనకు తోడ్పడ్డ
పెక్కు ఆంగ్లాంధ్ర గ్రంథాలను
పుస్తకంలోనే ఆయా చోట్ల
యివ్వడం జరిగింది.]